శ్రీ

# క్షేత్రయ పదములు



సంపాదకుఁడు:

డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి



శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజా

డాక్టర్ రావు వేంకటకుమార మహీపతి

సూర్యారావు బహద్దర్ వారి

సమాదరణమునఁ బ్రకటితము

1952 :: [వెల రూ. 8/-

# తొలిపలుకు

క్షేత్రయ దక్షిణ ప్రతిభాశాలి. ఆంధ్ర దేశమునం దంతటను, దక్షిణ దేశములోను విశేష యశస్సును గాంచిన ధీనిధి. ఇతఁడు రచించిన పదములు కోమలములును, రమ్యములునై తేట తెనుఁగు పదముల పొందికతోఁ జెన్నారుచున్నవి. ద్రాక్షాపాకమున రచితములైన యితని పదము లన్నియును రసపూరితములై సంగీత సాహిత్యముల రెంటనుగూడ నత్యంతమయిన యున్నతిఁ జెందియున్నవి. ఇవి విజ్ఞానమున మిన్నలని పన్నె కెక్కినవి. సుప్రశస్తములై సుప్రసిద్ధిఁబొంది భాసిల్లు భరత నాట్యమున కెంతయు ననువుగ నున్నవి.

ఇందలి పదముల పొందిక సుందరమైనది. మనము సామాన్యముగ వాడుచుండు మృదుపద సంపద యిందుఁ దవరారును. ఇతని కూర్పులఁగల యచ్చ తేట తెలుఁగు పదములతో జిలుగుగలిగి రసము తొలుకులాడుచుఁ గులుకుచుండును. శైలి మిగుల సుగమము. ఈ పదములందలి పదజాలము రసోచితరీతినిఁ దేజరిల్లును. పదలాలిత్యము లసమానమై ప్రతిపదమందును గాననగును. పశ్చిమదేశములలో నిటాలియన్ భాష యెట్టిదో యట్టిదే ప్రాచ్యదేశములలోఁ దెలుఁగు విశేష శ్రావ్యమైనదని భాషాతత్త్వవేత్తలలో నగ్రగణ్యుఁడుగ నెన్నఁబడిన బిషప్ కాల్డ్ వెల్ మిక్కిలి నెక్కుడుగఁ బొగడెను. అతని మత మీ పదములం దత్యంతము తగియున్నది. పలుకు పలుకునకుఁ దేనియ లొలుకుచుండును.

క్షేత్రయవాడిన భాష సలక్షణముగ నున్నదని లాక్షణికశిఖామణి యగు బహుజనపల్లి సీతారామాచార్యుల యభిప్రాయము. ఇది సముచితమని తోఁచుచున్నది. లాక్షణికాగ్రగణ్యుఁడగు మంద లక్ష్మీనరసింహాచార్యులు తన యాంధ్రకౌముది యను లక్షణ గ్రంథమున నాంధ్రభాషా విషయము చర్చించుచో క్షేత్రయను ప్రామాణికునిగఁ బరిగణించి గ్రహించెను. ఆంధ్రసాహిత్య పరిషత్ పక్షమున శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువును సంఘటించిన పండిత ప్రకాండులు క్షేత్రయను ప్రామాణికునిగఁ బరిగణించిరి. సుప్రసిద్ధ లాక్షణికాగ్రేసరులచేతను, పండితులచేతను ప్రామాణికునిగఁ బరిగణింపఁబడిన క్షేత్రయమహామహుని భాష శబ్దసౌష్ఠవము గలదిగ నెన్నఁబడి స్వీకరింపఁబడుట కిసుమంతయు సందియము లేదు.

ఈ పదములందలి భావము గంభీర సౌభాగ్య శోభితము. అది కొలఁది పలుకులలో నిమిడియుండును. క్షేత్రయ మానవ స్వభావమును

బాగుగ గ్రహించిన మహానుభావుఁడు. కావున నితఁడు భావప్రకటనమం దసదృశమైన ప్రజ్ఞఁజూపెను. మానవజాతికి జనించు బహుభంగుల భావము లితని పదములయందుఁ గాననగును. అటు లగుటనే క్షేత్రయ యక్షయమగు దివ్యమయిన కీర్తిని సంపాదించి మించెను.

ఇతని రసపోషణము విశేషశేముషీవిభవాతిశోభితము. ఈ గేయములు శృంగార రస ప్రధానములే యైనను నిందు వివిధ రసములును గలవు. సంగీత మన్నివిధముల రసానుగుణమై రాజిల్లును. వేయేల? ఈ పదములందు సంగీత సాహిత్యములు సర్వాంగ సుందరములై యొసపు మెసఁగుచున్నవి.

ఈ పదములందు రమణీయములైన వర్ణనలు స్వభావ సిద్ధములై శోభిల్లుచున్నవి. వర్ణితాంశములు విశదములై మన కన్నులయెదుటఁ బటము గట్టినట్లుండును. అట్లుండుటచేతనే యీ పాటలు నాట్యాభినయమునకుఁ దగియున్నవి.

ఇంత రమ్యతరములగు గేయములు విలసిల్లుట మన తెనుఁగు భాషకుఁగల విశేష భాగ్యము.

వివిధ శాఖలయందు విశేష విఖ్యాతిగాంచిన విద్వాంసశిఖామణులు, సంగీత విద్యాచార్యులయిన ప్రొఫెసర్ పి. సాంబమూర్తిగారును, నాట్యకళాభిజ్ఞులయిన శ్రీ ఇ. కృష్ణయ్యరుగారును, భావోద్దీపనగాయకు లయిన శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారును, గ్రంథ సంపాదకులయిన డా. గిడుగు వేంకట సీతాపతిగారు నీ గ్రంథముకూర్పు విషయమున నెక్కుడగాఁ దోడ్పడి, శ్రమయని యించుకయు నెంచక తమ స్వంత కార్యముగఁ దలంచి, ప్రశంసనీయమగు శ్రద్ధతోను, ప్రస్తుతి కత్యంతము నర్హమగు నుత్సాహ కరిమతోను నీ ముద్రిత గ్రంథమును బరిశీలించి, గ్రంథమును, గ్రంథకర్తను బ్రశంసించుచు విపులముగాను, విశదముగాను దమ యుపోద్ఘాతములను వ్రాసి యొసఁగిరి. ఈ పండిత ప్రవరులకు నా కృతజ్ఞతా పూర్వక నమస్కార సహస్రము నర్పించుచున్నాను.

రావు వేంకట కుమార మహిపతి సూర్యారావు.

# FOREWORD

Indian music is a dynamic system of music. It is built on a sound theoretical basis. This basis has enabled the development of a rich lakshya. The Lakshanakaras and Vaggeyakaras adorning the pages of India's musical history have contributed to build up an extensive musical wealth.

Kshetrayya, the greatest composer of Telugu padas has a unique place amongst the Musical luminaries of India. He is the father of the musical form, *Padam*. His padas are brimful of raga bhava and rasa bhava. They have been the admiration of illustrious composers like Tyagaraja, Syama Sastri and others. Musicians as well as scholars derive a perennial delight by listening to his padas. The fact that Kshetrayya's padas figure in the programmes of both Music concerts and Dance concerts is proof of the sterling worth of their sangita and sahitya.

Many composers have composed on the alluring theme of Nayika-nayaka bhava. But Kshetrayya has a special place amongst all of them. He is the most prolific composer on this theme. His sahityas are highly suggestive. They are in the Kaisiki riti and abound in poetic thoughts. There is a pada of his for every conceivable situation in life.

Kshetrayya is an adept in the art of wielding words and musical phrases. The combined vehicle of words and music became a powerful weapon in his hands for the portrayal of the various rasas, including delicate shades of

those rasas. His compositions when properly rendered have a telling effect. Even trifling situations are portrayed by him in glorious colours. He was a master of the emotional contents of ragas. This is revealed in his careful choice of ragas to depict the various degrees of a particular feeling. Even in the case of a feeling like *s'oka* or grief, there are degrees of grief like superficial grief, bearable grief, unbearable grief, very deep grief and heart-rending grief and we see Kshetrayya using ragas like Mukhari, Ghanta, Nadanamakriya, Punnagavarali and Ahiri for the purpose. In the Padas wherein the nayika ventilates her feeling of disgust at the continued absence of the nayaka, and in padas depicting jealousy, helplessness and foiled expectations, we find how the tunes clothing them offer a powerful commentary on the situations. Padas treating of situations like (1) the distressed nayika giving vent to her feelings to the sakhi, (2) the disappointed nayika talking in a taunting language at the unfaithfulness of the nayaka, (3) the heart-stricken nayika deriving consolation by recalling past memories of her association with the nayaka and (4) the joyous nayika meeting the nayaka after his long absence, offer valuable lakshyas for the study of the subject of raga and emotion. Kshetrayya's padas may be described as strongly painted musical pictures. The delicate contour of their lines, the vivid touches and their striking finish have a captivating effect upon us. While listening to a pada of Kshetrayya, we feel as if the nayika, nayaka or sakhi singing the pada stands before us in the exact psychological state of mind visualised by Kshetrayya.

Kshetrayya has used only rakti ragas in his compositions and rightly so. His aim was not merely to create

gana rasa. The manner in which he has handled ragas of single rasas like Punnagavarali and ragas of multiple rasas like Kambhoji deserves careful study. The bulk of his Padas are in Triputa tala and it is well-known that this 3 + 4 time-measure is the most appropriate of dance rhythms. The slow tempo of his compositious enables the singer to give embellished renderings and fascinating corner touches. This tempo again enables the dancer to depict the patent and latent bhavas in the sahityas with ease, freedom and accuracy.

Hitherto only the bare texts of Kshetrayya's padas were printed. There was no indication on the top of a pada, as to the particular type of nayika or nayaka that sings it, the particular psychological state of mind of the concerned character at the moment, the person to whom the pada is addressed, the prior situation, the intended rasa, etc. The present edition supplies that want and hence the publication of this book marks a distinct milestone in the literature on Indian music. The task of editing Kshetrayya's Padas in the manner done in this volume is no easy task. The thanks of the world of music and letters are due to the learned editor of this volume. This book will serve as an eye-opener to musicians and scholars alike and help them to understand something of the genius of the great composer who has shed lustre on Karnatic music by his marvellous compositions.

P. SAMBAMOORTHY,

*Head of the Department of Indian Music,*

*University of Madras.*

5th June, 1952.

# (అనువాదము)

భారతీయ సంగీత మభ్యుదయ పరంపరాభివృద్ధిగా సాగుట కనుకూలమైన పద్ధతి నేర్పడినది. ఆ పద్ధతి ప్రబలమయిన శాస్త్రాధారముగలది. ఆ యాధారమువలన సంగీత లక్ష్య సంపద పెంపొందుటకు సాధ్యమైనది. భారతీయ సంగీత చరిత్రలో ప్రఖ్యాతిబడసిన లాక్షణికులున్ను, వాగ్గేయకారులున్ను విపులమైన సంగీత సంపదాభివృద్ధికి తోడ్పడిరి.

తెలుగుపదము లనేకముగా రచించి, పదకర్త్రాగ్రేసరుడని ప్రఖ్యాతి పొందిన క్షేత్రయ వాగ్గేయకారులలో నొక విశిష్టస్థానము నలంకరించినాడు. గానకళా సమన్వితమయిన పదరచనకు క్షేత్రయ పితామహుడు. ఇతని పదములలో రాగ, రస భావములు రెండును నిండుగా గలవు. త్యాగరాజు, శ్యామశాస్త్రి మొదలయిన ప్రఖ్యాత కృతికర్తలకు సైత మితని పదము లాశ్చర్యమును గలిగించి ప్రశంసాపాత్రము లయినవి. సంగీత విద్వాంసులే కాక సకల విద్యాసంపన్నులున్ను ఇతని పదము లెన్నిసారులు విన్నను తనివితీరక యానంద పులకితులై మరల మరల వినవలతురు. గానసభలలోను, నాట్య ప్రదర్శనములందును క్షేత్రయ పదములకుగల స్థానమును బట్టియే సంగీత సాహిత్యములనే సారస్వత శాఖల రెంటను నీ పదము లెంత యుత్కృష్టము లయినవో తెలియనగును.

నాయికా నాయక భావ నిరూపణ మనెడు మనోజ్ఞ కథావస్తువు నాధారముగా గైకొని వాగ్గేయకారు లనేకులు పదములను రచించిరి. కాని, వారిలో క్షేత్రయకుగల విశిష్టత మరియొకరి కంతగాలేదు. ఈ నాయికా నాయక భావమునే నిరూపించుచు పదములను రచించుటలో నితడు బహుళమైన భావనా సంపదగల రచయిత యను ప్రసిద్ధిపొందెను. ఇతని రచనలలో నేకవాక్యమున ననేక భావములు స్ఫురింప జేయగల సద్గుణ సంపత్తి కలదు. ఇతని రచన కైశికీరీతిని సాగినది. ఇతని పదము లన్నిటను కవితాభావ చమత్కృతులు మెండుగా గలవు. మానవ జీవిత స్థితిగతులలో నేది తలచుకొన్నను దానిని సూచించు పద మితని రచనలలో కనబడగలదు.

గానమాధుర్యమున కనుకూలమయిన పదలాలిత్యమును పాటించి రచన సాగించుటలో క్షేత్రయ చతురతగల కళాభిజ్ఞుడు. వివిధ రసములను—

అంతే ప్రతి రసములోను కడు సుకుమారమయిన భేదములను నిరూపించి చిత్రించుటకు కావలసిన సంగీత సాహిత్య సమ్మేళనమును ఉపకరణములను యథోచితముగా వినియోగించుకొనుటలో ఇతడు కడు సమర్థుడు. ఇతని పదములు పాడవలసినట్లు పాడినయెడల శ్రోతలకు రసాస్వాదన ఫలము పూర్తిగా లభింపగలదు. కేవలము సామాన్యమైన సన్నివేశములను సైతము ఇతడు కడు దివ్యముగా వర్ణించెను. రాగములందు భావోద్రేకము కలిగింపగల స్వర సంగతులు లెస్సగా తెలిసిన ప్రౌఢ గనుక, అందుకు తగిన సాహిత్యమును క్షేత్రయ తన పదములలో యథోచితముగా పొందు పరచగల్గెను. ఒకొక్క రసములోగాని, భావములోగాని తీవ్రతయందుండగల తారతమ్యములను గుర్తించి యందుకు తగిన రాగముల నెంచుకొనుటలో నితడు కడు శ్రద్ధవహించినట్లు కనబడును. శోక రసములో బాహ్య మాత్రమైన దుఃఖము, ఉపశమించుకొనగల దుఃఖము, దుర్భరమైన దుఃఖము, హృదయ విదారకమయిన దుఃఖము—ఈ విధమున దుఃఖావస్థలను వర్ణించు పదములను రచించునప్పుడు, ముఖారి, ఘంట, నాదనామక్రియ, పున్నాగ వరాళి మొదలయిన రాగములలో ఏరాగ మేయవస్థకుచితమయినదో యాలోచించి జోడించెను. నాయకుడు తనవద్దకు రాక పెక్కుదినములు దూరస్థుడై యున్నప్పుడు నాయికకు కలుగు విసుగుదలను వర్ణించు పదములందును నాయకుడన్యాసక్తుడగుటచేత కలుగు నసహనము, నిస్సహాయత, ఆశా భంగము మొదలయిన యవస్థలను వర్ణించు పదములందును క్షేత్రయ జతపరచిన "వర్ణమెట్టు" లో యా భావములను వ్యక్తపరచుటకే కాక యందలి సూక్ష్మాంశములను సైతము వ్యాఖ్యానించుటకు తగినట్లు ప్రస్తరింప దగియున్నవి. లక్షితలు, ఖండితలు, అన్యాభోగ దుఃఖితలు నయిన నాయికలలో (1) వ్యాకులత చెంది సఖులతో తమ దుఃఖములను, మనోభావములను నివేదించుకొను నాయికలను, (2) ధృష్టుడో, శఠుడో యగు నాయకుని విశ్వాసద్రోహమును వక్రోక్తులతో నెత్తి పొడుచుచు ప్రసంగించు భగ్న మనోరథ లయిన నాయికలను, (3) అంతకు ముందు నాయకుడు కడు ననుకూలుడై ప్రేమతో వర్తించిన ముచ్చట్లు తలచుకొని వర్తమాన కాలమున విషమ పరిస్థితులవలన కలిగిన హృదయ విదారక దుఃఖము నుపశమింప జేసుకొను నాయికలను, (4) పెక్కుదినము లెడబాటు కలిగి నాయ

కూని తూగల కలిసికొనుటచేత నానంద పరవశయైన నాయికలను వర్ణించు పదము లాయా రాగ రస భావ లక్షణములను గుర్తించుటకు తగిన లక్ష్యములుగా నున్నవి. క్షేత్రయ పదములు యథోచిత వర్ణములతో స్ఫుటముగా చిత్రించిన సంగీత చిత్రము లనదగినవి. అందుగల సుకుమారములైన, స్ఫుటములైన వర్ణములు, సంపూర్ణత నొదవించు రూపములు మన చిత్తములను తీవ్రముగా నాకర్షించును. క్షేత్రయ పదములలో నేదైన నొక పదమును పాడగా వినునప్పుడు దానిలోనే నాయికా నాయకులను, పార్శ్వచారిణులగు సఖులను భావించుకొని వారి మనోభావములను వర్ణింప దలచెనో యవి యన్నియును మనయెదుట సాక్షాత్కారము పొందినట్లు తోచును. దానిని చక్కగా పాడుచు, అభినయించుచు నర్తించు నాయిక యా పదములోని నాయికయే యేమో ననిపించును.

క్షేత్రయ తన పదములకు "రక్తి రాగము"లనే యథోచితముగా ఎన్నుకొని జతపరచెను. ఐతే, అతని సంకల్పము కేవలము రాగ రసోదయమును కలిగించుట మాత్రమే కాదు ఒకే రసమును మాత్రమే నిరూపింపగల పున్నాగవరాళి వంటి రాగములను, అనేక రసములను నిరూపింపగల కాంభోజివంటి రాగములను ఉద్దిష్ట భావముల కనుకూలముగా పొందుపరచి పదములను రచించినాడు. ఇది జాగ్రత్తగా పరిశీలింపదగిన విషయము. ఇతని పదములలో త్రిపుటతాళమున రచితము లయినవి ఎక్కువగా గలవు. ఏడు మాత్రలు (3+4) గల త్రిపుటతాళము నృత్యగతుల కెక్కువ యనుకూలమయిన దన్న విషయ మనుభవము గలవారి కందరికిని తెలిసిన విషయమే కదా? ఇతని రచనలు "చౌక కాలము"లో నడచును. పాడెడు వారు గాన గతి "మెరుగు"లను సంపూర్ణముగా విశద పరచుటకు చౌకముగా నుండు త్రిపుటతాళ మెక్కువగా నుపచరింపగలదు. అంతేకాక, సాహిత్యములోగల బాహ్యాంతర భావములను సులువుగాను, స్వేచ్ఛతోను, నిర్దుష్టముగాను నిరూపించుటలో నీ చౌకకాలము నర్తకికి సౌకర్య మెక్కువగా కలిగించి తోడ్పడగలదు.

ఇంతవరకును క్షేత్రయ పదములు రాగతాళ వివరణములతో మాత్రమే ముద్రితములగుచు వచ్చినవి. అంతేకాని, పదములలోగల

నాయికా నాయకుల లక్షణము, స్థాయీ సంచారీ భావముల వివరణము, సఖీ లక్షణము పదములలో వివరించిన యవస్థలకు ముందు వెనుకల నుండు పరిస్థితులు మొదలగు నంశములు తెలియజేయలేదు. ఈ లోపమీ ముద్రణ మందు చాలవరకు తీరినది. భారతీయ సంగీత సాహిత్యరచనా చరిత్రలో విశిష్టమైన యొక వృద్ధిగతిని నీ కూర్పు సూచించునని చెప్పవచ్చును. ఈ ముద్రణమందు కనబడు పద్ధతిని క్షేత్రయ పదములను సంగ్రహించి సంప్ర తించుట సులభమయిన పని కాదు. ఇట్టి కష్టమయిన పని విజయవంతముగా నెరవేర్చిన ఈ గ్రంథ సంపాదకులు సంగీత సాహిత్యలోకమువారి కృతజ్ఞతకు పాత్రులయినారు. ఈ పదములను రచించిన క్షేత్రయ తన యద్భుత రచన ద్వారా కర్ణాట సంగీత సాహిత్యమున కొక దివ్యమయిన యుజ్జ్వలతను కలిగించిన మహనీయుడు. ఇతని ప్రతిభా విశేషములను సంగీత విద్వాంసులును, తదితర సకల విద్యాధికులును గుర్తించుటకీ గ్రంథ ముద్రణము లేశమాత్ర సూచకముగానైన నుపకరింప గలదని నా యభిప్రాయము.

పి. సాంబమూర్తి

# INTRODUCTION

Carnatic music has been fortunate in having had in successive centuries in the past a galaxy of great Vaggeyakars (master-composers) and their high class compositions in a rich variety of musical forms. Kshetraya occupies a unique place among such Vaggeyakars because his masterpieces called "Padas" have made an invaluable contribution to the enrichment and refinement of Carnatic music.

While Bhakthi or devotion to God has been the motive force of almost all great composers in pouring out their songs in this country, in the mode of expression of that devotion, they seem to have differed. Some were content with music alone and others believed that perfect devotion could be expressed only by a combination of song, dance and abhinaya. This difference in conception of devotional modes seems to have led to difference in musical forms as well. Jayadeva, Thirthanarayana and Kshetraya appear to belong to the latter School of thought. The Bhagavata Mela dance-drama tradition of Kuchupudi of Andhradesa and of Merattur and other villages of Tamil Nad is based on this line of thought. Purandara Das and his followers with a slight modification sang and danced in bhajans. Later day Thyagaraja and others simply sang out their hearts in devotion. Hence the forms of their compositions have their own distinctive marks on them such as Padas, Kirtanas and Kritis. These master composers besides being devout bhakthas were also highly learned men with

remarkable mastery over the science and art of music and great originality too. Hence each one contributed in his own way to improve and perfect the musical forms of his time. So much so they have established a wholesome tradition, that for devotional offering the intended art has to be of high aesthetic value as well without which no God would be pleased.

The unqiueness of Kshetriya padas lies in the fact that besides being exquisite musical forms, perfect in technique and replete with ragabhava, they are peerlessly fitted for expression of variegated shades of bhava in abhinaya in Bharata Natya. Hence they are of absorbing interest not only to music lovers but also to connoisseurs of the dance art. In fact for a long time before the decadence and neglect of Bharata Natya in the first quarter of the present century, the padas of Kshetriya along with the Ashtapadis of Jayadeva formed the mainstay of any Natya performance worth the name. If in spite of the phenomenal revival and popularity of Bharata Natya today, good abhinaya has become almost a casualty, it may be said to be due to the neglect of the vast treasure house of abhinaya in Kshetriya padas. The publishers of this volume are doing a great and timely service to the cause of high class music and abhinaya in Bharata Natya.

The beauty and value of Kshetriya padas cannot be described but must be experienced by one self. In them are combined mellifluous language, beautiful sentiments exquisite ragabhava and immense scope for expressing varying shades of bhava in abhinaya. All the Varnamettus are in slow time-measure and in between the words of every song, there is ample interval for elabora-

tion of ragabhava. All the compositions are in rakthi ragas admirably suited to the sentiments and emotions. If one hears a Kshetriya pada well sung, one can realise how the ragabhava blends with the sentiments and evokes an emotion, how varations in musical phrases evoke corresponding variations in shades of bhavas and what exquisite gamakas and graces can be put in to embellish the whole song. On the whole it will be an object lesson in the correct and soulful shape of a raga and also in the emotion relevant to it. If a dancer trains himself or herself in abhinaya for a dozen of Kshetriya padas, he or she will get the creative capacity to compose abhinaya for any new song given.

Hence the value of such Kshetriya padas can never be exaggerated. The author who fashioned them could not have been an ordinary man either but was peerless as a padakara. Very little authentic record of the life history of Kshetriya is available. All that can be said about him is that he was born and brought up in the 17th century in the village of Moova near the famous Kuchipudi in Kistna District. His family and surroundings were highly cultured. He himself was proficient in Sanskrit, Telugu, Music, Alankara Sastra, dance and abhinaya and imbibed fully the culture of the neibhouring Kuchipudi Bhagavatars and art of the local Devadasi experts in music and abhinaya. He travelled widely particularly in the Southern districts and visited places like Madura, Tanjore, Chidambaram, Srirangam, Mannargudi, Kanjeepuram and Tiruvellore. In his younger days he was known as Moova Varadayya and because of his extensive pilgrimage to various places he might have become famous as Kshetriya later. He

introduced himself into the Tanjore court during the time of Raghunatha Naick and became an honoured favourite there during the time of his successors particularly during the reign of Vijayaraghava Naick (1633–73) when he wrote most of his padas.

It was a period of great creative activity in fine arts in the Tanjore Court. During the time of Raghunatha Naick his minister the learned Govinda Dikshita wrote his '*Sangi a Suha*' and credited its authorship to his royal patron. The present day Veena with fixed facts was fashioned then. Under the patronage of Vijayaragava Naick Govinda Dikshita's son the reputed Venkatamakhi. created the famous 72 Melakartha system in music. Along with such high development in music, the art of dance was all galore in that Court. The dance-drama art of the Bhagavata Mela Mode and the Devadasi-Sadir nautch of the Nattuva Mela tradition were in full swing and numerous were the expert musicians, dancers and actors who received abundant patronage while the king himself revelled in their arts. It was in such a congenial and creative art atmosphere that Kshetriya lived and nurtured his talents as honoured favourite of the ruling prince and he had his eyes, ears and mind open to imbibe all the best in the theory and practice of music and dance.

He utilised his innate genius, facile imagination and vast experience of all that he saw and heard to great advantage and gave shape to them in his numerous and exquisite padas.

Unlike most other devotees he chose the path of Sringara as the means of expressing his bhakthi. Therein too he is said to have taken his cue from a predecessor

Annamacharlu. So much so it can be said that by the time of Kshetraya, compositions treating of Sringara came to be styled as padas. But he is said to have gone further than his predecessor by covering the full gamut of that field in all its details. Therein he is said also to have gone a bit beyond the limits in dealing with sex love. With all that the excuse for him might have been he was not of this world but he was in communion with the supreme Lord Moova Gopala.

In India our ancient sages did not taboo sex love as something unclean. On the contrary they considered it as one of the necessary four phases of life to be lived by every householder for attaining salvation. Sex love was scientifically analysed and human beings and their emotions circumstances and attitudes were meticulously defined. The classification of bhavas, nayikas and nayakas in the treatises is so ramifying in detail, that one's head will reel before one could master them and such knowledge was utilised for the development of the fine arts. But with all this scientific analysis, our ancients took care to take out the coarseness of ordinary sex love and sublimate it as the love of the Jeevathma to Paramatma, the Supreme soul in our music and dance arts. The Bhaktha considered himself as a Nayika and God as the Nayaka and expressed his love in the Nayika-Nayaka bhava in song, dance and abhinaya. Lord Krishna and his Lilas with the Gopis supplied never ending themes and sentiments for exposition of limitlessly colourful Nayika-Nayaka bhavas and hence worship through song and dance replete with Sringara became a mode of expressing devotion to Lord Krishna.

Kshetraya followed only that practice in having his hero lover as Moova Gopala which name incidentaly forms

the Mudra of most of his compositions as well. With all his bhakthi, his mastery of the Telugu language, music, Alankara Sastra and Natya Sastra seems to have been so great, that his sentiments are couched in easy and mellifluous words. His music reveals his comprehensive knowledge and true shape of the ragas and above all every song seems to illustrate one principle or other relating to the Alankara and Natya Sastras, bhavas and nayikas. Hence anyone who wants to be proficient in Bharata Natya has necessarily to get oneself trained in Kshetraya padas. While he has followed earlier works like *Sringara Rasa manjari*, he has outdone them by giving free vent to his facile imagination and by bringing into play exuberant Kalpana with greater vividy and realistic touch in dealing with Sringara than what is found in earlier works. So much so, he has exemplified in his padas all possible bhedas in nayikas and bhavas in an exhaustive manner.

Kshetraya has composed his padas in nearly 40 ragas including not only well known ragas but also rare ragas like Ahiri, Ghanta, Maruva, Regupthi, and Saindhavi. One or two rare talas also are to be found in his compositions. Among well known ragas he has composed the largest number in Kamboji, closely followed by Mukhari and then in descending order in Bhairavi, Kalyani and others. The compiler of this volume has done well in giving short explanations to many of the padas indicating the nature of the nayika and the bhava involved in the Song. There are 160 padas with Sweeya, 110 with Parakeeya and 109 with Samanya nayakis. There are also a few padas including one in Varali wherein the unusual nayaka expresses his sentiments.

Besides the authentic Kshetraya padas there are about 50 more of doubtful authorship of which about 25 may

belong to Kshetraya. Though the others sound as good as those of Kshetraya they seem to have been composed by different authors.

Though Kshetraya composed most of his padas with Moova Gopala as his Mudra, he sang in praise of other gods as well like Kanchee Varada another favourite of his.

Before leaving this subject, I cannot resist the temptation of touching upon one rather delicate aspect of Kshetraya padas. Nobody can deny the high aesthetic value of their musical form and their invaluable worth for abhinaya. The sentiments contained in them did no violence to the tastes of former times and generations. Kshetraya himself as a great Bhaktha was above the mundane plane even while expressing such sentiments of sex love. But we of the present generation cannot do many things that our forefathers could afford to do with their great sense of discipline, strict social codes and moral restraint. And Bharata Natya having come into the hands of respectable and cultured family girls nowadays they are likely to fight shy of taking to such of those padas as savour of bald sex love and about which the Devadasis had no compunction. With the growing tendency of our cinemas to vulgarise our Gods like Krishna and Subramania, there may not be much hope of keeping up a spiritual or devotional atmosphere in our present day dances. In these circumstances, the question is often asked "Is it proper or safe to encourage present day family girls to go in for Kshetraya padas and are they likely to handle them with understanding of their true devotional spirit ? At any rate can a pada like '*Oka Sarike*' be ever touched by our girls ?"

Well, as in literature so in music, passages dealing with sex love can never be taboo for mature minds even in these days. But if abhinaya is considered as taking matters further than reading or singing, then the less objectionable and more decent padas may be chosen. At any rate training in the musical forms and abhinaya of Kshetraya padas may help a great deal to compose new songs with sentiments better suited to modern times and tastes with bhavas relating to Uthama nayika—nayaka bhavas.

It is a pity that in our country, more arts are lost or forgotten than preserved or remembered. Like many other great composers, Kshetraya too did not give notation for his padas for the benefit of posterity. In the lapse of time, many of his padas have been lost or forgotten altogether. It involves immense labour and time to search out and gather the still available songs from various places and persons and patient scrutiny to sift the genuine ones from others. Few are to be found nowadays to give correct and convincing versions of even such of those padas as are still remembered. Hence the job of the compilers is unenviable. Laudable as the publication of the text of the padas is, it is time also to search out such of those very few as still preserve authentic versions of the songs and to utilse their help to publish intelligible notations also for them.

Be that as it may I dare say that this publication of Kshetraya padas will be welcomed by all genuine lovers of classical music and dance.

Madras,
2—7—1952.

E. KRISHNA IYER,
*Advocate, Madras.*

# (అనువాదము)

కడచిన పెక్కు శతాబ్దములలోను దక్షిణ దేశమందు ప్రసిద్ధికెక్కిన వాగ్గేయకారు లనేకు లొకరి తర్వాత నొక రెడతెగకుండ వెలసిరి. వారి యుత్కృష్ట గేయములు బహువిధకళారూపముల విలసిల్లినవి. ఇది యంతయును కర్ణాటక సంగీతమునకు కలిగిన మహాభాగ్యము. ఆ వాగ్గేయకారులలో క్షేత్రయ కొక విశిష్టమైన ఉన్నతస్థానము కలదు. మువ్వగోపాల పదములని పేరు పొందిన ఇతని యుత్కృష్ట గేయములు కర్ణాట సంగీతాభివృద్ధికిని, కర్ణాట గానకళా సంస్కరణమునకును ఎక్కువగా తోడ్పడినవి.

మన దేశములో వాగ్గేయకారులు తమ గేయములను వెల్వరించుటకు వారి నెక్కువగా ప్రోత్సహించినది వారికి గల భగవద్భక్తియే యైనను తద్భక్తిని ప్రకటించుటలో వా రవలంబించిన మార్గములు భిన్నము లగునవి. కొందరు సంగీతముతో తృప్తి చెందిరి. కొందరు గేయవృత్తాభినయములు మూడును జోడించిన గాని సంపూర్ణభక్తి వ్యక్తము కాదని నమ్మిరి. భక్తిని వ్యక్తపరచుటలో గల యభిప్రాయ భేదముల ననుసరించి సంగీత విధానంలో గూడ వేర్వేరు రీతు లేర్పడినవి. జయదేవుడు, నారాయణ తీర్థులు, క్షేత్రయ పైని పేర్కొన్న మతములలో రెండవ మతమునకు చెందినవారు. ఆంధ్రదేశమందు కూచిపూడిలోను, తమిళదేశమందు మేరతూరు మొదలైన గ్రామములందును వెలసిన భాగవతమేళ నాట్య నాటక సంప్రదాయము పైని పేర్కొన్న రెండవ మతముపై నాధారపడి పరిణమించినది. పురందరదాసున్ను, అతని అనుచరులున్ను కొద్దిపాటి మార్పులతో నీ మతమునే యనుసరించి భజనలలో పాడుచు నృత్యము చేయుచుండిరి. ఆ పిమ్మట త్యాగరాజాదులు భక్తి నిమగ్నము లయిన తమ హృదయములనుండి వెల్వడిన తమ కీర్తనలను కేవలము పాడుకొనుటతోనే తృప్తి చెంది యుండిరి. కనుకనే వారి రచనలు వారి విశిష్టలక్షణములతో పదములు గాను, కీర్తనలు గాను, కృతులు గాను రూపొందినవి. ఈ యుత్తమ వాగ్గేయకారులు కేవల భక్త్యావేశపరులు మాత్రమే కారు. సంగీతశాస్త్రమందును, గానకళలోను సమగ్ర పాండిత్యము, నిపుణత గల మహనీయులు; భావనాస్వాతంత్ర్యము గలవారు. కనుకనే వీరిలో ప్రతి ఒక్కరును ఎవరికి తోచిన మార్గమున

వారు తమ రచనలను సాగించి తమ కాలమందుండిన సంగీత సంప్రదాయ విధానములు వృద్ధిపొంది పరిపక్వమును పొందుటకు తోడ్పడిరి. తత్ఫలితముగా నొక నిండైన సంప్రదాయ మేర్పడినది. భక్తిని వ్యక్తపరచుట కుద్దిష్టమైన గానకళ సంపూర్ణ కళాధర్మముతో విడంబించవలెను. లేకున్న నే దేవతకును సంతోషము కలుగదు.

క్షేత్రయ పదములందు గల విశిష్టోత్కృష్టత యేమంటే: అవి కేవలం సంగీతరీతులం దుత్తమములై, కళావిధానమునందు పరిణతి పొంది రాగభావములతో పరిపూర్ణతను జెందినవి మాత్రమే కావు; భరతశాస్త్ర మందలి యభినయ రాగభావములలో గల సూక్ష్మాంశములను గూడ నిరూపింపగల యనన్య సామాన్య ప్రతిభ గలవి. అందుచేతనే యవి గానప్రియు లకే కాక నాట్యకళాభిజ్ఞులకు సైతము పరమాసక్తిని గలిగించు యోగ్యత గలవి యైనవి. ఈ శతాబ్దమందలి మొదటి యిరువదియైదు సంవత్సరముల లోను భరతనాట్యకళ యెడల నుపేక్ష యుండెను గాని, తత్పూర్వము చాలకాలము క్షేత్రయపదములును, జయదేవుని యష్టపదులును చెప్పుటకో దగిన ప్రతి నాట్య ప్రదర్శనమందును నాట్యమునకు ముఖ్యమైన యాధార ములుగ నుండెను. ఇప్పుడిప్పుడు భరతనాట్యము మరల జనరంజకమైనది; పునరుద్ధరింపబడినది. అయినను అభినయమునకు మెండుగా నవకాశము కల్గించు భాగ్యము గల క్షేత్రయపదము లింకను వ్యాప్తిలోనికి రాకపోవుట చేత మంచి యభినయ మీ నాట్య ప్రదర్శనములం దెక్కడనో కాని తరుచుగా తక్కినవారి పదములందు కనబడకున్నది. అందుచేత ఇప్పుడు ముద్రితమైన యీ గ్రంథమును ప్రకటించినవా రున్నతమైన గానకళాభివృద్ధికిని, భరతనాట్యమందలి యభినయ నిరూపణాభివృద్ధికిని తోడ్పడి నేడు కనబడుచున్న లోపమును తీర్చినవా రయినారు. క్షేత్రయపదములందలి సౌందర్యము, విలువ నోటిమాటలతో చెప్పుట కష్టము. అవి అనుభవైక వేద్యములు. ఈ పదములలో మధురమైన, సాహిత్యము సుందరమైన భావ ములు, ఉత్తమములైన రాగభావములు, అభినయమున కనువైన రసభావ విశేషములు మనోజ్ఞముగ కలిసి యున్నవి. వర్ణమెట్టులు చాలకాల ముండున్నవి. ప్రతి పదమందును మాటల నడుమను రాగభావ వికాసమున కవకాశ ముండునట్లు పదములు రచితములైనవి. పదము లన్నియు నుద్దిష్ట

రసభావముల కనుకూలములైన రక్తిరాగములలో పాడుటకు తగినట్లుగా నున్నవి. క్షేత్రయ పదములలో నేదైనను పాడవలసినట్లు పాడినయెడల రాగభావములెట్లు రసభావముల కనుగతములై యుత్సాహ మొదవించునో, స్వరసంగతు లెట్లు రాగభావములందలి వివిధాంశములను వ్యక్తపరచునో, పదమంతయు మనోజ్ఞముగా నుండుటకు తగినట్లుగా శ్రేష్ఠములయిన గమకములు, విలాసములు ఎట్లు పొందుపరుప వచ్చునో తెలియనగును. మొత్తము మీద నొక రాగ వర్ణమును నిర్దుష్టముగాను, నుత్సాహవంతముగాను ప్రస్తరించుటకు గాని, అందుకు తగినట్లు రసభావమును పొందించుటకు గాని రచన యెట్లు సాగవలెనో క్షేత్రయ పదములవలన బోధపడగలదు. పండ్రెండు క్షేత్రయ పదములకు తగినట్లు అభినయము నేర్చుకొన్న నర్తకులు మరియే క్రొత్తపాట పాడినను అందుకు తగినట్లుగా అభినయము ప్రదర్శింపగలరు.

ఇట్టి సుగుణ సంపదగల క్షేత్రయ పదముల ఘనత యెంత యెక్కువగా చెప్పినను అతిశయోక్తికానేరదు. అట్టి పదములను రచించిన క్షేత్రయ సామాన్యుడు కాడు. అనన్యసామాన్య ప్రతిభాశాలియైన వాగ్గేయకారుడు. ప్రమాణాధారములు గల అతని జీవితచరిత్ర మనకు లభ్యము కాలేదు. ఏవో కడుకొద్ది విషయములు మాత్రమే తెలియవచ్చినవి. తెలిసినంతవరకు మనము చెప్పగలిగిన దేమంటే: 17 వ శతాబ్దమునందు కృష్ణజిల్లాలో కూచిపూడి గ్రామమునకు చేరువగా నున్న మూవ గ్రామములలో నితడు పుట్టి పెరిగెను. ఇతని కుటుంబమువారును, వారి చుట్టుపట్ల నున్నవారును ఎక్కువగా సంస్కృతి జెందినవారు. అందు క్షేత్రయ ఆంధ్ర గీర్వాణ భాషలందును, సంగీతమునందును, అలంకార శాస్త్రమందును, నృత్యాభినయములందును పండితుడు. చేరువనున్న కూచిపూడి భాగవతుల విద్యా శిక్షణము లెస్సగా పొందినవాడు. సంగీతాభినయములందు చతురులయిన దేవదాసీల నాట్యకళను పరిపూర్ణముగ నభ్యసించినవాడు. దక్షిణదేశమునం దంతటను సంచారము చేసి మధుర, తంజావూరు, చిదంబరము, శ్రీరంగము, మన్నారుగుడి, కాంచీపురము, తిరువెల్లూరు నగరములకు వెళ్ళినవాడు. బాల్యకౌమారదశలలో నితడు మూవ వరదయ్య అను పేరు వహించి యుండెను. ఆ తరువాత నితడు వివిధ క్షేత్రములకు పోయి యుండుటచేత నితనికి క్షేత్రయ యను పేరు

వచ్చియుండును. రఘునాథ నాయకుని కాలములో నితడు తంజావూరి రాజాస్థానమునకు పోయెను. ఆ పిమ్మట విజయరాఘవ నాయకునకును, (1633—1673) పండితులకును మాననీయుడును, ఇష్టుడును, నై యుండెను. ఆ కాలమందే యితడనేక పదముల నక్కడ రచియించినాడు.

ఆ కాలమున తంజావూరి యాస్థానమునందు లలితకళలలో నూతన కళా నిర్మాణ చైతన్యము తాండవించుచుండెను. రఘునాథనాయకుని కాలమందు అతని మంత్రియైన గోవిందదీక్షితులు గొప్ప విద్వాంసుడు. సంగీతసుధ యను గ్రంథమును తనకు రాజపోషకుడైన యా రఘునాథనాయకుని పేర రచించి సమర్పించెను. నేటి కాలపు వీణ యానాడిప్పుడున్న మెట్లలో సజ్జీకృతమైనది. విజయరాఘవుని రాజపోషకులగు గోవిందదీక్షితుని కుమారులలో ప్రఖ్యాతి చెందిన సంగీత విద్వాంసుడు వేంకటమఖి. సంగీత శాస్త్రమందు మేళకర్తల విధానమును నూతనముగ నేర్పరచెను. ఆ రాజాస్థానమందు సంగీత శాస్త్రకళా వైభవముతోపాటు నాట్యకళకూడ దివ్యముగా విలసిల్లినది. అంతేకాక భాగవతమేళ పద్ధతిని నాట్య నాటక కళా విధానమున్ను, నట్టువమేళ సంప్రదాయమునకు చెందిన దేవదాసీ సదిర్ నాట్యకళా విధానమున్ను మహోన్నత దశ నందుకొన్నవి. కళా ప్రావీణ్యమఖండముగా గల గాయకులు, నర్తకులు, నటులు రాజాదరణమును పొందినవారనేకు లుండిరి. రాజాశ్రిత మీ కళలందు నోలలాడుచుండెను. అట్టి అభ్యుదయ పరంపరాభివృద్ధిగా లలితకళలు విలసిల్లుచుండిన యా కాలమందా వాతావరణమున క్షేత్రయ తన కళా నైపుణ్యమును వికసింప జేసికొని రాజాదరణము పొందియుండెను. గాన నాట్యములకు చెందిన శాస్త్రములందును, కళలందును గల విశేషములన్నిటిని క్షేత్రయ కని విని అవగాహనము చేసికొనగలిగెను. తనకు సహజముగ నలవడి యుండిన ప్రతిభను ఊహా వైశద్యముతో కని విని యలవరచుకొన్న యనుభవమును పరిపూర్ణముగా రాణింపజేసికొని తన శక్తి సామర్థ్యములను తన పదములలో నిరూపించుకొనెను.

ఇతర భక్తులనేకులవలె గాక యితడు తన భక్తిని వ్యక్తపరచుటలో శృంగార రసభావ మార్గమునే యనుసరించెను. అందుకు తనకు పూర్వుడయిన యన్నాచార్యుల పద్ధతిని వరవడిగా పెట్టుకొనెను. వీరవలంబించిన

రచనా విధానమును బట్టియే శృంగార రసప్రధానములయిన భక్తి గేయము లకు పదములను పేరు వచ్చినది. అంతను అన్నాచార్యులను మించి క్షేత్రయ తన పదములలో ప్రతి భాగ విభాగములందును నిర్దిష్టరసభావాంశ ములను ప్రసక్తించి పదరచన కొక నూతన వికాసము కలిగించిన వాగ్గేయ కారుడయ్యెను. దీనితోపాటు శృంగారరస భావమును పొందుపరచుటలో నితడు కొన్నిచోట్ల మితిమీరియుండెనని సైతము చెప్పవలెను. అయితే అందుకు తగిన సమాధానము లేకపోలేదు. క్షేత్రయ కేవల మీ బాహ్య ప్రపంచమువాడు కాడు. మువ్వగోపాలుడను పేరనున్న పరమాత్మునితో సంసర్గము పొందగోరిన పరమ వైష్ణవభక్తుడు.

మన భారతదేశములో మన ప్రాచీనకాలపు ఋషులెవ్వరును శృంగారరసమునకు జీవమయిన కాముక ప్రేమను అపవిత్రముగా నెంచి బహిష్కరించలేదు సరిగదా, నిర్వృతికి ప్రవృత్తి మార్గసాధనముగా నెంచి విహితములైన బ్రహ్మచర్యాద్యాశ్రమముల నాల్గింటను గల గృహస్థాశ్రమ మున కీ ప్రేమ యావశ్యకమయినదిగా పరిగణించిరి. కాముకప్రేమను దాని తత్త్వము ననుసరించి వివిధతరగతులకు చెందినదిగా విభజించిరి. మానవులను, వారి మనోభావములను, వారి ప్రేమావస్థలను, ప్రవృత్తి ప్రకృతులను శాస్త్ర దృష్టితో నిర్వచించిరి. అలంకారశాస్త్రములందు నాయికా నాయక లక్షణములను సవిస్తరముగా వర్ణించి నిరూపించిరి. అందులో నెన్నెన్నియో విశేషాంశములు గలవు. అవన్నియు కడు జాగ్రత్తగా నిర్వచింపబడినవి. అలంకారగ్రంథములలో రసభావములు, నాయికా నాయకుల లక్షణములు వర్గీకరింపబడినవి. ఆ వర్గీకరణమందలి వివరణములు శాఖోపశాఖలుగా నేర్పరచబడినవి. ఈ విషయము లన్నిటిని అవగతముచేసికొనుటకు చాల శ్రద్ధ వహించవలెను; కష్టపడవలెను. ఐతే, లలితకళ లభివృద్ధి పొందించుటకీ వివరణముల పరిజ్ఞానమంతయును కావలసినదే. అయితే, శాస్త్రదృష్టి కీ వివరణములతో నీ వర్గీకరణము సంపూర్ణతకోసము చేయవలసివచ్చినా, మన పూర్వులు నాట్యగానకళలందు సాధారణ కాముక ప్రేమలోగల మోటుతనమును తొలగించి, ఆ ప్రేమకు జీవాత్మ పరమాత్మల పరస్పర ప్రేమోత్కృష్టతను గలిగించిరి. భక్తుడు తాను నాయిక యయినట్లును, దేవుడు తనకు నాయకు డయినట్లును భావన చేసికొన్నట్లు పదములు రచితము

లయినవి. అందులోని నాయికా నాయక భావలక్షణము పాడినప్పుడును, అభినయించునప్పుడును స్పష్టముగా విశదీకరింపబడును. కృష్ణభగవానుని గోపికాలీల రాసక్రీడలు, నాయికా నాయక భావలక్షణ నిరూపణమునకు కావలసినన్ని సన్నివేశములను స్ఫురింపజేయును. ఈ సంప్రదాయమునుబట్టి శ్రీ కృష్ణపరమాత్మనియెడల నుండు భక్తి, ఆరాధన గేయములద్వారాను, నాట్యముద్వారాను వ్యక్తమగు మార్గ మేర్పడినది.

క్షేత్రయ ఈ సంప్రదాయమునే యనుసరించి తన పదములలో కృష్ణునే మువ్వగోపాలు డను పేర నాయకుని జేసి ఆ పేరే పెక్కుపదము లందు ముద్రగా పెట్టుకొనెను. క్షేత్రయకు తెలుగుభాషలో అఖండ మయిన పాండిత్యముగలదు; సంగీతజ్ఞానము మెండుగాగలదు. అలంకార శాస్త్రమందును, నాట్యశాస్త్రమందును నిష్ణాతుడు; సర్వతోముఖ విద్యా సంపదతోపాటు పరమ భక్తుడై యుండెను. ; కనుక, ఇతని భావన లుదారము లయినవి; ప్రకటితములయిన రాగరసభావము లుత్కృష్టములయినవి. ఇతని యలంకార నాట్య శాస్త్రజ్ఞానము పదములందు స్పష్టమగుచుండును. అందు చేతనే భరతనాట్యశాస్త్రము, నాట్యకళ నభ్యసింపదలచినవారు క్షేత్రయ పదములను లెస్సగా నభ్యసింపవలెను; పదములందలి భావముల నభిన యించుట నేర్చుకొనవలెను.

క్షేత్రయ శృంగార రసమంజరివంటి లక్షణ గ్రంథములలో గల నాయికా నాయక లక్షణములను, రసభావాదులను పూర్తిగా గ్రహించుటయేకాక, అందు వివరించిన విషయములకంటె నెక్కుడు విశేషములను తన యూహాప్రాభవముతో చిత్రించెను. శృంగార రసభావమును మరింత యెక్కువగా జీవకళతో తొనికిసలాడు కల్పనలు గల సన్నివేశములను సమకూర్చెను. తత్ఫలితముగా నాయికలలోను, వారి చిత్తప్రవృత్తులందును, మనోభావములందును గల భేదములన్నిటిని క్షేత్రయ తన పదములందు నిరూపించిన చతురరచయిత యయినాడు.

ఇతడు తన పదములను సాధారణముగా వ్యాప్తిలోనున్న 40 రాగము లందే కాక అహిరి, ఘంట, మారువ, రేగుప్తి, సైంధవి వంటి యపురూప రాగములందును రచించెను. ఇతని రచనలలో ఒకటిరెం డపురూపతాళము లను జతపరచిన పదములుకూడ కలవు. ప్రసిద్ధరాగములలో కాంభోజి

రాగము అత్యధిక సంఖ్యాక పదములందు కనబడుచున్నది. దాని తర్వాత ఎక్కువ తరుచుగా కనబడు రాగములు ముఖారి, భైరవి, కళ్యాణి మొదలయినవి.

ఈ కూర్పులో ప్రతిపదమునందును గల నాయికా నాయక లక్షణమును, భావమును సంపాదకులు సంక్షేపముగా నిరూపించుచు ప్రకటించిరి. ఇందు స్వీయకు చెందిన పదములు 160, పరకీయకు చెందినవి 110, సామాన్యకు చెందినవి 109 గలవు. నాయకుని పలుకులు గల పదములుకూడ కొద్దిగా గలవు. అందు వరాళి (పర. పు. 63)లో గలపదము ముఖ్యమయినది.

క్షేత్రయ పదములని స్పష్టముగా నిరూపింపదగిన పదములు కాక మరి 47 పదము లిందు చేర్చినారు. అందులో "క్షేత్రయపదములేమో ?" యను సందేహములో నున్నవి 25. ఇవి ఇతరులు రచించినను క్షేత్రయ పదముల వలెనే గోచరించుచున్నవి.

క్షేత్రయ పదములలో అత్యధికసంఖ్యాక పదములు మువ్వగోపాలు ముద్రతో నున్నను ఇతని కిష్టదేవతలయిన కంచివరద మొదలయిన యితర దేవతల ముద్రలతో గల పదములును కొలదిగా గలవు.

నా యుపోద్ఘాతము ముగించుటకు ముందు మరియొక విషయమును వివరింప వలెనన్న కోరిక నాకు ప్రబలముగానున్నది. అందుచేత వివరింపక తప్పదు. అది క్షేత్రయ పదవిషయములో సందేహించి చెప్పవలసిన సుకుమార విషయము. కళాపోషణకును, అభినయ నిరూపణమునకును క్షేత్రయపదములమూల్యము లనుమాట యెవ్వరును కాదనజాలరు. ఈ పదములందలి శృంగారరసభావములు మనపూర్వులకు లేశమైనను తప్పుగా తోచలేదు. ఆ భావములను నిరూపించుటలో క్షేత్రయ పరమభక్తుడుగనుక ఈ భావములను ఐహికదృష్టితోగాక పారమార్థికదృష్టితో విశదపరచెను. ఐతే, మనపూర్వులు సుశిక్షితమైన చైతన్యముతోను, సాంఘిక నైతిక ధర్మ నియమములతోను ఎట్టి శృంగారభావములనైనను నిశ్చలభావముతో గ్రహింపగలిగిరి కాని, మన మీ కాలమున వారి మనోదార్ఢ్యమును వహింపలేము; వారు చేసినపనులలో పెక్కింటిని చేయనూలేము. ఇప్పుడు భరత నాట్యము మర్యాద, గౌరవము గల గృహస్థుల యిండ్లలో బాలిక లభ్యసించుచున్నారు. పచ్చిశృంగారమును వెల్లడించు పదములనుపాడి యభినయించు

టకు దేవదాసీలకు సంకోచము లేకపోయినదిగాని యీ బాలికలు సిగ్గువడి వెనుదీయుచున్నారు. శ్రీకృష్ణ సుబ్రహ్మణ్యాది దేవుండ్లను సినీమాచనల చిత్రాలలో పచ్చిశృంగారపురుషులుగా నిరూపించు నాచారమంతకంత యెక్కువగు నీ కాలమున మునుపటివలె పరమభక్తిని శృంగారరసభావమున చిత్తశుద్ధితో వ్యక్తముచేయగలమన్న యాశ లేకున్నది. ఇట్టి పరిస్థితులలో నాట్యమున కుపచరించునని కులకాంతలగు బాలికలకు క్షేత్రయపదములను నేర్పించు టుచితమా? ఆ పదములందలి పవిత్రప్రేమభావమును వారు గ్రహింపగలరా? "ఒక్కసారికే యీలగయితే" అను పాటవంటి పదములను వారు పాడగలరా? పాడనీయవచ్చునా? అనే ప్రశ్నలు పుట్టును. ఐతే, సాహిత్యములో వలెనే సంగీతములో సైతము అనుభవము, ప్రాజ్ఞత గలవారి విషయములో ఎట్టి శృంగారరసభావమయినను అగ్రాహ్యముకాదు; బహిష్కృతముకాదు. కాని, నాట్యమున కట్టి పదముల నెంచుకొన్నప్పు డా పదములలోని శృంగార రసభావములను మరింత యెక్కువగా నవగతముచేసికొని వ్యాఖ్యానించున ట్లభినయించవలెను గనుక మితిమీరిన పచ్చి శృంగారరసభావములుగల పదములను విడిచి పథ్యమైన పదములనే యెంచుకొనవలసియున్నది. ఏదైనను నాట్యమున కందులో నభినయమునకు క్షేత్రయపదములు తక్కినవారి పదములకంటె నెక్కువ యనుకూలముగా రచితములయినవి గనుక, ఈ పదములను నేర్చుకొనుటవలన ముందు ముందు నేటి యభిరుచుల కనుకూలమయిన రసభావములతో నూతన పదసృష్టికి కావలసిన శక్తి, సామర్థ్యము అలవడగలవు. ఉత్తమనాయికా మనోభావములను వ్యక్తముచేయు పదములను రచించుట జరుగగలదు.

మన దేశమందు వెలసియుండిన కళలలో నేటికిని మనము నిలబెట్టుకొని జ్ఞప్తియందుంచుకొన్న వాటికంటె ఎక్కువ కళలను పోగొట్టుకొని మరచిపోయినాము. ఇది మన దురదృష్టము. రాబోవు తరములవారు పాడుకొనుట కుపచరించునట్లుగా స్వరమెట్లతో క్షేత్రయ తక్కిన చాల మంది వాగ్గేయకారులవలెనే తన పదములను రచించలేదు. పాడవలసిన తీరు తెలియక అనేక పదములు పోయినవి. పదములు సేకరించుటకూడా చాల కష్టమైనపని. ఎన్నో మారుమూలలందు దాగియున్నవి. ఎంతో శ్రమపడి వాటిని సంగ్రహించవలసియున్నది. సంగ్రహించిన పదములలో ఏవి

వాస్తవముగా క్షేత్రయ రచించినవో, ఏవి కావో ముద్రలేని పదముల విషయములో చెప్పుకొనుట కష్టముగానున్నది. ఇప్పుడు పాడుచున్న పదములలోనైనను సరియైన పాఠములేవో తెలిసికొనుట చిక్కుగానున్నది. కడు కొద్ది మంది మాత్రమే సంప్రదాయసిద్ధములును, శుద్ధములును నగు పాఠములను చెప్పగలరు. ఇట్టి పరిస్థితులలో నీ పదములను సంగ్రహించి సంపాదకులుగా పనిచేసినవారి కృషి యెంతయినను మెచ్చుకొనవలసినదే. ఈ గ్రంథ ముద్రణమునకు ప్రకాశకుల నభినందించుచు నీ పదములందు కొన్నియైనను శ్రేష్ఠములయిన వెంచి స్వరములతో జోడించి ముద్రించవలసిన ఆవశ్యకత గలదని హెచ్చరించుచున్నాను.

నా యాశయము లెట్లున్నను ప్రస్తుత మీ ముద్రణము సంప్రదాయ సిద్ధమైన సంగీత సాహిత్య నాట్యములయెడల నభిమానముగల వారందరికిని ఆదరణీయము కాగలదని నా నమ్మకము.

ఇ. కృష్ణయ్యర్

# గ్రంథప్రశంస

గేయ రచనలో క్షేత్రయ్యను మించిన వారు లేరని చెప్పుటకు నేను వెను దీయను. అతని పదములు చదివినకొలదిని తెలుగుభాషలోని గొప్ప తనము, జాతీయత యెక్కువగా విశదములగు చుండును. ఆ పదములను పాడినప్పుడు శ్రోతల డెందము లమితానందావేశభరితము లగును. పదముల లోని పలుకులు మామూలుగా పల్లెలలోని సామాన్యజనులు వాడుకొను లోకోక్తులేకాని అవి గేయములలో పొందుపరుపబడినప్పు డమృత తుల్యములై వీనులకు విందుచేయు చుండును. "కంచు పదను వంటి మనసు" "కన్నీరు కావేరికాలువ సుమీ" "కలిబోసిన నుట్టివంకలు చూచే వయ్యయ్యో" "మగవాని కట్టబెట్ట మనతరము గాదె" "సముఖాన రాయబారము లేలే" "వ్రతము చెడిన సుఖము లేదాయెగా" "నే నొకటి తలచితే దైవమొకటి తలచి నందుకు" ఇట్టి వనేకముగా క్షేత్రయ పదము లలో నున్నవి. మామూలు మాటలతోనే యితని పదము లెట్లు మనోజ్ఞ ములుగా నుండునో తెలియజేయుట కొక్క దృష్టాంతము చాలును. "ఎందుకు వచ్చెనో కోప మెవ రేమన్నారు" అనే పదములో "ఎన్నడైన నవ్వుకోమో యెదురు మాటాడుకోమో...ఏమైన ననుకోమో యెచ్చుకొద్దు లాడుకోమో....నామాట నీవు కాదంటే నీమాట నేను కాదంటి" మొద లయిన వాక్యము లెంతయు సరళముగాను, సహజముగాను, తెలుగు నుడి కారము ననుసరించి మనోజ్ఞములగు చుండును. ఇట్టి అద్వితీయ మధుర గేయములను వందలకొలదిగా రచించిన క్షేత్రయ్య వాస్తవముగా అమర కవి. ఇతనికీర్తి ఆచంద్రార్కము నిలిచి యుండు ననుటకు సందియములేదు.

క్షేత్రయ్య గొప్ప రసికుడు; లోకమును బాగుగా అర్థము చేసుకొని లోకుల స్వభావములను పూర్తిగా తెలిసికొని శృంగారాది రసభావములను సమయోచితములయిన రాగభావములతో జోడించి వ్యక్తము చేయగల శక్తిసామర్థ్యములు పూర్తిగా గల మహాకవి; వాగ్గేయకారుడు. ఒక్కొక్క గేయములో ఒక్కొక్క నాయికకు గల యవస్థలను, మనోభావములను

స్పష్టముగా విశదీకరించెను. కడు తేలిక మాటలతో గంభీర భావములను వ్యక్తపరుపగల చతురుడీ క్షేత్రయ్య. ఏయే రసభావముల కేయే రాగములను ఏయే తాళములను జతగూర్పవలెనో గుర్తించి పదములను రచించెను. నిర్దిష్ట రాగములో పదము పాడునప్పుడు పదమునందుగల ప్రతి రస భావమున్ను శబ్దార్థము వల్లనే కాక దానికి జోడించిన రాగభావము వలనసైతము మరింత స్పష్టముగా విశదమగుచుండును. ఎట్టి సందర్భమందైనను పదముల కూర్పు లలితముగా సాగుచుండుటేకాని గానమాధురికి ప్రతికూలము కాదు. అంతేకాక, ఒక పదము పూర్తిగా పాడునప్పటికి దానికి జతపరచిన రాగము పూర్తిగా నన్నిగతులను ప్రస్ఫుత మగుచుండును. గేయములకు పల్లవితో పాటు అనుపల్లవి చేర్చు సంప్రదాయమునకు క్షేత్రయయే మార్గదర్శకు డయ్యెను.

పదములందలి స్థాయి సంచారిభావము లభినయమున కెక్కువగా నవకాశ మిచ్చునట్లు క్షేత్రయ్య తన గేయరచన సాగించుటచేత నాట్యమున కితని పదములెక్కువగా నుపకరించును. అయినను నాట్యప్రదర్శనములందితని పదముల కింకను తగినంత పలుకుబడి రాకపోవుట కివి యెట్లు పాడవలెనో చాలమందికి సరిగా తెలియక పోవుటయే ముఖ్యకారణము. ఇంత వరకును ముద్రితము లయినవి నాయికా నాయకుల యవస్థా నిరూపణ సూచనలతో ముద్రితములు కాలేదు. ఆ లోప మీ కూర్పునందు తీరినది. శ్రీ పిఠాపురము మహారాజా సాహిత్య చక్రవర్తి డాక్టర్ శ్రీ రావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహదరువారు సంగీతసాహిత్యముల యెడలను, నాట్యము వెడలను తమకుగల యభిమానముతో విశేషముగా ధనము వెచ్చించి యీ గ్రంథమును ముద్రింపించిరి. దీనికి సంపాదకులయిన డాక్టరు గిడుగు వేంకటసీతాపతిగారు పదములను సేకరించి, వివిధ గ్రంథములను పరిశోధించి నాయికా నాయకలక్షణముల వివరణములతో పదములను ప్రకటించిరి. వీ రిరువురును సంగీత సాహిత్య లోకమునకును, నాట్యకళోపాసకులకును, మహోపకారము చేసిన వా రయినారు. వీరికి నా ధన్యవాదములు.

పర్వతనేని వీరయ్య చౌదరి.

# ప్రస్తావన

నాట్యము మన భారతదేశమందు యోగ్యమైన లలితకళగాఁ బ్రాచీన కాలము నుండియును బ్రసిద్ధికెక్కి యున్నది. లాస్యమునకుఁ బార్వతి యును, తాండవమునకుఁ బరమేశ్వరుఁడును బ్రఖ్యాతిఁ బడసిన దంపతులు. నాట్యమునకు నటరాజు గురుదేవుఁడు. శ్రీమద్రామాయణ, మహాభారత, భాగవత గ్రంథములందు నాట్య ముత్తమ కళగాఁ బరిగణింపఁబడినది. భరతముని తన కాలమునాఁటికి వెలసియుండిన నాట్యలక్షణములను సమగ్ర ముగాఁ గ్రోడీకరించి రచించిన భరతశాస్త్రము గొప్ప ప్రామాణిక గ్రంథమై యున్నది. భరత మనఁగానే నాట్యమని యర్థమగునంత ప్రఖ్యాతిఁ బడసినది. దాని ననుసరించి యభినయ శాస్త్రాద్యనేక నాట్యగ్రంథములు సంస్కృత భాషలో రచితములైనవి. అందనేకములు తెలుఁగు మొదలయిన దేశ భాషలలోనికిఁ బరివర్తనము పొందినవి. స్వర్గమున దేవేంద్రుని సభలో రంభాద్యప్సరసలు నాట్యమాడుచుండినట్లు, భూలోకమున రాజుల సభలలో నర్తకులు నాట్యమాడుట సదాచారమయినది. దేవాలయములందుఁ బ్రతి దినము నంగరంగభోగ వైభవములతోపాటు నాట్యము సైతము జరుగ వలయునను నాచార మేర్పడినది. ఆ నాట్యముచేయు స్త్రీలు తమ జీవిత సర్వస్వమును దేవునికి సమర్పించి సేవచేయవలసినవారు గనుకనే, వారికి 'దేవదాసీ'లను పేరు సార్థకమయినది. ఇంత పవిత్రమును, గౌరవార్హమును, సనాతన సదాచారమును నైన యీ నాట్యకళ రానురాను దేవదాసీ వర్గము వారికే కాని యుత్తమ కులకాంతల కుచితము కాదనునంత నీచదశకు వచ్చినది. ఇందుకు రెండు ప్రధాన కారణములు గలవు. దేవుని సేవకై నియుక్తలయిన దేవదాసీలు కేవల మాసేవతోఁ దృప్తిలేక, క్రమక్రమము భోగలాలసలై వారకాంతలుగా మారి నీచవృత్తి నవలంబించిరి. దానికిఁ దోడు మరియొక కారణము సైతము గలదు. దేవుని యెడలగల భక్తిని బ్రకటించుటలో నొక లలితమైన పద్ధతి యేర్పడినది. భక్తికిఁగల పరమావధి పరమాత్మతోడి జీవాత్మల సంయోగమను భావన పుట్టిన తర్వాత నిది స్త్రీ పురుష సంయోగము వంటిదిగా నిరూపితమయినది. దానితో భక్తిరస ప్రధానములైన గేయము లుత్తమ శృంగార రసభావముతో వాగ్గేయకారులు రచించుటకుఁ బ్రారంభించిరి. ఆ గేయములను దేవదాసీలు పాడి యభి

నయించు నప్పుడు వారు భోగలాలసత కలవాటుపడిన వారగుటచేత వా
పాట, వారి యభినయము కేవలము కాముకప్రేమ విలసనముతో నిరూపితమ
లగుచు వచ్చినవి. నర్తకుల యెడల గౌరవము నశించినది; వారు పాడ
పదముల యందలి యుత్కృష్టత చెడినది. అయినను నాట్యకళ యెడల గౌ
యభిమానము, గౌరవము మాత్రము తగ్గిపోలేదు. ఈ శతాబ్దారంభము
సంఘ సంస్కరణ ప్రియుల యలజడి వలన నొక క్లిష్ట పరిస్థితి యేర్పడిన
పవిత్రమైన నాట్యకళ నీతి బాహ్యులయిన వేశ్యల కప్పగించి, కులకాంత
కంట రానిదిగాఁ జేయుటయా? లేక, వేశ్యావృత్తిని నిర్మూలించి నాట్య
కళను బునరుద్ధరింపఁ జేసి దాని గౌరవమును నిలఁబెట్టి కులస్త్రీలకుయోగ్య
మైనదిగాఁ జేయుటయా? యను విషయము పెద్దల యాలోచనకు వచ్చినది
నాట్యకళా పవిత్రతను నిలఁబెట్టుటకే పెద్దలు నిశ్చయించిరి. సంఘ
సంస్కరణ ప్రియులును బ్రాహ్మమతస్థులును నాట్యకళ ప్రాశస్త్యము
బూర్తిగా గ్రహించిన విశ్వకవీంద్రులు, రవీంద్రనాథులు తమ విశ్వభార
విద్యాపీఠమున నాట్యకళా శిక్షణమునకుఁ గావలసిన యవకాశ మొసంగుటయే
కాక, తమ యధ్యక్షతను నాట్యనాటకము లాడించుచుండిరి. దేవాలయమ
లందు దేవదాసీల నృత్యము నిషేధింపఁ బడినది. ఉత్సవము లందున
నూరేగింపులందును భోగముమేళము లంతరించినవి. వేశ్యలును దమ వేశ్యా
వృత్తిని విడిచి వివాహితలై కులకాంత లగుచున్నారు. నాట్యకళ యవినీత
చేతులనుండి విముక్తి పొందినవి. ఇఁక సత్కుల కుటుంబముల బాలికల
యువతులు నాట్యము నభ్యసించు తరుణ మాసన్నమైనది. ఇట్టి సమయమ
నృత్తాభినయములకుఁ దగిన పదములను నాట్యలక్షణాంశముల వివరణముత
నర్తకుల కందఁ జేయవలసియున్నది. ఈ విషయమును లెస్సగా గుర్తించి
శ్రీ పిఠాపురము మహారాజా, సాహిత్య చక్రవర్తి, డాక్టర్ శ్రీ రా
వేంకట కుమార మహీపతి సూర్యారావు బహదరువారు తెలుఁగు పద
లన్నిటను క్షేత్రయ పదము లుత్తమములనియు, నభినయమున కెక్కు
యవకాశముల నీయఁగలవనియు నెంచి యీ పదములనే సాధ్యమగున
వఱకును ప్రయత్నించి సంగ్రహించి ప్రకటింతమని సెలవిచ్చిరి. వా
సంకల్ప మిప్పటికి రూపమున నెఱవేఱినది.

"వేడుకతో నడుచుకొన్న - విటరాయఁడే" (చూ.సా పు. 102) అను పదమునుబట్టి చూడఁగా క్షేత్రయ 4500 పదములకుఁ బైగా రచించినట్లు కనఁబడును. శ్రమమునకోర్చి నాలుగుచోట్లను విచారించి ప్రయత్నించిన యెడల నొక వేయి పదములైనను లభింపక పోవునా యని యనుకొంటిమి. తంజావూరిలోని సరస్వతీమహల్ పుస్తక భాండాగారమునుండి తెప్పించుకొన్న పదములును, శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరులు శాస్త్రులవారు నూతనముగా సంగ్రహించిన పదములును, శృంగార రసమంజరిలో లక్ష్యములుగాఁ జేర్చుకొన్న పదములును, పూర్వముద్రణము లందలి పదములను జేర్చి చూడఁగా సుమా రాఱువందల పదములయినను లభించునని యాశ కలిగినది. కాని, జాగ్రత్తగాఁ బరిశీలించి చూడఁగా నందు పెక్కు పదములు క్షేత్రయ పదములుగాఁ గనఁబడలేదు. కొన్ని క్షేత్రయ పదములే యైనను పూర్తిగా లేవు. కొన్ని లేఖకప్రమాదములతో నిండియున్నవి. ఈ పదములను నిర్దుష్టములుగా సవరించుకొనుటలో ముద్రిత గ్రంథములు, శృంగార రసమంజరి, పూర్వముద్రణములును మా కెక్కువగాఁ దోడ్పడినవి. మాకు మొదటఁ గలిగిన యాశ భగ్నమైనది. కాని, మొత్తముమీఁద సుమారు 350 పదములయినను సంగ్రహింపఁ గలిగినందు కొక్కింత యూఱట కలిగినది. మరి 25 పదములు క్షేత్రయ పదములేమో? యను సంశయముతోఁ బ్రకటించితిమి. మరి 23 పదములు క్షేత్రయవి కాకపోయినను రసవంతములైనవి గనుక, ముద్రితములు కాక వృథాపోనేల యను నుద్దేశముతోఁ బ్రకటించితిమి.

ఈ పదములను ముద్రించుటలోఁ గేవలము రాగ, తాళములను మాత్రమే కాక నాయికా-నాయక లక్షణాది విశేషములను సైతము సూచించుటవలన నీ పదములను బాడి యభినయించు నర్తకులకు సౌకర్య మెక్కువగా నేర్పడునని తోఁచినది. అందుచేత స్వీయ, పరకీయ, సామాన్య నాయికా భేదముల ననుసరించి పదముల నీ మూఁడు వర్గముల క్రిందను ప్రత్యేకించి ముద్రించితిమి. నాయికా నాయక లక్షణాది వివరణములే కాక పదమంతటను గల రసభావములు—స్థాయి సంచారి భావములు మొదలయిన వివరణము లన్నియును జేర్చి ప్రకటించిన యెడల గ్రంథము రెండింత లగునని భయపడి, స్వీయ కొక పది, పరకీయ కొక పది, సామాన్య

శ్లోక పది పదములు మాత్రమే యెంచి యీ వివరణములతో ముద్రించితిమి. ఈ వివరణములు కొన్నిసంవత్సరముల క్రిందటఁ దూర్పుగోదావరి జిల్లా కిర్లంపూడిలో నుండిన దేవులపల్లి వీరరాఘవమూర్తి శాస్త్రి గారు రచించి ప్రకటించిన యభినయస్వయంబోధినిలో నున్నవి. ఈ గ్రంథములో క్షేత్రయపదములు 60 కంటె నెక్కువలేవు. ఉన్నవి మాత్రము నిండుగా నాయికా నాయక లక్షణ నిరూపణముతోను, రసభావాది వివరణములతోను నుండుటచేత నీ గ్రంథ మీ ముద్రణమునకుఁ గొంత వరకుఁ తోడ్పడినది. రసమంజరిలోఁగల వివరణములకు, నీయభినయ స్వయంబోధినిలోఁగల వివరణములకును గొన్నిచోట్ల భేదములున్నవి. అందేవి యెక్కువ యుచితములుగా నున్నవో యవి గ్రహించి తక్కినవి పుట యడుగున సూచించితిమి.

క్షేత్రయ జీవిత విశేషములు పూర్తిగాను, నిస్సంశయముగాను దెలియుటకుఁ గావలసిన యాధారము లంతగా లేవు. వివాద గ్రస్తములయిన విషయములను బండితు లనేకులు చర్చించి యున్నారు. వాని నిక్కడ మరల నొకసారి చర్చించుట చర్వితచర్వణముగా నుండును. కనుక నింతవరకును బహు జన సమ్మతములైన విషయములను సూచించుట మాత్రమే చేయఁదలఁచితిమి.

"మువ్వగోపాల" లోని 'మువ్వ' పదము 'మవ్వ' యని సైతముండునేమో యనుటకు "మరునికేళిలో నన్ను—మవ్వగోపాలుడు" అను పాఠమును (చూ. పర. పు. 93) జూపుచున్నారు. యతి నియమము నిలుప వలెనన్న యుద్దేశముతో మువ్వ శబ్దమును మవ్వగా మార్చినారు. కాని, క్షేత్రయ యిట్టిచోట్ల యతి నియమ మంతగాఁ బాటించుట లేదు. చూడుఁడు :—

చెలియ ! నీ నెమ్మోము—చంద్రుడందురు గాని (ప. పు. 71.)
చిలుత ప్రాయమునీవు—చేరకుందువటే ? (స్వీ. పు. 85)
పుడమిలో వేఱె జన్మము లేద సుదతి (స్వీ. పు. 88)
ఉలికి లేచి కసరుకొని వనిత ! నీతో—పొందుచాలు పొమ్మనెను (స్వీ. పు. 95)

ఇంక నిట్టి ప్రయోగము లెన్నియో కలవు.

మువ్వ శబ్దము మూవ, మోవ, మొవ్వగా మారవచ్చును. మువ్వ యైనను గావచ్చును. కాని మువ్వ శబ్దమే తఱచుగా నున్నది. చూడుఁడు:—

మోదముతో నన్నేలిన చక్కని - మువ్వగోపాలుఁడు (స్వీ. పు. 72)
ముదమలరగను మా - మువ్వగోపాలుని (స్వీ. పు. 80)
ముప్పొంగనిచ్చేవో? లేదో? - మువ్వగోపాల! (పు. పు. 16)
మోడితో నీవిపు డున్నదాని తెలిసె - మువ్వగోపాలుం బొందుగోరి (సా. పు. 27)
మొన్ననాతో కోపగ్లాను - మువ్వగోపాలుఁడు (స్వీ. పు. 96)
ముదముతో నాముద్దు - మువ్వగోపాలుఁడు (పు. 17)
మ్రొక్కిన వినక మా - మువ్వగోపాలుఁ (ప. పు. 18)
మొలక నవ్వు మోముతో - మువ్వగోపాల! (స్వీ. పు. 105)
మున్ను నన్నేలిన శ్రీ - మువ్వగోలునితోను (సా. పు. 36)
మోసపుచ్చి నన్ను - మువ్వగోపాలుఁడు (సా. పు. 98)

ఇట్టి ప్రయోగము లింక నెన్నియో కలవు.

కృష్ణ జిల్లాలోని దివి తాలూకా యందలి కూచిపూడి గ్రామమున కొకటిన్నర మైలు దూరమునగల మొవ్వ గ్రామమే క్షేత్రయ చెప్పుకొన్న మువ్వపురియనుట లెస్స. క్షేత్రయ కుటుంబము వారమని చెప్పుకొను మొవ్వ బ్రహ్మయ్యగారు మొదలయినవారు కొందరు నేఁటి యీ మొవ్వగ్రామమునఁ గలరు. ఇందు గోపాలస్వామి యాలయము సైత మున్నది. "వేడుకతో నడుచుకొన్న —విటరాయడే" యను పదమునందుగల యనుపల్లవిలో "ఏడు మూడు తరాలనుండి—ఇందున్న కాణాచట! గూడుకొని మా మువ్వ - గోపాలుఁడౌ విభుఁడు" అను మాటలనుబట్టి గోపాలస్వామి యచ్చోట నేలకొని క్షేత్రయ నాటికి (7+3) 10 తరములో 21 తరములో యైయుండవచ్చును.

"నా వల్ల దుఃఖము లె - న్నటికైన గలవా?" (పు. పు. 56) యను పదములోని యనుపల్లవి "మోవవాఁడు కలిగిన - మువ్వగోపాల దేవా!" యని యుండుటచేత 'మోవ' శబ్దము పాఁకనాఁడు, వేఁగినాఁడు మొదలయిన శబ్దములలోవలె నాఁడికకును, 'మువ్వ' శబ్ద మూరికిని బెట్టిన పేళ్లుగా గనఁబడుచున్నవి.

క్షేత్రయ యింటిపేరు మువ్వా యని కొందరందురు. మువ్వగోపాలుని ముద్రగల పదములు రచించుట వలన ఆతని కాపేరు వచ్చెనని మరికొందరందురు. ఇది సరియైనదిగా నగుపించదు. మువ్వగోపాల ముద్ర మొదట్లో యుండలేదు. ఆతని పేరు వరదయ్య యనియు నటుతరువాత కొంతకాలమునకు బౌరుష నామముగానో బిరుదు, పేరుగానో క్షేత్రయ యను పేరు వచ్చినదనియు ననుచున్నారు. ఐతే కావచ్చు. నిందు కాక్షేపమేమియు నుండ నక్కరలేదు. మొదటి పేరేమయినను క్షేత్రయ క్షేత్రయ్యయే. ఇతనిని క్షేత్రజ్ఞుఁడను వారును గలరు. అందుకు నాక్షేపము లేదు.

క్షేత్రయ యే వయస్సునందే విద్య నభ్యసించెనో సరిగాఁ జెప్పలేము. కాని, పదములందలి రచన, భాష, రాగ రసభావములు మొదలయిన యంశములను బట్టి చూడఁగా నితఁడు సంస్కృత సాహిత్యము, తెలుఁగు సాహిత్యము, భరతశాస్త్రము, సంగీతము లెస్సగా నభ్యసించి కవిత్వము నందును, మధురపద కవితయు నలవర్చుకొన్న సుప్రసిద్ధ వాగ్గేయకారుఁడైనట్లు కనబడుచున్నది. ఇతఁడు కూచిపూడిలో భరతనాట్యము సంపూర్ణముగా నేర్చుకొని యుండునని చెప్పవచ్చును. అంతేకాక లోకమును, మానవచిత్త ప్రవృత్తులను, మనోభావములను లెస్సగాఁ బరిశీలించిన మహామేధావి యైనట్లు పదములందలి రసభావములు, లోకోక్తులు, ముచ్చటలు మొదలయిన విశేషములు తెలియజేయుచున్నవి.

సంగీతమునకు సంబంధించిన రాగభావములును, నాట్యమునకు సంబంధించిన రసభావములును క్షేత్రయ పదములందెట్లున్నవో సంగీత విద్వాంసులయిన శ్రీ సాంబమూర్తిగారును, నాట్య కళాభిజ్ఞులయిన శ్రీ కృష్ణయ్యరుగారును దమ యుపోద్ఘాతములలో సవిస్తరముగ వివరించి యున్నారు. అంతకంటె నెక్కువగ నేను వ్రాయఁగలవాఁడనుగాను. సంగీత విషయములో వారివల్లనే నేను నేర్చుకొన్నదియు, వారు చెప్పక విడిచినదియు నొక విషయము మాత్రము నేను జెప్పవలసి యున్నది. పల్లవినుండి యనుపల్లవికిని, ననుపల్లవినుండి పల్లవికిని, బల్లవినుండి చరణమునకును, జరణమునుండి పల్లవికిని పోవు స్వరముల కూర్పింద్రచాపమునందలి రంగులవలె సౌకుమార్యముతో మెల్లగా మారుచుండును. ఈ సద్గుణము క్షేత్రయ పదములలో నెక్కువగా విశదమగును. మఱియొక ప్రశంసార్హమైన విశేషమేమనఁగాఁ: బదమునందలి ప్రధాన భావమున కనుకూలమైన రాగము నెంచి జతపరచుటలో

క్షేత్రయ గొప్ప విచక్షణగల గానకళాభిజ్ఞుఁ డనిపించుకొనెను. కొన్ని పదములందొక్క చరణమునఁ గాని, పల్లవి యనుపల్లవి యందుగాని యనేక భావము లుప్పతిల్లుచుండును. ఒక్కసారి మాత్రమే పాడునప్పుడా భావము లన్నియు నభినయముతో వ్యక్తపరచుట సాధ్యముకాదు. ఎన్ని ప్రధాన భావములు గలవో అన్నిసార్లు పాడవలసి యుండును. పదమునకు జతపరచిన రాగమొక్కటే యైనను నొకొక్క ప్రధాన భావమున కొకొక్క విధమున స్వరముల కూర్పు మారుచుండవలెను. అందు కొక్క నిదర్శనం: "ఎందుకు బొంకేవురా - లేదని నాతో - ఎమ్మెలు సేయకురా|| ముందటి వాడవా - మువ్వగోపాలా నీ ముచ్చవగలు - మానరా" || అను పదము సామాన్య నాయిక పలుకులతో నున్నది. ఈ పలుకులలో సరసపు మాట, ప్రేమ, గౌరవము, వియోగము వెనల నసహానము, కోపము, హేళనము, బెదరింపు మొదలయిన భావముల నభినయింపవలెను. స్వరసంగతులు మార్చుచు మూఁడు నాలుగుసార్లు పాడినయెడల నుద్దిష్ట రసభావములన్నియు నభినయించుట కవకాశము కలదు.

ఈ పదములందలి భాష జయదేవుని యష్టపదులందలి సంస్కృత భాష కంటెను నెక్కుడు పదలాలిత్యముతో నింపెసలారుచుండును. తేట తెలుఁగు పలుకులతో భావగాంభీర్యమును వ్యక్తముచేయఁగల రచనా చాతుర్య మీ క్షేత్రయ కలవడినట్లు మఱియే వాగ్గేయకారునకు నలవడలేదని చెప్పవచ్చును. ఇందుకుఁ గొన్ని నిదర్శనములు :—

ఈ తనువుతో నిన్ను నే దలతునా ?
ఇంక నీ యాజ్ఞకు వెరతునా ?
రాతిమతి గలవాని గొలుతునా ?
రార ! మువ్వగోపాల ! యని నిన్ను బిలుతునా ?

(స్వీ. పు. 192)

అలుకచేసి యింటికి రా - వైతివి; నెవరైన
చెలికత్తె లున్నారా ? - పిలువ వచ్చేరా ?
చెలికత్తె వైన నీవే - చెలువుడ వైననీవే
తలచిచూడ నాపాలి - దైవము నీవే (స్వీ. పు. 73)

చెలిమి చేసేదందు - చలము చేసేదిందు
వలపు లుంచేదందుం. వట్టి సుద్దులిందు
నెలకొన్న రతులందు - విట్టూర్పులేయిందు
వెలలేని పాటలందు - వింతకయ్యములిందు (పు. 46)

నిన్న రాతిరి నీకు - నిదుర లేకున్న నా
కన్ను లెఱ్ఱగా - కలిగెనుగదరా (పు. 3)

ప్రేమరెట్టించు కోమో? బిగి కౌగిళ్ళనుండమో?
ఏమైన నను కోమో? - ఎచ్చు కొద్దు లాడుకోమో?
ఆమాట కామాట - కప్పుడే నే జాణనంటి
నామాట నీవుకాదంటె - నీమాట నేను కాదంటి (స్వీ. పు. 100)

తలపు వానిమీదనాయె - తలవాకిలె ఇల్లాయె (ప. పు. 38)

అలుక చేసి రానివాడ - వలయించి వెతలు పెట్టి
కలలో నేలవచ్చేవురా? చక్కనిసామి! (ప. పు. 42)

మనసు విరిచే చెలుల చాడి - మాటలు విన్నా మంచిదే
నెనరు దాననని యాదరించినను మంచిదే
చనవు మాటలింక - చన దనిన మంచిదే
తనకైన యీ మేను - తానేమైన చేయనీవే
తరుణిరో! పుణ్యాపాపము - తనచేతివి
పరమాత్ముడా మువ్వగో - పాలుతో విన్నవించవే (ప. పు. 44)

"చెలియ! నీ మోము - చంద్రుడందురుగాని
చంద్రుడైతే - చంద్రకళ గావా?"
"సరసుడవు నీవు నేను - సరసంబులాడంగ
కళ వేళనకళ వచ్చు - చంద్రకళగానా?" (ప. పు. 71)

నా మనసువంటిది - నీ మనసైతే నా
నోముఫల మీడేరురా - అదిగాక
వేమారు చెఱకున పండు పండినట్లు
వేడుకలినుమడించేరా! ఓకీ వరదా! (సా. పు. 69)

కవితా చమత్కృతినిజూపు పదము లనేకములు గలవు.

ప్రౌఢ, ప్రేమగర్వితయగు నాయిక తనప్రాగల్భ్యమును జమత్కృతితో ధ్వనింపఁ జేయుచుఁబలుకునట్లుగా రచించిన పద మెంత హృద్యముగా నున్నదో చూడుఁడు:—

సామాన్యముగాదె! వానిపొందు
సామన్యముగాదె!
ఏమన నేరని భామలు వానికాసించి -
రేమందు? విజయరాఘవుడే సామిసుమ్మీ॥

* * *

విజయరాఘవుని మెప్పించి, వానిపొందుగోరు నాయిక కెట్టి యర్హత యుండవలెనో చరణములందు గలవు.

* * *

ప్రాయ చదువు నేర - వలె! ఆ వగలయందు
గాయకురాలు - గావలె ...
ఆటకు మేటి గావలె! తంబుర
గోట మీట రాగ మరవలె! వానిపై సొగసు
పాటలు వినిపించవలె వాని మనసు
మాట లార నోవలె! ఓచెలియరో (సా. పు 105-6)

* * *

రసికత, భోగవిలాస లాలస గల నాయిక తన కోర్కెల నెట్లు వివరించుచున్నదో తెలియఁజేయు పద మెంత మనోహరముగా రచితమైనదో చూడుఁడు :—

మానినిరో! చేర రమ్మని పిలువని - మాలి మేటి మాలి మే?
పూనిదాని ప్రాయ మనుభవింపగలేని
పురుషు డేటి పురుషుడే? ఓ చెలియా!

అవునని మువ్వగోపాలుడు మెచ్చని
యంద మేటి యందమే? ఓ చెలియా!

పదమందంతట నిట్టియాశయములే సరసముగా రచితములయినవి. ఇందులో "కవులకు బహుమాన మియ్యఁగలేనట్టి కలములేటి కలములే" యను వాక్యము మాత్రము సదభిప్రాయము కలదే యయినను దక్కినయాశయముల వర్గమునకు జేరినది కాదు; గనుక, నప్రస్తుత ప్రశంసగా నున్నది. ఈ స్వల్పవిషయమునకేమి గాని, పదమంతయు హృద్యముగానున్నదనుటకు సందియములేదు. ఇది బమ్మెర పోతరాజు భాగవతములో రచించిన

"కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే?
పవన గుంఫిత చర్మ భస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే?
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక...
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే?
పాపయుగముతోడి పశువుగాక" (VII_170)

యను పద్యమును జ్ఞప్తికిఁదెచ్చుచున్నది. పోతరాజు పద్యము కేవలము భక్తి ప్రధానమయినది. క్షేత్రయ పదము శృంగారరస ప్రధాన మయినది అయిన నుదారాశయములు గలది గనుక, మిగుల మనోహరమయినది.

కవితా చమత్కృతి గల పదముల నేకములీ క్షేత్రయ మహాకవి రచన లందు గనఁబడుచున్నవి.

"ఏమి సేయుదు? మోహ - మెటువలె దీరును?" (స్వీ. పు. 202) ఈ పద మెంత చక్కగా రచితమైనదో! పదమంతయు నాయకుని కథనము తోనే నిండి యున్నది. దానిని బట్టి నాయికా నాయకుల లక్షణము తెలిసికొనవచ్చును. నాయిక స్వీయ; ప్రౌఢ. ప్రోషితపతిక. నాయకుఁ డను కూలుఁడు. ఇందుఁ బ్రవాస విప్రలంభ శృంగార రసతా తొలఁకాడుచున్నది. విరహవేదనలో నున్న నాయకుఁడూఱట పొందఁగోరి నాయికారూపమును జిత్రించి చూచుకొనును. చిత్రలేఖనమునకు సాధ్యమయిన యామె యాకృతిని జిత్రింపఁగలిగెను. కాని యా యా యవయవములందుఁగనులకుఁ గానరాని సుగుణసంపదను జిత్రించుట తెలియఁగనైతినే యని విలపించును. ఆమె ముఖారవిందమును లిఖియించెనుగాని, దానిలో "నలరు వాసనలు వ్రాయఁగనేరనైతి" నని చింతించును. ఆమె మోవి చిత్రించెనే కాని

యందలి " తేనియ అంచ నే నేర నైతి " నని తల్లడిల్లును. ఇంకనిట్టి వగపు లతో " ఏమిసేయుదు? మోహ మెట్లువలె దీరును? భామినీమణి నెవ్వరు తోడి తెచ్చేరు?" అని నాయికా సమావేశమునకై తహతహలాడును.

నాయకుని కథనమే కల మరియొకపదము (స్వీ. పు. 188) మధుర భావములతో నున్నది.

"అలిగి యేల యిందువచ్చితి? నయయ్యో! యింక నేనేమిసేయుదు" నని విలపించు నాయకుఁడు తన నాయిక యొంత యుత్తమురాలో తన యెడల నెంత యనురక్తయో వర్ణించి కీర్తించును.

నాయకుని కథనమే కల పదములు కడుఁగొలఁదిగా నున్నవి. అట్లుండుట సమంజసమే. ఏలయన, నాయకుని పలుకులకంటె నాయిక పలుకు లెక్కువ మధురములై యుండును. మానవు లందఱును స్థూలదృష్టి కేదో యొక సామాన్య లక్షణము గలవారే యయినను సూక్ష్మదృష్టికే యిరువురు నొక్కవిధముగా నుండరు గదా? అట్లే క్షేత్రయ పదములన్నియును శృంగారరస భూయిష్టములై ఒక్క మచ్చునవే యున్నట్లు కనఁబడినను నే రెండు పదములలోని భావములు నొక్కతీరున నుండవు. నాయికా నాయకుల లక్షణములు వారియవస్థలు నెన్నెన్ని విధములుగా నుండునో లెస్సగాఁబరిశీలించిన రసజ్ఞుఁడు గనుక. మనమెట్టి నాయికా నాయకుల నెట్టి యవస్థలను దలఁచుకొన్న నందుకుఁదగిన పదము క్షేత్రయ రచనలందు గనఁబడగలదు. అట్లులనుట వలన నితఁడు లక్షణశాస్త్రమెదుటఁ బెట్టుకొని యొకొక్క లక్షణమున కొక్కొక్క లక్ష్యముగా నీ పదములను రచించెనని చెప్పుట యొప్పుకాదు. క్షేత్రయవంటి యుత్తమ కవులెప్పుడు నట్టిపని చేయరు. లక్షణములకీ లక్ష్యములను బొందుపఱచుట పండితుల పని. శృంగార రసమంజరిలోని లక్షణములకు క్షేత్రయ పదములనుండి లక్ష్యములాయా స్థలములందు సమన్వయింపజేసినవా రిటీవలిపండితులు.

నాయికస్వీయయైయున్న పదములలో నాయిక ముగ్ధయు విస్రబ్ధ నవోఢయునై యుండు "చిన్నదాననే నే మెఱుఁగ సిగ్గయ్యీనమ్మ" (స్వీ. పు. 131) యను పదమును కేవలము ముగ్ధ, నవోఢయగు నాయిక పలుకు" నన్నేటికి బొమ్మ నేరే వానివద్దకి (స్వీ. పు. 149) యను పదమును

మొదలుకొని ప్రౌఢ, ప్రేమగర్వితయగు నాయిక పలుకు “(మన) ఇద్దరి వలెనే కూడి - యెవరున్నారు? తెల్పురా! ఒద్దికతో మనవలె - నున్నారా? మువ్వగోపాలా!... నిత్యము మదనుడునీవే - నీకు రతీదేవి నేనే (స్వీ. పు.82) యను పదమువఱకును వివిధ లక్షణణాలు గల నాయికా-నాయకులకును, వారి యవస్థలకును సంబంధించిన పదము లెన్నెన్నియో కలవు.

పరకీయ యంతగా మెచ్చుకోఁదగిన యుత్తమ నాయిక కాక పోయినను రాధా ప్రేమవలె పరకీయా ప్రేమ యెక్కువ తీవ్రమైనది గనుక దానిని నిరూపించుటలోఁ గవితా చమత్కృతి కెక్కువ యవకాశము గలదు. నవోఢ, విదగ్ధయైన పరకీయ “ఏమనే వానతీరా? ఏమిసేతురా?...... మువ్వగోపాలా!......తిలక మే తీరున దిద్దుదునో దేవుడవని మ్రొక్కుదునో పాలయలుకలే చేయుదునో చెలిమితో లాలింతునో...” (ప. పు.30) యని తన నిర్వ్యాజమైన ప్రేమ విశదపరచుకొనును. “నన్నే పెండ్లాడు సుమీ! నాయాన మువ్వగోపాలా!” యని పలుకు కన్యగా నున్న పరకీయ పదము మొదలుకొని, “మగ డేమిచేసిన చేయనీ!...యత్త నన్ను దూరిన దూరనీ!...కాపుర మేమైనగానీ......నీ పొందుసేయక మాన మువ్వ గోపాలా! నీ పాదమాన” యని ప్రేమోన్మత్తతతో సాహసించి పలుకు పరకీయ పదము వఱకును వివిధ లక్షణములు, నవస్థలు గల పదములు నాయిక పరకీయగాఁ యున్నవి యనేకములు కనఁబడును.

సామాన్య సర్వజ్ఞసింగభూపాల విరచితమైన రసార్ణవ సుధాకరమునఁ జెప్పినట్లు “సాధారణ స్త్రీ గణికా కళాప్రాగల్భ్య ధౌర్త్యయుక్” సామాన్యలలో రక్త, విరక్త యని రెండు తెఱఁగులవారు కలరు. రక్తురాలయిన సామాన్య యప్రధానముగ మాళవి కాగ్నిమిత్రమున వేశ్యయయిన యిరావతివలె నాటకములం దుండవచ్చును. నాటకముకంటె వేఱైన రూపకములం దీమె ప్రధానముగా నైత ముండవచ్చును. నాయిక సామాన్యయైన క్షేత్రయ పదములందు రక్తురాలయిన నాయికకు సంబంధించిన పదములే యెక్కువగాఁ గలవు. అందు, “ఇన్ని విధముల బూజించేర సామి! యింతిని; నను గూర్చుమీ!......మేలుగ రతులను మెలగిన నీకు, లక్ష్మికి గల్యాణము చేసేర సామి!......”(సా. పు. 23) యను ప్రేమాస్పద పదము, “ఎంత లేదని యెంచకురా!...నిను బాపి తాళలేను—

నీ సొమ్ము చేసితి నా మేను...వలచితిరా నిను వరద! నా పాల గలవని నమ్మితి గరుణా లోలా" (సా. పు. 29) యను ప్రేమగర్వితపదము, "గోపాలా! యేపట్ల దయ జూడవు నీ వెవ్వ రనేవు నే నేమి పాపము చేసితిరా?...నీ వెట్లు జాణవైతివో నీపై మరులు కొన్నదాని భావము తెలియలేవు...... తలచిన నావంటి వనితలు నీ కెందరో? బలవంతమా? మువ్వగోపాలా! (సా. పు. 55) యను నుత్తమ సామాన్య పదము నింకనిట్లే రక్తురాలయిన సామాన్యకు సంబంధించిన పదము లనేకము గలవు. ఇట్టి పదములతోపాటు విరక్తలు-నధమలు నైన సామాన్యల పదములును గలవు. "చేత కాసులేదే! కాని - చే సైగలే" (సా. పు. 60) యను పద మిందుకొక యుదాహరణము.

నాయికా నాయకు లిరువురును బరస్పరానురాగములో నున్నప్పుడు ప్రోషితపతికైయైన స్వీయ తన యాకులపా టెంత మృదువుగాను, విన్నవారి డెందములు కరగునట్లును జెప్పునో

"ఏమని తెలుపుదు-నేలాగు తాళుదు -
నేమి చేతునే? చెలియా!
భామరో! యూరికి-బయలుదేరెడు వేళ,
ప్రేమ మీర నాసామి - పిలిచి చెప్పిన మాట......
అన్న మిండక - అతివెత నొందకు
కన్నీరు నింపకు - కలవరింపకు మని
ఎన్నెన్నో విధముల - హితవులు తెలుపుచు
కన్నీరు నించుచు - కాంతుడు చెప్పిన మాట......(స్వీ. పు. 113)

ఇట్లు శ్రోతల కనుకంప గల్గించు పదము లనేకముగా నున్నవి.

సఖీ శిక్షా లక్షణమును దెలియజేయు పదములు సైతము కొన్ని గలవు. "అలగితి వెందుకు అల మువ్వగోపాలునితో" (స్వీ. పు....) "తాళి మొక్కరికైన వద్దా?" (స్వీ. పు. ...) మొదలయిన పదములు కడుహృద్యముగా నున్నవి. దూతి విరహోత్కంఠితయైన తన నాయిక కూటమి గల్గించు పద మొకటి యెంత కవితాచమత్కృతి గలదో చూతుము:

ఏ తీరున రమణిని గెలిచి నీ - వెట్లు రూపొందేవో
చూతాము రారా ! మదన నీ - చేతి బలిమి మా - చెలియ బలిమి||
(స్వీ. పు. 109)

# భాష

జ్ఞానుఁడనుఁగు నుడికారము, పదముల పొందిక, పదలాలిత్యము, ప్రసన్నత, సౌకుమార్యము మొదలయిన సుగుణములు గల మృదుమధుర భాషలో క్షేత్రయ తన పదములను రచించెను. ఇట్టి మధురకవి భాషవిషయములో ప్రామాణికుఁడు కాకుండునా ? బహుజనపల్లి సీతారామాచార్యులు తమ శబ్దరత్నాకరమందీ దిగువ పేర్కొన్న శబ్దములకుఁ బ్రయోగములను క్షేత్రయ పదములనుండి యెత్తి చూపించిరి :—

అంచు — చూచుకము. "అంచులచేత నప్పళించి" క్షేత్రయ
అన్నెకాఁడు—(అన్నెము + కాఁడు) అన్యాయకారి.
"అన్నెకాఁడైవాఁడు నా వలపెల్ల నారుదూఱు చేసేనే" క్షే.

అన్నెకారి—అన్యాయకారిణి "అన్నెకారి చాడి విన్నాడు" క్షే.
అమరిక—(అరమర యొక్క రూపాంతరము). భేదము.
"అరిమరిక లేని చుట్టలు" క్షే.

అలముకొను—పైకొను, "నిచ్చనిచ్చలు లాలించి నే నలము
కొనుటే గాని, గ్రుచ్చినాఁడు కౌఁగిలించుకొను
టెన్నఁడు లేదుగా" క్షే.

ఆరుదూఱు—అల్లరి, "ఆరుదూఱు చేసి నన్నల ఘుంచిన మంచిదే" క్షే.

ఉప్పతించు—ఓర్వలేని తనముచేత ఆడిపోసికొను
"ఉప్పతించి వాఁడునురను రనె నేమో" క్షే.

గుల్లకాఁడు—ఏమిలేనివాఁడు, అకించనుఁడు
"గుల్లకాఁడై మన యింటి గుఱుతు లడుగవచ్చినీ" క్షే.

గొంటుకాఁడు—కఠినుఁడు, "గొంటుకాఁడు మువ్వ
గోపాల రాయఁడు" క్షే.

జరత—(జలతారు యొక్క రూపాంతరము.
"జరత పావడ" క్షే.
నాగులు — నాగుఁబాము "నాగుల చవుతి వ్రతము" క్షే.
ముప్పొంగు—(మూడు+పొంగు) మూడు పొంగులు
పొంగు, ముప్పొంగు, క్షేత్రయ.
వడిగొను—(వడి+కొను) మెలిపడు, "వడిగొన్న సరులతో" క్షే.
సాకు—వ్యాజము, "అదలించినను సాకది యేమానో యని" క్షే.
సుంత—ఇంచుక, "సుంత సేపు వానిఁ జూడ కుండలేవు" క్షే.

సేన, సేనా (వాడుకలో శానా) శబ్దరత్నాకరములో నున్నది. ఉభ. దే. విణ. బహువు. (వాఁడు వచ్చి సేనసేపైనది) అని యర్థవివరణము కలదు. కాని, ప్రయోగమేదియును జూపలేదు. ఈ శబ్దమును క్షేత్రయయే గాక, ప్రసిద్ధ ప్రబంధ కవులును బ్రయోగించిరి. చూడుఁడు :—

"వెస, న్సింధులనుండి తీర్థములు సేనగఁ దెచ్చిరి వానరోత్తముల్" చంపూరామాయణము; (8. 164)—ఇది కార్వేటినగర సంస్థాన విద్వత్కవి యగు ఋగ్వేది కవి వేంకటాచలపతి కవిచే నాంధ్రీకరింపఁబడినది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

"సేనాధిపు లొక కొందఱు,
శ్యేనంబుల విడిచి రాజసింహుఁడు మెచ్చన్
నానావిహగోత్కరముల,
సేనగఁ బరిమార్చి యార్చి చెలఁగిరి నెమ్మిన్"

సర్పపుర మహాత్మ్యము (2.30)

ఇది కూచిమంచి తిమ్మకవి సార్వభౌమునిచే విరచితమైనది.

ఇంకను మరికొన్ని కావ్యములలో నీ శబ్దము దీర్ఘాంతముగా సైతము ప్రయుక్తమయినది. "సేనాగా నొనరించిన" అని ప్రభులింగ లీలలోను, "ఏలా ? సేనా మాటలు ? బాలా !" యని బసవపురాణములో బ్రయుక్తమయినది.

పైనిఁ జేర్కొన్న శబ్దములు కొన్ని శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువులో క్షేత్రయ ప్రయోగములతో నున్నవి.

క్షేత్రయ వాడిన కొన్ని శబ్దము లపూర్వములుగాఁ గనఁబడును గాని, పూర్వ కవులు కొంద ఱా శబ్దముల నతఁ డుద్దేశించిన యర్థములందే వాడి యున్నారు.

అంచు - చూచుకము - పెద్దన యీశబ్దము నీ యర్థమునందే ప్రయోగించెను. "ప్రాంచదమ్యాపణ... పై. యంచుల్ మోవఁగ...(మను 2-68).

"చేపట్లు" బ. చేతిపట్లు ; కలహము. క్షేత్రయ ప్రయోగము— "చేపట్లు కావచ్చునా మీలో మీకు ?" ఇందుకు పూర్వకవి ప్రయోగము లున్నవి. (చూ. సూర్యా. ని. 3. పు. 298)

"ఎల తుమ్మెదల దిమ్ముతలఁ గ్రమ్మకయమున్న, చిగురు చేపట్లకు డిగకమున్న" (వసుచరిత్ర 4. 25).

"ఎన్నిక" శబ్దమును క్షేత్రయ తలంపు, కోరిక యను నర్థములో "ఎంచిన యెన్నికలెల్ల నీడేరవాయె"నని ప్రయోగించెను. ఈ శబ్ద మీ యర్థమునఁ బూర్వులును వాడి యుండిరి. (చూ. సూర్యా. ని. 1. పు. 808.)

"చందురు పిల్లలు" సూర్యా. ని. లో (3. పు. 9) లున్న "చందురు కూనలు" వంటి ప్రయోగము. నఖక్షతములని యర్థము.

క్షేత్రయ రసజ్ఞుఁడు ; సంస్కృత సాహిత్యము, తెనుఁగు సాహిత్యము, నలంకార శాస్త్రము, సంగీతము, భరత శాస్త్రము మొదలయినవి లెస్సగా నభ్యసించిన విద్వాంసుఁడు ; మహాకవి. ఇట్టి మహనీయుని ప్రయోగములు ప్రామాణికములు కాకతప్పదు.

"అంతరంగులు"—అంతరంగు లున్నారా నన్నాదరించేరా ? ప్రాణ సఖులను నర్థమున వింత ప్రయోగముగాఁ గొందఱకుఁ దోఁచ వచ్చును. కాని, యిది సక్రమముగా నేర్పడిన తత్సమరూపమే. "అంతరంగమ్"? అను (సం. వి. అ. న.) శబ్దమునకు హృదయమను నర్థమే కాక ప్రాణమిత్రమను నర్థము సైతము గలదు. "అంత రంగేషు రాజ్యభారం

సమర్పయ్య" అని దశకుమార చరిత్రలో దండి ప్రయోగించెను. (చూ. ఆప్టే నిఘంటు.)

ఇచ్చేను, ఇచ్చీని, తిరిగేను, తిరిగీని వంటి క్రియా రూపములు క్షేత్రయ్యయే కాక ప్రబంధ కవులు సైతము కొందరు ప్రయోగించినారు :

"పో, పో నవ్వే రెవరైన విన్న..." దశావతార చరిత్ర (779)

"మ, మ్మను గన్నమ్మ యిదేటి బుద్ధి
వలదే ప్రమొక్కేము నీ కాళ్లకున్"...పార్వతీ పరిణయము
(4. 119)

"న, వ్వులు పచరించునట్లు చనువుల్
నెరపే వది మంచిమాట గాదు"...రంగారాయ చరిత్రము
(2. 169)

"...యేమి చూ, చేవని నవ్వుచున్ బయటచే
తడి యొత్తి శిరామరత్నతో"...రాధామాధవ సంవాదము
(1. పు. 3)

"స్వీకుంభిన్యధికారమిచ్చి కృశియిం
చే వెంచ రాజత్వమే"...షట్చక్రవర్తి చరిత్ర (3. 140)

ఈ రూపముల కొక యర్థవిశేషమున్నది. 'ఇచ్చెదను', 'ఇచ్చెదును' రూపములనుండియే 'ఇచ్చేను'; 'ఇచ్చెడిని' రూపమునుండి 'ఇచ్చీని' వచ్చియుండును. అయిన నివి సమానార్థకములు గావు. కన్నడ వ్యాకరణములో భావి, భవిష్యత్ కాలములు వేర్వేరుగా నేర్పడి యున్నవి. అందు భావి మన తెలుఁగు వ్యాకరణములోఁగల భవిష్యత్కాలమునకు సమానము. కన్నడ వ్యాకరణ మందలి భవిష్యత్ కాలరూపములు యదృచ్ఛా—సంభావ్యతాద్యర్థములను దెలియఁజేయును. అవను మాడియాను = వాఁడు చేసేను ; అవరు మాడియారు = వారు చేసేరు. వాడుకలో 'కునుకుచున్నావు ; జాగ్రత్త కాలు విరిగేను" నీవు వెళ్ళి పిలిచినావు గనుక, వాడు వచ్చాడు. లేకుంటే వచ్చీనా ?" మొదలయిన ప్రయోగము లున్నవి. ఈ రూపముల యందలి యర్థమును భావి రూపములకుఁ 'జుమీ', 'సుమండీ' చేర్చి కొందరు కవులు సాధించుకొనిరి. "అయన వినఁ బ్రేలెదరు సుఁడీ యిట్లు గయ్యాళు లార !"

యని సుగాత్రి తల్లి సుగాత్రి సఖియలను మందలించును. ప్రేవేసు; ప్రేల వద్దు సుండీ యని యామె యాదేశము. ఇది కళా పూర్ణోదయమందలి ప్రయోగము. ఇట్లే విష్ణుపురాణమందు యముఁడు తన కింకరులతో—

"నీవు మహీతలంబునకు నేఁగి ముకుందుని మీఁది భక్తిచేఁ
జేన వహించియున్న గుణశీలురఁ దెచ్చేదు సుమ్మ వైష్ణవుల్"

(4. 112) అని బోధించెను. తెచ్చేవు; తేవద్దు సుమా యని యముని యాజ్ఞ. ఇట్లే విజయ విలాసములో శ్రీకృష్ణుఁడు రుక్మిణితో—

"తన మదిలో నితఁడర్జునుఁ
డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నన్
జని మీఁగతనికి భోజన
మొనరింతురు గాక యూరకుండెదరుసుమీ" యనెను.

క్షేత్రియ యీ రూపములను వేరువేరర్థములలోఁ బ్రయోగించెను:

"అక్కరో! యోగ్యునివారు సగనుడు గాడని—
ఆడుకొంటే ఆడుకోనేరు" (ప. పు. 1)

ఆడుకోనేరు = ఆడుకొందురుగాక; ఆడుకోనని

"అట్టే యుండేవు సుమీ! నా ప్రాణనాధ!" (ప. పు. 2)

ఉండెదవుసుమీ, ఉండవద్దని యర్థము.

"అల్ల నాసామి నీతోటి - మొలక నవ్వు లాడీనటే
(ప. పు. 5)

నవ్వులాడుట కలదా? యని యభిప్రాయము

"అడిగితె మీరేమైన - నార్చేరో? తీర్చేరో (ప. పు. 10)

అనగా మీ రార్పఁగలరా? తీర్పఁగలరా? ఏమియును జేయలేరని యర్థము.

"ఇటువంటి నా వలపు, ముపాపంగ నీచ్చేవో? లేదో? మువ్వ గోపాలా?" (ప. పు. 16)

రాదని యభిప్రాయము.

"ఎందుకు బొంకేవురా?" (పు. 40)

= ఎందుకు బొంకెదవు?

"ఎన్ని నోములు నోచిన ఫల - మియ్యక పోయీనా"
(స్వీ. పు. 139)

అనగా నివ్వక పోవునా ? ఇచ్చునని యర్థము.

"నిన్నెవ్వరు తోడి తెచ్చేరు ?" (స్వీ. పు. 202)

తోడి తెచ్చువా రెవ్వరున్నారు ? ఎవ్వరును లేరని విచారము.

"ఇంటికి రానిచ్చేనా ? - ఈ మేనితో - ఇంతి !
వాని దలచేనా ?" (పు. 8)

రానిత్తునా ? రానివ్వను ; తలంతునా ? తలంపనని యర్థము.

అనఁగా - ముప్పొంగనిత్తువో లేదో ? ముప్పొంగ నీయవేమోయని భయము.

"ఊరకే చలము చేసే - వేరా ? - మ్రొక్కేరా !" (ప. పు. 17)

అనగా నీవేల చలము చేయుచుందువు. వద్దని నేను మ్రొక్కెదనని యర్థము.

"ముద్దుపెట్ట మనసయ్యేరా !" (ప. పు. 17)

అనగా ముద్దుపెట్ట మనసగుచున్నది ; అయ్యెడిని యని యర్థము.

"వదలక పో పోవే - వాడేల వచ్చిని" (పు.12)

ఈ రూపముల యర్థవిశేషము లా యా సందర్భములను బట్టి తెలిసికొన వలెను.

లోకవ్యవహారమందుఁ గల రూపములలో రసవంతమైన రూపముల నెంచి రసజ్ఞుఁడైన క్షేత్రయవంటి కవి ప్రయోగించునప్పుడా రూపములను లక్షణవిరుద్ధ రూపము లనుటకంటె గ్రహించుటయే సమంజసము.

క్షేత్రయ పదములందలి భాష రసవంతమయినది. అనేక లోకోక్తులతో నలరారుచు మనోజ్ఞమై యున్నది. అందుచేత సాహిత్యములో నైతమీ గ్రంథమున కున్నత స్థానము కలదు.

ఈ గ్రంథము కూర్పు విషయమున సంపాదకునిగా నన్ను నియమించి, నే నీ ప్రస్తావన రచించు నవకాశము నాకుఁ గలిగించినందుకు శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

—సీతాపతి.

# నాయికా ప్రకరణము

స్వీయ, పరకీయ, సామాన్య అని నాయికలు మూడు విధములు.

స్వీయ :—పెండ్లియాడిన పతియందే అనురాగము గలది.

పరకీయ :—పరపురుషుని యెడల ప్రీతిగలిగి రహస్యముగా వానితో గూడి సుఖించునది.

సామాన్య :—ద్రవ్యాపేక్షచేత సకల పురుషులయందు ననురాగము గలదిగా వర్తించునది.

స్వీయలలో ముగ్ధ, మధ్య, ప్రగల్భ అని మూడు విధములు.

ముగ్ధ :—అంకురిత యౌవన; లజ్జ ఎక్కువగా గలది. ముగ్ధలలో అజ్ఞాత యౌవన, జ్ఞాత యౌవన అనియు, నవోఢ, విస్రబ్ధ నవోఢ అనియు రెండేసి విధములు.

అజ్ఞాత యౌవన :—తనకు అంకురించిన యౌవనము తెలియనిది.

జ్ఞాత యౌవన :—తనకు అంకురించిన యౌవనము తెలిసికొన్నది.

నవోఢ :—క్రొత్తగా పెండ్లి యాడి లజ్జచేతను పతిని తప్పించుకొని పారి పోవునది.

విస్రబ్ధ నవోఢ :—కొంత బెదరు తీరి పతితో మెలగునది.

మధ్య :—లజ్జా కామములు సమానముగా గలది.

మధ్యా భేదములు—ధీర, అధీర, ధీరాధీర, జ్యేష్ఠ కనిష్ఠ.

మధ్య-ధీర :—అన్యస్త్రీసంభోగము గలిగిన పతిని చూచి వ్యంగముగా వాక్యములు పలికి తన కోపమును జూపునది.

మధ్యాధీర :—అన్యస్త్రీసంభోగము గలిగిన పతిని జూచి పరుషముగా పలుకునది.

మధ్యధీరాధీర :—ధీరాధీరల లక్షణములు రెండును గలది.

జ్యేష్ఠ కనిష్ఠ :—ఇద్దరి భార్యలలో పతి యనురాగ మెక్కువగా గలది జ్యేష్ఠ; తక్కువగా గలది కనిష్ఠ. కనిష్ఠలలో ధీరలు, అధీరలు, ధీరాధీరలు గలరు.

ప్రగల్భ :—లజ్జను జయించి కామేచ్ఛ పూర్తిగా గలది. ప్రౌఢ యను పేరు కూడా గలది. రతికేళి కోవిద.

ప్రగల్భా భేదములు—ధీర, అధీర, ధీరాధీర, జ్యేష్ఠ కనిష్ఠ.

ప్రగల్భ ధీర :—అన్యస్త్రీ సంభోగముగల పతియెడల రత్యుదాసీన భావము గలది.

ప్రగల్భా ధీర :—అన్యస్త్రీ సంభోగముగల పతిని దండించునది.

ప్రగల్భ ధీరాధీర :— ,, పైని చెప్పిన లక్షణములు రెండును గలది.

జ్యేష్ఠ కనిష్ఠ :—మధ్య విషయములో చెప్పినట్లే అన్వయింపజేసికోవలెను.

పరకీయలో కన్య, పరోఢ యని రెండు విధములు.

కన్య :—పెండ్లి కానిది; తలిదండ్రుల అధీనములోనే ఉండి పరపురుషుని ప్రేమించునది.

పరోఢ :—పెండ్లియై పరుని ప్రేమించునది.

పరకీయలలో స్వభావములనుబట్టి గుప్త, లక్షిత, కులట అనుశయాన, ముదిత, విదగ్ధ, సాహసిక, ప్రతిభాచతుర, అపలాపచతుర యను భేదములు గలవు.

గుప్త :—రంకుతనమును గోపనము చేయునది.

ఇందులో మూడు విధములు:-

వృత్తసురత గోపన :—జరిగిన జార సురతమును గోపనముచేయునది.

వర్తిష్యమాణ సురతగోపన :—జరుగబోవు దానిని గోపనము చేయునది.

వృత్తవర్తిష్యమాణ సురతగోపన :—జరిగిన దానిని, జరుగబోవు దానిని గోపనము చేయునది.

లక్షిత :—కొంతవరకు బయల్పడిన రంకుతనము గలది.

కులట :—బహు పురుషానురాగము గలది.

అనుశయాన :—ఇష్టమైన పురుషుడు దొరకక పరితపించునది.

ముదిత :—ఇష్టమైన పురుషుడు దొరికినందుకు సంతోషించినది.

విదగ్ధ .—తన వాంఛను తాను వలచిన పరపురుషునకు రహస్యముగా తెలియజేయు చతుర. వాక్చాతుర్యముచేత తెలియజేయునది వాగ్విదగ్ధ; క్రియలచేత తెలియజేయునది క్రియావిదగ్ధ.

సాహసిక :—సమీపములో నున్న పతిని వంచించి, ఏమైనను సరే యను సాహసముతో రంకుతనము చేయునది.

ప్రతిభాచతుర :—తన రంకుతనము బయల్పడు నప్పుడు సమయోచితముగా కప్పిపుచ్చునది ("కలలో నిట్లయ్యె"నని బొంకుట మొదలయిన యుక్తులతో).

అపలాపచతుర :—ఏదో కారణము కల్పించి ప్రమాదవశమున జరిగినదని రోదనముచేసి పతికి కనికరము కలిగించునది.

సామాన్యలో ఉత్తమ, మధ్యమ, అధమ యని మూడు విధములు.

ఉత్తమ :—ప్రియుడు అహితముచేసినను తాను హితము చేయునది.

మధ్యమ :—ప్రియుని హితమునకు హితమును, అహితమున కహితమును చేయునది.

అధమ :—కేవల ద్రవ్యాపేక్షచేత, ద్రవ్యముతో చేరనివానిని తిరస్కరించునది.

తృప్తా - అతృప్తా భేదము లందరి యొకలను చెల్లును. రతిసౌఖ్యము పూర్తిగా గలిగినది తృప్త; కొంతమాత్రమే కలిగినది తృప్తా తృప్త; కలగనిది అతృప్త.

## అష్ట విధ నాయికలు

1. స్వాధీనపతిక :—పతి తనకు స్వాధీను డైనయొకల స్వాధీనపతిక (లేక, స్వాధీనభర్తృక)

2. వాసకసజ్జిక :—ప్రియుడు వచ్చు వేళకు కేళిగృహము సజ్జచేసి తా నలంకరించుకొని నిరీక్షించునది.

3. విరహోత్కంఠిత :—పతి రానందున విరహబాధ పొందునది.

4. విప్రలబ్ధ :—సంకేతస్థలమున పతిని గానక విలపించునది.

5. ఖండిత :—అన్యస్త్రీ సంభోగ చిహ్నములతో వచ్చిన తన ప్రియుని జూచి కోపించి చింతించునది.

6. కలహాంతరిత :—పతిని అవమానించి అతడు వెడలిపోయిన తర్వాత పశ్చాత్తాపముతో బాధపడునది.

7. ప్రోషిత పతిక :—పతి దేశాంతరమునకు పోవునప్పుడును, ఆ పిమ్మట విరహముచేత బాధపడునది.

8. అభిసారిక :—ప్రియుడుండే సంకేత స్థలమునకు బోవునది. వెన్నెలలో పోవునది జ్యోత్స్నాభిసారిక చీకటిలో పోవునది తమోభిసారిక.

ఇవికాక మరి రెండువిధముల నాయికలను పేర్కొను లాక్షణికులు గలరు.

1. ప్రవత్స్యత్పతిక :—ప్రియు డూరికి వెడలనున్నాడని భావి విరహమును దలచుకొని దుఃఖించునది.

2. సమాగమిష్యత్పతిక :—ప్రియుడు దేశాంతరమునుండి తన వద్దకు రానున్నాడని సంతోషించునది.

ఇవియునుగాక మరికొన్ని లక్షణములనుబట్టి మరికొన్ని విధముల నాయికలను పేర్కొనుటయుగలదు.

మానవతి :—అన్యస్త్రీరతుడగు తన ప్రియుని కోపించి అతడు మంచిమాటలాడుటచేత మానశాంతి గలిగినది.

ఇందులో లఘుమాన, మధ్యమాన, గురుమాన యని మూడు విధములు.

లఘుమాన :—మరియొక స్త్రీని చూచెనన్న కోపముతో నుండియు ప్రియుని ఉపలాలనమువలన మానశాంతి గలుగునది.

మధ్యమాన :—ప్రియుడు అన్యస్త్రీ నామోచ్చారణము చేసినందు కలిగి అతడు ఆన పెట్టుకొనగా మానశాంతి గలుగునది.

గురుమాన :—అన్యస్త్రీ సంభోగచిహ్నములుగల పతిని కోపించి అతడు పాదప్రణామము లాచరించుటవలన మానశాంతి గలుగునది.

గర్విత :—ఇందైదు విధములు

సౌందర్యగర్విత, ప్రేమగర్విత, విద్యాగర్విత, యౌవనగర్విత, కులగర్విత

దివ్య :—దేవతా స్త్రీ

అదివ్య :—మనుష్య స్త్రీ

దివ్యాదివ్య :—దేవతా స్త్రీ మనుష్య స్త్రీగా పుట్టునది.

## నాయికా సహాయులు

1. దూతి :—నాయికా నాయకుల పరస్పర సందేశముల నందజేయునది.
2. దాసి :—పరిచారిక.
3. సఖి :—నాయికకు సమానవయస్క, చెలి.
4. చేటి :—నాయికా నాయకుల సమావేశ సంధాన చతుర.

---

# నాయక ప్రకరణము

1. అనుకూలుడు :—నాయికయెడల ప్రేమగలిగి ఆమె కనుకూలముగా వర్తించువాడు.

2. దక్షిణుడు :—తన సతుల నందరిని సమానముగా చూచుకొనువాడు.

3. ధృష్టుడు :—నాయిక యెడల నపరాధముచేసి బొంకి ప్రియవచనములతో బతిమాలి యామె కోపమును బోగొట్టువాడు.

4. శఠుడు :—నాయిక యెడల కాపట్యము గలవాడు.

5. వైశికుడు :—వేశ్యా సక్తుడు.

## నాయకుని సహాయులు

1. పీటమర్దుడు :—కుపితయైన నాయిక నాయకుని యెడల మరల ననుగ్రహము గలదానిగా జేయువాడు.

2. విటుడు :—కామ తంత్ర కళాకోవిదుడు.

3. చేటుడు :—నాయికా నాయకుల సమావేశ సంధాన కర్త.

4. విదూషకుడు :—అంగవికారాదులచే పరిహాసము చేయువాడు.

---

శ్రీ

# క్షేత్రయ పదములు

---

## 1. సావేరి రాగము - చాపుతాళము

(నాయిక స్వీయ, మధ్య, ఖండిత. నాయకుడు ధృష్టుడు. అద్భుత, విరహ విప్రలంభ శృంగార రసములు. సంచారులు - దైన్యము, అసూయ, వ్రీడ, వితర్కము, అమర్షము, రోషము, ధృతి, మోహము, హర్షము.)

పల్లవి :

బాగాయె నీ వగ లెల్లా మా - బాగాయె ॥
దైన్యము, అసూయ, అమర్షము

అనుపల్లవి :

బాగాయె మువ్వ గో - పాలా ! నీ వగ లెల్లా ॥బా॥
అమర్షము, అసూయ, దైన్యము

1. నీకు నే మడుపు లందించేది నీ వా - నెలత కందిచ్చేది
దైన్యము, ముదము, అసూయ, వితర్కము

లోకు లందరు నవ్వేది అది - గాక మ రేమో ఆగడము
[జేసేది ॥బా॥

వ్రీడ, రోషము, వితర్కము, రోషము, అసూయ, వితర్కము

2. నిన్ను నే కౌగిలించేది నీవా – నీరజాక్షిని తలచేది
దైన్యము, ముదము, అసూయ, స్మృతి, వితర్కము
నన్ను నీ వాడు కొనేది అల్ల – ననబోణింటను నవ్వు [కొనేది ॥బా॥
వితర్కము, దైన్యము, అసూయ, అమర్షము, రోషము, వితర్కము

3. కూడి నే నిను లాలించేది మువ్వ – గోపాల! నీ వలిగేది
మోహము, ముదము, దైన్యము, వితర్కము, అమర్షము
చాడిమాటలు వినేది నను – చౌకజేసి యల్ల సఖ ని [మెచ్చేది ॥బా॥
అమర్షము, వితర్కము, విషాదము, వితర్కము, అసూయ, ధృతి.

---

## 2. యదుకుల కాంభోజి రాగము - ఆటతాళము

(నాయిక స్వీయ, మధ్య, ఖండిత, ధీర. నాయకుడు ధృష్టుడు. ఈర్ష్యా మానవిప్రలంభశృంగారము; అద్భుతరసము పదమంతట నున్నది. సంచారులు - అమర్షము, అవహిత్థ, శంక, అసూయ, గ్లాని, ప్రబోధము, మోహము, త్రాసము, వితర్కము, వ్రీడ, ఆవేగము, ముదము, సతివిశేషములు, దైన్యము, విషాదము, ధృతి.)

పల్లవి :

నీ మేను నా మేననుచును బలికిన – నీ మాట నిజమాయెరా
అవహిత్థ, శంక, అమర్షము, ధృతి, అవహిత్థ
ఈర్ష్యామాన విప్రలంభ శృంగారము

అనుపల్లవి :

ఏమో యని యుంటి – ఎరుగక యిన్నాళ్ళు

శంక, అవహిత్థ, శంక, ప్రబోధము

కోమలాంగ ! మువ్వ – గోపాల ! నినుగూడి ॥నీమేను॥

దైన్యము మదము శంక

1. నిన్నె వ్వతో గిల్లి – యున్న యురము జూచి

అసూయ అమర్షము

నన్ను వేదన జేయు – చున్నది గదరా

గ్లాని అమర్షము

నిన్న రాతిరి నీకు – నిదుర లేకున్న నా

అమర్షము, ప్రబోధము, వితర్కము

కన్ను లెఱ్ఱగా – గలిగెను గదరా ॥నీ మేను॥

అమర్షము, ధృతి, వితర్కము

2. కోమలాంగిని నీవు – కోరి నప్పటినుండి

అసూయ, అమర్షము, దైన్యము

వేమారు నామది – నెత చెందె గదరా

మోహము ఆవేగము

నీ మోవి నొక్కుల – నీటుజూచినయంత

అసూయ, అమర్షము, వితర్కము

నా మోవి యదియేమొ – అదిరింది గదరా ॥నీ మేను॥

శంక, వితర్కము, త్రాసము, దైన్యము

3. అన్య కాంతను నీవు - అనుభవించితి వేమొ
అసూయ, ముదము, మోహము, శంక
న న్నేలినదొరా - నా తమి దీరెరా
ముదము వితర్కము
మన్నించు - గోపాల మళ్లి నీ విటురాగ
దైన్యము ముదము
చిన్న బోయి సిగ్గు - చెందితిని గదరా ॥ నీ మేను ॥
వ్రీడ, ధృతి, విషాదము, దైన్యము

---

### 3. దర్బారు రాగము - రూపక తాళము

(నాయిక స్వీయ, మధ్య, ఖండిత, ధీరాధీర. నాయకుడు ధృష్టుడు, ఈర్ష్యామాన విప్రలంభశృంగార, అద్భుత, రౌద్ర రసములు. సంచారులు - అసూయ, దైన్యము, శ్రమ, రోషము, నిద్ర, గ్లాని, అమర్షము, విబోధము, ఉగ్రత, వితర్కము, శంక, నవ్వు, అవహిత్థ.)

పల్లవి :

చల్లనాయె నా మనసు - చల్లనాయె నా
వితర్కము, అసూయ, అమర్షము, దైన్యము, రోషము

అనుపల్లవి :

చల్లనాయె ప్రాణేశ ! - స్వామి! మువ్వగోపాలా ! ॥చల్ల॥
వితర్కము, అసూయ, దైన్యము, రోషము, దైన్యము

1. వద్దికి రావేమోయి - వాడిన ముఖ మేడ దోయి
దైన్యము, వితర్కము, శంక, శ్రమ, గ్లాని, వితర్కము, శంక

నిద్దుర కనురెప్పలపై - నిండియున్న దేమోయి
నిద్ర, అసూయ, విబోధము వితర్కము, శంక

అద్దపు చెక్కిలి నొక్కి - ముద్దిడుకొన్న దెవతోయి
అమర్షము, ఉగ్రత, రోషము, అసూయ, వితర్కము,

దిద్దిన కస్తూరి బొట్టు - చెదరెనేమో- తెలుపవోయి ॥చల్ల॥
దైన్యము, నవ్వు, వితర్కము, శ్రమ, దైన్యము

2. విరులు జుట్టిన సిగను - వెగటు వాస నేడదోయి
అసూయ గ్లాని, వితర్కము, శంక

గరి తెవతో నీదు మోవి - గంటు జేసె నేమోయి
అసూయ, శంక, ఉగ్రత, రోషము, గ్లాని, శంక, వితర్కము

ఉరమున గుబ్బలపోటు - లున్నముద్ర లేడవోయి
దైన్యము, ఉగ్రత, అమర్షము, శ్రమ, వితర్కము, శ్రమ

మరుగేల చేసేవు - మగువ పేరు దెలుపవోయి ॥చల్ల॥
అవహిత్థ, దైన్యము, అసూయ, దైన్యము, ఉగ్రత

3. వలుచని గంధము మేన - పడ తెవతో అలదెనోయి
అమర్షము, దైన్యము, అసూయ, వితర్కము, శంక

చలువ పన్నీటి వా - సన లేడవోయి
అమర్షము వితర్కము, శంక

వలచియున్న దానివలెను – కలసియున్న దేవతోయి

మోహము, ధృతి, అసూయ, వితర్కము, శంక

పలుమారు మువ్వగో-పాల ! నీ వగ దెలసెనోయి ॥చల్ల॥

రోషము, దైన్యము, గ్లాని, విషాదము, దైన్యము, విబోధము

---

4. ముఖారి రాగము - చాపుతాళము.

(నాయిక స్వీయ, ప్రౌఢ. మధ్యమానము, మధ్యను మానవతి, లేక ఖండిత, నాయకుడు, ధృష్టుడు, రౌద్రరసము. సంచారులు - ఔత్సుక్యము, దైన్యము, అమర్షము, వితర్కము, మోహము, అసూయ, నిశ్వాస, వ్రీడ, అనలు, శంక, ధృతి, హర్షము; ఉగ్రత, శ్రమ, రోషము.)

పల్లవి :

అడుగరమ్మా యతనిపై నూరక – అలిగినానటరే

ఔత్సుక్యము, దైన్యము, దైన్యము, వితర్కము,

అనుపల్లవి :

పడుచుతనము మాని, మువ్వగో-పాలరాయునిఆన బెట్టి మీరు ॥రడుగ॥

అమర్షము, దైన్యము, దైన్యము అన, రోషము, దైన్యము

1. పూని దానింటికి పోగను మా – పొలతిజూచి బెదరించిన

అసూయ అమర్షము హర్షము ఉగ్రత

దానికి లంచ మిచ్చెద నన్నది – తానో నేనో

అమర్షము, శంక, వితర్కము

వానిపై లేనివి కల్పింపరాదు - వాడ వనిత లెల్ల వినగ
దైన్యము, ధృతి, వ్రీడ, హర్షము, విషాదము, అసూయ
దానినే జూడక తాళలేనన్నది - తానో నేనో ॥అదు॥
మోహము, శంక, వితర్కము

2. అలుకదీర దాని వాకిట - నిలచి వీధిలో నన్ను జూచి
అమర్షము, అసూయ, ఔత్సుక్యము
తలుపుమూల దాగియున్నది - తానో నేనో
అమర్షము విషాదము శంక వితర్కము
అలసి వచ్చే ననుచు జక్కె - రానవా లిచ్చిన నారగించి
శ్రమ దైన్యము అమర్షము హర్షము
తలిరుబోణి మోవి రుచికి రాదన్నది-తానో నేనో ॥అదు॥
అసూయ ఔత్సుక్యము శంక, వితర్కము

3. సొలపు మీద దాని రూపు - పలకమీద వ్రాసి పాణి
హర్షము అసూయ రోషము
తలమున నుంచి కనుగొను చున్నది - తానో నేనో
ఔత్సుక్యము హర్షము శంక, వితర్కము
కలసి మా మువ్వగోపాలరాయుని-గౌగిలించితే అల్లదాని
మోహము ఔత్సుక్యము హర్షము అసూయ,
తలచి యసురుసు రన్నది - తానో నేనో ॥అదు॥
ఉగ్రత రోషము శంక, వితర్కము దైన్యము.

## 5. సురట రాగము—చాపుతాళము

(నాయిక స్వీయ, ప్రౌఢ, ఖండిత, ధీరాధీర. నాయకుడు శఠుడు. అయోగవిప్రలంభ శృంగార రసము. క్రోధ స్థాయి యగు రౌద్రము అంగ రసము. సంచారులు : వితర్కము, దైన్యము, విషాదము, అసూయ. అమర్షము, దండన, శంక, నిర్వేదము, కోపము, ఔత్సుక్యము.)

పల్లవి :

ఇంటికి రానిచ్చేనా ఈ మేనితో — ఇంతి! వాని దలిచేనా

కోపము, అసూయ, విషాదము, వితర్కము

అనుపల్లవి :

గొంటుకాడు మువ్వ — గోపాలరాయడు

అసూయ, ఔత్సుక్యము

తంటాలు జేసితే — దండించక విడచేనా ॥ఇం॥

కోపము, దండన, వితర్కము

ఇతనికి వెరచి నే — నిక లంచ మిచ్చేనా

శంక, నిర్వేదము, కోపము, వితర్కము

ఇన్నాళ్ళవలె ననుస — రించేనా

విషాదము, వితర్కము

బతిమాలి నే రాయ — బార మంపించేనా

దైన్యము, ఔత్సుక్యము, వితర్కము

పతియని మునుపటి — భక్తి దయ లుంచేనా ॥ఇం॥

ఔత్సుక్యము, నిర్వేదము, వితర్కము

ప్రేమ దలచి తన - మోహమైన జూచేనా

ఔత్సుక్యము, కోపము, వితర్కము

ఏమి చెప్పిన నిజ - మెంచేనా

విషాదము, వితర్కము

రామా! అయినదెగాని - రచ్చకు వెరచేనా

దైన్యము, నిర్వేదము కోపము, వితర్కము

ఆ మాట సభలో నే - ననక విడచేనా ॥౨౦॥

అసూయ, అమర్షము, కోపము, వితర్కము

3. ఎనసిన మొకమాట - మెంతైన జూచేనా

విషాదము, కోపము, వితర్కము

ఎంతో వేడిన మన - సిచ్చేనా

దైన్యము, ఔత్సుక్యము

వనిత! పట్టిన పట్టు - వట్టి దనిపించేనా

కోపము, అమర్షము, వితర్కము

పనిబూని 'మువ్వగో - పాలా!' యని పిలిచేనా ॥౨౦॥

ఔత్సుక్యము, కోపము, వితర్కము

## 6. అఠాణా రాగము - అటతాళము

(నాయిక స్వీయ, మధ్య, ధీరాధీర. ఈర్ష్యామాన విప్రలంభ శృంగార రసము. మిశ్రస్థాయి. సంచారులు: అసూయ, వితర్కము, విషాదము, ఔత్సుక్యము, గ్లాని, అమర్షము, దైన్యము, కోపము, సంతోషము.)

పల్లవి:

ఎవతె తాళుసమ్మా యీ నడత - లేమందునే కొమ్మా

వితర్కము. కోపము, అమర్షము, విషాదము

అనుపల్లవి:

సవతియు ముద్దుగోపాలున కెక్కువేమో

అసూయ, విషాదము, దైన్యము, శంక

యువిద నావలె సది - యొక్కతేనా ? కలకాల ॥ఎవ॥

సహజగుణము, ఔత్సుక్యము, అమర్షము

1. అక్కరో ! నే వాని - కాను మదుపు లీయ

శంక, వితర్కము, విబోధము

గ్రక్కున వాడు నా - కన్ను లడ్డముచేసి

గిలిగింత, ఔదాసీన్యము

పుక్కిట విడెము ఆ - బోటికి కొసగి మోవి

అసూయ, ఔత్సుక్యము, విషాదము

నొక్కితె యలదాని - నోరు చూచి చూచి ॥ఎవ॥

తాపము, త్రాసము, దూషణ

2. పసిదానను నా - పానుపైపై వాడు

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ

ముసుకు బెట్టుకు నొక్క - మూలను బవళించి

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ

నిశి వేళలో నల - నీరజనేత్రితో

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ

గుసగుస మని చాల - కొసరి ముద్దులాడితే ॥ఎవ॥

సంతోషము గిలిగింత, అసూయ

3. రేపగ లివి యని - లేక వా రిద్దరు

ఉగ్రత, విబోధము, దైన్యము, పశ్చాత్తాపము

నా పడకింటిలో - కాపురమైయుండి

సంతోషము, గిలిగింత, గగుర్పాటు

యా పడతికి సుంత - కోపము గల నాడు

అసూయ, విభ్రమము

గోపాలుడు నన్ను - గూడ వచ్చుచుంటే ॥నెవ॥

సంతోషము

---

## 7. కాంభోజి రాగము - తిశ్రత్రిపుటతాళము

(నాయిక స్వీయ, ప్రౌఢ, విరహోత్కంఠిత. నాయకుడు శఠుడు, విరహావిప్రలంభశృంగారము, కరుణారసము. సంచారులు - దైన్యము, అమర్షము, వితర్కము, శంక, ఉగ్రత, ఆలస్యము, అధ్యానము, జడత, నిర్వేదము, ఔత్సుక్యము, హర్షము, గ్లాని, శ్రమ, విషాదము, చింత సంతాపము, నిశ్వాసము, భ్రమ.)

పల్లవి :

వదరక పోపోవే - వాడేల వచ్చేని-వద్దు రా వద్దనవే
దైన్యము, అమర్షము, శంక, వితర్కము, ఉగ్రత

అనుపల్లవి :

అది యొక యుగము వేరే జన్మ మిపుడు
నిర్వేదము, ఆలస్యము

అతడెవరో నే నెవరో ఓ చెలియరో ॥వద॥
జాడ్యము నిర్వేదము

1. నిచ్చ నిచ్చలు నేడె వచ్చేని రేపైన-వచ్చేననుచు మదిలో
ఆలస్యము, ఔత్సుక్యము, హర్షము

నిచ్చగా బలువేడి నిట్టూర్పులచేత - నింతిరో పెదవులెండి
దైన్యము, సంతాపము, సంతాపము, గ్లాని

హెచ్చైన వెన్నెల చిచ్చుల రాత్రులు - యెన్నెన్నో [గడపితి
విషాదము, జడత, నిర్వేదము, ఉగ్రత, గ్లాని, అమర్షము

నిక నేటి మాటలె ॥వద॥

అభ్యానము, చింత, దైన్యము

2. వలపు కాడిదె కాదావచ్చుననుచు దెరు–వులు జూచి వేసారితి

ఔత్సుక్యము, హర్షము నిర్వేదము, గ్లాని

నెల తెంచి యలసితి–నిలుపరాని ప్రేమ–నెమ్మది నడచు [కొంటి

ఆలస్యము, శ్రమ, ఔత్సుక్యము, హర్షము, చింత

కలకంఠ పిక నాద – ములు మించు మధుమాస–

ఔత్సుక్యము, అమర్షము, ఆలస్యము, విషాదము,

ములు గడపితీ వట్టి ముచ్చట లిక నేలే ॥వద॥

చింత. అమర్షము, నిర్వేదము, వితర్కము, శంక

3. భామరో! శకునము లడిగితి మువ్వ గో – పాలుడు [వచ్చుననుచు

దైన్యము, హర్షము, ఔత్సుక్యము, శ్రమ

కామించి నాథుల గలయు చెలుల జూచి – కరగి చింత [నొందితి

మోహము, హర్షము, అసూయ, విషాదము, అభ్యానము

రామ! రామ! ఈ మేనితో నిక వాని–మోము జూడవలెనా

విషాదము, ధృతి, వితర్కము, ఉగ్రత

మొదటి పోం దేచాలు ॥వద॥

అమర్షము, విషాదము, దైన్యము

## 8. సురటరాగము - తిశ్రత్రిపుట తాళము

(నాయిక స్వీయ, ప్రౌఢ, అధీర, మధ్యమానవతి, ఖండిత. నాయకుడు ధృష్టుడు. ప్రణయమాన విప్రలంభ శృంగారాద్భుత రసములు. సంచారులు - వితర్కము శంక, అసూయ, హర్షము, ఔత్సుక్యము, రోషము, నిద్ర దైన్యము, మోహము, గుణులు, విషాదము, ఉగ్రత, చింత.)

పల్లవి :

ఎవరివల్ల దుడుకు మా–యిద్దరిలో సఖియా !
వితర్కము, శంక, దైన్యము, ఔత్సుక్యము

అనుపల్లవి :

విపరింపుమమ్మా మా – విధము దెలెసే నిపుడు ॥ఎవ॥
దైన్యము, హర్షము

1. రమణిరో ! బంగారు మం–చముపై నిద్రము చాలా
దైన్యము, ఔత్సుక్యము. హర్షము

మమతతో సరసంపు – మాట లాడే వేళ
హర్షము ఔత్సుక్యము, దైన్యము

కమలాక్షి పేర నన్ను – ఘనుడు పిల్వగ కోప
అసూయ, రోషము, అసూయ, రోషము

శమనము లేక నాదు – జడనొద్ది కొట్టితి నమ్మ ॥ఎవ॥
అమర్షము, చింత, ఉగ్రత, విషాదము, దైన్యము

2. ఘను డని వాని పై - కొని నేను నెనరున
హర్షము ఔత్సుక్యము, దైన్యము

మొనగుబ్బ లెదను గ్రు - మ్మచునుండే వేళ
మోహము హర్షము, ఔత్సుక్యము

కనకాంగి రతినిట్టి - పనులకు జాణ యనగ
అసూయ, రతులు రోషము, అసూయ

విని పదింటిలో సగ - మొనరించితి నమ్మా ॥ఎవ॥
అసూయ, రోషము, విషాదము, దైన్యము

3. కలికి! మువ్వగోపాలు - కలసి మునుపటివలెనె
దైన్యము. ఔత్సుక్యము, హర్షము

తలిరాకు వంటి పాదము లొత్తేవేళ ఆ
హర్షము ఔత్సుక్యము

చెలియ పెట్టిన మందు - తలకెక్కి నా పక్క
అసూయ రోషము, ఔత్సుక్యము

గలువరింపగ మోవి - గంటు జేసితినమ్మా ॥ఎవ॥
నిద్ర, దైన్యము, విషాదము, ఉగ్రత, చింత, మోహము

## 9. కల్యాణిరాగము - రూపక తాళము

(స్వీయ, ప్రగల్భ, స్వాధీనపతిక ; నాయకుడు అనుకూలుడు సంభోగశృంగార, కరుణశృంగారములు ; రతిస్థాయి ; సంచారులు దైన్యము, వితర్కము, హర్షము, అమర్షము, అసూయ, విషాదము, ఔత్సుక్యము, సుప్తి, శంక, ఉగ్రత.)

పల్లవి :

ఎందు దాచుకొందు నిన్ను - ఏమి సేతు నేను

దైన్యము, వితర్కము, దైన్యము, వితర్కము

అనుపల్లవి :

అందమైన నీ మోము - అయ్యారె ముద్దుగులుకుచున్నది

హర్షము ఔత్సుక్యము హర్షము

1. అందిందు తిరుగకురా - అతివలు నీతోడి

ఉగ్రత, అమర్షము, అసూయ

పొందుగోరి యీ వేళ - పొగరుచు నున్నారు

ఔత్సుక్యము అసూయ

ఎంద రెంద రని కాతు - ఎంతని నే విన్నవింతు

అమర్షము దైన్యము

పందెమాడుకొన్నారట ! - పట్టుకపొయ్యేద మనుచు

విషాదము శంక ఔత్సుక్యము దైన్యము

2. పలుమారు నా సామి - బయలు వెళ్ళకు మొక్కేను

దైన్యము అమర్షము విషాదము

నిలుపరాని మోహమున - నిన్ను జూచి చెలులు

మోహము, అసూయ,

అలరు నీ మోవి తేనె-యాని చప్పరించ వలసి

ఔత్సుక్యము, హర్షము

కులుకు గుబ్బల రొమ్ము - గ్రుమ్మి పొమ్మ్యేద మనుచు ॥ఎం॥

అసూయ, ఉగ్రత, విషాదము

3. ముదముతో నా ముద్దు-మువ్వ గోపాలసామి

హర్షము, మోహము

గుదిగొన్న తమకమున-గూడి యిద్దరము

ఔత్సుక్యము, హర్షము

నిదుర పరవశమున-వదలునో కౌగిళ్ళు

సుప్తి, వితర్కము, ఔత్సుక్యము

పదిలముగ నా జడను-బట్టికట్టుకొందునా ॥ఎందుదాచు॥

హర్షం వితర్కం, శంక, దైన్యము

("నిన్ను నేమిసేతు నేను" అని పాడుతూ పట్టవలసినవి: 1. పైటలో దాచుకొందునా? 2. రోమరాజి చేతకట్టుకొందునా? 3. రొమ్మున నిల్పి నా జడచేతకట్టి పెడుదునా? 4. ముంగురుల చేత బిగింతునా? యీ మొదలైనవి పట్టవలెను.)

## 10. ముఖారి రాగము - చాపుతాళము

(నాయిక స్వీయ, ప్రౌఢ, ఖండిత, అన్యగోపన. నాయకుడు ధృష్టుడు. శాంతవిప్రలంభశృంగారాద్భుత రసములు, సంచారులు : ఔత్సుక్యము, అమర్షము, అసూయ, శంక, వితర్కము, ఉగ్రత, కోపము, దైన్యము, దండనలు.)

పల్లవి :

దొంతర విడెముతో నా — చెంతరాకురా నీకు నా యాన
అసూయ కోపము, అమర్షము, అసూ

అనుపల్లవి :

ఇంతకూ నే తాళగలనా—వర విజయ రాఘవజాణా! ॥దొంత॥
శంక, వితర్కము, ఔత్సుక్యము

1. జగ్గు గుల్కుమై బుక్కాతావి — చప్పరించిన నీదు [కెమ్మోవి
అసూయ, ఔత్సుక్యము
నిగ్గు నుదుటి లత్తుక తీవి — నీటు తోడను
అసూయ, ఔత్సుక్యము
దగ్గర నిలువకు పదరా — దాని కేమి తాళగదరా
అసూయ, అమర్షము, శంక, వితర్కము
ఎగ్గు జేసి నా యెదురా — యీలాగున నీవే బొంకుదురా
కోపము, ఉగ్రత, అమర్షము

2. సిబ్బెంపు గుబ్బలపోటు — చెమ్మిగ రేగిన కీల్జడ వేటు
అసూయ, ఔత్సుక్యము, దండనలు

మబ్బువీూరిన నిదుర పాటు — మఱవు తోడను

అసూయ, దైన్యము, వితర్కము

దబ్బర లాడేవు చాల — దానిదే గదరా యీా శాల

కోపము, అసూయ, వితర్కము

గబ్బితనము నీకేల—కలికితో మాటాడు మీా వేళ ॥దాంత॥

వితర్కము, అసూయ, కోపము

3. చక్కని విజయ రాఘవా — సామిగా నన్నేలినావా

ఔత్సుక్యము, వితర్కము

టక్కులాడియింటికి పోవా — మక్కువ తోడను

కోపము, అసూయ

ఎక్కడి పీ వాడిన విరులు — చిక్కుబడ్డవి నీ కంఠసరులు

ఉగ్రత, కోపము, అసూయ

నిక్కము దానిపై మరులు—నీవు దా నింటికే తరలు ॥దాం॥

అసూయ, కోపము

## 11. పున్నాగ రాగము - తిశ్ర త్రిపుట తాళము

(నాయిక పరకీయ, ప్రౌఢ, కలహాంతరిత, నాయకుడు - అనుకూలుడు. రసములు - విరహావిప్రలంభశృంగారము, కరుణ. స్థాయీభావము - శోకము. సంచారిభావములు - దైన్యము, శంక, వితర్కము, గ్లాని, విషాదము, అగ్న్యావేగము, పశ్చాత్తాపము, ఉగ్రత, శ్రమ, హర్షము, ఔత్సుక్యము.)

పల్లవి :

తెలివి యొకరి సొమ్మా-ఎందుకు విభుని-తిరుగ బొమ్మంటి
[నమ్మా ॥ తెలివి॥

దైన్యము, శంక, వితర్కము, పశ్చాత్తాపము, విషాదము, దైన్యము

అనుపల్లవి :

చలమునను ననవిలుతు డేసిన - అలరు ములుకులకులికి
యలసితి ॥ తె॥

దైన్యము, ఉగ్రత, శ్రమ, గ్లాని

1. చేడెరో ! ఏమందునె నిన్నటి రేయి—చంద్రుడు ఏమో కాని
విషాదము, వితర్కము, దైన్యము, శంక, వితర్కము

వాడు చల్లని వాడటంచును — చూడ జూడగ వేడి
[మాయెనె ॥ తె॥

హర్షము, అగ్న్యావేగము, విషాదము

2. మై చల్లగ జేసేటి కమ్మని ముద్దు-మలయమారుత మిపుడు
హర్షము, దైన్యము, ఔత్సుక్యము

వీచినంతట జూచితే సెగ - గాచు నటువలె దోచుచున్నది
విషాదము, అగ్న్యావేగము, గ్లాని,

3. పాయరాని ప్రేమతో గూడిన మువ్వగో-పాలుడేమో కాని
దైన్యము, హర్షము, ఔత్సుక్యము, శంక, వితర్కము.

కాయజుని రసమాయె పరవశ-మాయె ఉపరతి జేయ
[నైతిని ॥ తె॥

ఔత్సుక్యము, గ్లాని, పశ్చాత్తాపము, దైన్యము

(ఖిన్నారపడుట, విసుకొనుట, అవయవములను కదలించుట, వ్యత్యాసముగా అడుగు లిడుట, నేత్రములు మూసికొనుట, పరితాపపడుట, మన్మథుని వేడి ములుకులచే అలసిపోవుట, దుఃఖము కనుపరచుట, ఎడబాయని ప్రేమ కనబరచుట, పరవశమగుట, ఉపరతిని కనబరచుట—ఇట్టి అభినయముల మూలమున పై భావములను ప్రకటింపవలెను.)

## 12. కాంభోజి రాగము - త్రిశ్రత్రిపుట తాళము

(నాయిక పరకీయ, మధ్య కనిష్ఠ, విరహోత్కంఠిత, ధీర. నాయకుడు అనుకూలుడు. రసములు అయోగ విప్రలంభ, విరహావిప్రలంభ, మాన విప్రలంభ శృంగారములు. సంచారిభావములు - శంక, వితర్కము, ఆర్తి, విబోధము, జడత, స్మృతి, మదము, ఆగ్రావ్యవేగము, ఔత్సుక్యము, అసూయ, అమర్షము, దైన్యము, గ్లాని, చింత, దుఃఖము, శోకము, పశ్చాత్తాపము, విషాదము, మోహము.)

పల్లవి :

మోస మాయె నే—నా బుద్ధికి — మోస మాయె నే

దైన్యము, చింత, దుఃఖము, విబోధము, మానవిప్రలంభ శృంగారము గ్లాని,

అనుపల్లవి :

మోసమాయె నేమి సేతు—మువ్వగోపాలుడు నేడు

పశ్చాత్తాపము. జడత, ఆర్తి,

త్రొక్కి వేడిన రాడె ఓ చెలియరో ! ॥మోస॥

స్మృతి. విషాదము దైన్యము, విషాదము

1. అందరికి చల్లనైన ఆ—చందమామ నాపాలిటి

ముదము ఔత్సుక్యము అసూయ

కనలమాయె నయ్యో ! చెలియ !

ఇచ్చట ఆగ్నావేగము, విషాదము, ఆర్తి, గ్లాని, తటస్థములు, విరహ విప్రలంభము, మన్మథుడు విరోధి అయినందులకు దాఖలా

ముందు నే నెవ్వరి—పొందెడ బాపితినో !

వితర్కము, గతిఎడబాపుటకు శంక,

అందుకు నే నీలాగైతిని ఓ చెలియరో ! ॥మోస॥

దుఃఖము, మృతి, విషాదము, దైన్యము

2. వలవల నా కన్నీరు వెల్లువలాయె నేటి కే

శోకము గ్లాని

వెలది మోము జూచితినో చెలియా

అసూయ, అమర్షము, దైన్యము, శంక, వితర్కము

చిలుక పగ సాధించెనె దీని పెంచిన నా

ఉత్పాతములు ఉత్పాతావేగములు

చేతు లెటు వంటివో ఓ చెలియరో ॥మోస॥

శంక, విషాదము, దైన్యము

3. ఏప్రొద్దు ప్రాణవిభుని — ఎడబాయని యింతులు

స్మృతి, ముదము, విషాదము, ముదము

ఎన్ని నోములు నోచిరో చెలియా
మతి, అయోగవిప్రలంభము, అమర్షము, విషాదము
దాపున గూడున్న విభుని – దవ్వులబెట్టే చెలులు
అసూయ, చింత, దైన్యము, అసూయ
నాపాల గలిగి రో చెలియరో ॥ మోస ॥
దైన్యము, అమర్షము, విషాదము

## 13. సహన రాగము - తిశ్ర త్రిపుటతాళము

(నాయిక పరకీయ, ద్వితీయానుశయాన, నాయకుడు ఉపపతి. వీర, శృంగార రసములు. ఉత్సాహరతి స్థాయికములు. సంచారులు - దైన్యము, చింత, విషాదము, ఉగ్రత, శంక, ఆవేగము అవహిత్థ, అమర్షము, ఔత్సుక్యము, నిద్ర, ఉన్మాదము, అసూయ, మోహము, గర్వము, వితర్కము.)

పల్లవి :

అత్తవా గూరికీ–అం పేరు మావారు
దైన్యము, చింత శృంగార రసము
అయ్యయ్యో ఇక నేమి సేయుదునే
విషాదము, శంక, చింత, వితర్కము

అనుపల్లవి :

కత్తి కోతగాడు మగ డేమి జేసునో
ఉగ్రత, శంక, చింత, అసూయ

పొత్తు మరువక యుండు—పోయివచ్చెద సామి ॥అ॥
ఆవేగము, విషాదము, దైన్యము

1. ఊరికి నే బోయి — ఉన్నా యెప్పటికైన
దైన్యము అమర్షము

తీరినట్టు గుట్టు — తెలుపకు నా సామి !
అవహిత్థ దైన్యము

సారెకు మాబావ — సవతి యత్తతోడ
అసూయ దైన్యము

పోరాడి యెటులైన — బొంకి వచ్చెదసామి ॥అ॥
ఉగ్రత ఔత్సుక్యము, అవహిత్థ

2. నడిరేయి ఝాముస — నను దలచి పక్కలో
దైన్యము, చింత, హర్షము

ఉలికి దిగ్గునలేచి — పలువరించకు సామి !
త్రాసము నిద్ర, ఉన్మాదము

కలుషగ మన యూరి — పొలతులతోగూడి
అమర్షము అసూయ

పడుచు తనమున నీవు — వదరకురాసామి ॥అ॥
ఉగ్రత, గర్వము విషాదము, దైన్యము

3. తిరిగిరా న నెంచకు — తిరిగి వచ్చెద సామి !
ఆవేగము, దైన్యము, ధృతి

విరజిమ్మి నా యాస — విడిపింతు వేమో
ఔత్సుక్యము, విషాదము, శంక, విషాదము

గురిలేక మాముద్వ — గోపాల సామిగ
విషాదము, అమర్షము, దైన్యము, చింత

మరు కేళి గూడుట — మరచి పోయెద వేమొ ॥అ॥
మోహము, గర్వము, చింత, దైన్యము

(కర్తికోతగాడనగా — "దయావిహీనుడు, నామనస్సునకు ఇష్టము లేనివాడు, కఠినుడు, విరసుడు, నాకు సరిపడడు," అనుభావములను ప్రదర్శించవలెను. కొయ్యకోతలు, ముక్కుకోతలు మొదలైనవి అభినయింప గూడదు; విరసముగా నుండును.

ఏమి జేసునో అనగా — దండించునేమో, కోపించునేమో, మన యిరువుర చెలిమి తెలిసికొనునేమో, రంధి జేసుకొనునేమో, బయటకు కొట్టి వేసునేమో, వంచించునేమో - అనుభావముల నభినయింపవలెను.)

## 14. రేగుప్తిరాగము-ఆదితాళము

[నాయిక పరకీయ, ప్రౌఢ. అతృప్త, సురతాసక్తిగలది విరహోత్కంఠిత. నాయకుడు ఉపపతి. హాస స్థాయికమైన హాస్య, రసము. సంచారులు - శ్రమ, ఔత్సుక్యము, చాపల్యము, గ్లాని, సుప్తి, జడత, దైన్యము, విషాదము, వితర్కము (ఇది పదమంతటను వ్యాపించి యున్నది), హర్షము, ధృతి, వ్రీళన, రతులు, మోహము.]

పల్లవి :

ఒక్కసారికే యీలాగై తే-ఓహో హో యిది యేటి రతిరా!

శ్రమ, ఔత్సుక్యము, వితర్కము, రతులు, వితర్కము, హాస్య, హేళనలు

అనుపల్లవి :

మక్కువ దీర్చర — మా మువ్వగోపాల

ఔత్సుక్యము దైన్యము

సొక్కియున్న నీ — సొగసది యేమిర !

గ్లాని వితర్కము, దైన్యము

1. నెమ్మొగమున నీ బడలిక లేమిర—నీటుకాడ! రొమ్మదిరే [దేమిర !

దైన్యము, శ్రమ, వితర్కము సొగసు, శ్రమ, వితర్కము

కమ్మని వాతెర కందిన దేమిర — కాళ్ళను చేతులు తడబడు టేమిర !

ధృతి, వితర్కము, దైన్యము, శ్రమ, వితర్కము

2. కన్నుల నిద్దుర గమ్మె దేమిర — గళమున చెమ్మట [కారే దేమిర !

సుప్తి, వితర్కము, శ్రమ, వితర్కము

తిన్నని పలుకులు పలుక వదేమిర — తెలిసి తెలియ కున్నా వది యేమిర !

గద్గదిక, శ్రమ, వితర్కము, జడత, వితర్కము

౩. ఇనపురి ముద్దుల మువ్వగోపాల !–ఏపురిమీర నను కలసితి
[వారా !

ఔత్సుక్యము, దైన్యము, హర్షము, మోహము, ఔత్సుక్యము

మనమున నిను నెరనమ్మినదానర – మారుబలుకకున్నా
వది ఏమిర !

హర్షము, ధృతి, విషాదము, గ్లాని, వితర్కము

## 15. పున్నాగవరాళి రాగము - తిశ్రత్రిపుటతాళము

(నాయిక పరకీయ, ప్రౌఢ, వాసక సజ్జిక. నాయకుడు దక్షిణుడు. విరహ విప్రలంభశృంగార, కరుణా రసములు. సంచారులు - చింత, శంక, విషాదము, వితర్కము, నిర్వేదము, స్మృతి, శ్రమ, అమర్షము, ఔత్సుక్యము, హర్షము, మతి, దైన్యము, నిశ్వాసము, అసూయ.)

పల్లవి :

ఇంత ప్రొద్దాయె నిక వా–డేమి వచ్చునె

చింత, విషాదము, నిర్వేదము, శంక, వితర్కము

ఏ యింతిని గూడి యున్నాడో

అసూయ, విషాదము, శంక

అనుపల్లవి :

చింతింప పనిలేదు – చెలియా ! మువ్వగోపాలుడు ॥ఇం॥

శంక, నిర్వేదము, ఔత్సుక్యము, చింత, దైన్యము

1. చేరినాతో నేస్తము—చేసిన పాపమా
స్మృతి, వితర్కము, విషాదము
కీరవాణిరో! ఏల వేగించేవే నీవు
దైన్యము, వితర్కము, రోషము, శ్రమ
నూరినగంధ కస్తూరి — పారవేసి పవ్వళించు
అమర్షము, ఉగ్రత, రోషము
ఏరమణి యింట నున్నాడో—యీరెల్ల మాటు మఱగి ॥ఇం॥
అసూయ, శంక, రోషము, నిర్వేదము, విషాదము

2. భాసురాంగిరో! వినవె — పక్షులు మొదలుగాను
దైన్యము, నిర్వేదము
వాసములు జేరి తమ — వనితల గూడెనె
మదము, హర్షము, మతి
ఆసించినా ఫలించే — దరుదు గాదటవే నే
నిర్వేదము, నిశ్వాసము, శంక
జేసిన పాపమెవ్వరు — చేసినారే చెలియ ॥ఇం॥
అమర్షము, విషాదము, వితర్కము, విషాదము, చింత

3. పమ్మిన వేడుకతోను — పడకిల్లు శృంగారించి
హర్షము, ఔత్సుక్యము, హర్షము
యెమ్మె కాదు వచ్చునని — యెదురుజూచితి
ఔత్సుక్యము, నిర్వేదము, ఆర్తి

సొమ్ము లేలే ? విరు లేలే ?-సొగసెవ్వరు చూచెదరే
చింత, వితర్కము, నిర్వేదము, వితర్కము
కొమ్మా! నన్నేలిన మువ్వ-గోపాలుని నమ్మరాదే ॥ఇం॥
హర్షము, వితర్కము, దైన్యము, వితర్కము, దైన్యము

## 16. ఆనంద భైరవి రాగము - ఆదితాళము

(నాయిక పరకీయ, ప్రౌఢ. నాయకుడు ఉపపతి. అయోగ విప్రలంభశృంగార, భయానకరసములు. భయానకరసస్థాయి యగు భయము పద మందంతటను వ్యక్తమగుచున్నది. సంచారులు : దైన్యము, త్రాసము, మోహము, విషాదము, శంక, చింత, హర్షము, స్మృతి, విబోధము, ఆలశ్యము, వితర్కము, అమర్షము, గ్లాని, శ్రమ, ఔత్సుక్యము, చక్షుఃప్రీతి ఉగ్రత, అసూయ, ధృతి, గోపము.)

పల్లవి :

రేపు వత్తువుగాని పోర నేటికి తాళి — రేపు వత్తువుగాని
అయోగ విప్రలంభము, దైన్యము, త్రాసము, దైన్యము, హర్షము

అనుపల్లవి :

రాపు చేయుట మేలా ? ॥ రేపు॥
దైన్యము, మోహము, విషాదము, దైన్యము
రేపువత్తువుగాని గోపాల నాసామి
అయోగ విప్రలంబము, విషాదము, దైన్యము

1. రాతిరి పగలొక్క తీరు నిన్ను-రమ్మంటే మా యింటివారు
మోహము, త్రాసము, విషాదము, వితర్కము, దైన్యము, త్రాసము

మాటలు ద్రిప్పేరు – మొన్న వచ్చితివని

అసూయ, స్మృతి, హర్షము. వితర్కము,

వా దేల తడవాయె వద్దునేటికి తాళి ॥ రేపు॥

ఆలస్యము, అమర్షము, ఉగ్రత. దైన్యము

2. మరునాడె ననుగూడితివి నన్ను–మరుకేళి గెలిచి మెప్పించితివి

స్మృతి, ఔత్సుక్యము, ధృతి, హర్షము, మోహము, ధృతి

మరియాద గలిగిన–దొరబిడ్డవైతె

హర్షము, ధృతి, వితర్కము, శంక,

తెరచిచూడర తలుపు–తెల్లనారె తూరుపు ॥ రేపు॥

త్రాసము, దైన్యము, శంక, వితర్కము, ప్రబోధము

3. రాపు సేయకు నాతో పోరా నన్నే – రతినేలిన మువ్వ [గోపాలా!

ఆలస్యము, అమర్షము, వితర్కము, హర్ష, ధృతి, దైన్యము

కోపగించి పోయేవు – కొన్ని నాళ్ళాయె నీవు

కోపము, వితర్కము, దైన్యము, ఆలస్యము, వితర్కము, శంక, ధృతి

తాప మణచ వేరా – దయతో కలసి పోరా ॥ రేపు॥

ఔత్సుక్యము, మోహము, విషాదము, దైన్యము గ్లాని, శ్రమ

---

## 17. శహన రాగము - చాపుతాళము

(నాయిక పరకీయ, అభిసారిక, కులట. నాయకుడు. ఉపపతి. సంభోగశృంగారాద్భుత రసములు. సంచారులు : శంక, వితర్కము, ధృతి, దైన్యము, చింత, విషాదము, ముదము, మతి, వ్రీడ, త్రాసము, ఉగ్రత, నవ్వు, అసూయ.)

పల్లవి :

చూడరె అది నడచే హొయలు – సుదతి సేయు జాడలు

శంక, వితర్కము, ధృతి, దైన్యము, చింత, అద్భుతము

అనుపల్లవి :

ఆడది కుల కాంత – అత్తింటి కోడలు

వ్రీడ, దైన్యము, ధృతి

అల గోపాలుని – విడిదికి వెడలెను ॥చూడరె॥

దైన్యము, మతి, దైన్యము

1. కొండంత కాపురమె రానుపోను – కోమలి కందలమె

ధృతి, దైన్యము, చింత, విషాదము

దండున గెలిచే మగడు – తక్కువేమే

ధృతి, వితర్కము

తలవ్రా లెవరికి తప్పించ వశమే ॥చూడరె॥

విషాదము శంక, వితర్కము

2. పైట కొంగు జారి నను తెలియక–భయమించుకయు లేక

ముదము, త్రాసము, ఉగ్రత

తోటివారు నవ్వ – దురని యెంచక
నవ్వ ముదము
దోచునటె అది గయ్యాళి బల్ జాణ ॥చూడరే॥
వితర్కము, ధృతి, మతి

3. అత్త, మామ, భావ, మరదులనుదిట్టి, – అవమాన [మును గొట్టె
ముదము, ఉగ్రత, చింత, విషాదము, ధృతి
గుత్తగాను మువ్వ – గోపాలదేవుని
ధృతి దైన్యము, విషాదము
గూడునటే అది మనిషా మ్రాకా ॥చూడరే॥
అసూయ, ఉగ్రత

## 18. భైరవి రాగము - ఆదితాళము

(నాయిక పరకీయ, ప్రౌఢ, అనుశయాన. నాయకుడు - అనుకూలుడు. కరుణారసము. స్థాయి - శోకము. సంచారులు - దైన్యము, చింత, మోహము, వితర్కము, ఔత్సుక్యము, ధృతి, ఉగ్రత, విషాదము, అవహిత్థ, గ్లాని, ముదము, త్రాసము, స్మృతి.)

పల్లవి :

బొట్టు గట్టిన వానింటికి – పోయి వత్తున సామి!
దైన్యము, చింత, దైన్యము

అనుపల్లవి :

పుట్టినింటనెయుండుట సతులకు
దైన్యము, చింత, దైన్యము
పోసగునా మువ్వ గోపాల సామి ! ॥బొట్టు॥
వితర్కము, దైన్యము

1. చెలియల పెండ్లికి నెలదినములలో - చేరవత్తుసామి
దైన్యము, ధృతి, ఔత్సుక్యము, ధృతి
చెలిమి యింతలో మరువక యుండుమీ-చెలువుడా ! నీనుది
[లోను
దైన్యము, ధృతి, చింత, ఔత్సుక్యము
కలుగజేసె ఈ నడుమడి దైవము-కులభామల కెల్లను
గ్లాని, ఉగ్రత, బ్రహ్మనింద, చింత, విషాదము, అవహిత్థ ధృతి
నిలువరముగ నీ దయ యిందుండితె - నీ సొమ్ముగదా
దైన్యము, వితర్కము ధృతి, దైన్యము వితర్కము,
[యీమేను సామి ॥బొట్టు॥
ముదము

2. తిరునాళ్ళ కనుచు నీవైనా నొక-పరి యందనుక రారాదో
అవహిత్థ, దైన్యము, ఔత్సుక్యము, వితర్కము, దైన్యము
గురుతు చూచుచునుందుదు నీవ్రేలి యుం - గరమైనా
[యివ్వరా
స్మృతి, ముదము, ఔత్సుక్యము, వితర్కము, దైన్యము.

విరహామోర్వలేనంటివి పేర - ఇరువురకు సరి పోరా!

మోహము, విషాదము, వితర్కము, ఉగ్రత, చింత

మఱిమరి సెల విమ్మని నే వేడిన - మాటలు బెట్టకురా

ఔత్సుక్యము, దైన్యము, దైన్యము, విషాదము, ధృతి, ఉగ్రత

[నాసామి ॥బోట్టు॥

3. కోరిక యొకసారి తీరెగద యిక-గొబ్బున సెలవియ్యరాదా

మోహము, ధృతి, ముదము, దైన్యము, వితర్కము

శౌరి మువ్వ గోపాలా! ఈ వేళ - పోరుట మరియాదా

దైన్యము, ధృతి, ఉగ్రత, గ్లాని, వితర్కము

పీరు వారు మన సుద్దులు వింటే - ఏరా మోసము కాదా

అవహిత్థ, ఉగ్రత వితర్కము, త్రాసము

తీరదింక నేనేమిసేయుదు - దేవు డలిగెను మనమీద

గ్లాని, వితర్కము, మోహము, విషాదము, చింత, ధృతి.

॥బోట్టు॥

## 19. మోహన రాగము - జంపతాళము

(నాయిక పరకీయ, పరోఢ. నాయకుడు విటుడు. సంభోగశృంగార రసము. రతిస్థాయి. సంచారులు: నిర్వేదము, గ్లాని, విషాదము, పశ్చాత్తాపము, చింత, పరులు చూడకుండ సమర్థించుకొని తన యింటికి వచ్చుట.)

పల్లవి :

మగువ తన కేళికా - మందిరము వెడలె

నిర్వేదము, విషాదము

అనుపల్లవి :

వగకాడ! మా కంచి - వరద! తెల్లవారె ననుచు ॥మ॥

మోహము, చింత

1. విడజారు గొజ్జంగి - విరిదండ జడతోను

నిర్వేదము

కడు చిక్కుపడి పెనగు - కంటసరితోను

నిర్వేదము

నిడుద కన్నుల దేరు - నిదుర మబ్బుతోను

విషాదము, గ్లాని

తొడరి పదయుగమున - తడబడెడు నడతోను ॥మ॥

నిర్వేదము, గ్లాని

2. సొగసి సొగయని వలపు - సొంపు జూపులతోను

మోహము, చింత

వగవగల ఘనసార - వాసనల తోను

మోహము, గ్లాని

జిగిమించు కెమ్మోవి - చిగురు కెంపులతోను

మోహము, గ్లాని

నగము కుచముల విదియ - చందురులతోను ॥మ॥

గాని చింత

౩. తరితీపు సేయు సమ - సురత బడలికతోను
మోహము, గ్లాని
జరుగక పావడ చెఱగు - జార్చెవటతోను
విషాదము, చింత
ఇరుగడల కైదండ - లిచ్చు తరుణులతోను
మోహము, నిర్వేదము
పరమాత్మ! మువ్వగో - పాల! తెల్లవారె ననుచు ॥మ॥
మోహము, పశ్చాత్తాపము

---

## 20. పంతువరాళిరాగము - ఆటతాళము

[నాయిక పరకీయ, ప్రౌఢ. నాయకుడు ధృష్టుడు. సఖి పార్శ్వ చారిణి. సంభోగశృంగార రసము, అద్భుతరసము. ఈ పదమంతటను ముద మను సంచారి యున్నది. (ఉపరతి విశేషమందు జరిగిన అలంకార వర్ణనము) సంచారులు: వితర్కము, శంక, దైన్యము, హర్షము, త్రాసము, అద్భుతము, ధృతి, మోహము, ఆవేగము, స్మృతి.]

పల్లవి:

ఏమి చోద్యమైన సురత - మిందు వదనరో ॥ఏమి॥
అద్భుతము, హర్షము, దైన్యము

అనుపల్లవి:

కామ తంత్ర గతులు పెక్కు - గలవు ఎన్ని చూడగను ॥ఏమి॥
మోహము, ధృతి హర్షము, దైన్యము

1. తరుణి ఉపరి సురతకేళి – తగిలె పెనగి వేగమునను

మోహము, హర్షము, ఆవేగము

కురులు విడి ఝల్లు ఝల్లున – విరులు రాలగా

అద్భుతము, హర్షము,

ఎరుగలేక మదిని విభుడు – ఇంద్రనీలమేఘ మనగ

స్మృతి, దైన్యము, ధృతి, హర్షము

గురుతరముగ పువ్వులవాన – కురిసె ననుచు భ్రమసెనో ॥ఏమి॥

హర్షము, ధృతి, హర్షము, భ్రమ

2. మదన మోహాంధకార – మయ్యో మృగమదంబుజార

మోహము, హర్షము, ధృతి

కదిసి కుచయుగంబు నడుమ – గగన వీథిని

ఉగ్రత, హర్షము, ధృతి

కదలు మణులు సరులు, తార – కంబు లనగ నఖరేఖ

హర్షము, ధృతి, హర్షము

కొదమ చంద్రు లనుచు జూచి, – అదరి చెదరి భ్రమసెనో ॥ఏమి॥

హర్షము, ధృతి, త్రాసము, భ్రమ

3. విమలమైన రమణి నాభి – వెడలియున్న రోమరాజి

హర్షము, హర్షము, ధృతి

విమర్శింపలేక రాహు – విధము గాగను

వితర్కము, శంక, ధృతి

కమలనేత్ర ముఖము చంద్ర – కళల సొబగు దేలగాను
హర్షము, హర్షము, ధృతి
భ్రమసి వేంకటేశు డంతలో–భావ మెరిగి గూడెనో ॥ఏమి॥
భ్రమ, దైన్యము, మోహము, హర్షము

## 21. శంకరాభరణ రాగము - తిశ్రజాతి త్రిపుట తాళము

(నాయిక సామాన్య, అస్పష్ట, సురత ప్రియయగు ప్రౌఢ, నాయకుడు వైశికుడు. సంభోగశృంగారరసము, విస్మయ స్థాయికమగు అద్భుత రసము. సంచారులు- దైన్యము, అధ్యానము, హర్షము, మోహము, వ్రీడ, నిద్ర, విషాదము, ఔత్సుక్యము, నిర్వేదము, రోమాంచము, ఆవేగము.)

పల్లవి :

ఏల తెల్లవారె నయ్యయ్యో – ఇంత వేగమే
దైన్యము, విషాదము అధ్యానము

అనుపల్లవి :

భామరో! మాముద్దుగో–పాలునితో మాటాడ గానె ॥ఏల॥
దైన్యము, అధ్యానము, విషాదము

1. రాక రాక మా యింటికి – రమణుడు వచ్చినంతలో
హర్షము ఆవేగము
పోకముడి వీడగాను – పొంగుకొంచును
రోమాంచము హర్షము

ఏక చిత్తమున శయ్య - నిద్దరము పవ్వళించి

హర్షము మోహము

అని మదుపు లందిచ్చి స - య్యాటలాడు నంతలోనె ॥ఏల॥

ఔత్సుక్యము; సరససల్లాపములు; హర్ష, విషాద, నిర్వేదములు.

2. మేను మేను గదిసి నపుడె - మిక్కిలి బిగి కౌగిళ్ళ

ఔత్సుక్యము హర్షము మోహము

పూని పెనగుచు నిద్దరము - పొంకము మీర

ఔత్సుక్యము, నిద్ర, హర్షము

సూనశరుని పాటలు - సొంపుమీర బాడుకొంచు

మోహము హర్షము

అని కౌగిలించు మని - అడిగే టంతలోనె ॥ఏల॥

ఔత్సుక్యము వ్రీడ, దైన్యము

3. సరసుడౌ నా మోహనాంగుడు - స్వామి మువ్వ [గోపాలుడు

ఔత్సుక్యము దైన్యము

కరుణించి సమరతిని - గలయు నంతలో

దైన్యము, రతులు విషాదము, నిర్వేదము

సురతాన తమి హెచ్చి - చొక్కి వేరేమీ తోచక

ఔత్సుక్యము ఆధ్యానము

గురుకుచములరొమ్మున - గ్రుమ్మి పై కొనునంతలోనె ॥ఏల॥

ఔత్సుక్యము, నిర్వేదము, మోహము, విషాదము

[అనుభావములు :—తెల్లవారెనని చూపుటకు ఆదుర్దాపడుట, దీపము కళ తగ్గుట, తాంబూలము చప్పబడుట, కమ్మలకాంతి తగ్గుట, పక్షులు లేచుట అభినయింపవలెను. 'సయ్యాటలాడు నంతలోనే' అను చరణములో - పోకముడి వీడుట, రోమాంచము, పవ్వళించియుండుట, తాంబూలము, సయ్యాటలు అభినయింపవలెను. 'కౌగిళ్ళలో పెనగుచునుండగనే తెల్లవారె' ననుచోట మన్మథుని పాటలు, ఆలింగనము, చుంబనము, నఖక్షతము, దంతక్షతము అభినయించవలెను.]

## 22. ముఖారి రాగము - చాపుతాళము

(నాయిక సామాన్య, ఖండిత, మధ్య ధీరాధీర. నాయకుడు ధృష్టుడు. ఈర్ష్యామాన విప్రలంభ శృంగారరస మంగి. రౌద్రహాస్యము లంగ రసములు, సంచారులు - రోషము, అవహిత్థ, వితర్కము, అసూయ, అమర్షము, శంక, దైన్యము, రతివిశేషములు, మోహము, ఉగ్రత, హర్షము.)

పల్లవి :

ఎందుకు బొంకేవురా—లే దని నాతో—ఎన్నోమ్రలుసేయకురా

రోషము, అవహిత్థ, వితర్కము, అసూయ, అమర్షము

అనుపల్లవి :

ముందటి వాడవా — మువ్వగోపాలా నీ

హాస్యము, రోషము, వితర్కము, దైన్యము,

ముచ్చు వగలు — మానరా ॥ఎందు॥

అసూయ ఉగ్రత

1. నిన్న దా నింటికి బో లేదో — నీ వది నన్నాడుకో లేదో
అసూయ, శంక, వితర్కము, అసూయ, రోషము, వితర్కము

అన్నియిప్పుడె తార్కాణ గాదో — అవురా! ఈలాగై తే
[కోపము రాదో ॥ఎందు॥

2. సరస సల్లాపము లాడుకో లేదో — సన్నజాజులు జడ
[నుంచుకో లేదో
మోహము, వితర్కము, శంక, అమర్షము, వితర్కము, శంక

పరిమళ గంధాదు లలదుకో లేదో — భామచేతి విడె
మందుకో లేదో ॥ఎందు॥
రోషము, అమర్షము, వితర్కము, అసూయ, రోషము, వితర్కము

3. చెలిని కౌగలించ లేదో — చేరి మోమును ముద్దిడ లేదో
అసూయ, వితర్కము, మోహము, అమర్షము, రోషము, వితర్కము, శంక

కిలకిల నవ్వుకో లేదో-కీరవాణిని మెచ్చుకో లేదో ॥ఎందు॥
అసూయ, నవ్వు, వితర్కము, అసూయ, రోషము, అమర్ష వితర్కము.

4. దయ మరువ వద్దన లేదో — దక్కితి నని వేడుకో లేదో
దైన్యము, వితర్కము, శంక, హర్షము, దైన్యము, వితర్కము

నయముగ పదము లానగ లేదో— 'నాతి! నిను బాయలే'
[నన లేదో ॥ఎందు॥

5. నన్నుగూడిన వాడవు కాదో-నాతో నీ సుద్ది తెలుపనీదో
రత్యాదులు, వితర్కము, శంక, దైన్యము, రోషము, వితర్కము

చిన్నబుచ్చితె దోసముకాదో - కన్నెనేలితివని బలుక
రాదో ॥ఎందు॥

దైన్యము అవహిత్థ, వితర్కము, అసూయ, కోపము, వితర్కము, శంక

[‘ఎందుకు బొంకేవురా - ముందటి వాడవా’ అనుచోట పరసంపు మాటలాడుట, ప్రేమించుట, మిక్కిలి గౌరవించుట, సురతమును మెచ్చుట, ఎడబాయకుండుట, అసహ్యపడుట, బెదరించుట, ధీరత్వమును చూపుట, హేళనచేయుట, కోపగించుట—చూపవలెను.]

## 23. బేహాగ్ రాగము - చాపుతాళము

(నాయిక సామాన్య, ఖండిత, ప్రౌఢ, ధీర, కనిష్ఠ. నాయకుడు శఠుడు. ఈర్ష్యామానవిప్రలంభశృంగార, కరుణ, హాస్యరసములు. సంచారులు - అమర్షము, వితర్కము, ఉగ్రత, విషాదము, అవహిత్థ, అసూయ, గర్వము, ఆవేగము, స్మృతి, జడత, వ్రీడ, ధృతి, దైన్యము, మాయలు, తిరస్కారము, పశ్చాత్తాపము.)

పల్లవి :

రాయబారమంపి నాడా—రానురాను నే రా ననుమా ॥రా॥

అమర్షము, వితర్కము, ఉగ్రత, అసూయ, గర్వము, ధృతి, హాస్యము

అనుపల్లవి :

మాయవాది మా మువ్వగోపాలు – మాటనమ్మిగ రా
[దెన్నటికైన

మాయలు, దైన్యము, అసూయ, అమర్షము, వితర్క, ధృత్యుగ్రతలు

1. చిత్త మొకరిమీద నెయుండు–చిరునవ్వు నవ్వుచునుండు
అసూయ, అవహిత్థ అవహిత్థ, ధృతి
బత్తి గలిగిన ట్లేయుండు–భావనే లాగునందు ॥రా॥
అవహిత్థ, ధృతి అసూయ, ధృతి, విషాదము

2. గడిచుకొకరితో సరసము–గడుసువగ లైతె చాలాఘనము
అసూయ, విషాదము, ధృతి, గర్వము, అమర్షము, ధృతి
నడక చూచితే వేరే విధము – నాలుకపై నుండు నమ్రు
[తము ॥రా॥
ఆవేగము, అవహిత్థ ధృతి, అవహిత్థ, ధృతి, అసూయ

3. తొలుత గూడిన కూటమె చాలు – వలపు లుంచని దారేటి
[మేలు
స్మృతి, రతులు, ధృతి, మోహము, పశ్చాత్తాపము, ధృతి, జడత, వ్రీడ
తిరస్కారము
చలపాది మువ్వగోపాలుని –సరసమే చాలుచాలు పదివేలు
॥రా॥
అసూయ, దైన్యము, వితర్కము, స్మృతి, ధృతి, అసూయ, గర్వము

---

## 24. కేదార రాగము – త్రిపుట తాళము

(నాయిక సామాన్య, ప్రౌఢ, మధ్యమ, వక్రోక్తి గర్విత. శృంగార, అద్భుత రసములు - సంచారులు : గర్వము, వితర్కము, ధృతి, విషాదము, అసూయ, సుప్తి, ఔత్సుక్యము, దైన్యము, హర్షము, నిర్వేదము, శంక.)

పల్లవి :

రమ్మనవే సముఖాన - రాయబారము లేలే ॥రమ్మ॥

ఔత్సుక్యము, గర్వము, వితర్కము, దైన్యము

అనుపల్లవి :

కమ్మ విల్తుని గన్న చక్కని మువ్వగోపాలుని ॥రమ్మ॥

హర్షము, ఔత్సుక్యము, విషాదము

1. సొగసు చేసుకవచ్చి - సుదతు లందరు జూడ

గర్వము, దైన్యము, హర్షము, వితర్కము

వగలు జేసి తల - వాకిట నిలిచి

హర్షము, ఔత్సుక్యము, దైన్యము, వితర్కము, శంక, ధృతి

తెగనాడే విఘ్నమేమో - దినదినము క్రొత్తలాయె

అమర్షము, ఔత్సుక్యము, విషాదము, దైన్యము

ఇగురు బోణిరో! వచ్చి - యెంత సే పాయెనో ॥రమ్మ॥

ఆలస్యము, వితర్కము, నిర్వేదము, దైన్యము

2. ఇరవంద నిన్న మా - యింటి వరకు వచ్చి

ఔత్సుక్యము, విషాదము, నిర్వేదము

తిరుగ వేంచేసెనట - సరిప్రొద్దు వేళ

వితర్కము, విషాదము, హర్షము, నిర్వేదము

విరిబోణు లెవ్వరో - వేళగా దని రట

అసూయ, శంక, వితర్కము, స్మృతి, వితర్కము, విషాదము

తరుణిరో! నేమంత - దొరలమా మాబాగాయె ॥రమ్మ॥

విషాదము, నిర్వేదము, వితర్కము, గర్వము, దైన్యము, విషాదము, వితర్కము

3. రామరో! తా నొక్కడు – రాలేదో పోలేదో

విషాదము, నిర్వేదము, దైన్యము, వితర్కము, శంక

కాముకేళిని నన్ను – కలయ లేదో

రతులు, విషాదము, వితర్కము, ధృతి, హర్షము

ఏమే నే నందాక – ఎదురుగ రావలెనో

విషాదము, గర్వము, వితర్కము, దైన్యము

మా మువ్వగోపాలుడు–మనసు శోధించె నేమో ॥రమ్మ॥

ఔత్సుక్యము, విషాదము, నిర్వేదము, వితర్కము, శంక

—

## 25. కాంభోజి రాగము – త్రిపుట తాళము

(నాయిక సామాన్య, ఖండిత, అన్యా సంభోగదుఃఖిత. నాయకుడు శఠుడు. ఈర్ష్యామానవిప్రలంభశృంగార, కరుణారసములు. సంచారులు: దైన్యము, అధ్యానము, అసూయ, అమర్షము, పశ్చాత్తాపము, మోహము, విషాదము, ఔత్సుక్యము, రోషము.)

పల్లవి:

ఇటువంటి వాడవని – ఇపుడు తెలిసెనుర!

ఈర్ష్యామాన విప్రలంభము, అధ్యానము, దైన్యము, అసూయ, అమర్షము, పశ్చాత్తాపము

అనుపల్లవి:

విటరాయ! మువ్వపురి–విభుడా! గోపాలా! ॥ఇటువంటి॥

దైన్యము, అధ్యానము

1. చెలిమి చేసేదందు – చలము చేసేదిందు
అసూయ, దైన్యము చింత,
వలపు లుంచే దందు – వట్టి సుద్దు లిందు
మోహము, అమర్షము
నెలకొన్న రతులందు – నిట్టూర్పులే యిందు
అసూయ, రతులు, అమర్షము, అసూయ
వెలలేని పాట లందు – వింత కయ్యము లిందు ॥ఇటు॥
అమర్షము, అసూయ అధ్యానము, దైన్యము

2. వగలు గులికే దందు – వచ్చి పోయే దిందు
అసూయ, అమర్షము
మగునతో నెయ్య మందు – మత్సరము లిందు
అసూయ, రోషము, అసూయ
సొగసు నవ్వులందు – సోలించు మోమిందు
అసూయ, హర్షము, అమర్షము
తగు సొమ్ము లిచ్చే దందు – దబ్బరమాట లిందు ॥ఇటు॥
అసూయ, అమర్షము, దైన్యము, అధ్యానము

3. విరివడిగొన్న మోహ మందు – వల్లభు డని పే రిందు
అసూయ, మోహము, దైన్యము, చింత
విడెము లిచ్చేదందు – విడనాడే దిందు
అసూయ, అమర్షము, విషాదము

పడకింటి మోహమందు – పాన్పుశృంగారమిందు
అసూయ, హర్షము, ఔత్సుక్యము
నడవడిగ గూడేదందు – నన్నేలి దూరేదిందు ॥ఇటు॥
హర్షము, ఔత్సుక్యము, దైన్యము, విషాదము

---

## 26. ఆనందభైరవి రాగము – త్రిపుట తాళము

(నాయిక సామాన్య, ప్రౌఢ. నాయకుడు వైశికుడు. వియోగ విప్రలంభశృంగార రసము. సంచారులు : ఔత్సుక్యము, వితర్కము, అమర్షము, ఆలస్యము, దైన్యము, ఆవేగము, ధృతి, ఆర్తి, మతి, విశ్వాసము.)

పల్లవి :

మంచి దినము నేడే – మహా రాజుగా రమ్మను
ఔత్సుక్యము, విశ్వాసము

అనుపల్లవి :

పొంచి జూచిన దేమొ – పోలతి మువ్వగోపాలుని
వితర్కము, చింత

1. సుదతిరో ! అలవాని – సొమ్మొగద యీమేను
దైన్యము, మతి, మోహము
పదరితె యేమొ నేమొ–పడుచుతన మందుకనె ॥మంచి॥
వితర్కము, శంక

2. సదయుడని విడనాడ – సహజమానలె యింక
హర్షము, వితర్కము

కొదువ వద్దని వాని - కొమ్మ పేరెత్తినా ॥మంచి॥
అమర్షము, అసూయ

3. ఇంగను వచ్చుట భేద - మెంచా యీవేళ
ఔత్సుక్యము, వితర్కము

ఇందువదన ! వాని - యిల్లుగాదటవే ॥మంచి॥
ఔత్సుక్యము, వితర్కము, దైన్యము

4. అందు నా సుందరివలె నే - నందగత్తెగానా
అసూయ, వితర్కము,

ఎందుకే వట్టిదూరు - ఎవరు దండించిరో ॥మంచి॥
అమర్షము, ఆవేగము

5. వనజాక్షి ! మువ్వగో - పాలుడే వాడా చెలినిగూడ
ఔత్సుక్యము, అసూయ

తనకు ఇష్టమైతే - తగదని చెప్పుదునా ॥మంచి॥
అసూయ, అమర్షము, వితర్కము.

---

## 27. కళ్యాణి రాగము - చాపు తాళము

(నాయిక సామాన్య పరోక్ష, ఖండిత, నాయకుడు అనుకూలుడు. వియోగవిప్రలంభశృంగారరసము. సంచారులు : నిర్వేదము, ఔత్సుక్యము, విషాదము, తాపము, వితర్కము, విబోధము, అపూర్వ ఈర్ష్య.)

పల్లవి :

దగ్గరా రాపనిలేదురా మువ్వ గోపాలా॥
నిర్వేదము, ఔత్సుక్యము

అనుపల్లవి :

దగ్గరా రాపనిలేదురా మువ్వగోపాలా ॥దగ్గరా॥
విషాదము, విబోధము

1. దగ్గరా రాపనిలేదు – వద్దనుండి మాటలాడు
విషాదము, అపూర్వ, ఈర్ష్య
అగ్గువాగ్గైతె నీకే – అయిదు వరహాలూ
వితర్కము, ఔత్సుక్యము
ఈయగలిగితే రా – రా గలిగితే తే
వితర్కము, ఔత్సుక్యము
తేలేకుంటే పో – పో లేకుంటే ॥దగ్గరా॥
వితర్కము, విషాదము, తాపము

2. కలికి మువ్వగోపాలా – కలసెడువాడవైతే
అపూర్వఈర్ష్య, వితర్కము
చలువ చీరెలు మంచి చెం – గలువరవికలు ఈ
ఔత్సుక్యము, ఔత్సుక్యము
యీగలిగితె రా – రా గలిగితె తే
వితర్కము, ఔత్సుక్యము
తేలేకుంటే పో – పో లేకుంటే ॥దగ్గరా॥
వితర్కము, విషాదము

## 28. యదుకుల కాంభోజిరాగము - అటతాళము

(నాయిక - సామాన్య, ఖండిత, ప్రౌఢ. నాయకుడు - వైశికుడు. అద్భుత రసము. సంచారులు : మదము, అసూయ, వితర్కము, ఔత్సుక్యము, గర్వము, అమర్షము, ముదము, హేళన, రతివిశేషములు, రోషము, నిర్వేదము, ధృతి, శంక.)

పల్లవి :

ఇల్లెరుంగక మరి యొక రింటి కో స్తివి

మదము, అసూయ.

నీ వెవరవోయి నాయకుడా !

గర్వము, అమర్షము

అనుపల్లవి :

అలనాడు నీతోను గలసి మాటాడిన అలదాని యిల్లు ఆవల [నుండెపోరా ॥ఇ॥

ముదము, అమర్షము, అసూయ, అసూయ, రోషము.

1. మాటతేటలె కాని - మరిచేతి దుగ్గాని

అసూయ, అమర్షము

మనసు విడిచి నీవు - మరి వదల వదేమి

అమర్షము, రోషము, హేళన

వాటముగా వల్లె - వాటు వేసికొని

ముదము, ముదము

వయ్యారముగ నీవు - వచ్చి పైబడే వేమిరా ॥ఇ॥

గర్వము, రోషము, వితర్కము, శంక

2. మాట నొకటింటికి – మాప నరహా లిమ్మి
గర్వము, ముదము
మాపు బలికితే రెండు–మాప నరహాలు
గర్వము, ముదము
పాటు బడే వేమిరా – నాటక ధారణ
వితర్కము, శంక. ముదము
బాట జూచి మరి – మూడగా పోపోరా ॥ఇ॥
రోషము, అసూయ, అమర్షము
3. మాపటి వేళాయె – మాట లొట్టివాయె
ఔత్సుక్యము, నిర్వేదము, హేళన
మా వాకిట తల్పు – మరి వేసి పొయ్యేద
ముదము, నిర్వేదము
నా పతి పార్థసారథి – వచ్చే వేళాయె
ఔత్సుక్యము, త్రాసము
ఆ పని నేటికి – అబ్బదు పోపోరా ॥ఇ॥
రతివిశేషము, ధృతి, అమర్షము, నిర్వేదము

---

## 29, భైరవిరాగము - అటతాళము

(నాయిక సామాన్య; నాయకుడు శఠుడు. ప్రణయమాన విప్రలంభ శృంగారము. హాస్యాద్భుతరసము. సంచారులు - అవహిత్థ, హర్షము, ఆవేగము, దైన్యము, వితర్కము, ఔత్సుక్యము, శంక, అసూయ, క్రీడలు, రతులు)

పల్లవి :

అప రూప దర్శనం బాయెగద నేడు ॥

హాస్యం    అవహిత్థ, హర్షము,

అనుపల్లవి :

కృప గలద మా మువ్వగోపాలసామి ॥అప॥

దైన్యము, శంక,    కృష్ణక్రీడలు

1. ఎన్నాళ్ళ కెన్నాళ్ళ – కీ వీథిలో నిన్ను

శంక, వితర్కము, ఔత్సుక్యము

కన్నుల పండుగగాను – కనుగొంటి నేడు

హర్షము,    దైన్యము

ఉన్నదా నా మీద – ఉల్లమున దయ నీకు

శంక, వితర్కము    అమర్షము, దైన్యము

ఉన్నాను నీ దయ – పన్నగశయనా ॥అప॥

ఔత్సుక్యము,    దైన్యము

2. త్రోవ తప్పి వచ్చితివో – తోయజాక్షికి నీకు

ఆవేగం, శంక, వితర్కము    అసూయ

ఈవేళ కలహంబు – ఏమయినా గలదా ?

వితర్కము, శంక    హర్షము, శంక, వితర్కము

నీ వేల జంకెదవు – నెనరు గలిగిన చోట

వితర్కము, నవ్వు    దైన్యము, హర్షము

వేవేల నేరములు – రావా ? నా సామీ ! ॥అప॥

ఔత్సుక్యము    హర్షము, దైన్యము

3. సందేహమేల యిక — శేయనించి సమరతులు
శంక, వితర్కము, ఔత్సుక్యము
చెంది నను ఉపరతులు — సేయమనక
హర్షము, రతులు దైన్యము
ఎందైన నీకు ఆ — నందమయ్యే చోట
అవహిత్థ హర్షము
కందర్ప జనక చ — క్కని మువ్వ గోపాల ॥అప॥
ఔత్సుక్యము హర్షము, దైన్యము

---

30. నీలాంబరి రాగము - త్రిపుటతాళము

(నాయిక - అత్యంత స్వాధీనపతికయగు సామాన్య, ప్రౌఢ; నాయకుడు - దక్షిణుడు. అయోగవిప్రలంభ శృంగారము, అద్భుతము, సంచారులు శంక, దైన్యము, వితర్కము, ఆవేగము, హర్షము, నిజము, ధృతి, విషాదము, ఔత్సుక్యము, మోహము.)

పల్లవి:

ఎటువంటి వాడే వాడు ఓయమ్మా వాడు —
శంక, వితర్కము, ధృతి హర్షము
ఎన్నడు నీ వీధిని రాడు ॥
విషాదము దైన్యము

అనుపల్లవి:

కుటిల కుంతల మువ్వ — గోపాలు డట పేరు ॥ఎటు॥
ఔత్సుక్యము, హర్షము, దైన్యము

1. నల్లని మేను వాడట — నయము లెన్నో చేసునట
వితర్క్యము, శంక, హర్షము, వితర్క్యము, శంక

చల్లగా మాటాడు నట — సరసము వాని సొమ్మట
హర్షము, వితర్క్యము, శంక, ఔత్సుక్యము, ధృతి

కల్ల కాదట వాడు—కళలంట నేర్చెనట ఓయమ్మా వాడు ॥ఎటు॥
ధృతి, హర్షము, మోహము, వితర్క్యము. దైన్యము, విషాదము

2. బంగరు దుప్పటివాడట — పంతములాడు కొన్నాడట
ఔత్సుక్యము, వితర్క్యము, వితర్క్యము, శంక

అంగన లెందరినైన — అలయక కూడునట
వితర్క్యము, శంక వితర్క్యము, ఆవేగము

సంగీతలోలుడట—చాలా ఈవిగాడట ఓయమ్మా వాడు ॥ఎటు॥
హర్షము, శంక హర్షము, ఔత్సుక్యము, వితర్క్యము

3. నన్నేలే మన్నాడట — నాదు చిన్నెలు తెలిసినాడట
వితర్క్యము, శంక హర్షం, ఔత్సుక్యము, వితర్క్యము

మొన్ననిందు వచ్చినాడట — మువ్వగోపాలుడట
విషాదము, శంక, వితర్క్యము హర్షము, ధృతి, వితర్క్యము

చిన్నవయసు వాడట—చెలియ! అందగాడట ఓయమ్మా వాడు
హర్షము, వితర్క్యము ఔత్సుక్యము, వితర్క్యము, శంక, విషాదము, దైన్యము

## (నాయిక స్వీయయైయున్న పదములు.)

---

### 31. ముఖారి - చాపు.

(స్వీయ - మధ్య ; అదివ్య - పూర్వము స్వాధీనపతిక ; తత్కాలవిరహోత్కంఠ ; తన్నుతా నోదార్చుకొను నాయిక).

పల్లవి :

అక్కరో ! ననుబాసి సందు — కాడితి నింతే॥

అనుపల్లవి :

చక్కని మా మువ్వగోపాలు — డెక్కడ నుండితే నేమి
॥అక్కరో॥

1. ఉప్పతిల్లవాని మోవి — చప్పరించీ నింతేకాని
ఎప్పుడు గల్గిన రసము — చప్పనయ్యానా ?
అప్పిచ్చిన దొరల — కతివరో ! తక్కినటవే ?
తప్పదుగా విధికృతము - తరుణి ! అల్లది కొన్నాళ్లు
॥అక్కరో॥

2. చానయెంత ప్రౌఢైనాను - చౌశీతిబంధ ములతోను
పూనిపెనగీ నింతే వాని — మేను దాచీనా ?
ఆ నాతికే సతమౌనా ? - నేను వలచినటుల గాదా ?
కానీ యిందుల కే మాయె - కలవే కలిమిలేములు
॥అక్కరో॥

3. మానినీ మణులకు మంచి—మగని గంటె మనసురాదా ?
తాను వలచి నటులగాదా ? – ఆ తరుణి ననునేలే ?
ఆనిన ప్రేమ మువ్వ గోపాలరా- యడు మునుపటి వలెనే
తానే రాడా ? బావిలో నీరు – తరుణి ! వెల్లువ బోవునటవే
॥అక్కరో॥

---

### 32. కాంభోజి - త్రిపుట.

(స్వీయ - ప్రౌఢ, కలహాంతరిత).

**పల్లవి :**

అక్కరో ! మగవాని – కెక్కడి వలపులే॥

**అనుపల్లవి :**

ఇక్కడికి రాడు చెవ్వందిలింగ–డెంత చెప్పిన గాని చెలియ !
॥అక్కరో॥

1. రామరో ! దానింట రాతిరిపగలు — రచ్చలుచేసినాడే
నా మనసు నొవ్వనేమేమోదానికి – సమ్మెక లిచ్చినాడే
మోముచేర్చుకొని కన్నులనొత్తుక—ముద్దుపెట్టుకొన్నాడే
యేమి సేతు నీమాట లెల్లవిని–యేలాగు తాళుదునే చెలియ !
॥అక్కరో॥

2. నిన్న నేడు వచ్చెదనని రాకుంటే–నెలత! ఊరకుందునా ?
కన్నెరో! నవ్వులకైన వానిపై – కాకచేసుకొందునా ?

వెన్నవంటి మనసువానికి నాపై - వెగటాయెననివిందునా ?
అన్నెకాడై వాడు నావలపెల్ల - నారుదూరుచేసెనే చెలియ !
॥అక్కరో॥

3. మున్నగోపాలుని ముద్దుసఖుడని - మ్రొక్కి వేసుకొందునే !
జవ్వాన మెల్లను వానిపాలుచేసి - సంతోషించుకొందునే !
ఎవ్వతె యింటికిపోయినా వద్దని - యిది బుద్ధికాదందునే !
చెవ్వాందిలింగ డింతరట్టుచేసి - చేపట్టి ననుకూడెనే చెలియ !
॥అక్కరో॥

## 33. ముఖారి - ఆది.

(స్వీయ - మధ్య ; కలహాంతరిత).

పల్లవి :

అక్కరలేని కాపురమాయె — నతని మనసు లేదాయె॥

అనుపల్లవి :

ఎక్కడిదిక దానిపాలాయె — నెనరాడిన రోసమురాదాయె.
॥అక్కర॥

1. మగువ! నా పేరు దలపడాయె — మమతలు మరపాయె
పగలు రేయునందే యునికాయె — బాళియెక్కువాయె
సొగసు లీ వెనుక ముందాయె — వగలు సేనాయె
ఇగురుబోణులకు నవ్వులాయె — నేమమ్మ! వలపు మంద
[మాయె ॥అక్కర॥

2. ఇంటిదోవ తొంగిచూడదాయె – సొంటు వెదకుటాయె
ఒంటిగా చెప్పి చాలాయె – ఓర్పు లేదాయె
తుంటవనుచు సహవాసమాయె – మంటిముక్కాయె
అంటుననుచు సీసు నిందాయె – నడగించని గొప్ప
[ముత్తెమాయె ॥అక్కర॥

3. దానిపొందు సంతోసమాయె–దైవము తోడాయె
చానరో ! నాపొందు కల్లాయె – సడ్డ లేకపోయె
తాను మువ్వగోపాలుడాయె – దయలు దూరమాయె
కానివారి కిది వేడుకలాయె – గయ్యాళి వానికిసతమాయె
॥అక్కర॥

## 34. కాంభోజి - జంపె.

(స్వీయ - ప్రౌఢ ; ప్రేమగర్వత).

పల్లవి :

అనుకూలుడైనట్టి మగవాడుకలిగితే – అంతకన్నను
[సంభ్రమ మున్నదా ?

అనుపల్లవి :

వినవమ్మ ! అలిగియుండినను కూటమి సేయ
వేడ్కలకు వెలయుచున్నదా ఓ చెలియ ! ॥అను॥

1. పడతి నేటికి తప్పుగావుమని ననుగదియు —
   నడుగుకొని కౌగిట జేరుచుపట్టి
తొడలపై చెక్కిలి నిడి చెలిమి నులిమి —
   పెడమరల బారలించి తిన దునల కేలను
సడలియున్న ముంగురులు —
   కడకొత్త నెమ్మోమున నెపసిపొడలిన నగల
తొడిబడి యిట్టిట్టు సంభ్రమము —
   తో నను గనుక మురియుగ వచ్చు ॥అనుకూ॥

2. చలమేల నాతోడ బలుకవే! యని పేర —
   బిలిచి నునుచెక్కు నొక్కి
మొలకట్టు సవరించుగతి నాభినిమిరి —
   పులకలు మేన బొడము జేసి
సొలపుచూపుల తనదు జాలితీర్పవే! యనుచు
   మొలక చనుమొన నలుపుచు
అలివేణిరో! యెంతకలసి మెలసినగాని
   ఆదుకొమ్మని వేడునే ఓ చెలియ! ॥అనుకూ॥

3. కలుకుచును మోముగళమున నప్పళించి—
   జిలిబిలి గళరవము చెలగగ
కళలనెలవె ఆగి అగ్గలపు తమికొసరి—
   పలుకుల కేరి ముద్దుపెట్టి

కులుకుచు కిలకిల నగుచును -
కలిసే ముద్దుగోపాలు లాలించగా
వలరాజు కేళి పరవశముచే నానంద-
జలధి తేలగవచ్చుగా ఓ చెలియ ! ॥అను॥

35. మధ్యమావతి - త్రిపుట.

(స్వీయ - ప్రౌఢ, దివ్య)

పల్లవి :

అనుకో పనే మున్నది ? - అక్కర లేనందుకు ॥

అనుపల్లవి :

ఎనసికూడిన న - న్నెడబాసినందుకు ॥అనుకో॥

1. మోము మోమున జేర్చి మోవీయ న్నైతినో ?
ఆముకొని ముచ్చట - లాడ న్నైతినో
నోముఫలమింతే - నో మోహనాంగిరో !
పాముడిజోగి - వలె పోయె నా బ్రతుకు ॥అనుకో॥

2. అలమి కౌగిట జేర్చి - యందుకో న్నైతినో ?
కులుకుగుబ్బలరొమ్మ - గుమ్మ న్నైతినో ?
తలిరుబోణిరో ! వినవె - తనకుగాని భూమి
ఫలమె యేమి ? యెవరి - పాలై తేనేమి ? ॥అనుకో॥

3. మరుకేళి నెనసినా - మనసీయ్య నైతినో
కరమెంచి యుపరతి - గలియ నైతినో
తరుణి! మువ్వపురి - ధాముడు ననుగూడి
అరటాకు ముల్లుసామ్య - మైనందు కిప్పు ॥డనుకో॥

---

## 36. శంకరాభరణము - ఆది.

(స్వీయ - సఖీ సంఘటన)

పల్లవి:

అప్పటికి నిన్నెంచెదనే - అతివా!

అనుపల్లవి:

ముప్పొంగి యల - మువ్వగోపాలుని దోడి తెచ్చిన ॥అప్ప॥

1. పనిబూని నా కొఱకై - నెనరు బుట్ట మాటాడి
ఘనమైన విరహావే - దన తీరను
వనితరో! నాప్రాణ - వల్లభునొనగూర్చి
కనికరమున మనసు లో - క్కటిగ నుండజేసిన ॥అప్ప॥

2. ఇదివరకు విభుకౌగి - లెడబాసి యెరుగ గనుక
తుదమొదలిది యని - శోచక మది
చెదరి దిగులుచేత - చిక్కిన నను జేర్చియిందు
వదనరో! ననుగా - వలసి నడచుకొన్న ॥అప్ప॥

3. మునుపటివలె మాలి - మిని మువ్వగోపాలుడు
కినుకదీరనన్ను మరు - కేళి నేలగా
అనుదినము నీలాగె - యెనసి యుండు డని
కనకాంగిరో! మాటవాసి - గట్టిగా దైకొన్న ॥అప్ప॥

---

37. కల్యాణి - చాపు.

(స్వీయ - మధ్య; స్వాధీన పతిక)

పల్లవి:

అమ్మా! యిటువంటివాని - కేమి సేయుదునే?

అనుపల్లవి:

కొమ్మ! మువ్వగోపాలుని - గుణముచెప్పెద వినవమ్మ!
॥అమ్మా॥

1. పయ్యెద చే బట్టుకొని - పాయజాల నని వాడు
సయ్యాట లాడుచు నన్ను - చాల వలపించునమ్మ
॥అమ్మా॥

2. దబ్బున పడకింటిలో - దాగియుండుకొని నాదు
గబ్బిగుబ్బలనుబట్టి - కన్నుల నొత్తుకొనునమ్మ ॥అమ్మా॥

3. సమ్మతించక నే నుంటే - సారెకు నదలించి చూచి
కమ్మవిల్తుకేళిలోన - కౌగిలించి కూడునమ్మ ॥అమ్మా॥

## 38. నాధనామక్రియ* - త్రిపుట.

(నాయిక: స్వీయ, ప్రౌఢ-సురతప్రియ, విరహోత్కంఠిత; నాయకుడు-శఠుడు- విరహ విప్రలంభ శృంగార, కరుణాద్భుత రసములు, సఖిపార్శ్వచారిణి, సంచారులు - దైన్యము, ఆలస్యము, అధ్యానము, వితర్కము, విషాదము, నిద్ర.)

పల్లవి:

అయ్యయ్యో వెగటాయె - నా? నా సామికి ॥

అనుపల్లవి:

పయ్యెద మీద చేరి - పవ్వళించి యుండేసామికి
॥అయ్యయ్యో॥

1. వెలది! నామోమురెప్ప - వేయక కనుగొని
కలియ నిండు సంజచీ - కటి గ్రమ్మితే
కలికి నీముద్దు మోము - కానరాక యున్నదని
తెలిసి ప్రొద్దుండగానే - దీపము తెమ్మనే సామికి
॥అయ్యయ్యో॥

2. వనజాక్షి వినవమ్మ - నాపై చాలా ప్రేమచే
తన దంతమున నా య - ధరమునొక్కి
మొనసి మాటాడిన - మోవి విడువవలె నని
అనువుగ చే సైగ - లాడుచునుండే సామికి ॥అయ్యయ్యో॥

---

* లలిత.

3. మదిరాక్షి ! వినుమమ్మ ! – మూవ్వ గోపాలుడు
నిదురించితే కౌగిలి – వదలీ నని
పదరి శయ్యమీద దు – ప్పటి కొంగులు నాలుగు
ముదముతో గట్టిగా – ముడిగొను మను సామికి
॥అయ్యయో॥

---

39. భైరవి - త్రిపుట.

(స్వీయ, సఖీ శిక్షా లక్షణము)

పల్లవి :

అలిగితి వెందుకు ? – అలమువ్వ గోపాలునితో
ఆయాయె పోవే ॥

అనుపల్లవి :

నెలతరో ! నీవంటి – నిర్దయురాలను
ఇల నెందు గాన – నిదియేమి వానిపై ॥అలిగి॥

1. భామరో ! నీమది – కేమని తెలుపుదు
కోమలాంగుడు నిన్నే – కోరియుండగను
వేమారు నీ వేమొ – వేడినా వని వాడు
నోము ఫలమని – నోచ్చుకొన్నాడట ॥అలిగి॥

2. వలువ చక్కెరపురి – నిలయుడని మదిలో
వలవేసి నిను – వలపించ లేద ?

కళలూర రతికేళి - కలిసిన పిమ్మట
చెలువుడ! నీపొందు - చాలు పొమ్మని ॥అలిగి॥

3. ఎనసిన వానిపై - కినుక సేయుట నీదు
మనసు ఎటువలె వచ్చె - మానవతిరో!
నెనరు గలదాన వని - నీ విభు డిందు రాగ
వనజాక్షిరో! వాని - వలపు లారడిచేసి ॥అలిగి॥

## 40. సారంగ - చాపు

(స్వీయ - ప్రౌఢ సఖీ పరిహాస లక్షణము)

పల్లవి:

అలుక దీరెనా నేడైన మీ - యలుక దీరెనా

అనుపల్లవి:

పలుకులాడుకొంటిరా మువ్వగో -
పాలుడు నీవు ముద్దులగుమ్మా! మీ ॥అలుక॥

1. చక్కెరబొమ్మ మీ యిద్దరి మనసు - చల్లనాయెనా?
నిక్కమానతీయవే నేడు మీ - నెంజిలి దీరెనా?
మక్కువతో నేడైన మీకు - మంచిదినమాయెనా?
అక్కడిక్కడ విభుడు నీవు-నసురుసు రని యుంటిరే!
చెలియ! మీ ॥అలుక॥

2. సుదతిరో! యొకరికొకరు మోములు – చూచుకొంటిరా?
పెదవులాని తియ్యని ముద్దులు – పెట్టుకొంటిరా?
అదుముకొని కౌగిళ్ల నిద్దరు – కదసియుంటిరా?
పదరి వానికి నీకుబోయు – పగలవలెనే యుండెనే? చెలియ!
మీ ॥అలుక॥

3. బాలరో! నేడైన నేక శయ్యమీద – పవ్వళించితిరా?
మేలుమేలని యిద్దరివలపులు – మెచ్చుకొంటి?
చాలవేడుకతో మువ్వగో – పాలుడు నీవు కూడితిరా?
వేళవేళల చాడిమాటలు – వింటిమనుకొంటిరిగదవె? మీ
॥అలుక॥

## 41. సావేరి - ఆది

(స్వీయ - ముగ్ధ; ధీరాధీర, కలహాంతరిత)

పల్లవి:

అలుకో? పొలయలుకో! తెలియ దమ్మలార!

అనుపల్లవి:

తలపులు తెలియవలెను – తాళరే మీరు చెలులార ॥అలు॥

1. కన్నె చిన్నతన మేమంటే – కన్నులు తేల వేసెను
భిన్నలు జూచి యాపె విభుడు – చిఱునవ్వు నవ్వెను

ఉన్నరీ తిదే మంటే - యువిద! యెంతే నుసు రనేను
వెన్నునినే నదలించితే - విని విన నట్లుండెను ॥అలు॥

2. చెలియ! విభుని భుజముపై - చేరగబోతే వలదని
సొలపున చెంగట కూ - ర్చుండు మనెను
అలివేణి! అతని కెమ్మోవి - ఆనెదనని యందుకో బోతే
చెలువు డానలి మోమైతన - చెక్కిలి గదియించెను ॥అలు॥

3. రమ్మని తిల్లగోవింద - రాజా! యని పిలిచితే
కొమ్మరో! తనపేరు మువ్వ - గోపాలు డనెను
ఎమ్మెతో మీ యిద్దరు - నెనసి యుంటిరా? యంటె
నెమ్మితో నాపె కద్దనెను - నెలత! యాతడు తల
యూచెను ॥ అలు ॥

---

## 42. భైరవి - త్రిపుట
(స్వీయ - మధ్య, వాసకసజ్జిక)

పల్లవి:

అవునమ్మ! మీకేమి? - అందరు బోధించేరు

అనుపల్లవి:

నవుగాదు వాని గుణము - నాటివలెనే లేదు ॥అవు॥

1. ఎదురుగా తలవాకిట నే - నెంతసేపైనాను
ఇదే వచ్చునో యనుచు - హితవుతో నేను

పదముల మీఁద కడుగ - పన్నీరు చేబూని
సుదతినంపితా రాక - చులకన గా జూచే గాని ॥అవు॥

2. సరిప్రొద్దుదాక ఆ - సఖియ యిల్లే మరుని
దరిసెనమున జోడు - బాయక యుండగను
వరుస పడకింట తా - నేకాంతమున నుండ
మరుకాక కుందిన - మన సెరుగ డింతే కాని ॥అవు॥

3. చక్కని మువ్వగోపాల - సామి! రమ్మని పిలిచితే
యెక్కువ లంటి నాప్రేమ - యెనసి యున్నాను
చక్కెర కెమ్మోవాని - చయ్యనగా ననుజూచి
మక్కువతో వాడుండే - మనసు తెలియదుగాని ॥అవు॥

---

## 43. మధ్యమావతి - అది

(స్వీయ - ముగ్ధ; కలహాంతరిత)

పల్లవి :

ఆడుబుట్టువు పుట్టిన - న్నలయింతురా!

అనుపల్లవి :

వేడుకొన్న రాడే యిపుడు - విభుడు మువ్వగోపాలుడు ॥ఆడు॥

1. మ్రొక్కివేడిన వినక - మోడిచేసేది న్యాయమా?
అక్కరో! నా మోహ మి - ట్లారడయ్యెగా

దక్కి దక్కించుకొ నేనంటే - దయ యెంతైన దెలియనీడు
నిక్కము వానికిగాని - నెన్మోనిచెలువ మేమిసేయ ॥ఆడు॥

2. పండువెన్నెల కాకాయె - భావజు డమ్ముల నేయ
గండుగోయిల రవళి - మెండాయె నిపుడు
కండచెక్కరమో విచ్చి - కౌగిలించడాయె
నిండువేడుకలవాని - నెనయెని తను వేమిసేయ ॥ఆడు॥

3. ఏపుమీర చిన్ననా - డెనసి నన్నేలిన వాడు
రాపుచేసి రాకున్నాడు - రమణిరో! నేడు
పాపజాతి నా వలపు - పడతి యెట్టుల గూడు
కోపగించి రాడు మువ్వ - గోపాలుడైన విభుడు ॥ఆడు॥

---

## 44. ముఖారి - ఆది

(స్వీయ - మధ్య ; కలహాంతరిత)

పల్లవి :

ఆలాగే మంచిదికాని - మ్మనవే ఓయమ్మా !

అనుపల్లవి :

బాల ! మువ్వగోపాలుడు - పంతమె సాధించెనమ్మా ॥ఆలా॥

1. వినవే ! వానికి నాచేతి - విడెమైనను గారాదట !
తన యెదురు కట్లనిలి - చిన కాదట !

నను జూచిన పాపమట్లు! – నామాటంటే సైచడట !
తనకుగాని యీ మేను–దాచి యెవరి కయ్యీ్యానమ్మా ॥ఆలా॥

2. విరిబోణి ! నేనున్న యింటి – పొరుగిల్లయిన జేరడట !
అరసి నే వచ్చిన దోవ – నైన రాడట !
మరినావలె నున్న ప్రతి – మలనైన గనుగొన డట !
సరసిజాక్షి ! యీపాపపు – జన్మమెవరి కయ్యీ్యానమ్మా !
॥ఆలా॥

3. వనిత ! మువ్వగోపాలుడు – తనదా నొచ్చుకొన్నాడట !
తనతో నేమి పనియున్నది పొ – మ్మనినాడట !
యెనసి సది కల్లలట ! – యిచ్చిపబాస లేదట !
మనసులేనివానితో నే – మల్లాడి యెందుకయ్యీ్యానమ్మా
॥ఆలా॥

## 45. కల్యాణి - ఆది

(స్వీయ - మధ్య ; విరహోత్కంఠిత)

పల్లవి :

ఇంటి కేల రాడే ? ముద్దులబాల ! – నేతాళజాల
ఇంతిరో ! విరహ – మెచ్చెనే చాల

అనుపల్లవి :

కంటకుడై యున్నాడు కందర్పుడు మదిని
బంటుపంత మిదే మేలా? – పడతిరో! వరదు డీవేళ
॥ఇంటి॥

1. చిన్ననాడే వలపించినాడు – నామేలు వాడు
అన్నికారి చాడి – విన్నాడు
నన్ను కలలోనైన జో – డెన్న డెడబాయనివాడు ॥ఇంటి॥

2. భాసురాంగిచేయు మాయవల్ల–నలగి నా డల్ల
భావమేమో తెలియదు – మెల్లమెల్ల
నాసరివారిలో నెల్ల – నగుబాటుచేసెనే చెల్ల ॥ఇంటి॥

3. కూరిమితో మరుకేళిలోన – న్నేలు మువ్వ
గోపాలు డెంతో సంతోసాన
నారీమణి నేలి నేడైన–మీరినమోహాముతోనా ॥ఇంటి॥

---

## 46. పంతువరాళి - చాపు

(స్వీయ - ప్రౌఢ ; కలహాంతరిత)

పల్లవి :

ఇంతకంటె డా నన్నేమి చేసీని – యింకగొంతయున్నదో

అనుపల్లవి :

పంతముతో మువ్వ గోపాలరాయుడా–పడతి యింట నుండీ

1. ఆసతోనే కౌగిలించుకోబోతేను - అక్కడనుండుమనెను
ఈనులేక మోవితేనె లీరా!యంటె - ఎంగిలయ్యీననెను
కాసంతనెంచక నోటివిడెమిమ్మంటె - కసరిలేదనెను
నాసరివారిలో నీ యుదాసీనము-నలినాక్షిరో! చాలదా ?
॥ఇంత॥

2. ఇందుండియాకు జుట్టిచ్చెదనంటే-హితవుగాదనెను
అందుండి మోమైన గనుల జూచెదనంటె-అందుకు వద్దనెను
పొందుగపాదము లొత్తెదనంటే వచ్చి-ప్రొద్దాయెబొమ్మ
[నెను
మందయానరో! నీమీద మమత-మరచితిననెను ॥ఇంత॥

3. వీదివారితోడ నా మీది మనసు-విరిగినదనెను
ఆదరించినాతో మాటలాడనంచు - నానలిడుకొనెను
వాదించి నీపొందు వద్దని గట్టిగ - వక్కలాకు లిచ్చెను
మోదముతో నన్నేలిన చక్కని-మువ్వగోపాలుడు ॥ఇంత॥

---

## 47. బిలహరి - త్రిపుట

(నాయిక స్వీయ - ప్రౌఢ; విరహోత్కంఠిత. నాయకుడు శఠుడు-విరహావిప్రలంభ శృంగారము).

పల్లవి :

ఇంత తెలిసియుండి - యీ గుణమేలరా

అనుపల్లవి :

పంతమా? మువ్వగో-పాల! నా సామిగ ॥ఇంత॥

1. అలుకచేసి యింటికి రా-వైతివి నెనరైన
చెలికత్తె లున్నారా? - పిలువ వచ్చేరా?
చెలికత్తెనైన నీవే-చెలువుడవైననీవే
తలచిచూడ నాపాలి-దైవము నీవే ॥ఇంత॥

2. వింతదానివలె నన్ను - వేరుచేసి రావైతివి
అంతరంగు లున్నారా? న-న్నాదరించేరా
అంతరంగమైన నీవే న-న్నాదరించిన నీవే
చింతించిచూడ నా-జీవస్వామివి నీవే ॥ఇంత॥

3. శ్రీనిధి మువ్వగోపాల !- చేపట్టి నన్నేలితివి
నానేర్పు లెవ్వరైనా - నానందించేరా ?
నానేర్పులైనా నీవే - నమ్మికలిచ్చినా నీవే
ఆనగా బల్కుదు నా-యానందమైన నీవే ॥ఇంత॥

---

## 48. బిలహరి - ఆది

(స్వీయ-మధ్య ; ప్రేమగర్వితే నాయకు డన్య కాంతలతో నుండిన వార్తను విని, అతడు తనవద్దకు రాగానే దండించవలెనని యెంచియు నతడు రాగానే ఊరకుండి యనుకూలవతియైనందున.)

పల్లవి :

ఇందుకు నే నేమిసేతునే ? ఏమందునె ?

అనుపల్లవి :

మందమైన మనసు సిగ్గు - మాలినదయ్యో నయ్యయ్యో
॥ఇందు॥

1. దా నింటికి పోయె నని - తరుణులచేత విని
ఆన పెట్టి రావద్దనే - నని యుంటినే
వాని మోము జూచినపుడె-వలపు రెట్టించి చాల
ఈనిన పులివంటికోప-మెందు పోయెనో యీవేళ ॥ఇందు॥

2. అతివరో! దానికి సొమ్ము-లంపించె నని విని
యతని మోము జూడ-నని యుంటినే
కతవింటే యని వచ్చి - కౌగిట జేర్చినపుడె
యతిశయమైన రోష-మపుడేమో తోచదాయె ॥ఇందు॥

3. సుదతిరో! దానింట వాని-జూచితి నన విని
యది మొదలట్టిట్టుచేసే - నని యుంటినే
ముదముతోడుత వచ్చి - మువ్వగోపాలుడు
మదనకేళి గూడినపుడు - మాటలన్నియు మరపాయె
॥ఇందు॥

## 49. పున్నాగవరాళి - చాపు

(స్వీయ-మధ్య ; ప్రోషితపతిక)

పల్లవి :

ఇందుకేమి సేతునమ్మా!-ఎవరు తోడి తెచ్చెద రమ్మా!

అనుపల్లవి :

ఇందువదన! కడపవేంకటేశు - డెంతదూరాన నున్నాడో
॥ఇందు॥

1. ఎక్కువమోహమున నన్ను - నే వేళ కౌగిటజేర్చువా
డొక్కడే పవ్వళించియుండ - నోపునటవే ?
పక్కలోన వెదకి కానక - ప్రాణేశుడెంత కలువరించెనో
మిక్కిలి విరహవేదనచేత-జక్కనిసామికి మేనెంతజిక్కెనో
॥ఇందు॥

2. నెలతరో!నా కెమ్మోవానక-నిముసమైన తాళలేడు
ఎలమి నా పొత్తునే కాని భుజి-యింపనొల్లడు
తెలియనైతి మా యిద్దరి వలపు - దృష్టితాకె నమ్మలార!
వలరాజునన్ను బాధించినట్లనా-లుపునినేడెంతవెతలబెట్టెనో
॥ఇందు॥

3. పడతిరో! మువ్వ గోపాలుడైన-కడప వేంకటేశునిగూడి
యెడబాయక యుందునని - యెంచుకొంటి
తడయకేనొకటి తలచితే - దైవమొకటి తలచినందుకు
తొడబడినే తెగువచేసెదనంటె - తొయ్యలి వాడేమి చేసు
[కొనునో ॥ఇందు॥

## 50. యదుకులకాంభోజి - ఆది

(స్వీయప్రౌఢ; విరహోత్కంఠిత)

పల్లవి:

ఇక నేలనే వాని గొడవ ?

అనుపల్లవి:

అకట ! ముద్దుగోపాలు-డను కూలుడటవే ? ॥ఇక॥

1. వినవే మతిలేక యీరీతివాని-మనసు తెలియక మోసపోతి
కనుగొంటివాని జాతినే జెల్ల
మును పే యిటువంటివా - డని తెలియనైతి ॥ఇక॥

2. పొమ్మనవే యిందుకే మాయెవాని
నమ్మెదు రే పోపో యిది వట్టిమాయ
అమ్మ ! నామాట వెగటాయె నల - యెమ్మెలాడే వాని
కెంతో హితమాయె ॥ఇక॥

3. వలదేల రచ్చ బెట్టెదవే? యీరాయ - బారమెందాక
నడపెదవే
తొలిపొందె చాలు చాలు పదవే యీ
చెలి-చేతిలో దారపోసితి గదవే ॥ఇక॥

## 51. భైరవి - ఆది

(స్వీయ - మధ్యమాన)

**పల్లవి :**

ఇక్కడ లేదే మనసు – ఇంతిరో! వానికి

**అనుపల్లవి :**

దిక్కుమాలిన మోహము–తెలియనీదయ్యో! నయ్యయ్యో

॥ఇక్కడ॥

1. వచ్చినప్పుడు ప్రేమచే – వాని నెమ్మోని నిండ
పచ్చికస్తురి యలదితే – పాటి దంటేను
మచ్చికంటి కొంతసేపు – మాటాడక యూరకుండి
హెచ్చుతావి బూసిన వా – రెవ్వార నెను ॥ఇక్క॥

2. కోమలి! యా మాటవిని–కోపమడపలేక వాని
మోము జూచి పంటకొద్ది – మోవి నొక్కితే
తామరసాక్షిరో! నన్ను – దాని పేర బల్కరించి
వేమరునొచ్చిని మొక్కె – వినువు మనెను ॥ఇక్కడ॥

3. దానిపై వాని బాలి – తప్పింప వలెనని
పూని మువ్వగోపాలుని – పొందుచుండగా
మానుమని యనక మంచి – మాటైన నాడక
మానినీ! యుస్సుర నెను – మరి నే జాలించితి ॥ఇక్కడ॥

## 52. కన్నడ - త్రిపుట*

(స్వీయ-ప్రౌఢ ; ఉత్తమ-తనయెడల ప్రేమ లేకపోయినను పతిని చేరి ఉపచారములతో ఆదరించే ఇల్లాలు)

పల్లవి :

ఇటువంటి నా వలపు ఏమి కాబోయ్యా నమ్మా॥

అనుపల్లవి :

చిటుకుమన్న కోపము - సేయు మువ్వగోపాలునిపై ॥నిటు॥

1. వచ్చినప్పుడు నేనే - వద్దికి పోయే దే కాని
ఇచ్చటికి రా రమ్మనే - దెన్నడైనను లేదుగా
నిచ్చనిచ్చలు లాలించి నే నలుముకొనే దే కాని
గ్రుచ్చివాడు కౌగలించు - కొనే దెన్నడు లేదుగా ॥ఇటు॥

2. ముందుగాను నేనే వచ్చి - ముద్దిడుకొనే దే కాని
ఇందమని కెమ్మో విచ్చిన - దెన్నడైనను లేదుగా
అందంపు మోమున కోప - మమరియుండే దే కాని
మందయాన ! న వ్వనేది-మనసుననైనను లేదుగా ॥ఇటు॥

3. బలవంతమున నేనే - పలుకరించే దే కాని
ఎలమి నాతో మాటాడే-దెన్నడును లేదుగా
అలసియుండిన నేనే - కలిసికూడే దే కాని
చెలియ ! మువ్వగోపాలుడు - చేరికూడినది లేదుగా ॥ఇటు॥

---

* నీలాంబరి - జంపగాని చాపుగాని.

## 53. కాంభోజి - జంప

(స్వీయ - మధ్య ; విరహోత్కంఠిత)

పల్లవి :

ఇటువంటి మోహసాగరమున ఓ కొమ్మ!-
ఏలాగు గడతు నమ్మ !

అనుపల్లవి :

బటువైన యీ వయసు-బాధించు నని యిపుడె
కటకట! విభు నూరి - కరుగ నద్దనె తి ॥ఇటు॥

1. నిచ్చనిచ్చ లేమేమొ - నిరతము దిగులొంది-నిదుర
కంటికి రాదె !

వచ్చెవచ్చెనన్నట్లు - వాని రూపమె మదిలో - వారకమ్మె
యుండునే -

వాడు నన్ను కౌగిట నుంచె నన్న-కలువరము హెచ్చునే
మచ్చరించి విభుడేమొ - మత్తుజల్లెనేగాన-మనసు
నిలుపరాదే ఓ చెలియ ! ॥ఇటు॥

2. పతి రమ్మని పిలిచి చాలా లాలించిన-హితవు మదిని బాయదే
అతని యెడబాసినది మొదలుకొని యేమొ-ఆహారమే
[సైచలేదే

సతతము యిటువంటి జాలినొందితిగాని - సంతోషమింత
[లేదే

అతను పుష్పాంగితే-అదనైనపగ జాతి- వెతచేత నే [ప్రియుని
వేగ రమ్మనన్నైనతి ॥ఇటు॥

3. అదిమేలా నని పిలిచి రేయిపగల్లు-సుదతిరో !
విననమ్మ! - సొంపుతోనే నన్ను
ముద మలరగను మా-మువ్వగోపాలుని - కదసి
కూడిన ట్లుండునే-మదిరాక్షి వాడెంతో
వాదిగిచేసిన వినయమూట మరపురాదే !
పదిగిట ననవిల్తు కలమున కేలాడు - అదరీన యేమందునే!
ఓలలనా ! ॥ఇటు॥

54. యదుకులకాంభోజి - త్రిపుట

(స్వీయ - మధ్య ; ఖండిత)

పల్లవి :
ఇటువంటివాడని నే దెలియనైతిని-ఇంతిరో ! బాగాయెనే॥

అనుపల్లవి :
విటరాయు డంతలో - వెలది యింటికి బోయి
చిటుకున వచ్చెనే-చెలియ ! మువ్వగోపాలుడు ॥ఇటు॥

1. ముదిత! మీ చక్కని - మోహనాంగుని పైని
వెదచల్లియున్నది-వింతవాసన లెంతో
కదసియా పడతిని - కౌగిట జేర్చె నేమో ?
ఉదుటు గుబ్బలపోటు-ఒరసి రొమ్మున మెరసె ॥ఇటు॥

2. తెలిసె యీ సొగసు – తేలించి యీ లలన
కులుకుచు ముద్దాడి–కొనగోట మీటె నేమో ?
నెలవంక లుంచిన–నిద్దంపు గళముతో
పలుచని మోవాని–పలు కెంపు వరుసలే ! ॥ఇటు॥

3. మరుకేళి నెనసిన – మంచె మేలము చేత
తరళాక్షి! ముత్యాల–సరులు తా ధరియించి
విపులహారమని–విడువక యిచ్చుట
మరపున వచ్చెనే – మగువ! మువ్వగోపాలుడు ॥ఇటు॥

---

## 55. సపరోజు - త్రిపుట

(స్వీయ-ప్రౌఢ, ధీరాధీర, జ్యేష్ఠకనిష్ఠ)

పల్లవి :

ఇటువంటివా డనుచు–ఇప్పుడు తెలిసెనుర!

అనుపల్లవి :

విటరాయ! మువ్వపురి – విభుడైన గోపాల ! ॥ఇటు॥

1. చెలిమిచేసే దందు – చలము చేసేదిందు
వలపు లుంచే దందు – వచ్చియుండే దిందు
నెలకొన్న మరు లందు – నిట్టూర్పులే యిందు
వెలలేనిపా టందు – వింత కయ్యము లిందు ॥ఇటు॥

2. వగలు గులికే దందు – వట్టి సుద్దు లిందు
మగువతో లీయ మందు – మత్సరము లిందు
సొగసునవ్వు లందు – సోలించే దిందు
తగుసొమ్ము లిచ్చే దందు–తగువులు చేసే దిందు ॥ఇటు॥

3. వడిగొన్న మోహ మందు – వల్లభు డని పేరిందు
విడెమొసగి మెచ్చే దందు – విడనాడే దిందు
పడుకటింటి హాయలందు – పాన్పుశృంగార మిందు
నడవడిక కూడే దందు – నన్నేలి దూరే దిందు ॥ఇటు॥

---

## 56. సౌరాష్ట్రము - ఆది

(స్వీయ - ప్రౌఢ, ప్రేమగర్విత)

పల్లవి :

ఇద్దరివలె నే కూడి – ఎవ రున్నారు? తెల్పరా !

అనుపల్లవి :

ఒద్దికతో మనవలె–నున్నారా? మువ్వగోపాలా ! ॥ఇద్దరి॥

1. మున్ను నలరాజు నీవే – ముదిత దమయంతి నేనే
చెన్నుగ శ్రీకృష్ణుడు నీవే – శ్రీరుక్మిణీ దేవి నేనే ॥ఇద్దరి॥

2. అలరఘు రాముడు నీవే – అయిన సీతాదేవి నేనే
ఇలను రంగేశుడు నీవే–యేలిన రంగనాయకి నేనే ॥ఇద్దరి॥

3. సత్యహరిశ్చంద్రుడు నీవే – స్వామి! చంద్రమతి నేనే
నిత్యము మదనుడు నీవే – నీకు రతీ దేవి నేనే ॥ఇద్దరి॥

---

57. కల్యాణి - చాపు

(స్వీయ - మధ్య, ధీర, జ్యేష్ఠ కనిష్ఠ)

పల్లవి :

ఇద్దరి సందున పవ్వళించి యున్న–ఇంతి పే రేమిరా!

అనుపల్లవి :

గద్దరి వగల మా మువ్వగోపాల!–గాజుల చప్పుడు
నే వింటిగదరా! ॥ఇద్ద॥

1. అప్ప టప్పటికి సీదు కెమ్మోవి – యానిన యలవాటుచేత
కప్పురగంధి మోవి నా పంట – గలయనొక్కితిరా!
అప్పళించి దాని మోవి తేనె – యనుభవించితివేమో? కాని
చప్పరించబోతే నమిలిన చెరుకు–పిప్పివలెనే చప్పనై యుండె
గదరా! ॥ఇద్ద॥

2. కదసి నీవంటు దాని – మేను గ్రక్కున కౌగిట నదిమిపట్టిన
ఉదుటుగుబ్బలు నా గుబ్బలపై – ఒరసి క్రిక్కిరిసె
ఇదియేమో వింతమైయున్న దనుచు–ఇందుకు నామదిచోద్య
[మంది
పదరితే నీమనసు నొచ్చెనని – ప్రాణేశ ఆవలి మోమైతి
గదరా! ॥ఇద్ద॥

3. మునుపు నను నీ వనుభవించి యా–ముద్దులగుమ్మను గూడితి
[వేమో
అనుదినమును ఈ రీతిగా – అది యీడకు వచ్చునా ?
మనసుపోహణ గంటి నేను–మదనజనకు డైన సామి!
నినునమ్మరాదుర మువ్వగోపాల–నీ వగ లెల్లను దెలిసెను
గదరా ! ॥ఇద్ద॥

---

58. తోడి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ధీర, జ్యేష్ఠ - కనిష్ఠ)

పల్లవి :

ఇన్నాళ్లవలె గాదమ్మా ! మువ్వగోపాలు – డెన్ని నేర్చెనా
॥డెవమ్మా॥

అనుపల్లవి :

నన్ను కన్నులు మూసి – నా చెంత నుండిన
సన్నుతాంగి మోవి – చాలచప్పరించెనె ॥ఇన్నా॥

1. చలువ చప్పరములో – సఖతో నే నుండగ
బలిమి నాదు కొంగు – పట్టుక చాటున
పలుమారు తొడలపై – గిలిగింత లిడగానె
తెలిసినే నడిగితే – కిలకిల నవ్వెనే ॥ఇన్నా॥

2. మిసమిస లాడునా – నొసలిపై తిలకము
పొసగ దిద్దుచును – పొందుగ నలదాని
కుసుమాస్త్ర గృహముపై – కొసరిచే వేయగానె
కసరినే నడిగితే – గారవ మాడెనె ||ఇన్నా||

3. సదరక మువ్వ – గోపాలుడు నన్ను గూడి
మదిరాక్షినే! దాని – మమత తెచ్చుకొనెనె
కొదమ గుబ్బలపైని – కొనగోట తొలగింప
కదిసి నే నడిగితే–తొడిసి నన్ను గూడెనే ||ఇన్నా||

---

## 59. కాఫి - త్రిపుట

(స్వీయ-మధ్య, ధీరాధీర, అన్యసంభోగదుఃఖిత. ఆ అన్యకాంత తనకు ఆప్తగానుండిన చెలికత్తెయే యగుటచేత నెక్కువగా దుఃఖించును.)

పల్లవి :

ఇన్నాళ్లు తెలియకనైతి ఈ చెలిమి–ఎంతటి నెరజాణవే||

అనుపల్లవి :

నన్నేకాదు మువ్వగోపాలుడే నిన్ను
వలచెనో ? నీవే పిలిచితివో ? లేక ||ఇన్నా||

1. పొరుగిరుగున నొక్క – సరసుడు ఉండే
చిరుతప్రాయము నీవు – ఊరకుందువటే ?
మరులు హెచ్చి వాడే – మమతతో వేడెనో?
పరవశమై నీవే – బతిమాలినావో ? ||ఇన్నా||

2. అదిమి వాతెర యిచ్చి - ఆము కొనెనో ?
ముదముతో చెక్కిలి నొక్కి - ముద్దిడుకొనెనో ?
కదిసి నీవే వాని - కౌగిట జేర్చితివో ?
. . . . . . . . ॥ఇన్నా॥

3. మరుకేళిలో తానే పైకొనెనో ? లేక
మామువ్వగోపాలుని నీవే పైకొంటివో ?
అరమర లేలనే ? పలుకవే ! చల్లగ
సరసముగ నన్నేల నట్టేయుంటను ॥ఇన్నా॥

---

## 60. మోహన - ఆది

(స్వీయ - ముగ్ధ, స్వాధీన పతిక)

**పల్లవి :**

ఇన్నాళ్లు మల్లాడిన - దిందు కోసమా ?

**అనుపల్లవి :**

మన్నించి నాపై దయ - మరువ వద్దమ్మలార ! ॥ఇన్నా॥

1. మనసు గట్టిచేసుక - మగువలార ! వాని మీద
కనుగొన వద్దనగానే - కనగోరుట
తనువు కాసించి కాదు - తగిన చవిలేదాయె
నని మీరు వెతజెంది - యసు రుసు రనే రని ॥ఇన్నా॥

2. వానిమాయల బెల్లి – నగల మాటల మీరు
పీనుల వినవద్దనగానే – విన గోరుట
మానవతులార! నాదు – మనసు తెలిసిన సఖిని
కానన్మైతి మని మిగుల – కన్నీరు నించేరని ॥ఇన్నా॥

3. పలుమారు మా మువ్వగో – పాలరాయని మీరు
కలయనద్దన గానే – కలయ గోరుట
కల్లనైన నా మాట – గనుప నద్దని మీరు
తలచి జాలిచే చాల – తల్లడమందే రని ॥ఇన్నా॥

---

## 61. ఘంటారవము - ఆది

(స్వీయ - ప్రౌఢ, కలహాంతరిత)

పల్లవి :

ఈ మాట వలన ఫల–మిక నేమి కద్దు?

అనుపల్లవి :

భామరో! చాలు మువ్వగో – పాలు పొందే మనసు వద్దు
॥ఈ మాట॥

1. వామాక్షిరో! వా డీడకు–వచ్చే మనసు లేదు
రామ! వాడు రా దలచితే – రానిచ్చేది కాదు
ఏమో నాటి కా యూ! ఫల–మింక పని లేదు
నా మేలు వానిపై నింక–నాటియుండగ బోదు ॥ఈ మాట॥

౩. వనజాక్షిరో! వానికొఱకై - దినదిన మీ పోరు
కని విని మీ రెండఱైన - గా దనగ లేరు
చెనకి వానితో నను మోడి - చేసుకొన్న నేరు
చనువు లేని చోట నింత-చలమేల్లు ఈడేరు? ॥ఈ మాట॥

౪. ఎంత లాలించి కూడిన - హితవుమాట సున్న
వింత మువ్వగోపాలుని-విధములు నే విన్న
అంతరంగము శోధించి - అలసితి నే నిన్న
రంతు సేయక చిత్తము-రాయి చేసుకున్న ॥ఈ మాట॥

---

## 62. ఘంటారవము - ఝంప

(స్వీయ - ప్రౌఢ, విప్రలబ్ధ)

పల్లవి :

ఈ మేను జీవునకు-ఎంత ప్రియ మాయెనే

అనుపల్లవి :

భామ ! మా మువ్వగో-పాలు కౌగిట లేని ॥ఈ మేను॥

౧. పడతి! నే నొకచోట-ప్రాణేశు డొకచోట
ఎడబాసి మరునిచే - ఇడుములకు లోనై
కడలేని విరహాగ్ని - క్రాగియున్నది చాల
పుడమిలో వేఱె జ - న్మము లేదె సుదతి ॥ఈ మేను॥

2. మోము జూడ మనసై - మోవియాన నో రూరి
యామముకొన్న ప్రేమచే - నసు రుసు రనుచు
సోము కాకల జిక్కి - సొమ్మసిల్లి యీ వేళ
కామినిరో! ఎడతెగని - కన్నీట నిటులున్న ॥ఈ మేను॥

3. కంతుకేళి మువ్వగోపాలు - కలసియున్నది తలచి
వింత తోచి నామనసు - వేవిధము లాయెగా
ఇంతిరో! విభుసేమ - మీ వరకు విననైతి
ఎంతవ్రాత వ్రాసియున్నదో - ఇంతకు తాళియున్న
॥ఈ మేను॥

---

63. సావేరి - త్రిపుట

(స్వీయ-మధ్య, విప్రలబ్ధ - సఖీ-ఉపాలంభన)

పల్లవి :

ఈలాగటవే బుద్ధి? - ఇందు బింబాననా?

అనుపల్లవి :

నాలో నీలో భేద మేమే? - నాతో నానతీవె యీ
వేళ మువ్వగోపాలునీ - మేలువాని చేయనా? ॥ఈలా॥

1. విద్దెలు చదువక - పెంచిన చిలుకకు
సుద్దులు దెలుపక - సుదతిరో! నీవు
అద్దమరాతిరి - యసు రుసు రనుకొంటి
ముద్దుమోము వాడ - నిద్దుర లేకున్నావు ॥ఈలా॥

2. కోడె గుబ్బలపైని — కొంగు పచరింపక
తోడి వారిజాక్షుల — తో మాటలాడక
ఆడికలకు లోనై — యలమట నొందుచు
చేడె! ఏల చెక్కిట — చేయిచేర్చుకొన్నావు ॥ఈలా॥

3. కూడి మువ్వగోపాలు — గుణములు దెలియక
కోడిగెపు మాటలాడి — కోమలిరో! వానిబాసి
వాడలో నీసరి — వనితలు నవ్వగ
ఆడాడ భ్రమచెంది — యిట్లు తిరుగ విధియేమో? ॥ఈలా॥

## 64. బిలహరి - చాపు

(స్వీయ-మధ్య, కలహాంతరిత)

పల్లవి:

ఈలా గయ్యేది — యెరుగలేక వాని — కేల మరుపైతి నే

అనుపల్లవి:

వాలాయమైన నాతో లేని—నట్టివాడె ప్రొద్దాయెనే చెలియ!
॥ఈలా॥

1. నాటినుంచి యీవరకు వానికి నేను—నడచుకొన్నదే మొదలు
బోటిరో! వినవే భూతిలో హాసము—పాటాయెను జూడను
మాటిమాటికి ఎంతో మనవి చేసుకోబోతే—మదిలో మచ్చర
[మెచ్చెనే
నేటికి దెలిసెను నాపై గల ప్రేమ నీటిపై వ్రాలాయె నేమో?
చెలియా! ॥ఈలా॥

2. తానునే నను భేదములేక యున్నాళ్లు - తనసొమ్మయి నే
నుంటినే
దానిమీద గల దయ విశ్వాసము - తనకు నాయెడల
గలుగునా ?
వానకాలము నాటి గరికవలెనె యీ-వనిత లందరు గలిగిరే
కాని కాని పగవారిలో జేరేది - కాలమిట్లనే యుండునా ?
ఓ చెలియా ! ॥ఈలా॥

3. కలువ భానునిచేతి కరములకోర్వను - కల మువ్వగోపాలుని
తొలుతటివలెనే కూడి యుందామని - పిలువక నే పోతి నే
కలవి లేనివి కొన్ని నామీద కల్పించి - కడకంటను జూచె నే
చిలుక బూరుగమాను ఫలముల కాసించి - చింతించిన
[ట్లాయెనే ఓ చెలియ ॥ఈలా॥

---

## 65. ధన్యాసి - చాపు

(స్వీయ-మధ్య ; సౌందర్యగర్వితె ; తృప్తాతృప్త)

**పల్లవి :**

ఈ లో నున్న దతనిపై నామోహా - మింతంత యన రా
దమ్మ !

**అనుపల్లవి :**

భామరో ! మువ్వగోపాల రాయని - భావ మెట్లున్నదో
॥ఈలో॥

1. ఎన్నగలసొమ్ములు వదలింతునుగాని –
    యెదుటనె నిలువవచ్చుటకు వెరతునమ్మా!
తిన్నగా చెలువుని చూచితే – దృష్టితాకునో యని
కన్నరో! తమి సణచుకొందుగాని – కౌగిట బిగియింపుటకు
    వెరతునమ్మా!
ఉన్నత మైనట్టి సిబ్బెంపు గుబ్బలు–ఉరమున నొత్తునో యని
    ॥ఈలో॥

2. ఎలమితో నేమి సేయుమన్నాను గాని–ఎంతైనా కాదనుటకు
    వెరతునమ్మా!
జలజాక్షిరో! నావిభుని చిత్తమున–చంచల మొందునో యని
చెలియ లెటువలె నాడుకొన్నానుగాని – చిన్నబోయి
    యుండుటకు వెరతునమ్మా!
మలయజగంధిరో! నా ప్రాణేశ్వరుని – మనసెట్లు వచ్చునో
    యని ॥ఈలో॥

3. కోరికి కెమ్మోవి చవి చూతును గాని–
    గుబ్బలు కొస నొక్కుటకు వెరతునమ్మా!
సారెకుజొబ్బిల్లు తేనె లూరక – జాళుగ విందునో యని
కూరిమి నుపరతి సలుపుదుగాని – కూడ సమ్మతించుటకు
    వెరతునమ్మా!
గారవ మగు మువ్వగోపాలుని పదముల –
    కంటె మాల బెట్టునో యని ॥ఈలో॥

66. అసావేరి - ఆది

(స్వీయ - ప్రౌఢ, ధీరాధీర)

పల్లవి :

ఉన్నబోటి చెలులైతే - ఓర్చుకొందురా ?

అనుపల్లవి :

కన్నులార శాంతురాల - గానసే దాళితి గాని ॥ఉన్న॥

1. కలువరించి నీవల్ల-చెలిపేర బిలువగ నా
నెలతగాను భ్రమయుటకు - నే నంటిగా? యిందుకెల్ల ॥ఉన్న॥

2. అనుదినము కౌగి - లలమి నే సడలింపగ
మనసు నిలుపలేనని - వనిత తోడి తెమ్మన్నందుకు ॥ఉన్న॥

3. కోపము దీరి మా మువ్వ - గోపాల! నిను గూడితే
ఆపెవలె హితవరిగా - నంటి నీ మాటల కెల్ల ॥ఉన్న॥

---

67. ఆహిరి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

ఎంతట తెల్లవార దెంతట ప్రొద్దుగూక దే మందు నమ్మలార!

అనుపల్లవి :

కంతుజనకుడైన మువ్వగోపాలుడు -
కౌగిట లేనందుకు అమ్మ! నే జెల్ల! ॥ఎంత॥

1. పతియు నేను గూడిన - విత మెల్ల దలచుక
వెతల కొంతసేపు — వెన్నెల కాకను
సతులు సేయు శైత్యోప - చారముల కొంతసేపు
అత డిందు లేక లో - కాస్తమాన మైనట్లు ॥ఎంత॥

2. గతము కొంద రింతులు - పతులబాసి గూడిన
కతల కొంతసేపు కరి - గమనలు పుణ్యా
వతి ! నీ పతి రేపే — వచ్చు ననెడి
నుతుల కొంతసేపు - నోరు నిండినట్లు ॥ఎంత॥

3. కోరినట్లు మా మువ్వ - గోపాలు డిందు వచ్చి
ఊరడించి కొంతసేపు - ఒక నిమిష మొక యేడై
ఆ రమణితో నన్ను — నది తెలుప కొంతసేపు
మారు కేళిగూడి నా - మనసు తేర్చుకో లేక ॥ఎంత॥

## 68. మాపుప - చాపు

(స్వీయ - ముగ్ధ, కలహాంతరిత)

పల్లవి :

ఎంత మాట లాడెనమ్మా - ఇంతిరో ! నావిభుడు నన్ను

అనుపల్లవి :

చెంత జేరి మోవి తేనె - చప్పనని మోమటు త్రిప్పె నేమో
॥ఎంత॥

1. రమ్మని చే పట్టి నేను మా యింటికి – రా రమ్మంటి
నీ వెవరో ? నే నెవరో ? నేను – నీవాడుకాదు
పొమ్మనెను ॥ఎంత॥

2. కులుకు గుబ్బల రొమ్ము గుమ్మ – కౌగిలీయను నే బోతే
ఉలికి వేచి కసరుకొని వనిత ! నీతో – పొందుచాలు
పొమ్మనెను ॥ఎంత॥

3. చెలియ మా మువ్వగోపాలుని – చిత్తము రంజిల్ల జేసి
ఎలమి పైకొని ఉపరతి సేయగబోతే – ఈ పొందువద్దు
పొమ్మనెను ॥ఎంత॥



## 69. ముఖారి - అటతాళ చాపు

(స్వీయ - మధ్య ; సఖీశిక్షాలక్షణము)

పల్లవి :

ఎంతరాతి మనసు దానవే ! ఎలనాగ నీవు !

అనుపల్లవి :

కొంత సేపు అలిగి యుంటే – కూడుకొనే వారులేర ?
॥ఎంత॥

1. అలివేణిరో ! నీవు – అలిగియున్నది మొదలు
పలుమారు విధిని దూరేది – పనియేమో కాని

వలకాకను డస్సి – వాతెరలు తడుపుచు
పలువేదనతో పొరలీనా? – పసితి? యీపాపమయ్యయ్యో
||ఎంత||

2. కొసరి కొసరి వేడితే – కొమ్మ! వెలిగా పొయ్యాన?
ఇసుమంతైన దయలేక – ఇంతయిది దోసమయ్యయ్యో!
బిసరుహాక్షిరో! నీవు – కసరిన నాటనుంచి
పసలేని తప్పులెంచే వీ – పని యేమో కాని అయ్యయ్యో!
||ఎంత||

3. మున్ను నీ విభుని జేరి – ముద్దుముద్దుగా గూడిన
చిన్నెల మది దలచితలచి – చింతచేసేవు
మొన్ననాతో కోపపడ్యారు – మువ్వగోపాలుడు
కన్నుల నీరు తుడిచి, గారవించితేనే దోసమా?
అయ్యయ్యో ||ఎంత||

### 70. ముఖారి - ఆది

(స్వీయ - మధ్య, అధీర.)

**పల్లవి:**

ఎంత వింత రా? చక్కని సామి!

**అనుపల్లవి:**

కంతు జనక! నాదు – కన్నులాన కల్లగాదు ||ఎంత||

1. నానబాలు చక్కెర - పానకము జుంటి తేనె
లారగించి వచ్చితో - అదిచెప్పరా
పూని నీ చెక్కిలి నొక్కి - పుక్కిటి కొలదిగా నే
నానగా నానగా తియ్య - నైయున్నది నీ కెమ్మోవి
॥ఎంత॥

2. కలపము పన్నీరు - కదంబము నీ మేన
అలదు కొన్నావేమో - అందముతోను
తులుకు గుబ్బల నిన్ను - గ్రుచ్చి కౌగలించుకొన్న
చలువ వాసనలు వెద - చల్లేరా సామి! నీ మేన ॥ఎంత॥

3. ఎన్నిమందు లిడితివో! - ఏమి మంతరించితివో!
చిన్నదానగాగా మాయ - చేసితివో!
నిన్ను రతికూడ గూడ - నేడు నా తమి యగ్గలమై
తిన్నగా నెంతైన తనివి - తీరదు మువ్వగోపాల! ॥ఎంత॥

---

## 71. అసావేరి - త్రిపుట

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి:

ఎందుకు పగచేసెనో? కమలుజు - డికనైన లెస్స
వ్రాయడో?

అనుపల్లవి:

అందుకందుకు చెలు - లమరికతో నున్నారు
చందమామ ఈ రేయి - చల్లనుండడే దైవమా! ॥ఎందు॥

1. బలిమి నేమంటినో ? నాసామిని – తెలియక
పొమ్మంటినో ?
కలకంఠిరో ! వినవే – కలలోన వానిగంటి
చెలిమి చెలువుడేల – చేరదీయడు ? దైవమా ! ॥ఎందు॥

2. పగవారిలో జేరెనో ? నాసామి మనసు – బాళి లేన
ట్లాయెనో ?
చిగురుబోడిరో ! వినవే – చిన్ననాటి నాపైని
తగుల మెల్ల నేడు – దిగదీసెనో దైవమా ? ॥ఎందు॥

3. మ్రొక్కుమంటే మ్రొక్కనైతినా ? నే నిటుల –
మోము చిన్న జేసు కొంటినా ?
చక్కెర కెమ్మోవి యిచ్చి – చాల దయతో రాగ
పక్కకు మువ్వగో – పాలుడు రాడో దైవమా ! ॥ఎందు॥

## 72. కాంభోజి - చాపు

(స్వీయ - ప్రౌఢ, ధీర, అధమ ; నాయకునితో కలహించి, అతడు హితముచేసినను, అహితముచేసి కోపించి, సరసములకు లోబడినది.)

పల్లవి :

ఎందుకు ? ఈ మాటలేల ?

అనుపల్లవి :

ముందు నిన్నెరుగునా ? – మువ్వగోపాలా ! ॥ఎందుకు॥

1. నిలుపు నాపై దయ - నీక ఆ
చెలియతో నలిగి వ - చ్చితివో లేక
తలపు తెలిసె నిం - దాక న
న్నలయించు దైవము - ననవలెగాక ‖ఎందుకు‖

2. మనసు రానిపొందు - మాను మా
కనకాంగివలె చ - క్కనిదాన గాను
నిను మెప్పించనేర్తునే - నేను? ఓ
వనజాక్ష! సరసము - వద్దు నాతోను ‖ఎందుకు‖

3. రంతుసేయక మున్ను - రావా? నే
నెంతో కోపించిన - నెదురాడి నావా?
ఎంతలేదని యుండ - నీవా అది
కొంతకాలము మువ్వ - గోపాలదేవా! ‖ఎందుకు‖

---

### 73. బేగడ* - ఏక

(స్వీయ - ప్రౌఢ; తాను ముందుగా మగనికి కోపము తెప్పించి పిమ్మట సముదాయించి యతని కోపము పోగొట్టగల జాణ.)

పల్లవి :

ఎందుకు వచ్చెనో కోప - మెవ రే మన్నారు?

అనుపల్లవి :

అందు కిందుకు సరి - యాయెరా! మువ్వగోపాలా!
‖ఎందు‖

---

* శహాన.

1. ఎన్నడైన నవ్వుకోమో ? – యెదురు మాటాడుకోమో ?
మొన్నరాతి రలిగి – ముచ్చట లాడుకోమో ?
చిన్న ముద్దు వచ్చెనని – చెక్కిలి నొక్కినందుకు
నన్ను నీ వొక టంటె – నిన్ను నే నొకటంటి ॥ఎందు॥

2. ప్రేమ రెట్టించుకోమో ? – బిగి కౌగిళ్ళ నుండమో ?
ఏమైన ననుకోమో ? – ఎచ్చుకొద్దు లాడుకోమో ?
ఆ మాట కా మ్మాట – కప్పుడే నే జాణ నంటి
నా మాట నీవు కాదంటే – నీ మాట నేను కాదంటి ॥ఎందు॥

3. అతనుని కేళి గూడి – యందమాయె ననుకోమో ?
మితము లేనట్టి తమి – మే లనుకోమో ?
హితవై మువ్వగోపాలా ! – ఇంచుక నే నలిగితే
అతిక మలిగితి – వప్పుడే కూడి యిప్పుడు ॥ఎందు॥

## 74. సావేరి - చాపు

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

ఎక్కడ తాళుదునే – యేమని దూరుదునే

అనుపల్లవి :

మ్రొక్కిన రాదు కౌగిలీదు – మువ్వగోపాలు డో
చెలియా ! ॥ఎక్కడ॥

1. దయ గోరంతైన లేదాయె; వట్టి - తచ్చనలే ఘనమాయె
ప్రియముతో నను జూడడాయె — ప్రేమతో చే పట్ట
డాయె నో చెలియా! ॥ఎక్కడ॥

2. బతిమాలిన రాడాయె; నన్ను - పగవాడై యల కంతుడేయ
హితవని నన్నేలడాయె — ఎంతటి మాయయో చెలియా!
॥ఎక్కడ॥

3. కూడి యున్నదే వెగటాయె; నేను - పీడె మిచ్చిన
నొల్లడాయె
మోడి చేసి మువ్వగోపాలుడు నా - మోహ మెన్నడాయె
నో చెలియా! ॥ఎక్కడ॥

---

75. సారంగ* - త్రిపుట

(స్వీయ † - మధ్య; అన్య సంభోగదుఃఖిత; నాయకుడు - అను
కూలుడు; ఈర్ష్యామాన విప్రలంభ శృంగారము.)

పల్లవి:

ఎక్కడి నేస్తము - లెక్కడి నెనరు — లెవ్వరి కెవ్వరే!
ఓ చెలియా!

అనుపల్లవి:

మొక్కిన వినక మా మువ్వగోపాలు నా —
ముదిత యింటికి త్రోసిరే ఓ చెలియా! ॥ఎక్కడి॥

* కళ్యాణి - చాపు. † "పరకీయ - విప్రలబ్ధ" అని రసమంజరి.

1. ఇదిగో నెన్నడు నిరుగు పొరుగు లెరుగని వాని —
కన్నెనోళ్ళ బోధించిరే!
అది చక్రసాని జాణ యని వాని దా నిల్లు
కదలకుండగ జేసిరే ఓ చెలియా! ॥ఎక్కడి॥

2. బలిమిని నాచేత నింతలో నింతైన — పంచుక పోజేతురే
చెలులు గాదా రెండు దలచరని యుంటి — చెలువుని
ఎడజేసిరే ఓ చెలియా! ॥ఎక్కడి॥

3. తొలుక ప్రాయమునాడె మువ్వగోపాలుని — కలయుట
తెలియరటె
లలనరో! వానిచే లంచాని కాసించి — చలపట్టి పగచేసిరే
ఓ చెలియా! ॥ఎక్కడి॥

## 76. తోడి - ఆది

(స్వీయ - ముగ్ధ - విరహోత్కంఠిత)

పల్లవి:

ఎచ్చోట నున్నాడో? చెలియా! వా - డేమనుచున్నాడో?

అనుపల్లవి:

విచ్చలవిడిగాను - వెరపింతైన లేక
ముచ్చటలాడుచు - మువ్వగోపాలుడు ॥ఎచ్చోట॥

1. వారిజాక్షి ! యనుచు తన – వద్దికి రమ్మని
తీరుగ నుదట – తిలకము దిద్దుచు
జారు కొప్పున సన్న – జాజులు ముడుచుచు
గారవమున పక్క – చేరి ముద్దు పెట్టుచు ॥ఎచ్చోట॥

2. చాల నను దూరుచు తన – సాటి లే దనుచు
పాలు గారు చెక్కిలి – బాగుగా జీరుచు
వాలాయముగాను – వా తెర యానుచు
ఏల పదము పాడుచు – నెలమి సొక్కించుచు ॥ఎచ్చోట॥

3. బాలరో ! మువ్వగో – పాలుడైన వరదుడు
కోలాహాలముగ – కొసరి కొసరి వేడుచు
నీలవేణిని రతి – లీలశయ్యా నను
కూలముగ రతి కేళి – గూడి లాలింపుచు ॥ఎచ్చోట॥

---

## 77. కాంభోజి - త్రిపుట

(స్వీయ - ప్రోషిత భర్తృక ; నాయకుడు - ప్రోషితపతి, ప్రవాస విప్రలంభ శృంగారము.)

పల్లవి :

ఎన్నటికో నా కొమ్మను జూచేది ? – ఎన్నటికో నా
మనసు చల్లనయ్యేది ?

అనుపల్లవి :

వన్నెలాడి బన్నసరులు నా యురముపై
నూగాడగా నుపరతి గలసేది ॥ఎన్నటి॥

1. మేటి చందుర కావి పావడపై పసిడి
పట్టు చేలము చాల – పసమీర గట్టి
కోటి వేలకు గొన్న – తాటంకముల నొప్పు
కోమలి చెక్కిళ్ళు – కొసరి ముద్దాడేది ॥ఎన్నటి॥

2. మోము మోమున జేర్చి – మోవి తేనియ పీల్చి
వేమారు నా మనసు – నొకటిగా జేర్చి
కామశాస్త్రము చదివి – కథలు చెప్పుచు నేను
కామినిని నెమ్మదిని – కలిసి కౌగిట జేర్చేది ॥ఎన్నటి॥

3. జోడు గూడి – తోడి రాగము పాడుచు
మేడపై నుండి – మేలునే లనుచు
వేడుకలతో దాని – విడువక యెప్పుడు
తోడ బంగారు – తూగు టుయ్యాల లూగేది ॥ఎన్నటి॥

4. చెలియరో ! మా మువ్వగోపాలరాయడు
ఎలమి నేల రాడని – పలుకరించిన
చెలియ లందరు గూడి – నలినాక్షి వెతజూచి
నేడు రేపని రాక కెదురు చూచేది ॥ఎన్నటి॥

## 78. ముఖారి - అది

(స్వీయ - ప్రౌఢ, అభిసారిక)

పల్లవి :

ఎన్నిటికని నే మెత్తు ? – నెంతని వినుతింతు ?

అనుపల్లవి :

కన్నె ! నీవు చేయు నుప – కారములు పదివేలు ॥ఎన్ని॥

1. విరహ సాగరములో – దరిదాపు లేనపుడు నీ
యురమను తెప్పపై నుంచి – వెరపు తీర్చినందుకా ?
మరుని వాడి తూపుల – మనసు వేగునప్పుడు
సరగున వచ్చి మది – చల్ల జేసినందుకా ? ॥ఎన్ని॥

2. మగువ ! నిన్నెడబాసి – పగలు రేయు జీకాకై
వగల బొరలునప్పుడు నా – దిగులు దీర్చినందుకా ?
నెగడు కార్చిచ్చు వంటి వె – న్నెలచేత వేగునప్పుడు
జిగిమోవి పానక మిచ్చి – సేదదీర్చినందుకా ? ॥ఎన్ని॥

3. మొలక నవ్వు మోముతో – మువ్వగోపాల ! రమ్మని
కలసి చెమట లూర – కౌగిలించినందుకా ?
అలిగి నే నూరకుండిన – యంతలోనే తెలుసుకొని
నలినాక్షి ! కోపము వద్దు – నమ్మితి నన్నందుకా ?
॥ఎన్ని॥

## 79. పంతువరాళి - చాపు

(స్వీయా - ప్రౌఢ, దివ్య, నాయకుడు అన్యకాంతాసక్తుడైనను సఖు లకు అతని సుగుణములను పలుకుచున్నది.)

పల్లవి :

ఎవతె కూడిన నేమి చాలు - నిది నాతో ననకు రే!

అనుపల్లవి :

కువలయాక్షిరో! ఎప్పటి మా మువ్వ
గోపాలరాయుడు వీడెకదా? ॥ఎవతె॥

1. మంచితన మైననాడె - మక్కువతో నే చెక్కు నొక్కి
కొంచక మోహావేశమునను - గోర నే జీరి
అంచులచేత నప్పళించి - యాని యాని తనివితీర
చంచలాక్షిరో! నే చాల - చప్పరించిన వాని మోవె
కదా? ॥ఎవతె॥

2. ప్రేమతో తన రెండుచేతుల - బిగియించి తమికొద్ది
వేమరు గబ్బి గుబ్బల గుమ్మ - వేడుకమీర
మోము వాని చక్కని మో - మున జేర్చి చేర్చి
లేమరో! నే గాగి - లించిన వాని రొమ్మె కదా?
॥ఎవతె॥

3. హితనైయున్న మువ్వగోపాలు — డిందు వచ్చే
దినములెల్ల
సతమని నే నుపరతుల — సమరతుల
సతిని నలయించి తా — నలసి మరియు వింత వింత
విశేషముల నే ననుభ — వించిన మేనే కదా ? ॥ఎవతె॥

---

## 80. భైరవి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, కలహాంతరిత)

**పల్లవి :**

ఎవ్వరి బంపుదు – నేమి సేయుదు నీవే — యిది బుద్ధి
యనవమ్మా !

**అనుపల్లవి :**

మువ్వగోపాలుడు మోడి చేసుకొన్నాడు –
మొన్నటాళనుండి రాడు నీ తోడు నే ॥నెవ్వరి॥

1. అతివ చులక నని — యందు పోరా దని
యతని బిలువ నని — యంటే నా మదిలోని
వెతలెట్లు తీరు నెన్నాళ్ళున్న – మితిలేని పోరు
నీకంటె నాకు
హితవరు లెవ్వరున్నారు ! పలుమారు ॥ఎవ్వరి॥

2. మనసు కరగ మంచి – మాటలాడి నా మీద
నెవరు పుట్టించేది – నీ భారము గాక యే
వనితకేలా దైవము నన్ను – వినవే నీ పాల ద్రోసినది
అనుమాన మిక నేలా? యీవేళ ॥నెవ్వరి॥

3. అక్కరో! మువ్వగోపాలు – డతను కేళి గూడగ
ఎక్కడ మనసని – చెక్కిలి నొక్కితే
మక్కువ లేనివాని వలె–మ్రొక్కెనె కాని విడనాడి యీ
దిక్కుకు రాక మాని నినుగాని ॥ఎవ్వరి॥

## 81. ముఖారి - ఝంప

(స్వీయ - ప్రౌఢ, విప్రలబ్ధ)

పల్లవి :

ఎవ్వరి ననగ పని యే మున్న దమ్మలారా!

అనుపల్లవి :

నొవ్వనాడ నేలే మువ్వగోపాలుని – నోము ఫల
మిట్లుండగ ॥ఎవ్వరి॥

1. మంచివారి వలెనే యుండి యీ – మగువ లందరు వానిచే
లాంచలమున కాసించి వానికి బో –ధించి నా యిల్లు
పగ గా
వించుచు నది ద్రోహమని – యెంచక తిరిగేది ప్ర
పంచమనవలె గాక ॥ఎవ్వరి॥

2. ఎవ్వారెంత చెప్పినా యింతైన వినక
నవ్వుల కొక నాడైన నాతో - నలుగని విభుడు
రవ్వజేసి యిందు రాడు - రాతిరెల్ల నందుండి
పువ్వుబోణి చేయు - పుణ్యా మనవలెగాక ॥ఎవ్వరి॥

3. తొలుతటివలె నన్ను - తలచి మువ్వగోపాలు
డెలమితోడను రతుల - కలసి యుండగను
చెలియ లోర్వలేక - చేసైగ దానింటికి
పిలువ బోయిన - ప్రియుని ననవలె గాక ॥ఎవ్వరి॥

## 82. సౌరాష్ట్రము - చాపు

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత; దూతి యామె విరహమును దెలుపును.)

పల్లవి :

ఏ తీరున రమణిని గెలిచి నీ - వెట్లు రాపోదువో

అనుపల్లవి :

చూతాము రారా! మదన నీ - చేతి బలిమి మా
చెలియ బలిమి ॥ఏ తీరున॥

1. రాతిరనే యేనుగనెక్కి – రాకాచంద్రుడు గొడుగుగాను
లేత తెమ్మెర మొదలైన బలముల – చేతగెలిచెద
సంటివా ?
పోతుటేనుగు కుంభములే – పాలతిగుబ్బలు; మోము
చంద్రుడు
నాతిప్రాణములె చలువ తెమ్మెర – జాతివారిలో పగలు
గలవా ? ॥ఏ తీరున॥

2. జంటవిరి దమ్మిమొద – సంటగుమ్మొద సంటివా ?
దంటవే చెలి కేలుదమ్మి – తమ్మియొక్కటె సుమ్మా !
తుంట విల్లొక్కటి నీది – తొనియని విండ్లు చెలిచు
కన్బొమలు
ఇంట గెలిచి రచ్చగెలువ వలెనను – ఎన్నిక లేక పూనితివి
॥ఏ తీరున॥

3. అంచలు మా చెలిని జూచి – యడుగు బెట్ట వెంచిచూడ
పంచవన్నెల చిలుక – పలుకులే చాన పలుకులు
పంచ బాణములు నీదు – పడతిచూపులే తూపు లనగ
ఎంచ శక్యము గా దా మీాద – నేలుకొన్నాడు మువ్వ
గోపాలుడు ॥ఏ తీరున॥

## 83. కేదారగౌళ - త్రిపుట *

(స్వీయ - జ్ఞాత యౌవనయగు ముగ్ధ; తృప్తాతృప్త, నాయకుడు - శఠుడు, సంభోగ శృంగారము, కరుణ.)

పల్లవి :

ఏమందునమ్మా యీవింత నే - నెచటగాననమ్మా!

అనుపల్లవి :

భామరో మా మువ్వగోపాలు డేలిన భావ మేమని
తెలుపుదు - నేనో చెలియరో ॥ఏమందు॥

1. ప్రేమతో సొక్కి నా చెక్కిలి - వేమారు నొక్కి
కామించి నను బిగయు - కౌగలించెనె కాని
మోము మోమున జేర్చి - ముద్దుపెట్టడాయెనే ॥ఏమందు॥

2. వలపు మితిమీరి నా - వద్దకి వచ్చి నోరూరి
పలుచని కెమ్మోవి - సొలసి క్రోలెనె కాని
కులుకు గుబ్బలపైని - గోరు లుంచడాయెనే ॥ఏమందు॥

3. పరిపరిగతుల ననుచాల - పైకొని రతుల
పరికించి మువ్వగో - పాలు డేలెనె కాని
చిరుతొడలపై తన - చే సోక నివ్వడాయెనే ॥ఏమందు॥

* చాపు

### 84. అసావేరి - త్రిపుట

(స్వీయ - మధ్య, అన్యసంభోగ దుఃఖిత, నాయకుడు - శఠుడు, వియోగ విప్రలంభ శృంగారము, కరుణ.)

పల్లవి :

ఏ మందు పెట్టిరో చెలులు - ఏ మందునమ్మా !

అనుపల్లవి :

సీమగాని సీమకు ఆ - సీమంతినుల్లెల్లరు గూడి
భామరో ! నన్నెడబాసి - పయినము జేసిరో యమ్మా
॥ఏమందు॥

1. ఇల్లువిడిచి యిరుగుపొరుగు - ఎరుగనని బాసచేసి రే
కల్లలాడి అలదాని - యిల్లు చేరెనే ఓ యమ్మలార !
తెల్లని వెల్లా పాలు - నల్లనివి నీళ్లనచు
ఉల్లమున నమ్మినే - నుంటినే ఓ యమ్మలార ! ॥ఏమందు॥

2. మాపు రేపు నేజేసిన - మంచి రతుల భావమెల్ల అల
పాపి సవతితో చెప్పి - అనుభవించెనో
ఈ పట్లలో మగవాని - నెన్నటికి నమ్మరాదు
ఏ పుట్టలో ఏమున్నదో-ఎరుగనైతి నమ్మలార ॥ఏమందు॥

3. బాలమువ్వగోపాలుడు - పన్నెండేండ్లు ననుగూడి
పాలించి నన్నీ వేళ - బాసిపోయెనే ఓ యమ్మలార !
పాలలో పాపిడికాయ - పడవేసిన దైవమునకు
పూలపూజ సేయనైతి - పూర్వము నే నమ్మలారా !
॥ఏమందు॥

## 85. ఆనందభైరవి - త్రిపుట

(స్వీయ - మధ్య ; ప్రోషితపతిక)

పల్లవి :

ఏమని తెలుపుదు – నేలాగు తాళుదు –
నేమి చేతునే ? చెలియా !

అనుపల్లవి :

భామరో ! యూరికి – బయలు దేరెడు వేళ
ప్రేమ మీర నాసామి – పిలిచి చెప్పినమాట ॥ఏమని॥

1. అన్నమిందక – అతి వెత నొందకు
కన్నీరు నింపకు – కలవరింపకు మని
ఎన్నెన్నో విధముల – హితవులు తెలుపుచు
కన్నీరు నించుచు – కాంతుడు చెప్పినమాట ॥ఏమని॥

2. నిడివికన్నుల నీరు – నించుచు తలయూచి
తడలేక వేగ – తానే వచ్చెద నని
అడు గడుగున కుసు – రసు రని మదిలోన
కడు మోహమున ప్రాణే – శుడు పలికినమాట ॥ఏమని॥

3. ఏ నోము నోచితినో ? – ఎం తని వేడితినో ?
తా నేమి వ్రాసెనో ? – తలమీద విధి యని
పూనికతోడ మా – మువ్వగోపాలుడు
సూనశరుని కేళి – సుఖయింత మను మాట ॥ఏమని॥

## 86. అహిరి - చాపు

(స్వీయ - ప్రౌఢ; విరహోత్కంఠిత)

పల్లవి:

ఏమి సేతునే? ఓయమ్మా నే - నేమి సేతునే?

అనుపల్లవి:

ఏమి సేతునే? వెన్నెలకాకల - కోర్వలేనమ్మా!
నేను ॥ఏమి॥

1. కలకల రవములు - చిలుకల పలుకులు
సొలపులు నామీద - ఝలు ఝల్లుమనెనే!
అళులచే నలియుచు - సొలపుల సలచితి
తెల తెల్లవారదే - చిలుకలకొలికీ! ॥ఏమి॥

2. మింటచందురు న - న్నంటి కాయుగాక!
యొంటి నుండే రాదు - కంటికి నిదుర
తుంటవిల్తుడు నన్ను - కంటగించినాడు
వింటివటే! కల - కంఠిరో! నేడు ॥ఏమి॥

3. అందమైన మా మువ్వగోపాలు - డైన రంగేశు
(డెందుపోయి యే - సుందరాంగిని జేరెనో)
మందలించి వాని - నిందు తోడితెచ్చి
పొందుసేయగదవే - చందనగంధి! నే ॥నేమి॥

## 87. కేదారగౌళ - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

ఏమిసేతురా ? ప్రాణేశ ! నే - నెటువలె తాళుదురా ?

అనుపల్లవి :

ఏమోకాని ని - న్నెడబాసి నప్పుడే
యీ మేన ప్రాణము లే - మిటికని తోచీ ॥నేమి॥

1. ఒకమాటు నీ మోము చూడక - ఒక వస్తువు జి
హ్వకు చవిగాదు చే - దయ్యీని రా
మకురు మనసు నీతో - మచ్చికై యున్నట్లు వే
రొకచోటను మోద - మొంద నీయదెందు ॥నేమి॥

2. నీ మాటలు విన - నే కాని వే
రేమియు వీనుల - కితవుగాదు
నీ ముద్దుమోము చూడ - నె కాని యితరము
కామింపనొల్లవు - కన్ను లయ్యయ్యో ! ॥ఏమి॥

3. ఎలమితో మువ్వగోపాల ! - ఇపుడు నిన్ను నాయెదపై
సలుముకొన మన - సయ్యీనిరా !
చెలరేగి రతుల నెంత - సేపు కూడి యలసిన
తలరించు కోరికల - తనవిదీర దెందుకే ॥నేమి॥

## 88. సావేరి - త్రిపుట

(స్వీయ - ప్రగల్భ, ప్రోషితపతిక)

**పల్లవి :**

ఏమో తెలియ దెటువలె నున్నాడో? ఏమని తెలుపుదునే?

**అనుపల్లవి :**

భామరో! నాపైని నెనరున నచ్చటి
సేమము తెలిసి వచ్చేవా రెవ రున్నా ॥రేమో॥

1. పొలతి! యూరిదాక - పోయి వచ్చెద నని
పలికినంతలో - పల కన్నీరు నించి
కిలకిలమని నవ్వి - తలయూచి యేమేమో
తలచి తప్పకచూచి - దయయుంచుమన నింక ॥ఏమో॥

2. చుర చుర మన వేడి - చూపు లెగయు; చం
దురు కాక మేనెం - తో నాగిలెనుగదవే ?
మరుని రాయిడి వెం - బడిని చల్లని గాలి
దరియింప భరియింప - దరమా యెవరికైన ? ॥ఏమో॥

3. కవగూడి యెదపైని - గాని శయ్యపైని
పవళింప నేర్చునా ? - పడతి! మువ్వగోపాలు
నెవ తెయాదరించెనో ? - యెట్లని యెంచెనో ?
యువిదరో! యీ రేయి - నొంటినుండనాయె ॥ఏమో॥

## 89. సావేరి - త్రిపుట

(స్వీయ-ప్రౌఢ, అన్యాసంభోగదుఃఖిత, ప్రియుని తోడితెమ్మని రమ చెలిని పంపెనో ఆ చెలియే నాయకునితో రమించి రాగా చిహ్నములను జూచి కోపించి యడుగునది.)

పల్లవి:

ఏమో యీ వింతలు - ఎక్కడిదే నీకు ?

అనుపల్లవి:

భామా ! మా మువ్వగో - పాలుడు నిన్ను గూడెనో ?
॥ఏమో॥

1. చిక్కుపడిన హారములు - చెదరిన ముంగురులు
కక్కసమై నీమోవి చాల - గంటియున్న దిపుడు
పుక్కిట విడెమున - బుగులుకొను వాసనలు
నిక్కుచను దోయిపై - నెలవంక గురుతులు ॥ఏమో॥

2. వీడినక్రొమ్ముడి - వింత వింతయూర్పులు
వాడబారిన విరులు - వైఖరి యును
నీడదేరు చెక్కులపై - నెక్కొను గురుతులు
కూడి యలసిన చెమ్మట-కొంగు తడసియున్నది ॥ఏమో॥

3. సరసుడౌ మువ్వ గో - పాలు డిందు వచ్చి
సరస రతుల గూడి - చౌకమీరినది
మరిగి దా నింటనే - మరిరాక యున్నాడు
అరనిమిషాన తోడి తెమ్మ - న్నందు కింతాయె ॥ఏమో॥

## 90. కాంభోజి - త్రిపుట
(స్వీయ - ప్రౌఢ, ఉత్తమ)

పల్లవి :

ఏమో నేర మెంచుచు - ఎదురాడు చున్నా - డేమి
సేతునే? చెలియా!

అనుపల్లవి

భామరో! నాపైని యేమేమో విభునికి -
పగవారు బోధించిరో? ఏమి చేసిరో? ॥ఏమో॥

1. అలిగియున్నాడని - అలుక దీర్చకబోతె
అలుకలో నలు - కాయెనే!
చెలియరో! నే నపుడు సన్న - సేయగబోతె
చేయపట్టి నను దీసెనే ఓ - చెలియరో! ॥ఏమో॥

2. అక్కరో! నే వాని - మ్రొక్కి వేడుకో బోతె
మ్రొక్కులో మ్రొక్కాయెనే!
చక్కన గాడంటె - సకియరో! వాడు నా
చక్కదనమె చూపెనే! ఓ చెలియరో! ॥ఏమో॥

3. వగకాడు మువ్వగో - పాలుని రతికేళి
సొగసులో సొగసాయెనే!
మగువరో! నే నపుడు - మాటలాడగబోతే
మొగమొగమే చూపెనే! ఓ చెలియరో? ॥ఏమో॥

## 91. మోహన - ఆది*

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

ఏమో? రాడమ్మా! యిందుండి పోయి
జామాయె నమ్మా!

అనుపల్లవి :

భామరో! ఆదివరాహుడే - మఱతిని గూడెనో! ॥ఏమో॥

1. ఎన్నడైన నన్నెడ బాసి - యీలాగుండునా?
సన్నుతాంగిరో! నామాట - జవదాటని విభుడు
మన్ననతో నిపుడే - మగువ వల దగిలెనో? ॥ఏమో॥

2. నిలువదే నా మనసు వాని జూడక - నిమిషమైన
కలిసిన వేళాగుణమో? - కమలజు వ్రాతఫలమో?
కలకంఠి! యిదే నిజము - కన్నులాన కల్లగాదు ॥ఏమో॥

3. మువ్వగోపాలుడైన - ముద్దువరాహుడు
పువ్వుబోణి! రతుల - పొలుపొంద నను గూడి
నవ్వులకే యందు జేరి - నన్ను జూడకున్నాడె! ॥ఏమో॥

* శహాన - త్రిపుట

## 92. ఉశేని - ఆది

(స్వీయ - ప్రౌఢ, ప్రేమగర్వితి, ప్రోషితపతిక)

**పల్లవి :**

ఏ రీతి నున్నాడో ? – ఎటులతాళి నాడో ? –
ఎరుగ నో యమ్మా !

**అనుపల్లవి :**

వారిజాక్షి ! ప్రాణ – వల్లభుడు ననుబాసి –
వంతచెంది విరహవేదనచేత ॥ఏరీతి॥

1. కలనైన నామీఁది – కలవరమే ! ఇతర
– కామినుల నొల్లడే !
చెలు లోర్వజాలక – చెలి ! ననుదూరితే
– చెవియొగ్గి వినసహించడే
అలిగి యెప్పుడైనా – తెలియక యాడితే
– ఆమాట మదినెంచడే !
నెలకొన్న దయతోను – నెనరు నాపై నుంచి
– నెమ్మదినుండే సామి యీవేళ ॥ఏరీతి॥

2. తమిమీర క్షణమైన – తనయెదుట లేకున్న
– తత్తరమున నుండునే !
రమణి ! నే నంతట – రాగాను నవ్వులకు
– రావద్దు పొమ్మననే !

క్రమము దెలిసినవాడు – కౌగిట లీయమై
– ఘనముగా లాలించునే!
సమరసముతోను – సరసములాడుచు
– సంతోషమునునుండే సామి యీవేళ ॥ఏరీతి॥

3. పాటలగంధి! నా – భావము దెలిసి
– పలుమారు తేలించునే!
నీటుగా మా మువ్వగోపాలు డైన్న
– నేర్పులు పచరించునే!
ఘాటమున నన్ను – కౌగిట లీయమై
– ఘనముగా లాలించునే!
పాటించి రాతిరి – పగలు జోడుగూడి
– బాళితో నుండేసామి యీవేళ ॥ఏరీతి॥

---

93. శంకరాభరణము - త్రిపుట (లేక ఆది)

(స్వీయ - ప్రౌఢ, సురతప్రియ)

పల్లవి :

ఏల తెల్లవారె? సయ్యో! యింతవేగమె

అనుపల్లవి :

బాలరో! మా మువ్వగో–పాలుతో మాటాడగానే ॥ఏల॥

1. రాకరాక మాయింటికి – రమణుడు వచ్చినంతలో
పోకముడి వీడగాను – పొంగుకొందమను
ఏకచిత్తమున శయ్య – నిద్దరము పవ్వళించి
ఆకు మడుపు లందిచ్చి సయ్యాటలాడునంతలోనే ॥ఏల॥

2. మేనుమేను గదసినపుడె – మిక్కిలి బిగికౌగిళ్ల
పూని పెనగుచు నిద్దరము – పొంకముమీర
సూనశరుని పాటలు – సొంపుమీర పాడుకొనుచు
ఆని కౌగలించు మని – అడిగేటంతలో ॥ఏల॥

3. సరసుడౌ మా హేమాద్రి – సామి మువ్వగోపాలుడు
కరుణించి నను చేరెను – కలయునంతలో
సురతానంద మిమి హెచ్చ – చొక్కి వేరేమి తోచక
గురు కుచముల రొమ్ము – గ్రుమ్మి పై కొనునంతలో ॥ఏల॥

---

94. నీలాంబరి - త్రిపుట

(స్వీయ - ముగ్ధ, విరహోత్కంఠిత. సఖితో ఆమె విరహమును దెలుపుట.)

పల్లవి:

ఏలర వూరక చలము ? మువ్వగోపాల !

అనుపల్లవి:

బాలర; నీపాల కలిగిన దేమి ? యీ –
వేళ కరుణాలవాల ! ॥ఏలర॥

1. వలచింది ప్రేమచే చాల దాని – వలెనెందుగాన గోపాల!
మలయజగంధి నీ లీల దలచి – మది నుప్పొంగుచు నే వేళ
నెలతలిటువలె పలుమారేచవలెన ? – నీకేమైన
ఫలమౌన ? కాక, మేలౌన ? ॥ఏలర॥

2. కనుల జూడవలె నని కాన అది – కనుగు
చున్నది నీ మీఁద దాస
మనవాలకించు ఓ జాణ! దయ – మరువ
వద్దని నీతో ననేన ?
వనిత వసుపగ వస్తి నిజముగ
వలదు ఇక నిటువంటి కోపము – వచ్చు పాపము ॥ఏలర॥

3. చిగురుబోణితో నిష్ఠుర వాదమును – జేరి యింపుగ
[నుండలేదా ?
తగవు పెట్టక వేరారాసి ? తి – రుగ కూడియుండితేను
[కారాద ? వృథా
పగలు చేసుక అలిగి వచ్చితే
నగవులకు ఎడమౌను ధరలోన సరివారలోన ॥ఏలర॥

## 95. యదుకులకాంభోజి - త్రిపుట

(స్వీయ - మధ్య, ధీర, అధమ. అన్యకాంతాసక్తుడైన నాయకుని పరసత్వము లే మాత్ర మంగీకరించక కోపించేది)

పల్లవి :

ఏలరా ? ఈ వగ లెల్ల నాసామి ! యిపు -
డేలరా ? ఈ వగ లెల్ల

అనుపల్లవి :

చాలురా ! మువ్వగోపాల ! యీ జాజమెల్ల ॥ఏలరా॥

1. మన వేమి యున్నది నేడు అల్లమటు -
మాయలాడిన మరిమరి వేడు
ఘనముగా దిది యెంచి చూడు ముచ్చ -
కనికర మెల్లను దెలిసెను నేడు ॥ఏలరా॥

2. చాలు నీదయ అట్టె యుండునట్టె -
సరసములాడకు నాతో వేలందు
కాళ్లకు మొక్కుల బందు ఇంత -
కరుణ గలవాడవు మనసందే యుండు ॥ఏలరా॥

3. శయ్యపైని చేరరాకు నాదు -
పయ్యెద తొలగించి పట్టి ముద్దిడకు
కుయ్యాకు మని కూడ రాకు మువ్వ -
గోపాల ! నేడు నీ కింత పరాకు ॥ఏలరా॥

## 96. యదుకులకాంభోజి - ఆది

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

ఏలాగు నే వేగింతునే ? ఓ ముద్దుగుమ్మా !

అనుపల్లవి :

బాలరో ! మువ్వగో - పాలు డలిగి రాడాయెనే ॥ఏలాగు॥

1. చిలుక నంపిన రాడాయెనే నాతోనె ముద్దు -
చిలుక మాటాడకపోయెనే వాని కిపుడు
అలిగి యుండేది హితవాయెనే ఓర్వజాలని -
యతివల రవ మాయెనే ఓ ముద్దుగుమ్మా ! ॥ఏలాగు॥

2. బలిమినన్నొడ జేసెనే యందువల్ల నా -
చెలి యే పుణ్యముచేసేనే మంచు బెట్టి
అలవాని నోరు మూసెనే ! యంతలో నామా -
టలు గాకుండ చేసెనే ఓ ముద్దుగుమ్మా ! ॥ఏలాగు॥

3. కూరిమి నేరమెంచెనే మువ్వగోపాలుడు -
కూడినదాక నలయించెనే పైపోటి చేసి
ఆ రామపొందు గావించెనే నన్ను నిప్పు -
డంతలోనె మచ్చరించెనే ఓ ముద్దుగుమ్మా ॥ఏలాగు॥

97. పున్నాగవరాళి - చాపు

(స్వీయ - ముగ్ధ, ఖండిత)

పల్లవి :

ఐతేగాని నిన్నిమ్మ - యేపాపె చేసిన భాగ్యముసామి !

అనుపల్లవి :

సైతురా ! యీ సడతలు - సామి! మువ్వగోపాల! ॥ఐతే॥

1. చెక్కిలి నొక్కిన సొగసు - చేతిలో చేయివేసిన హాసు
ఎక్కువయిన నీమనసు-ఈ మర్మమునాకే తెలుసు ॥ఐతే॥

2. అక్కరకు రాని ధనము - ఆస పడితే నేమి ఫలము ?
నొక్కిన నొక్కుసొమ్ము - నొలచుకొంటే నేమి ఘనము ?
॥ఐతే॥

3. కులుకు గుబ్బల పోటు - గురిగ వేసిన కీల్జడ వేటు
అలుకవలదు నీ పలుగాటు - అందమాయెను
[ఈ తడబాటు ॥ఐతే॥

---

98. ముఖారి - ఆది

(స్వీయ - మధ్య, విప్రలబ్ధ)

పల్లవి :

ఐరాదే నేస్త - మమ్మలారా !

అనుపల్లవి :

సారసాక్షి ! పోరేది - చాలునమ్మ చెలులతో ॥ఐరా॥

1. నామీద నెనరు గల్గి – నా వారి వలనుండి
యేమేమో విభునితో – నెగ బోసిరే
ఆ మాట నిజముచేసి – యతడిందు రా కున్నాడు
వామాక్షిరో ! మేక – సన్నె పులినంటి చెలులే ॥ఐరా॥

2. సుడువ నోరాడ దమ్మ ! నూ గింజైన నాన నియరు
అడలి నే నొకనితో – నాడుకో రాదె
పడతిరో ! నామాటలన్ని – పలికేరే విభునితో
ముడుచుకొని పోరేరు – ముని ముచ్చు లీ చెలులు ॥ఐరా॥

3. పాయక మువ్వగోపాల – భావజ్ఞుడైన యఖిలాండ
నాయకుడైన వరమును – నన్ను గూడి
గాయక మెరుగనమ్మ – కటకట తెలియదు
కాయజుని తలిరుపదను – కష్టములమ్మ ! యీా
చెలులు ॥ఐరా॥

---

99. మోహన - ఆది

(స్వీయ - మధ్య, ఆధిసారిక)

పల్లవి :

ఒక్క గడియకే ఈ లాగైతే ఇదేటి ఘనమే

అనుపల్లవి :

గ్రక్కున మాటికి – అక్కర దీరగ
పక్కబో నేమొ ? ఓ – భామామణిరో ! ॥ఒక్క॥

1. సన్నంపు పలుకులు పలికే వేమే ? -
చన్నులు పయ్యెద గప్పే వేమే?
తిన్నని చూపులు చూపవదేమే ? -
నన్ను మంచి మాటలాడ వదేమే ? ||ఒక్క||

2. పదములు తడబడి నడచే దేమే ? -
పాటిమాట లాడనోరాడ దేమే ?
తనువున చెమటలు జారే దేమే ? -
తరుణిరో ! పెదవులు తడిపే దేమే ? ||ఒక్క||

3. మదనుని కేళికి బెదరే వేమె ?
మమత దీర ముద్దీయ వదేమే ?
చెదరి భయంబున జూచే వేమే ?
మడుపులీయ చెయ్యాడ దదేమే ? ||ఒక్క||

4. ఉన్న తావునను - ఉండ వదేమే ? -
కన్నె ప్రాయమున - కదిలే దేమే ?
వెన్నుడు మువ్వగోపాలుడు తెలియుగ
వెలదీ ! మనకది భయమేమేమే ? ||ఒక్క||

## 100. సావేరి - త్రిపుట

(స్వీయ - ముగ్ధ, విప్రలబ్ధ)

పల్లవి :

కొంచెకత్తెలా ? మీరో చెలియరో !

అనుపల్లవి :

కొంచెకత్తెలా ? నా - గుణము తెలియక నన్నుడి
కించి వాడు దాము - కేరి కేరి నవ్వేరు ॥కొంచె॥

1. అలిగి రాడు తోడితె - మ్మని సఖుల నంపితె
చెలువుని తోడితెచ్చి - తలవాకిట నుంచి
యలదాని గూడి రా - నని సంటె నా మది
కలగి కన్నీరు నించ - గా తోడితెచ్చేరు ॥కొంచె॥

2. పొరుగింట పతినుంచి - తరుణి ! నీ పతియూరి
కరిగేటప్పుడు దయ - మరువవద్దని నీతో
నెరిగింపు మనె నన - విరహవేదన చేత
పొరలగ నప్పుడు వి - భుని తోడితెచ్చేరు ॥కొంచె॥

3. నెలత ! మువ్వగోపాలు - నికి నా సఖి కట్టిన
వలువ కట్టి స్త్రీవలెనే - యలవరించి యిందుదెచ్చి
అలివేణి ! పవ్వళించు - మత డిందు రాడని
తొలగి యచ్చట నుండ - గలసి విభుడు నవ్వె ॥కొంచె॥

## 101. భైరవి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ఖండిత)

పల్లవి :

కోపము సేయ వచ్చున ? నాపై నింత

అనుపల్లవి :

రే పగలునీవు - లేమచే ఘన విని
బాపురే! ముద్దుగారి - చాల ! నా సామి ! ॥కోపము॥

1. అలదానికెమ్మోవి - ఆనిన పలుకాటుచే
అలరు నా జిగిమోవి - నాన వద్దంటినా ?
తిలక మొదిగినది - దిద్దుకొమ్మని చాల
నిలువు టద్దము తెచ్చి - నిలిపినందుకు నాపై ॥కోపము॥

2. నెలవంక లందందు - నెగడిన మేనితో
ఎలమినను కౌగిటను - అలమవద్దంటినా ?
చలువ పన్నీటిచే - కలయ మర్దించిన
కలపము మైనిండ - నలదినందుకు నాపై ॥కోపము॥

3. ఏ మగువనో చేరి - యెనసివచ్చితివని
కాముకేళిని గూడి - కలయవద్దంటినా ?
నీ మనసు దెలిసి నే - నే బలిమిచేసి
సామి రమ్మని రతి - సలిపినందుకు నాపై ॥కోపము॥

## 102. సౌరాష్ట్రము - చాపు

(స్వీయ - మధ్య, ధీర, నాయకుడన్యకాంతను భోగించివచ్చినను అలుగక సేవచేసేది)

పల్లవి :

చక్కనయ్య ! ఏమి యుప - చారము లే జేయింతును?

అనుపల్లవి :

నిక్కముగ శ్రీకర ! దోషహరతుల - నిప్పింతునో ?

॥చక్క॥

1. మల్లెపూల పాన్పుపైని - చల్లని మొల్లలే పరుతునో ?
చల్లని వాసనగాలికి - చామరాలే వేయింతునో? ॥చక్క॥

2. మంచి గంధం బలది నే యూకు - మడుపులం దిత్తునో ?
అంచితమైన మోవినొక్కి తే-నందుకే రవలుచెక్కింతునో?

॥చక్క॥

3. చక్కని మూవునపుర - సామి ! మువ్వగోపాల ! యిం
కొొక్కసారి నేనే - యోాలలా డింతునో ? ॥చక్క॥

---

## 103. ధన్యాసి - త్రిపుట*

(స్వీయ - లఘుమాన)

పల్లవి :

చల్లనాయె లేరా ! నా మన సెంతో -
చల్లనాయె లేరా !

---

* ఘంట - ఆట

అనుపల్లవి :

చల్లనాయెలేరా ! నా – సామి మువ్వగోపాల !   ॥చల్ల॥

1. చెలరేగి యదినీవు – చేపట్టు పట్టుక
కిలకిల నగుచు వె – న్నెలలో రాగా
అలివేణి వేరొకతె – ఆకుమడుపులందియ్య
పలుమొనల నందుకొని – పడతి కియ్యగజూచి   ॥చల్ల॥

2. జోడుగూడి యదినీవు – సొగసుపాటలు పాడుకొని
వేడుక మీరగ నీ – వీధికే రాగా
తోడిచెలివచ్చి నా – తో విన్నవింపగ
మేడమీదనుండి మీ – మేలిమి చూచి చూచి   ॥చల్ల॥

3. ముదమున నది నీవు – ముచ్చట లాడుచుండగ
అదియేమో పదిరి ని – న్ననగవిని
గదిమి నిరాకరించి – కాదని యిందువచ్చి
కదసి నన్నేలిన – ఘనుడవు మువ్వగోపాల !   ॥చల్ల॥

---

### 104. తోడి* - ఆది

(స్వీయ - ప్రగల్భ, ప్రవత్స్యత్పతిక)

పల్లవి :

చాల ఇందుకే నా మనసు – జాలి పొందెరా !

అనుపల్లవి :

తాళగలనా? కంచి వర–దా! నే నిన్ను నెడబాయ ॥చాల॥

---

* సౌరాష్ట్రము - ఆది ; లలితపంచమము - ఆది; వసంతభైరవి - ఆది.

1. ఇంతంత నా మోవి తేనె - లిచ్చి నోరు దడపగ
నింతలో సొమ్మసిల్లే - వింక నేలాగో ?
కంతుజనక నే నిచ్చిన - కౌగిలి వదలీ నని
ఇంతగా కన్నీరు నించే - వింక నేలాగో ? ॥చాల॥

2. మొదట మడుపు నొక్కి - మోవి చే నందీయవని
ఇదిగో విడె మొల్లకున్నా - వింక నేలాగో ?
సదయుడ ! పడకింటిలో - జవ్వాజి తెచ్చునంతలో
ఎదురెదురే చూచే - వింక నేలాగో ? ॥చాల॥

3. చేరి సురకేళి నిన్నెంత - సేపు కూడిన గాని
సరా ! తనివితీర దందు - వింక నేలాగో ?
జారా ! మువ్వగోపాలు - డైన కంచి వరదరాజ !
ఈ రాతిరే పైన మైతే - ఇంక నేలాగో ! ॥చాల॥

---

## 105. ముఖారి - చాపు

(స్వీయ - ప్రౌఢ, ధీర)

పల్లవి :

చిత్తము వేరైనందుకె - చింత చేసేను

అనుపల్లవి :

క్రొత్తలాయె నానాటికి నీ - గుణములు కరివరద ! ॥చిత్త॥

1. ఏనాటికైన నీ కెమ్మోవి - విచ్చితివని కోపమా ?
ఆనీని ! చప్పరించీని ! - అపహరించీనా ?
నే నెంతో విన్నవించిన - నీవు వినవు వినకున్న
మాను మందువల్ల నా - మనసు నొవ్వగ లేదురా ॥చిత్త॥

2. ఎలమి నెవతెనైన కౌగి - లిచ్చితే రోసమా ?
అలమీని ! గుబ్బల గుమ్మీని ! - అమ్మికొనీనా ?
తెలియ బల్కెనను నమ్మి - తించేది లేదు లేకున్న
పలుమారు నిందుకు నే - నలిగి యుండ లేదురా ॥చిత్త॥

3. అక్కట మువ్వగోపాలుడ - వై దానిల్లు చేరితే
మ్రొక్కీని ! కలసీని ! - మూల దాచీనా ?
చక్కన గాదంటే మాట - లెక్క సేయ వెందుకు నీ
యిక్కువ దెలిసెను గనుక - ఈరసించ లేదురా ॥చిత్త॥

---

## 106. కల్యాణి - త్రిపుట

(స్వీయ - ముగ్ధ, విస్రబ్ధనవోఢ - సఖుల వాక్యములనంగీకరించినది; నాయకుని అనుభవము తెలిసికొన్నది గనుక.)

పల్లవి :

చిన్నదాన నే నే మెఱుగ - సిగ్గయ్యీ నమ్మా !

అనుపల్లవి :

కన్నె లెల్ల కంచి వరదుని - కౌగిట నుందుమనేరు ॥చిన్న॥

1. వద్దికి బొమ్మని చాల – సుద్దులు చెప్పేరు
ముద్దు పెట్టి బొమ్మనేను – ముదముతో లాలించుమనేరు
॥చిన్న॥

2. మదన శాస్త్రము నేను – చదివిన దాన గాను
సదయుడని వానితోను – సరసము లాడుమనేరు ॥చిన్న॥

3. మల్లెపూల పాన్పుపైని – పనసు నెమ్మదితోను
ఉల్లము రంజిల్లజేసి – ఒమ్మికతో నన్నుండుమనేరు
॥చిన్న॥

4. పల్లవాధరి ! వినవే – పడతు లందరు నన్ను
వల్లభుడా మువ్వగో – పాలునితో గూడుమనేరు
॥చిన్న॥

---

## 107. ఉసేని - చాపు

(స్వీయ - ప్రౌఢ, సురతప్రియ సేనాదినములకు రాకరాక వచ్చిన పతితో మాటలాడుచు కాలక్షేపముచేసి, చిలుకపలుకలవలన తెల్లవారుచున్నదని గ్రహించి వ్యాకులపడినది)

పల్లవి :

చెల్లబో యెంతవేగమే – తెల్లవారెరా !

అనుపల్లవి :

ఉల్లములో జాల వింతై – యున్నది మువ్వగోపాల !
॥చెల్ల॥

1. ఇద్దర మీా వరదాక – నెడబాసిన వెతదీర !
కొద్దిగా నింతసేపైన – సుద్దు లాడుకొంటిమో ?
నిద్దరమైన తమిదీర – నెలత ! రా రమ్మని నీవు
ముద్దుపెట్టిన నీ మోవి నా – మోవిపైనున్న దింతలోనే
॥ చెల్ల ॥

2. చెలువుడ ! నీవు నేను – వల రాజుచే జిక్కిన
యలుక దీర మోవి తేనె – లానుకొంటు ఉంటిమో ?
తలిరాకు బోణీ ! రమ్మని – దయతోడ నీ విచ్చినట్టి
వలపుల బిగి కౌగిలి – వదలలే దింతలోనే ॥ చెల్ల ॥

3. కళలంటి నే బలికేస – పలుకులు విని ముద్దు
చిలుక పలికినందు కింత – సేపు నవ్వుకొంటిమో ?
కలికిరో ! రమ్మని నన్ను – కడు వేడ్క మువ్వగోపాల
కలసి యుపరతి నన్నె – గమకించే టంతలోనే ॥ చెల్ల ॥

## 108. తోడి - రూపకము

(స్వీయ - ఉత్తమ, నాయకుడు - దృష్టుడు, సఖిశిక్షాస్వభావముగల పార్శ్వచారిణి.

పల్లవి :

తగదు పో పొమ్మన నా – తరమా ? ఓయమ్మా ! .

అనుపల్లవి :

సొగసైన వాని మోము – సుదతిరో ! చూచినపుడె
॥తగదు॥

1. వడిగ వా డింటు వచ్చి - వద్ద చేరి ముద్దు పెట్టి
తడవేల విడె మిమ్మని - తా సారెకు నను వేడగ
॥తగదు॥

2. సరసము లాడుచు నాదు - చక్కని చెక్కులు నిమురుచు
గురుకుచముల గోరు లుంచి - కొమ్మా ! నీ పుణ్య
మనగ ॥తగదు॥

3. మనసిజు కేళిని నన్ను - మువ్వగోపాల సామి
మును గలసిన చందాన - ముదిత నన్నేలు మనిన
॥తగదు॥

109. మోహన - త్రిపుట

(స్వీయ - మధ్య, ఖండిత)

పల్లవి :

తగిలితి విక నిన్ను - తరలనీయ నోయి !

అనుపల్లవి :

వగకాడా ! మా మువ్వగో - పాలా ! నా సామీ !
॥తగిలి॥

1. గంధము చాటున - ఘనమైన జడవేటు
కందియున్న సొగసు - కనుగొంటినోయి !
సందిటనున్న యీ - చందురు పిల్లలు
అందమాయె నోయీ - యిందు కేమోయి ! ॥తగిలి॥

2. తావి మించిన నీ – మోవిపై పలుకెంపు
దేవునాన నినుజూడ – దృష్టయ్యా నోయి!
దేవర చిత్తము – తెలిసు దానినా నీ
వీ వేళకై న నా – యిల్లు చేరితివోయి! ॥తగిలి॥

3. కళలంటి వేమారు – ఘనుడ! మువ్వగోపాల!
కలసితి వందుకు – కాదనవోయి!
చెలిని నేటనుండి – తలచనంటు నాతో
పలికితే కాని యా – పని కొల్లనోయి! ॥తగిలి॥

## 110. కన్నడ - త్రిపుట

(స్వీయ - మధ్య, కలహాంతరిత)

**పల్లవి :**

తన యాసవలెనే యుండ – దా నా యాస?

**అనుపల్లవి :**

తనకేమి తెలివి లేదా? – చానరో మువ్వగోపాలుడు
శానా చదివిన సర – జ్ఞుడే ఓ చెలియా! ॥తనయాస॥

1. ఇంటికి వచ్చి శయ్యపైన – న్నంటక దయజూడక యుండ
పంటి కొద్ది మోవి – గంటి చేసితినని
కంటగించి చూచి – కను లెఱ్ఱజేసెనే! ॥తనయాస॥

2. ముద్దు పెట్టుకయుండగా వానిపై - మోహ మగ్గలమై నేను
వద్ద కూర్చుండి తిలకము - దిద్దితేను
గద్దించినాడు గదవే ? ఓ యమ్మా ! ॥తనయాస॥

3. మనసు నిలుపలేక వానిపై - కోని రతిగూడు వేళ
తనువు మరచి నేను - తాళి త్రాడు మనిస
విని మోడిగా జూచెనే ! - ఓ చెలియరో ! ॥తనయాస॥

---

## 111. ఘంటారావము - రూపకము

(స్వీయ - ప్రౌఢ, కలహాంతరిత)

**పల్లవి :**

తరుణిరో ! నేనందాక జీవము బట్టుక -
తాళి యుండే నమ్మా !

**అనుపల్లవి :**

వరదుడు రాక యుండి నంతట - వలరాయడున్నాడు
నే నున్నాను ॥తరుణి॥

1. ఎన్ని నోములు నోచిన ఫల - మియ్యక పోయీనా ?
పున్న మొక్క ప్రొద్దు లూరకే - పొల్లపోయీనా ?
తిన్నగా మీవంటి పుణ్యసతుల - దీవెన వ్యర్థమయ్యీనా
కన్ను తెరచి యే దేవుడైనను - కరుణ చూడక
పోయీనా ॥తరుణి॥

2. చానరో! నా గ్రహచార మికనైన - చక్కన
గాకుండీనా?
దీనత చూచి యే చెలియైన - దిక్కు కానక పోయీనా?
వానిపై నున్న నా విశ్వాసమైన - నన్నె నేయక
పోయీనా?
పూని నేను ముందు చేసినట్టిదాన - పుణ్యమైన లేక
పోయీనా? ॥తరుణి॥

3. కామునితో గూడి యాపద లేమైన - కాపురము చేసీనా?
పామరు లాడుకొందురు పైకైనము - పగవారిని గూడీనా?
రామరో! మువ్వగోపాలు డిందు నేడు - రాక మానీనా?
ప్రేమతో నన్నేలిన దేవుడు - తామస మొసరించీనా?
॥తరుణి॥

---

## 112. మధ్యమావతి - త్రిపుట

(స్వీయ - సఖీ ఉపాలంభన)

పల్లవి :

తలిరుబోణి వారు పెద్దలైనారు

అనుపల్లవి :

తాళుకొన్నదే దోసమా? ఎక్కడి జోలి
వలచేది యొకరి కోసమా? ఓర్వలేని చెలులంటే నే
దోసమా? ॥తలిరు॥

1. నిను నిందించి నారంటు నీ వేల అలిగి యున్నావు ?-
నీ వివేక మింతాయెగా !
వనజాక్షుల నోటి వెక్కసపు మాటల
వాని మొక్కవోయీనా ? ఎక్కడి జోలే ! ॥తలిరు॥

2. వారు సేయుమనగానే ముందు చెలిమి చేసినావో
వారికి చింతన సేతురా ?
ఊరికే చిన్నజూచి యుసురనే దోసకారులు
ఒకరి మేలు సైతురా ? ఎక్కడి జోలే ? ॥తలిరు॥

3. నెమ్మి ముట్టెడి మువ్వగోపాలుడు
నీతోనైన కూడండనే చెల్లదా ? జాలమైనదే
చాలదా ?
అమ్మమ్మా ! యిది యేమి యెదిగే తిరిగే
నయ్యయ్యో ! యెవరైన దేశ రాజుల యెక్కడి
జోలే ॥తలిరు॥

---

## 113. అహిరి - చాపు

(స్వీయ - ముగ్ధ, ప్రోషితపతిక)

**పల్లవి :**

తాళరాదమ్మా ! నా సామిని బాసి

**అనుపల్లవి :**

ఆ - వేళ జూచి యింత - వెత చెందజేసినే ॥తాళ॥

1. వన్నె చిగురు పగడమువంటి – వాని పాదము లెన్నడు
కన్నుల నొత్తుకొందునో ? – కలికిరో ! యిపుడు ॥తాళ॥

2. మురువైన వాని ముద్దు – మోము కన్నుల జూచక
పరితాప మెట్లు దీరునె ? – మరుబారి చేతను ॥తాళ॥

3. అతివరో ! మువ్వగోపాలు – డైన శ్వేత వరాహును
రతికేళి గూడు టెప్పుడో – గత మింటివలె నీవు ? ॥తాళ॥

---

## 114. సావేరి - అది

(స్వీయ - సఖీశిక్షాలక్షణము)

పల్లవి :

తాళి మొక్కరికైన వద్దా ? ఓ చెలియరో !

అనుపల్లవి :

లోలాక్షి ! మువ్వగో – పాలునికి నీకు మాటలైతే
॥తాళి॥

1. వా డలుగ నీ వలుగ – వశమె ? మీకై తిరుగు –
లాడి చాలు నన్నట్లున్నది; యెవరు మెత్తురే ?
కూడక మీరినట్లున్నది నే జెల్ల మీకు –
కోపము ముక్కున నున్నది చెలియరో ! ॥తాళి॥

2. చలమున వాడొక టంటే - సైగగా నూరకుండక
చెలియరో! యిదేటి కోపము? - చెల్లనె మిూతోడ
చెలిమి చేసిన పాపము ఎందుకె మిూకు
వలువని మనస్తాపము? చెలియరో! ॥తాళి॥

3. ఎలమి పాలు నీరు వలెనె - కలసి యుండక
మువ్వగోపాలునితో -
చెలియరో! ఈ - చలమేటికి? ఇటువంటి గుణము
చెల్లునే నీ వంటి మేటికి? వివేకమింత
వలువదా? లెస్సాయెను నేటికి ఓ చెలియా! ॥తాళి॥

---

## 115. మధ్యమావతి - ఆది

(స్వీయ - ప్రౌఢ, స్వాధీనపతిక)

**పల్లవి:**

తెలిసి తెలియలేక - పలికేరు చెలులు

**అనుపల్లవి:**

కలిసి యున్న నా సామిపై - గాకసేయ వశమా?॥ తెలిసి॥

1. చలపట్టి తమ బు - ద్ధులు వినలే దని
యలిగి రేమి సేతు - నతివ లెల్ల?
చెలువుని ముద్దు మా - టలు నా వీనుల నిండి
తొలుకుచున్నవి తమ మా-టలకు చోటున్నదా? ॥ తెలిసి॥

2. కొనగంట దము గను – గొన రింతైనా గాని
నెనరులేని దాయనంచు – నిందించేరు
ఘనమైన సామి రూపు – కనులు నిండి యుండగ
కనకాంగి! యితరులు – కానవత్తురటవే? ॥తెలిసి॥

3. నా పాల గల మువ్వ – గోపాల సామితో
కోపించుకొమ్మని – కొమ్మ లనేరు
ఏ ప్రొద్దు నా సామి – యెద నిండి యుండగ
పాప మింతె కాని – కోపమున కిమ్మున్నదో? ॥తెలిసి॥

---

## 116. కల్యాణి - ఝంప

(స్వీయ - ప్రౌఢ; సురతానందమోహిత - క్రీడాసమయమున మైమరచినది)

పల్లవి:

తెల్లవారినది – తెలియులే దకట!

అనుపల్లవి:

కల్లగాదిది యెంతో వింత నైయున్నది! ॥తెల్ల॥

1. మొలక నవ్వుల ముద్దు – మోము కనుగొనగానె
వలపు రెట్టించి కడు – వడిని కౌగిటను
అలమి కమ్మని మోవి – యాని తనివారగనే
జెలగి మోమున జే – ర్చి ముద్దాడుచునుండ ॥తెల్ల॥

2. ఎలమి నెద నెదను కదియించి – యొకరి కొకరు
తలచినటు వలె నెల్ల – తమి రేచుకొనుచు
కలసి మనసు కరగి – కాతరింపుచు మిగుల
సొలసి సరి మోహమున – సొక్కి పరవశమొంద
॥ తెల్ల ॥

3. ఇదివరకు నెడబాసి – యిరువురము మదినున్న
కొదవలన్నియు దీర – గూడి యిద్దరము
సదయ ! మువ్వగోపాల ! – సామి ! బడలితిననుచు
కదసి పైకొని వగల కులికి – కళలంటగను ॥ తెల్ల ॥

---

## 117. భైరవి - రూపకము

(స్వీయ - ప్రౌఢ; సురతానందమోహిత)

పల్లవి :

తెల్లవారు టెరుగనైతి నమ్మ ! యేమందు నా –
తెలివి కెంత మోసమాయె నమ్మా !

అనుపల్లవి :

చెలిమి బలిమినైనా గాని – అలమి పోనీయకున్న –
చెలువుని కడ నుండగ అయ్యయ్యో ! ॥ తెల్ల ॥

1. విరుల దండ కొప్పున ముడిచి నా మోముమీద -
చిలుకు చెమట దుప్పటిచే తుడిచి నే
సరసముతో రవిక ముడి గొబ్బున విడిచి
విరుల మరుల పొరలి కెరలి కెరలి నేరగనైతి
దురంతరవచ నించిన జాణు డయ్యయ్యో ! ॥ తెల్ల ॥

2. అలరు మోవి నా మోవిపై నుంచి కొన గోరులు -
కులుకు గుబ్బలపై నాటించి
వలల నా మది నెన్ని విధ - ములనో భ్రమియించి
అలసి సొలసి కలసి మెలసి వెలసి తెలియనైతిరా ? యని
పిలిచి పిలిచి వేడుకొందు నయ్యయ్యో ! ॥ తెల్ల ॥

3. చెక్కిలి నొక్కి ముద్దు పెట్టి - చేరదీసి కలికి
ఆత్మను నను బలికి
అక్కరో ! బిలయు మువ్వగోపాలుడు నను జోడు గూడి
సొక్కి దక్కి మొక్కి తెక్కి మిక్కితే నా -
మక్కువతో నైనా
ఎక్కడి వలపు వచ్చె నయ్యయ్యో ॥ తెల్ల ॥

## 118. బిలహరి - రూపకము

(స్వీయ - ప్రౌఢ, సౌందర్యగర్విత)

పల్లవి :

తోయ్యాలి ! నా విభు డెవతెనైన - తోడి తెమ్మనునా ?

అనుపల్లవి :

వెయ్యేన మువ్వగోపాలరాయ డీ - వెలదులకు
చిక్కునా ? ॥తోయ్యాలి॥

1. కొలువున నున్నయపు డాకతె - గుబ్బలు కానరా
బయ్యెద తొలగించి
ఎలమి నా దేవుని కన్నుల జూడ - నీయరాదేమి ?
యంటే
వెలదులు సముఖాన నుండిన వారిని - విరుగనొత్తి
ముందరికి
నిలిచి బెళుకు చూపులు చూచితే తన - నిలవర
మెంచక ॥తోయ్యాలి॥

2. కీవితో చెలువ రాయడై యున్న - యా వేళ తెలిసి
ముందర నిలిచి
సేవకు వచ్చిరి చేయెత్తి మ్రొక్కి - చిత్తాన భయములేక
మోవిపై దంతము లుంచిన వారి - ముక్కున
వేలుంచి భామలు నిగుడించి
కావరమున నడ వంచుకోగ తన - క్రమము
విచారింపక ॥తోయ్యాలి॥

3. మంచివారి వలెనే తమ - మాయలకు లోనౌ నంటు
కొంచక చంచలాక్షు లందరు - గుంపులు గూడితే
పంచ బాణుని కేళి నన్ను మువ్వగో - పాలుడు
గూడి యుండితే
మంచకు పెట్టిన వగ లింతే తమ - మనసు
మర్మ మెంచక ॥తొయ్యలి॥

---

## 119. అఠాణ - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, అతృప్త. నాయకుడు సదా తనవద్దనే ఉండక పోవుటచేతను, రతియందు తృప్తిలేకపోవుటచేతను అతృప్త).

పల్లవి :

నన్ను నీవు దలచేది - న్యాయము కాదు

అనుపల్లవి :

నిన్ను నేను వలచేది - నీతి కాదు మువ్వగోపాల
॥నన్ను॥

1. ఏ ప్రొద్దు నా కౌగిటిలో - నెనయుచున్న వాడవు
రావు చేసి యేలాగైన - రాని పక్షమాయె
కోపమైతే ఘనమాయెను - గుణమెంతో చక్కనాయె
ఈ ప్రొద్దు చాలింతుకొంటె - ఇంతకన్న సుఖము లేదు
॥నన్ను॥

2. నే విన్నవించిన మాట - నీకు సమ్మతి కాదు
నీ వెంత బాస చేసిన - నే నమ్మజాల
ఈ వగ లిట్లుండగ - ఇంపు సొంపులు పుట్టునా ?
దేవుని మనసున మ్రొక్కి - తే కనుల దీవించినట్లు
॥నన్ను॥

3. నేను నీవు మువ్వగోపాల ! - నేడు కూడి యుంటిమి
ఆనాటివలె నేస్తమైన - అందమయ్యేనా ?
నీ నా మనసు నొచ్చితే - నెనరు లేదు చాలించు
పూని చెలులందరు గుం - పులు కూడి నవ్వేరు ॥నన్ను॥

---

## 120. పంతువరాళి - త్రిపుట

(స్వీయ - ముగ్ధ, నవోఢ)

పల్లవి :

నన్నేటికి బొ మ్మనేరే ? వాని వద్దికి

అనుపల్లవి :

మిన్నక వాని వద్దికి - మీరే పోరే చెలులారా ॥నన్నే॥

1. పడతీ ! నే నందు పోను - పలుమారు తన నోటి
మడుపందు నయము చేసి చేపట్టి నన్ను
పడకింటికి రమ్మనీనే ! నే రానంటె
కడు వెరపించి పొమ్మనీనె ! అమ్మ ! నే వెరతు ॥నన్నే॥

2. మచ్చకంటి యిప్పు డిపుడు - వచ్చిన లేత చన్నులను
నొచ్చ ననగా బట్టినే! వద్దంటే వినక
మచ్చరాన గోరు బెట్టెనె! వచ్చెదనంటే
ముచ్చ వగల దోవ గట్టెనె! అమ్మ నే వెరతు ॥నన్నె॥

3. నెలత నమ్మిక లిచ్చి - యల మువ్వగోపాలుడు
చెలిమితో నను దీ - సేనే! కుయ్యాకు మని
బలిమి నోరు మూసీనే! పరవశమై
తెలియనైతి నేమేమో జేసీనే! అమ్మ! నే వెరతు
॥నన్నె॥

---

## 121. సౌరాష్ట్రము - ఆది

(స్వీయ - ప్రౌఢ, అతృప్త, అధీర)

పల్లవి :

నా దోవకు రాకురా - నాతో నవ్వకు మువ్వగోపాలా!

అనుపల్లవి :-

కాదనగ కడమ రా - గము నిలుప నసేవు ॥నాదోవ॥

1. విద్దెలు నేర్చినదని - వినయపరురాలని
దిద్దుకోదగినదని - తెలియ నేర్తువా? వోరి!
వద్దనుంటె నొకమాట - వాకిట నొకమాట
మద్దులేల? నీ గుణము - చూచినది కాదా? ॥నాదోవ॥

2. మెత్తని మనసు దని – మేలు నిలిపే దాన నని
ఉత్తమురాలని దయ – యుంచ నేర్తువా ? వోరి !
చిత్తము నొప్పించేవు – సిగ్గింతైన దక్క–నీయవు
హత్తి దాని వద్ద న – న్నాదుకోనేవు ॥నాదోవ॥

3. కొసరి నే వేడుకోగా – ఇసుమంత సేపు నన్ను
కుసుమశరుని కేళి – గూడి యలసితి నంటివి
రసికత గనవచ్చె – రాతిరి నా మనసు నొచ్చె
ముసి ముసి నవ్వులేల ? – మువ్వగోపాల ! ॥నాదోవ॥

122. కాంభోజి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, గురుమాన)

పల్లవి :

నాపైని కోపమేమే ? నా సామికి

అనుపల్లవి :

బాపురే మువ్వగోపాలు – పంతము సాగించె నేడు ॥నాపైని॥

1. పలుచని మోవిపై పలు కెంపు వరుసలు –
పణతి నే జూడనంటిన ?
అల చెక్కు ముద్దు పెట్టి అది గంటుచేసిన గురు –
తులు చూడనంటిన ?
చెలువరో ! యీవేళ చెలువుని తోడనే –
చెనకి నే నేమంటిన ? పో పోవె ! ॥నాపైని॥

2. మోమున చిరు చెమటలు కారేటి సొంపులు -
ముదితరో చూడనంటిన ? యు
రమ్మున గుబ్బలు సోకై యున్నది చూడనే -
రచ్చలు చేసితిన ?
ప్రేమమాట నాతో నాడగ యీ - యీ రేయి పిలిచిన
పలుకకున్నాడు పో పోవె ! ॥నాపై ని॥

3. సరసుడైనట్టి మా మువ్వగోపాలుని మేనెల్ల నా
తరుణి పసుపంటిన
మరుకేళిలో దాని గూడి ఆలసినాడని నేనేమి
దూరితిన ?
సరసిజాక్షి తన నడతలు తెలియదా ? -
చలమేమి ? పో పోవె ! బాగాయె ! ॥నాపై ని॥

123. తోడి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ప్రేమగర్వితి)

పల్లవి :

నిదుర వచ్చునా కం - టికి ? చక్కని సామి !

అనుపల్లవి :

కదసి మన మీలాగు — కలసి మెలసి యుండగా ॥నిదు॥

1. గమ్మని వాసించు – గళమున వదనాబ్జముంచి
కమ్మకొని కౌగిట – గదియరా దీసుకొని
నెమ్మితోడ కటిమీద – నీ పాదము లుంచగ
ఒమ్మన నా గుబ్బలు నీ రొమ్మున నుంచుకొన్న గాని
॥నిదుర॥

2. చక్కెరవలె నున్నది – చల్లనై యున్నది
అక్కర తీర దెంతో – యాన నిమ్మని మోవి
యెక్కువ దిది నా సా – మ్మపరి కీయ వద్దని
నొక్కి తేనే మోవి – నోర నుంచుకొన్న గాని ॥నిదుర॥

3. అలిసినగాని మొదటి – నిలువరము తప్పనీక
తలపున మితిలేని – తమి గలుగ జేసి
కలికి! మువ్వగోపాలుడైన – కంచి వరదుని
కలసి నా యురముపై – గ్రక్కున పవ్వళించక ॥నిదుర॥

---

124. పున్నగవరాళి – త్రిపుట
(స్వీయ - మధ్య, ఉత్తమ)

పల్లవి :

నిన్ను చూడగలిగే నిన్నాళ్ళకు

అనుపల్లవి :

నిన్ను చూచి నాలుగైదు – నెలలాయె మువ్వగోపాల!
॥నిన్ను॥

1. నిన్న రేయి కలలో నా - కన్నుల గట్టినట్లుండ
వెన్నుడా! డిగ్గున లేచి - వెదకి కానక
కన్నీరుచే పైట తడిసి - కరగి చింత నొందితి
నన్ను దలచితో? లేదో? నా నోము ఫలము ॥నిన్న॥

2. విడెమని యన్నమని - వేడుకని నిదురయని
ఎడబాసినది మొదలు - లేమియు లేదుగా!
అడవిలో ప్రొద్దుగూక - అంధకారమైన వానలో
తడిసి దోవ గానని - దానివలె నున్న తనకు ॥నిన్న॥

3. కన్నవా రాడుకొనేది - కన్నెలు నవ్వుకొనేది
విన్నావో? వినలేదో! - వినరా! యీ వింత
నిన్ను గూడినదే మొదలు - నీతోడిదే లోకమై
ఉన్నా నింతే వేరే మనసై - యుంటినా?
మువ్వగోపాల! ॥నిన్న॥

---

## 125. కాంభోజి - అది

(స్వీయ - మధ్య, కలహాంతరిత; సఖీ శిక్షాలక్షణము)

పల్లవి:

నిన్ను నీవే నొచ్చుకొనేవు - నీ మనసున కరగేవు

అనుపల్లవి:

నన్నుతాంగి! మువ్వగోపాలుని - చాల ఆరడూరు చేసి
॥నిన్ను॥

1. తాలిమి కలిగిన వాడని – దండింప మనసు రాదని
మేలు దాచి నే తాళలేనని – ఏల మనసు నొప్పించితినని
॥నిన్ను॥

2. నిన్ను జూచి యుప్పొంగునని – నీ వతని జీవనమని
కన్నె ! నీ వింత కోపగించితే – కన్నుల నీరు
నించుగా యని ॥నిన్ను॥

3. మక్కువ నమ్మిన వాడని – మా మువ్వగోపాలుడని
లక్కవంటి మనసు రాదాయె – లాలించనైతిగా యని
॥నిన్ను॥

---

## 126. తోడి – అది

(స్వీయ* - మధ్య, విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు, విరహ విప్రలంభ శృంగారము, కరుణ, దూతి - మధుర కథన చతుర ; సఖి శిక్షా స్వభావముగల పార్శ్వచారిణి.)

పల్లవి :

నెలత ! అతడు అలిగేదెల్ల – నెనరు గాదటవే ?

అనుపల్లవి :

వెలవెల బోనేల మోము ? – చెలువుని తోడి తెచ్చెదనే
॥ నెలత॥

---

* ‘ పరకీయ ; సఖీ ఉపాలంభన ’ అని రసమంజరి.

1. కాటుక కన్నుల నీరు – ఘనమైన నీలముల వలెనే
పైట తడిసి రవిక దూసి గు – బ్బలపై నిండెనే
ఏటికె యీ వట్టి వెతలు ? – ఇందువదన ! వెరవనేల ?
నేటి మాపటి వేళ – నీ విభుని నిను గూర్చెదనే ॥నెలత॥

2. వాని ప్రేమ తెలియకనె – వలపు నీవు నిలుపలేక
మేనెంతో కరిగి యున్న – దాన వేలనే ?
ఓ నాతిరో ! నన్ను వినా – ఊరడించే చెలులున్నారా ?
నే నీదాన నైనందుకు – నీవు పరుల వేడదగునా ? ॥నెలత॥

3. వనిత ! మువ్వగోపాలుడా – వరదుడు నినుగూడిన వెనుక
కనుమిక నే చెలినైనను – కనువిప్పి చూచునా ?
మనసు గట్టి చేసుకోవే – మగువరో ! నామాట నమ్మవే!
కినుక వలదే తాళుకోవే ! – వనబోణి ! గెలుపున
నుండవే ! ॥నెలత॥

---

## 127. సారంగ - త్రిపుట
(స్వీయ - తృప్తయైన ప్రౌఢ)

పల్లవి :

నేటిదే కలయికరా ! చక్కనిసామి ! –
నేటిదే కలయికరా !

అనుపల్లవి :

కోటిసేయురా మువ్వ – గోపాల ! యీవగ ॥నేటిదే॥

1. ఎనసిన బడలికలు దీర మన - మిద్దర మానుకొంట
మనసులు చల్లనై - మమతలు కొనసాగి
ఇనుమడించిన మోహ - మిపుడు నాసామి! ॥నేటిదే॥

2. ఉల్లము లోకటియై - యింతింత యనరాని
ఉల్లాసములు మీరగ - అల్లిక కౌగిళ్ల
అల్లిబిల్లి సుద్దుల - కొల్లడింతుర ? కులికేర ? నాసామి!
॥నేటిదే॥

3. ఎలమి నెడబాయమని సమ్మికె - యిద్దర మిచ్చకొంటి
పొలయలుక యిప్పుడే - పొందు టంతలోనే
సొలుపు మీర ఇంపు - సొంపున మువ్వగోపాలసామి!
॥నేటిదే॥

---

## 128. కాంభోజి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, గురుమాన)

పల్లవి :

నోరెత్త నైతి నమ్మా! ఓ చెలియ! నే -

అనుపల్లవి :

వీరు వారందరు - వింటే సిగ్గయ్యీ నని ॥నోరెత్త॥

1. కలికిరో! మోవిపై - కాటుక నిగ్గులతోను -
చెలువు డింటికి వ - చ్చెనే! అందుకు లోలో
పలనె నొచ్చుకొని - పలికినందుకు విభు -
డులికి రంతులు చేసెనే! ఆ సుద్దులు
చెలు లడిగితేను న - వ్వాల కని వారితో -
మలయజ గంధిరో! - మరుగుచేసితి నింతే ॥నోరె త్త॥

2. అదురు బెదురులేక - నుదుటి లత్తుకతోను -
కదసి కౌగిలిమ్మనెనె అందుకు నేను
అదరివచ్చిన కోప - మడచుక మెల్ల నే -
అదిమేర కాదంటినే - అందుకు వాడు
అదలించితే నాకు - ఇది యేమానో యని -
యరటాకు సామెత - యట్లు వానితోనె ॥నోరె త్త॥

3. వినవమ్మ! గళముపై - వీడెంపు రసముతో -
నను కెమ్మోవిమ్మనెనే అందుకు నేను
ఎనయ వచ్చిన వాని - మనసు నొప్పించుట -
ఘనము కాదని యుంటినే అంతలోవాడు
మునపటి వలెనన్ను - దనియ గలసితేను -
మువ్వగోపాలుని - మోమోటమిచేత ॥నోరె త్త॥

## 129. అహీరి* - చాపు

(సీయ - మధ్య, స్వాధీనపతిక)

పల్లవి :

పచ్చిరొయ్యొడలి దానర !

అనుపల్లవి :

పచ్చిరొయ్యొడలి దాన - పాపడు నిలువడు -
వచ్చికూడుటకు వేళకాదు
వచ్చె తాళవోయి - వదలను నీ పొందు -
మచ్చిక నొయ్యారి-మా మువ్వగోపాల ! ॥పచ్చి॥

1. మిసమిస లాడేటి - నొసటి సొంపుచూచి
కొసరి పైకొనేవు - కొల్లలుగా
కసరితే నొకవింత - గారాబుచేసేవు
రసికుడ ! యీవేళ - రా రాదు పోపోరా ! ॥పచ్చి॥

2. పట్టకురా రొమ్ము - పాలంటు జేతుల
ఎట్టులోర్తును పరు - లేమందురు
పట్టిపోతే మొర - పెట్టును పసిబిడ్డ
అట్టె మనసు బిగ - బట్టుకో రేణ్ణాళ్లు ॥పచ్చి॥

---

* ధన్యాసి

3. కారము తిన్నాను – కరకర లాడీని
ఈ రేయి ౹ శీతం – గేశుడ !
మారుకేళి గూడ – మా మువ్వగోపాల !
ఆరడిపెట్టకు – మోరి ! నా సామి !

130. మోహన - అది

(స్వీయ - ప్రౌఢ, ధీర, ప్రేమగర్వితా)

పల్లవి :

పరదేశమున జేసిన – పనులిందు చెప్పరాదు రే

అనుపల్లవి :

తరుణులార ! యిదెక్కడి జోలి – తాళగదరే !
మీ పుణ్యమయ్యాని ! ॥పర॥

1. దాని యింటికి పోయివచ్చి – ధనములిచ్చి వేడుకొన్నాడా ?
వాని చక్కదనమె చూచి – వలచిపైకొని బతిమాలి
గాన విద్యా ప్రౌఢిమిచే – కరగించినట్లు కాబోలు
మానిని మగవాడు గనుక – మనసు నిలుప లేడాయె ॥పర॥

2. పూచిన తంగేడు వలెనే – భూషణ భూషితురాలై
చూచి మరుడంపిన మోహినీ – సుదతివలెనె వచ్చినిలిచి
ఓ చక్కని ముద్దుసామి ! – ఒంటినుండమేర కాదని
తేచివచ్చి మాయింటిలో బవళించుమనె గాబోలు ॥పర॥

3. ఎన్నగ మధురా పు - రీశుడైన మువ్వగోపాలుడు
నన్ను మరుకేళిలో గూడిన - నాటనుండి యన్య మెరుగడు
చిన్నెల వాడు గాడమ్మ - చెలియరో! గాంభీర్యశాలి
కన్నరో! నే దగ్గరలేని - కాంతాళాన నైనట్లు కాబోలు
॥పర॥

131. కాంభోజి - త్రిపుట

(స్వీయ - మానవతి, అసాధ్యమాన (రసాభాసము) నాయకుడు - ధృష్టుడు)

పల్లవి:
పలుకులేటికి దయలు - బట్టబయలాయెగా

అనుపల్లవి:
ఎలనాగ! అవకాశ - మేమున్నదయ్యయ్యో! ॥పలుకు॥

1. నెట్టు కొన్నట్టి మమత - నిలుపలేక మోవి మ్మంటె
పట్టి త్రోసి మనసు - గట్టిచేసుకొంటివి
చుట్టము లేనివారు - సుదతి! ఎవ్వరినో
పట్టుకొని పాటలాడి - నట్టాయె నామనంబు ॥పలుకు॥

2. హితముగా నీ పాదములె గతియని నమ్మియుంటి
ఇతరునిగా జూచితి - వేమిసేతు సుదతి!
సతులనమ్మి - పాపజాతి మగవారికి
గతులు లేవనుమాట - కలికిరో నిజమాయె ॥పలుకు॥

3. మొగమోట మేలనే - మువ్వగోపాలుడ గాన
అగడైతి నిన్నుగూడి - అందరిలోన
మగువ వాక్కున నొకటి - మదినొకటి యెంచుకొని
తెగనాడితివి మున్ను - తెలియలేనైతి నీతోడ ॥పలుకు॥

---

132. *కేదారగౌళ - ఆది

(స్వీయ - మధ్య, ప్రత్యుత్పతిక)

పల్లవి:

పోయిరమ్మనే ముద్దుగుమ్మ! నా సామిని

అనుపల్లవి:

నేయముగాదు వద్దంటే - నిలిచేది మేరకాదు ॥పోయి॥

1. ఏల కన్నీరు నించేవే? - ఏమిటి కానబెట్టేవే?
ఏల వేడుకొనేవే? - ఈప్రొద్దు మంచిదినము ॥పోయి॥

2. తరుణిరో వానితోనేల - తరుచు మాటలాడేవే?
తరువాత నడచే సుద్ది - తానే వినబొయ్యీని ॥పోయి॥

3. కలసినదే కల్లలాయె - కలలో నీ ముద్దులాయె
పలుకులేల మా మువ్వగో - పాలుని మహారాజువలెనే
॥పోయి॥

* రేగుప్తి - అఠాణా.

## 133. కేదారగౌళ - త్రిపుట*

(స్వీయ - ముగ్ధ, ఖండిత)

పల్లవి :

ప్రేమ కేశవరాయ - బెదరింపుల కే మాయె

అనుపల్లవి :

ఆమోహం దే సతమాయె - అవురా ! జాణరాయ ॥ప్రేమ॥

1. నిదుర కన్నుల మంపు - పెదవుల కాటుక నింపు
పదముల కుంకుమ కెంపు - ఫాలమున లత్తుకసొంపు॥ప్రేమ॥

2. మంచిది యందుల కేమాయె - మగవారి మాటలేమాయు
పంచి వేసినది లెస్సాయె - బొంకులేలరా ? విటరాయ !
॥ప్రేమ॥

3. మైలతో నన్నంటరాకు - మారుని తురాయి నీకు
మాలిమి సేయరాబోకు - మాకునై చదీదిమాకు ॥ప్రేమ॥

4. మాలిమి శ్రీ నాగశైల - మల్లికార్జున ! మువ్వగోపాల !
ఏలితివి నన్నీ వేళ - మోదమలర శ్రీలోల ! ॥ప్రేమ॥

---

* అట, చాపు.

## 134. సావేరి - ఆది
(స్వీయ - సఖీ ఉపాలంభన)

పల్లవి :

మగవాని కట్టిపెట్ట - మనతరముగాదే !

అనుపల్లవి :

మగువ ! మువ్వగోపాలుని - మనసు తెలియని దానవా?

॥మగ॥

1. మాటికి నీవే మన్నాను - మర్మము మది నుంచునా ?
బోటి ! నిన్ను జూడక యె - చ్చోట నైననుండునా ?
పోటీచేసి వానిపైని - పొరిచూపుల కేమేమో
ఏటి కీ చేత - లింకనైన చాలు చాలు ॥మగ॥

2. నిన్నరాతిరి వానితో - నీ వాడిన మాటలువింటే
వన్నెలాడిరో ! తాళ - వశమా ? ఎవరికైన ?
అన్నిట నెరజాణ గాగ - అతడు తాళెను గనుక
ఎన్నటి కీ మాట - లెత్తవద్దూరకె చాలు ॥మగ॥

3. భామరో ! మువ్వగోపాలు డే - పడతికైన చిక్కేవాడా?
వేమరు నీ మదిలోన - వెతనొంద నేటికే
ఆముకొన్న ప్రేమచే - అతడు నీవెప్పటివలెనే
కాముకేళినిగూడి - కలసి మెలసి యుండరే ? ॥మగ॥

## 135. భైరవి - అది

(స్వీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత. నాయకుడు - శఠుడు. విరహ విప్రలంభ శృంగారము, కరుణ)

పల్లవి :

మానినిరో ! చేరరమ్మని పిలువని – మూలిమేటి మూలిమే!

అనుపల్లవి :

పూని దానిప్రాయ మనుభవింపగలేని – పురుషుడేటి
పురుషుడే ? ఓ చెలియా ! ॥మాని॥

1. వెన్నెలబైట సంగీతము విననట్టి – వేడుకేటి వేడుకే ?
చిన్నెలు మెరయించి చిరునవ్వు నవ్వని – చిత్తమేటి
చిత్తమే ?
సన్నుతాంగిరో ! కనుసైగచేయని యట్టి – సరసమేటి
సరసమే ?
పన్నుగ దాని వర్ణింపలేనట్టి – పదములేటి పదములే ?
ఓ చెలియా ! ॥మానిని॥

2. విరిపాన్పుపై సోలి వేగింపలేనట్టి – విరహమేటి విరహమే !
తరితీపుతో చాల తమకమెచ్చని యట్టి – తనువులేటి
తనువులే ?
కరికుంభముల సాటి కుచముపై లేని–కరములేటి కరములే!
విరిగొన్న విధమున అధరమానని యట్టి – పెదవులేటి
పెదవులే ? ఓ చెలియా ॥మానిని॥

3. నీవే నా ప్రాణనాయకి యని యెంచని–నెనరు లేటి నెనరు లే?
చవుసీతి బంధము విధము తెలియనట్టి – చదువు లేటి
చదువు లే ?
కవులకు బహుమాన మియ్యగ లేనట్టి – కలుము లేటి
కలుము లే ?
అవునని మువ్వగోపాలుడు మెచ్చని – యంగ మేటి
యంగ మే ? ఓ చెలియా ! ॥మానిని॥

---

136. భైరవి - త్రిపుట

(స్వీయ - ఖండిత, మధ్య, ధీరాధీర. నాయకుడు - శఠుడు, అయోగ విప్రలంభ శృంగారము, రౌద్రము.)*

పల్లవి :

ముందటివలె నాపై నెన రున్నదా ? నా సామి !
– ముచ్చట లిక నేల రా ?

అనుపల్లవి :

ఎందుకు మొగ మిచ్చకపు మాట లాడేవు ? –
ఏరా ! మువ్వగోపాల ! మేర గాదురా ! నా సామి !
॥ముంద॥

1. పిలువ నంపిన రావు – పిలిచిన గైకోవు
పలుమారు వేడిన – పలుకవు
వలపు నిలపలేక – చెలువుడ వని నిన్నే
తలచి తలచి చాలా – తల్లడిల్లుచే కాని ॥ముంద॥

* రసమంజరిలో పరకీయ, పరోఢ, అధమ.

2. చిన్ననాట నుండి - చేరిన దెంచక
నన్ను చౌక చేసేది - న్యాయమా ?
వన్నెకాడ నీదు - వంచెన లెరుగనా
నిన్నన బనిలేదు - నే జేయు పూజకు ॥ముంద॥

3. కలువల రేడంచు - కంచి వరదా ! నిన్నా
లలన యింత దూ - రము రానిచ్చేనా ?
అలరువిల్తుని కేళిని - అలుముకొనుచు నన్ను
కలిసిన పాపానకి - కన్నుల జూడవచ్చితివో ॥ముంద॥

---

### 137. కాంభోజి - ఆది

(స్వీయ - ప్రౌఢ, అధీర ; జ్యేష్ఠ - కనిష్ఠ ; తన నాయకుడు వేరొక నాయకునితో తన మందిరముననే సరసము లాడుచుండ చూచి, యలిగినప్పుడు సమాధానపరచవచ్చిన సఖితో తన కోపము తెలియజేయునది.)

పల్లవి :

ముద్దు లేని వానితోను - ముచ్చట లేలే ?

అనుపల్లవి :

నిద్దుర లేప రాకవే - నే వచ్చేదాన గాను ॥ముద్దు॥

1. చెలియ ! వాని గుణము - తెలియ రా దెవ్వరికి
పిలువ నంప వాని పయి - అలిగి యుండేటి నా
వలపు నిలు పెక్కడ ? - చెలియ ! చేసియున్నాడు
కలకాలము నీవు నాతో - కనికరము సేయ వచ్చేవు ॥ముద్దు॥

2. ఆము కొన్న ప్రేమ వాడు – ఆకడ జారుకొన్నాడు
నా మీద దయ వా డంటే – నవ్వరా ? చెలులు
ఏమో నాటి చెలిమి – యీ వగల గలుగ దే
రామ రామ ! నాతో ఇంతగా – పోల సేయ వచ్చునే
॥ముద్దు॥

3. సద్దుసేతురా నీ వంటి – సరసు రాలవు
పద్దు మీరి నా యింటవే – వద్ద నొక తె నుంచుకొని
.......................................
పద్దులేని మువ్వగో – పాలునితో పలుకులేల నే ॥ముద్దు॥

---

## 138. కాంభోజి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, కలహాంతరిత)

పల్లవి :

మేర కాదు రమ్మనవే ! నా సామిని

అనుపల్లవి :

మీర తోవు సేయక – మువ్వగోపాలుని ॥మేర॥

1. అలిగే వారలు లేరో ? – అంతలోనె సమ్మతించి
కలిసే వార లేరో ? – కలికిరో ! యిపుడు
చలపట్టి యిందు రాడు – చాల మ్రొక్కిన వినడు
వలరాజు బారి కోర్వ – వశముగాదో యమ్మా ॥మేర॥

2. నెనరున నే నొక్క టంటె - నెలత! అదే నేరము చేసి
అనరాని మాట లాడి - అలయించెనే!
వనిత! మోహాంబుధిలో - మునిగి యెట్లోర్చుదాన?
తనవంటి సామి కిది - తగవు కాదనే కొమ్మా! ॥మేర॥

3. మమతతో చిన్ననాడే - మచ్చిక చేసి నన్ను
సమరతుల నేలినట్టి - చనవుగ నన్ను
గమకించి మోవి పంట - గంటి చేసితినని
రమణి! మువ్వగోపాలుడు - రాక పరాకు చేసెనే ॥మేర॥

---

## 139. సైంధవి - అట

(స్వీయ - ప్రౌఢ; ధీరాధీర: నాయకు డన్యకాంతా సక్తుడయి ఆమెకు నగలు నాణెములు ఇచ్చినవార్త తెలిసికొని నాయకుని అడుగునది.)

పల్లవి:

మేలు మేలురా! నిన్ను - మెచ్చ వచ్చురా!

అనుపల్లవి:

చాలు చాలు నీతో పొందు - సామి! మువ్వగోపాలా!
॥మేలు॥

1. ముదిత కై తే - ముత్యాల సరమా? య -
ల్లది నా కన్న మీసరమా? నీవు
పదరి దానికిచ్చ్యుతరమా? -
భళిభళిరా! మేలు కామి తరమా! ॥మేలు॥

2. అలదానికి జీనా సరిపెనలా ? –
    ఔరా ! పొలతితోనె సరిపనులా ? ఆ
వెలదికి పారిజాతము ననలా ? –
    వేమా రెవ్వరికి లేని మన్ననలా ? ॥మేలు॥

3. అతివకు వేయి వరాలా ? –
    అల్లది యే మోహాపు జవరాలా ? దాని
రతులచే రమియించ చెయి సరాలా ? –
    రమణికి బిరుదు నాగసరాలా ? ॥మేలు॥

---

140. బిలహరి - త్రిపుట

(స్వీయ - ముగ్ధ, ఖండిత)

పల్లవి :
    మోసపోదునా వానికి నేడు – మోసపోదునా ?

అనుపల్లవి :
    మోసపోదునా ? నేటి – మువ్వగోపాలుడు
    ఆసలాడి న – న్నల యించ జూచెనే ! ॥మోస॥

1. కోరిక మీర వాని వేడుక కొంకక –
    గోరు వంక తెమ్మన్న నేగి
కూరిమి నా చెలి గోరువంక తెచ్చి –
    సారెకు చెక్కిలి చూపెను వాడు నే బాలగాన ॥మోస॥

2. పలుమారు నా చేతి యుంగరాని కొక్క-
పలుకెంపు వేడినదే పోయి
అలదాని బలుకెంపు అతివ! తెచ్చి నను
బిలిచి తన మోవి జూపెను వాడు చిన్నదాన గాన
॥మోస॥

3. విరిబోణి! ఆసతో సరిపెనలు
వెలది! ఇపుడె తెచ్చెదనని
సరసుడౌ మువ్వగోపాలుడు సమరతియేలి యిదె
సరిపెన లని నవ్వెను నే కొదమగాన ॥మోస॥

---

141. సావేరి - త్రిపుట (ఆది)
(స్వీయ - ప్రౌఢ, దివ్యాదివ్య)

పల్లవి :
లేమరో మా మువ్వగోపాలు డెందైన -
లెస్సయుండితే చాలునే

అనుపల్లవి :
వేమారు దూరేది తగవా? భావిలో నీరు
వెల్లువపోయీ నటవే! ఎంతటి దిటవే ॥లేమరో॥

1. నా పుణ్యము చక్కనౌ నాటి దినములెల్ల -
నన్ను చే పట్టలేదా?
ఈ పట్ల విడనాడె వెన్నెల చీకటి -
ఎవరికైన లేదా? వానితో వాదా? ॥లేమరో॥

2. పలుమారు నా వెత జూచి నొచ్చిన నోట -
పలుకఁ బొయ్యేరు సమ్మీ!
అలిగి మీ చేత నే నాడించి నట్టయితే -
అతని మనసు నొచ్చునే! ఏమి వచ్చునే? ॥లేమరో॥

3. కన్నెరో నను గూడి కౌగిట లీయమై -
యున్న మువ్వగోపాలుడు
వెన్నవంటి మనసు రాయి చేసుకొన్నాడు -
విడనాడి యిందు రాడు మోము చూడడు ॥లేమరో॥

---

## 142. కేదారగౌళ* - ఆది

(స్వీయ - మధ్య, అతృప్త; ఏకశయ్యా న్యోన్యసంయోగ వియోగము)

పల్లవి:

లేమరో! ఊరకే పవ్వ - ళించి యుంటినే

అనుపల్లవి:

మా మువ్వగోపాలుని కే - నీమాటి బోధించెనో!
ఆ మాటేమియులేక - అత డాకడ; నే నీకడ ॥లేమరో॥

---

* యదుకుల కాంభోజి.

1. వడివడి కోపముతోను - వచ్చి ముసుకు పెట్టుకొని
పడకింటిలో మాటాడక - పవ్వళించెనే!
విడమియ్యనే బోదుగదా - విదళించివేసె నందుకు
నుడువ నోరాడక యిది నా - నోము ఫల మనుకొని
॥లేమరో॥

2. మెదలితే శయ్యపై తనమేను - నామేనంటునని
యొదిగి తా మంచము కోటి - యోర జేరెనే!
కదిసి నా కౌగిటి లోనే - నదముక మోవానబోతే
ఉదిరి లేచి పోయీనని - పదరేది మేరగాదని ॥లేమరో॥

3. అలగియున్న విభుడెప్పటి - యలవాటున నాయందు తిరిగి
కలికి! నిదుర పరాకేమో - కౌగిలించెనే!
సలలితముగ నే నప్పుడు - సందుకొని మువ్వపురి
నిలయునితో గలసి - నేను నతడు నవ్వుకొని ॥లేమరో॥

## 143. మధ్యమావతి - చాపు

(స్వీయ - ప్రౌఢ, ధీర)

పల్లవి :

వలచిన వాడనే నీ మీద చాల

అనుపల్లవి :

కులుకులాడి! మువ్వ - గోపాలుడనె భామ ॥వలచిన॥

1. నినుబాసి కంటికి – నిద్దుర రాదు –
నిమిషమైన గాని ప్రొద్దు పోదు
ఎనసిన మరుబారి కోర్వగ రాదు –
ఇకనా తమి నిలుప వశముగాదు ॥వలచిన॥

2. బాళి నెంతో తరుణి యీవేళ –
తాళలేను నాపై దయ దాచిన మేల ?
చాల నన్ను కరుణించి లీల –
నేలు కొమ్మంటె – నీ జాగులేల ? ॥వలచిన॥

3. ఏపట్ల దయలేక యిటువలె నీవు –
పాప జాతి మరునిపాలు చేసేవు
కోపగించి నెనరు కొసరిన రావు –
కొమ్మ ! మువ్వ – గోపాలు డని కౌగిలీవు ॥వలచిన॥

---

144. పున్నాగవరాళి – త్రిపుట
(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :
వల పనే దెటువంటి – వస్తువో తెలియదే

అనుపల్లవి :
తలిరుబోణి ! మువ్వగోపాలుని – తచ్చనలకే లోనైతినే
తాళజాల నేమి సేతునే ? అయ్యయ్యో ! ॥వల॥

1. కన్న విన్న మేలుగా - దున్నచోట నుండనీయ -
దన్నము హితవుగా - దదేమో ప్రొద్దుపోదు
కన్నరో! వలపు నన్నింత - గా జేసెనో? లేదో? -
కటకట! తాళ నా వశమా? అమ్మయ్యా! ॥వల॥

2. రేయి బవలు నిద్దుర లేక - రెట్టించి వానిపై ప్రేమ
ఓయమ్మ! మించెనే తమి - ఓర్వనా వశమా?
మాయగాడు మువ్వగోపాలుని - మచ్చికలకే లోనైతి నేనే-
గాయకము తెలియనైతిని అమ్మయ్యా! ॥వల॥

3. కలలో మెలుకవను వాని - కలవరనే కాని -
చెలులతో మాటాడ నా - చిత్తము రాదె
అలవాటు లేని మోహాము కానవే -
అయ్యయ్యో! యేమిసేతునే? అమ్మయ్యా! ॥వల॥

---

## 145. పున్నాగవరాళి - ఆది

(స్వీయ - మధ్య ; సఖీశిక్షాలక్షణము)

పల్లవి :

వాడిచ్చిన సొమ్ములేల? వద్దంటి

అనుపల్లవి :

నేడు ఈ మాటలు వించే - నిను నవ్వరా చెలులు
॥వాడిచ్చిన॥

1. హితవు గూర్చి నీతో - ఇంత కోపము వద్దని
బలిమాలే సఖులు నీ - పాటి కారా ?
అతివ ! వాని చేతు - లంటిన నీ గుబ్బ లు
న్నతములై నీ రొమ్ము న ను - న్నది యిందు కేలాగే
॥వాడిచ్చిన॥

2. నవనీతమువంటి మ - నసు రాయి చేసుక
ఎవరు చెప్పిన కన్ను - లెఱ్ఱ చేసేవు
అవు నె ! ఇన్నాళ్లు వా - డానిన కెమ్మోవి
కువలియాక్షి ! ఉంచేది - కొదవ గాదటవే ॥వాడిచ్చిన॥

3. కోరి నిన్నేలిన మువ్వ - గోపాలు డిందు వచ్చి
నేరములుగాచి మ - న్నించు మనిన
ఆరుదూరు చేసేవు - అతడు సంతరించగా
మీరి యున్నట్టి యీ - మే నేమి చేసేవే ? ॥వాడిచ్చిన॥

---

### 146. ఉసేని - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ధీరాధీర ; జ్యేష్ఠ - కనిష్ఠ)

పల్లవి :

వానికి నేనేల వలచితి నిటువంటి - వాడని తెలియకను

అనుపల్లవి :

నే నేర్పు మాలిన దాన నై నందుకు
పూని యెవ్వరికైన దూరుకొన నేలే ? ॥వానికి॥

1. అలరు శయ్యపై నా - న్నాల శైత్య మంతగ
చెలినల్ల సైగచేసితివిరా ? యంటె
అలివేణి! యిట్లందు - వనికదా యూరకే
అలదాని రమ్మంటి - నని బొంకు లాడనే! ॥వాని॥

2. నెనరుతో నా యొద్ద - నే యుండి దాని ర
మ్మని ముద్దు లిడుకొంటి - వని నే నడిగితె
నిను జూచి చూచి నా - కను లిరులు గ్రమ్మ యా
వనిత నీ వని యుంటి - నని బొంకె నమ్మా! ॥వాని॥

3. కూరిమి మా మువ్వ - గోపాల! నే జూడ
సార సాక్షిని ఎట్లు - చేరితి వంటే
వారిజముఖి ఈ లాగు - చేరితి నని తనివి
దీర సారెకు రతుల - దేలించె నమ్మా! ॥వాని॥

---

### 147. యదుకులకాంభోజి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ప్రోషితపతిక ; సఖి ఊరట వాక్యములు)

పల్లవి :

విందుబూచి తిరిగీనే తిల్ల గో -
విందు డిందు వచ్చా నేమో!

అనుపల్లవి :

ఇందు వదన! ఇంటి - ముందర సొంత మింతగ ॥విం॥

[illegible] [illegible] పాల - [illegible] తిరిగేనే!
కలకల [illegible] పైడి - గంట పలికెనే
[illegible] నెరికొ్క - ముడి యిప్పుడు వదిలెనే!
[illegible] నీ శకున - మెవరికయ్యా నమ్మా! ॥విందు॥

౩. [illegible] గుబ్బలు - చాల ఉప్పొంగెనే!
చక్కెరవంటి కెమ్మోవి - నారె కదిరెనే!
[illegible] సందటి దండలు - మాటి మాటికి బిగిసెనే!
[illegible] తోరణగాలి - పలుమారు పలికెనే ॥విందు॥

౪. తలచినట్లు నేడు - దైవము తోడయ్యానే!
కలికిరో! యిది క్షేమ - కారి యయ్యానే!
ఎలమి నీ వామ భుజ - మిపు డిదిగో! అదిరెనే!
పలుమారు మువ్వగో - పాలుడు నిను గూడెనే! ॥విందు॥

---

## 148. సావేరి - త్రిపుట*

(స్వీయ - మధ్య; సఖి - ఉపాలంభన)

[illegible]:

సామిగా! రారా యనంటే రో - స మటే? నీకు

అనుపల్లవి:

ఏమి నేర మమ్మా! మువ్వగోపాలుని ముచ్చట దీగ ॥సామి॥

---

* గోపికావసంతం - ఆది.

1. నీ మాటలు నమ్మరాదు - నీకే కోపమైనగాని -
కోమలి ! నాడే కంటి నీ - గుణము తెల్లను
సీమలో మగవారివలె - నేమైన నేరము చేసితే -
ఏమి చేతువో తెలియు - దిక నైన చలము మాని
॥సామి॥

2. నీవే యతనిని విడనాడి - నీకే కోపమైనగాని -
యీవేళ ఇద్దరి వాదుల - నెవరు దీర్చేరు ?
నావంటి సకియ లేకున్న - మీ వేడుకలు చెల్లునా ! -
ఆయా వింతల కేమి కొదవలేదు - వగలు చేయక
॥సామి॥

3. వేడుకతో నొకనాడైన - విభుడు నీవు ముదము మీరగ
జోడు గూడియున్న - సొగసు చూసెద నంటేను
నేడు కలిగె భాగ్యము - నెలతరో ! మీ యలుక దీర -
పాడి పంతముల మాని - పతియైన మువ్వగోపాలుని
॥సామి॥

---

## 149. పీలాంబరి - త్రిపుట

(స్వీయ - [1]ఉత్తమ, విరహోత్కంఠిత. నాయకుడు శఠుడు. వియోగ విప్రలంభ శృంగారము, కరుణారసము).

పల్లవి :

సామిని దయయుంచు మనవే! నా - చక్కని సామిని

అనుపల్లవి :

భామరో మువ్వ గోపాలుని - ప్రేమ సతిమని యెంచినావు
గదవే? తడవేల? పదవే! ॥సామిని॥

1. నెలతరో! నను విడనాడి యారు- నెలలాయె నలదాని గూడి
పలుమారు ఆ వెన్నెలాడి చాడి - పలుకులు విని
నాతో మోడి సేతురా?
ఇలను బూరుగు ఫలము పొంచిన
చిలుక సామితి - సేయ వద్దనవే! ఒక మాట వినవే!
॥సామిని॥

2. పగదాయె పూవింటి వాడు నాపై - మిగుల
పంతము కోరినాడు
తెగువ చేసుకో వశమా? నేడు నా మదికి - దిగులాయె
గదవే? నీ తోడు.
వగటురా పగవారిలో నను
అగడు చేసిన నెవరి నే - మందు నెటు తాళుకొందు?
॥సామిని॥

---

1. రసమంజరిలో సామాన్య, విరహోత్కంఠిత

3. ఆసలూరగ మువ్వపురిని నన్నేలిన - వాడు దేవుని
పొంచి కోరి
భాసు రాంగిరో! ఎలవు మీరి యతని - కోసరమై
చెలులు చేసారి
వాసి వాడని రతుల నెనసి నను
మోస పుచ్చుట న్యాయమటవమ్మా! ఓ - ముద్దు
గుమ్మా! ॥సామిని॥

---

### 150. కాంభోజి - ఆది

(స్వీయ - మధ్యా విరహోత్కంఠిత)

పల్లవి :

అక్కరో! వానికి నాపై - హర్షము లేదుగా!

అనుపల్లవి :

చక్కనాయె సారెకు రా రమ్మని వేడిన గాని ॥అక్కరో॥

1. నిన్న వాని బిలువ బోతే - నీరజాక్షియును దాను
నన్ను జూచి తలుపుమూసి - నవ్వుకొంటును
నన్నుతాంగిరో! యింతైన - సడ్డసేయక యుండితే
నన్ను నేను దూరుకొని - న్యాయము గాదని వచ్చితి
॥అక్కరో॥

2. చక్కఁగ చూడడు నన్ను – సరసాన మాటాడడు
ఒక్కవ్రాఁతైన మనను – ఉవిదరో ! వానికి
మక్కువ కేమియు లేక – మగువరో ! నా చెలిమి
వెక్కస మాయెనో ? గాక – వెలది యేమి బోధించెనో
॥అక్కరో॥

3. * ?

---

## 151. పున్నాగవరాళి – త్రిపుట

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

అయ్యయ్యో ! నా వంటి తొయ్యలి నేచేది –
అయ్యలూ ! తగునటరా ?

అనుపల్లవి :

నెయ్యముతో నిన్ను – నెరనమ్మ లేదా ?
గయ్యాళి బోధన – కాదన రాదా ?

1. ఇచ్చిన నమ్మిక – లేమాయె ? అలనాటి
మచ్చిక లన్నియు – మరచితివో ?
ముచ్చుమందుల మారి – ముదిత ననవలె గాని
అచ్చోట నిన్నన – నగునా ? నాసామి ! ॥అయ్యయ్యో॥

* మూడవ చరణము లేదు. ముద్ర మూడవచరణములో ఉన్నదేమో !

2. కలనైన నా యిల్లు - కదలని వానికి
చెలియ పెట్టినమందు - తలకెక్కెనో
వలరాజు శౌరికి - వశముగాదు రారా!
పలుకవు నే నీకు - పగదాన నటరా? ॥అయ్యరొయ్యా॥

3. మేడమీదికి పిలిచి - వేడుకొన్న వగలు
నాడేమో యది - తలపు లాయెన్
పోడిమికే బ్రహ్మ - పురుష పంచకుడనుచు
వాడుకొరా సతులు - వానిల్లు బంగారు కాను!
॥అయ్యరొయ్యా॥

4. మాలిమి మును న - న్నేలిన మువ్వ గో
పాల! యీ చలమేల - లాలించరా!
తాళజాల విరహ - తాప మగ్గల మాయె
జాలిబెట్టకు యిక - సరసుడ రారా! ॥అయ్యరొయ్యా॥

---

## 152. భైరవి - ఆది

(స్వీయ - ప్రౌఢ ; ఉత్తమ)

పల్లవి :

అయ్యలూ! నీ విట్ల - అలిగి యుందురా?

అనుపల్లవి :

తియ్యని విల్తుని గన్న - దేవా! మువ్వగోపాలా!
॥అయ్యలూ॥

1. కలికిరో ! రమ్మని - కస్తూరి మకరికల్
వలచు చెక్కిళ్ళపై - వ్రాయునపుడు
చెలగి మాటాడక - చేరిక నొందక
చలమున నవ్వులను - జడగొని బెదరించితే ॥అయ్యలూ॥

2. ఇంటిపనుల దీరిన - జాళువారవికెయు
తొంటికై వడి మించి - తొడిగి చూడు మనుచు
జంటవై నీవు నా - చనుమొన లంటగ
కంటి నీ వగయని - కన్నుల బెదరించితే ॥అయ్యలూ॥

3. విందును రమ్మని - వెలలేని నా మోవి
విందారగించిన - వింత కనుంగొని
అందుకు బదులుగా - నలమినే పైకొని
పొందు వేళలో నిన్ను - బొమముడిని బెదరించితే
॥అయ్యలూ॥

---

## 153. మంగళకైశిక - చాపు

(స్వీయ - ప్రౌఢ ; ప్రేమగర్విత ; స్వాధీన పతిక. నాయకానాయకుల పరిహాసల్లాపములు.)

పల్లవి :

అల్లల్ల అల్లల్ల అల్లల్ల కృష్ణపదర నాతో నీ వగలెల్ల

1. "చిలుకల కొలికిరో! - చెలగు నీ పైటలో -
    కలికేది యదియేమో - తెలుపవే!" "అది
కలికి జక్కవలంట - తెలియవ?" "అయితే
    సెలవియ్యవే పట్ట - జేరునో?" "అది పట్టరాదు
బలుకొండలు"; "అయితే - ఎలనాగ! -
    పై నెక్కని - వ్వేన?" "ఓరి
చిలుకల తేజవాని - చికిలి దుర్గము లవి -
    తలపున నీ వెక్క - దరమౌన? ఓరి!" ॥అల్ల॥

2. "చక్కని పగడంవు - చాయల అదియేమేమో -
    మొక్కను తెలుపవే - ముదితరో!" "వన్నె
కెక్కియున్న దొండ పండది" "అయితే -
    చొక్కము మొనపంట - నొక్కనే" "అది
నొక్కరాదు కెంపు - సిక్కము
    ఎక్కువ వెలయిచ్చిన నిచ్చేనా? ఓరి!
ఎక్కడ వెలలేని - సొక్కంపు మణి యిది
    దక్కించు కొననంట - తసికేవ? ఓరి!" ॥అల్ల॥

3. "వినవే నీ మొగమింత తళుకుమీరి
    తనరేని అదియేమో?" "అది
యనగ అద్దములంట తెలియవ?" "అయితే -
    వనిత నీడవచ్చునా?" "నీడ

కానగరాదు కపురంపు తునకలు" "అయితే -
నెనరుగ కలియ వచ్చేద?" "ఓరి!
ఘనుడ! మువ్వ గోపాల! - నిను గూడి కలసేను -
మునుపటి నెనరున - తనరేవ? ఓరి!" ॥అలల్ల॥

---

### 154. యదుకుల కాంభోజి - ఝంప

(స్వీయ - ప్రౌఢ ; కలహాంతరిత)

పల్లవి :

అలిగి యుండుట కేమి కారణమో - తెలిసి నీ వడిగిరా
పోవే ఓ భామా!

అనుపల్లవి :

చెలియ! ఇదివరలోన మువ్వ గోపాలునికి -
జేసిన యపరాధ మేమో చెలియా! ॥అలిగి॥

1. అందందు తిరిగి రావలసి వచ్చిన వేళ -
అలరు పాదము జలమున - అలమగా లేదా?
చందపు కావి పసిండి సరిగంచు పయ్యెదను -
సరవి తడి యొత్తగా లేదా?
మందమారుత అంకురము లాదవ సురటి చే -
మై చెమట లార్చగ లేదా?
గంధము పునుగు కస్తూరి యేలాది పచలతల
మై నలదగ లేదా? ఓ చెలియా! ॥అలిగి॥

2. మరులు కొూడియు కూడ నెలువంటి తొలినాడే –

    కూడి నెనరుంచగ లేదా ?

కరుణతో నను నెల్ల కాలము విడువక నే –

    కామకొమ్మనగాను లేదా ?

వగసతో తాను సేవించు ఊడిగ మెల్ల –

    వడివడిని సేయగ లేదా ?

మరుకేళి వేళ నే నెదు రెదురుగా వన్నుగూడి –

    పెదవి నొక్కగ లెదా ? ఓ చెలియా ! ॥అలిగి॥

3. తెప్పు తనవల్ల కలిగి పరవా సేయగ నే –

    తాళి నే నుండ లేదా ?

ఎప్పు డెప్పుడు వచ్చునని రాక కే –

    నెదు రెదురు చూడగ లేదా ?

ఎప్పటికి మువ్వ గోపాలుని చెలిమే కోరి

    ఎంతో నీతో పలుక లేదా ?

అప్పుడె యతనుతో రతి చెల్ల చేయుమని –

    అతనితో వేడగ లేదా ? ఓ చెలియా ! ॥అలిగి॥

---

## 155. ఘంటారావము - రూపకము*

(స్వీయ - ప్రౌఢ, ఉత్తమ; పశ్చాత్తప్తుడయిన నాయకుని వచనములు.)

పల్లవి:

అలిగి యేల యిందు వచ్చితి? -
నయ్యయ్యో! యింక నే నేమి సేయుదు

అనుపల్లవి:

చిలుకల కొలికి చింతలో నెంత - చిన్నపోయెనో?
॥అలిగి॥

1. జలజాక్షి నా యురమున నె కాని - శెయ్యపై నెన్నడు
పవ్వళించదు
అలరు నా మోవి పానకమె కాని - అన్నము ముట్టదు
పలుమారు నాతోనే కాని - ప్రాణ పదమైన
చెలులతో ముచ్చటలాడదు
ఎలనాగ మదన వేదనచేత - నెంత బడలెనో? ॥అలిగి॥

2. కలికి నన్నే కాని మొరుల - కలనైన చూడ నొల్లదు
ఎలమి నన్నే కాని మనసులో - నేమియు దలచదు
చెలియ నా పాదములకే కాని - వెయ్యొత్తి దేవరకైన
మ్రొక్కదు
కలకంఠి నను బాసి నందువలన ఎంత - కన్నీరు
నించెనో? ॥అలిగి॥

---

* ఝంప

3. కూరిమి నా సామి యనుగాని మువ్వ -
గోపాలయని పేర బిల్వ డెన్నడు
ఆ రూఢి రతికేళి తానే కాని న - న్నలయ నీయడు
వారిజముఖి నే నలిగితే తానే వచ్చి వేడుగాని -
పరుల బంపడు
ఏరీతి తాళెనో! ఎటువలెనున్నదో! - ఎంత
బడలెనో ॥అలిగి॥

---

## 156. కాంభోజి - త్రిపుట

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి:

ఇంతెనా పొరుగింటనే తావులేవట్ల

అనుపల్లవి:

ఇంతనా పొరుగింటనే - ఇంతి విజయరాఘ -
వేంద్రుని వేడుకతన ॥ఇంత॥

1. ప్రొద్దుపోదు గా - బోలు! సమ్మ! దాని -
వద్దనున్న - సుద్దులే! అందుచేత
నిద్దుర పట్టక - నే నుంటే, దానికి -
ముద్దు మీద - ముద్దులే! అది
కద్దో లేదో మా - కలికి సడిగెడ నని -
సద్దు వినలేక - సఖియ యింట నుండితి ॥ఇంత॥

2. వారిజముఖి నన - వలె నంట! -
  కేరడపు నవ్వులె దానింటి క
వ్వారి ఘుమఘుమ క - స్తూరి గాక మితి -
  మీరలేని పువ్వులె!
సారెకు నా యింటికి వా - సన లిందు వచ్చితే -
  ఓరువ జాలక - యువిద యింట నుండితి ॥ఇంత॥

3. భావజు కేళి - నా వసతి గూడే వేళ -
  పావురింపు - పలుకు లే!
ఆ వేళ విడువు - మని నమ్మిక లిమ్మని -
  ఆపె కెంత కులుకో!
నా వద్దికి రాడో! - నాతో మాటాడడో! -
  యీ విజయ రాఘువు - డెలమింతో నుండేది ॥ఇంత॥

---

**157. యదుకుల కాంభోజి - ఆది**

(స్వీయ - అధమ; సఖి - ఉపాలంభన)

పల్లవి:

ఇంత నిరాకరింతు రే? ఓ చెలియ! నీ -
  వింత నిరాకరింతువే

అనుపల్లవి:

పంతగించి నీ వీ లాగు - పాపమున కొడిగట్టి ॥ఇంత॥

1. తనువు నీ సొమ్మనెనట! – దయవాడ ననెనట!
మనసు నిలుపగా జాల – నని మ్రొక్కెనట!
నినుదూర నోరురాక – తను దా దిట్టుకొనెనట!
ననబోడి నీ వెంత రాతి – మనసు దానవే! ॥ఇంత॥

2. జిగిమోవి యానవిచ్చి – జీవము నిలుపుమనెనట!
వగలబెట్టి నన్నేచ – వద్దనెనట!
మగువ? నేనుసురంటె – మంచిది కాదనెనట!
దిగనాడితే గట్టిగ – తెగువసేతు ననెనట! ॥ఇంత॥

3. కలికి! విరహవేదనచే – కన్నీరు నించెనట!
చెలియ! నీ కూడికము – సేతు ననెనట!
కలిసి యెప్పటివలె – కరుణించుమనెనట!
అలిగి మువ్వగోపాలు – నాదరించక యీ వేళ ॥ఇంత॥

---

### 158. ఘంట - అట
(స్వీయ - మధ్య, కలహాంతరిత)

పల్లవి :
ఇగ నేలనే పట్టి వలపు – ఇసుమంతైన తెలియదాయె

అనుపల్లవి :
మగువా! ఇది నా నోము ఫలము –
మరచే నంటే మరవదాయె ॥ఇగ॥

1. అనుభవమే క్రొత్తలాయె – అసలేమీ లేకపోయె
మనసిజుని మాయలాయె – మమత లందే నిలిచిపోయె ॥ఇగ॥

2. విడువ తానిచ్చేనా యీ ఛాయ – వేడుక లీడేరదాయె
   సుడువ నోరాడదాయె – నొసటి వ్రాత
   తప్పదాయె ॥ఇగ॥

3. కలకాలము నాకు దక్కె – కలికిరో! మువ్వగోపాలు
   డలుకజేసి ఆపె తాను గలయ – నతితమినే
   జెందనాయె ॥ఇగ॥

---

### 159. సురట - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ఖండిత)

పల్లవి :

ఈ తనువుతో నిన్ను నే దలతునా! –
ఇంక నీ యాజ్ఞకు వెరతునా ?

అనుపల్లవి :

రాతిమతి గలవాని గొలుతునా ?
రార! మువ్వగోపాల! యని నిన్ను బిలుతునా? ॥ఈ॥

1. బలవంతుడని నీవు ఎంచక నాతో –
   పదరి నీవు మాట మించక
   అలదాని ముచ్చట లిందు తెప్పించక –
   అంటరాకు నను ఓరి జగద్వంచక! ॥ఈ॥

2. మరియాదలేని మోహము వద్దు ఆ -
    మగువతో పలుకర యీ పద్దు
దొరతనము పనికి వచ్చురా? యీ ప్రొద్దు -
    ద్రోహి! నీ మోము జూచితె పాపము కద్దు ॥ఈ॥

3. మనసు భ్రమసి నన్ను మీరక దాని -
    సుమతి దగిలి నన్ను జేరక
అనువుగాని వలపు నాపైని మీరక -
    అలనాటి పొందు చాలును నన్ను గోరక ॥ఈ॥

---

## 160. ఆనందభైరవి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, ప్రేమగర్విత)

పల్లవి:

ఊరకే చలము చేసేరా! మ్రొక్కేరా!

అనుపల్లవి:

ఔరా! మువ్వగోపాల! గారవించి చూడరా! ॥ఊరకే॥

1. వద్దు సేయక వేగ - వద్దికి రారా! వట్టి
సుద్దులనే తేలించి - ప్రొద్దు పుచ్చకురా!
ముద్దులయ్య! నీ మోము - ముద్దుగులుకుచున్నదిరా!
ముద్దుపెట్ట మనసయ్యెరా! - మోము మోమున
    జేర్చరా! ॥ఊరకే॥

2. అరమరలు సేయకురా! - మోసపోతిని దాసనురా!
తెరుఁగులవలె వలపు - దాచనేరనురా!
నెరనమ్మిన దాసనురా - నిమిషమిక తాళలేరా!
మనసిల్లు చెమ్మగిలి నామై - మరవసాగెనురా! ॥ఉం కే॥

3. అక్కర తెలిసి వేగ - పక్కనుంచుకోరా!
చక్కని మా మువ్వగోపాల! చొక్కియున్నానురా!
నిక్కి నా గుబ్బలు గోట - నొక్కి యెద జేర్చుకోరా!
ఎక్కువైన రతులచే - గ్రక్కున సన్నేలుకోరా! ॥ఉం కే॥

---

161. యదుకులకాంభోజి - ఆది

(స్వీయ - మధ్య, ప్రేమ గర్వితా)

పల్లవి :

ఎంత చక్కనివాఁడే! నా సామి వీ - డెంత చక్కనివాఁడే

అనుపల్లవి :

ఇంతి మువ్వగోపాలుఁడు - సంతతము నా మదికి -
సంతోషము చేసునే ॥ఎంత॥

1. మొలక నవ్వులవాఁడె - ముద్దు మాటలవాఁడె
తళుకారు చెక్కు టె - ద్దములవాఁడే
తలిరాకు జిగి దెగడు - దగుమోవి గలవాఁడె
తెలిదమ్మి రేకు క - న్నుల నమరువాఁడే ॥ఎంత॥

2. చిరుత ప్రాయమువాడే - చెలువొందు విదియ చం
మరు గేరు నొసలచే - మెరయువాడే
చెరుకు విల్తునిగన్న - పోరవలె నున్నాడే
మెరుగు చామనచాయ - మే నమరువాడే ||ఎంత||

3. పాదలు కెందామరల పెం - పొదపు పదములవాడే
కొదమసింగపు నడుము - కోమ రమరువాడే
మదకరి కరముల - మరువు చేతులవాడే
సుదతి! మువ్వ గోపాలు డెంతో - సొగసు గలవాడే||ఎంత||

## 162. భూపాల - చాపు

(స్వీయ - ప్రౌఢ ; సురత ప్రియ "ఈ నాయికయందు నాయకుడు చాలా దినములుగా రాకనే యుండి వచ్చినవాడు గనుకనున్ను, నాయిక మూడు జాములవరకు మాటలచేత ప్రొద్దు గడిపినందువల్లనున్ను, నాలుగో జామున నాయకుని కూడ ఇంటిలో కోడి కూసినందువల్ల వ్యాకులపడినందు చేతనున్ను సురత ప్రియ")

పల్లవి :

ఎంతో మనసున నెంచి యున్నందుకు
ఇంటిలో కోడి కూసెనా ? స్వామి !

అనుపల్లవి :

కంటిని గన్న మువ్వ గోపాల ! శౌరి ! -
కౌగిలించి మొక్క ముద్దైన పెట్టితినా ? ||ఎంతో||

1. మంచముపై మన మిద్దరు చేరి -
మరిమరి వింతలు సేయ గోరి
మంచిగ్గంధము నే దెచ్చితి ఈ సారి
మన యెడల నిర్దయ చేసినది మీారి ॥ఎంతో॥

2. ఆకులు మడుపు లందించితినా ?
అధరపానమైన జేసితినా ?
సాకిన దానికి సఫలము సేనా
సంభ్రమ మాయెనా ? సవతి యిదేనా ॥ఎంతో॥

3. కోరినకోరిక చెల్లకపోయెను
మరుబారికి నిక తాళలేను ఒక
పారైన కూడక నిన్నాడ బాయను
సామి ! మువ్వ గోపాల! వినరా! నేను ॥ఎంతో॥

---

163. కాంభోజి - చాపు

(స్వీయ - ప్రౌఢ, అధీర)

పల్లవి :

ఎందుకు నా పై జాలి ?

అనుపల్లవి :

ఏదు వదప విని యుండునా తాళి ? ॥ఎందుకు॥

1. దిన దినములు దాని యింట నీవు -
ఎనసి తిరిగితివి నగలాడివెంట
మనసు వచ్చెనా నేడు నన్నంట -
కనకాంగి వింటె తాళునె మాట ? ॥ఎందుకు॥

2. మందయాన మాట లేల -
మందుపెట్టి నిను వలవేసెనో చాల !
ముందటి నెనరెంచే వేళ -
అందరు నవ్వేరు అది నీ కొక్క మేల ? ॥ఎందుకు॥

3. భావము తెలిసెను నీదు -
దైవము ఎడజేసె నిక నే నేమందు తిల్ల
గోవింద ! మునుపటి పొందె చాలు ఇక మువ్వ
గోపాల ! సరసము లేల ? ॥ఎందుకు॥

---

## 164. కాంభోజి - ఝంప

(స్వీయ - మధ్య, ప్రోషిత పతిక, నాయకుడు - అనుకూలుడు, ప్రవాస విప్రలంభ శృంగారము)

పల్లవి :

ఎటువంటి మోహమో కాని ఓ యెలనాగ ! -
ఇంతంత యనగరాదే !

అనుపల్లవి :

మటుమాయ దైవ మీ మనసు తెలియగ లేక -
మన్నల నెడబాపె నయ్యో! ఓ మగువా! ॥ఎటు॥

1. కలికి! నిన్నెడబాసినది మొదలు నీ రూపు -
కనుల గట్టి నట్లుండునే!
చెలియ! నే నొకటి దలచెదనన్న నీ సేయు -
చెలిమి తలపై నుండునే!
సొలసి నే నేమైన వ్రాయ నీ యాకార -
శోభనమె కనుపించునే!
పిలిచి పేరున నొకటి పిలువబోయిన నీదు -
పేరు ముందుగ దోచునే ఓ మగువా! ॥ఎటు॥

2. అతివ! నీ యధరామృతము దలచి నంతనే -
ఆహార మింపుగాదే!
సతి! నీదు కౌగిటను ప్రతి దినము నెనసిన -
గతిదెలుప నిదుర రాదే!
మతిలోన నిన్నెకా నితరంబు నెరుగ రతి -
పతియాన కల్లగాదే!
సతతమును నిను దలప తుండెదనన్న -
క్షణమైన మరపురాదే ఓ మగువా! ॥ఎటు॥

3. ఘనత మా మువ్వ గోపాల! రా! రా! యని -
కలిసినది మరపు గాదే!
దిన మొక్క యేడుగా గడప నెవ్వరి తరము -
వనభోణి! ఏమిసేతు ?
మనసిజుని బాణవేదనల నే సైరింప -
మగువరో! వశము గాదే!
మనము చేసిన పాప మెట్టిదో బిరులతో -
మాటాడనే సైచదే! ఓ మగువా! ॥ఎటు॥

---

## 165. బిలహరి - ఆది

(స్వీయ - మధ్య, స్వాధీనపతిక. నాయకుడు-అనుకూలుడు.)

పల్లవి :

ఎటువంటి స్త్రీల పొందైన - హితవై యుండునా ?

అనుపల్లవి :

కుటిల కుంతల నా మదిలో - కూరిమితో నుండగ ॥ఎటు॥

1. మనసు మర్మము దెలియ వలసి - మగువల గొందరి దెచ్చి
కినిసి ప్రక్కబడద్రోసి - కేరి నవ్వేరు
కనకాంగి నను బంపునప్పుడు - కన్నుల నీరు నించుక
వినయోక్తులుగా విన్నవించిన - వితము మరవ
నీయదు ॥ఎటు॥

2. చెలి ముద్దుపాదము లాదిగ – శిరము దనుక చక్కదనము
నలిన సంభవునకు వ – ర్ణన సేయ దరమా?
అలివేణి దూరమైన – నైతే మనసు దూరమా?
వలపున నా తను వా రమణికి – వారకమై యుండగను ॥ఎటు॥

3. చెలువ! మువ్వ గోపాలుడైన – (శ్రీ) వేంకట రమణా! యని
కిలకిల నగవుల నాయెద గు – బ్బల గుమ్మిచు
కళలంటి పరవశము చేసి – కంతుకేళి సన్నెలిన
మెలతను దలప నిపుడు నా – మే నెల్ల పులకరించెగా ॥ఎటు॥

---

### 166. పంతుపరాళి - ఆది

(స్వీయ - మధ్య, అధీర. నాయకుడు - ధృష్టుడు.)

పల్లవి:

ఎన్నటికి నిటువంటి గుణ – మింక వలదె

అనుపల్లవి:

నిన్ను నన్ను గన్న విన్న – కన్నెలు నవ్వరే? ॥ఎన్న॥

1. వామాక్షిరో! మాట – వచ్చినప్పుడే నీవు నేను
ఏమైన నాడుకోమా – యెప్పుడైనను?
నా మోము నీవు చూడవో – నీ మోము నేను చూడనో?
భామ! ఇంటికి రా వద్దని – పలుకరింతు రటవే? ॥ఎన్న॥

2\. మెలతరో! నీ మీఁది - మిక్కిలి దయవాఁడ
కలికి! నా పై మనసు - గలదానవు
అలిగి యొకరి కొకరు మో - ములు జూడ వద్దనుచు
పెలుచ దనమున నొట్టు - పెట్టుకొందు రట వే? ॥ఎన్న॥

3\. నీరజాక్షిరో! ఇంచుక - నిన్ను నే నాడుకొన్న
నేరక రెండుమాటలు నన్ను - నీ వాడుకొన్న
అరసి మువ్వ గోపాలు - డని కలియు వేమో?
సారెకు నీ పొందులేక - క్షణమైన నుందునో? ॥ఎన్న॥

---

167\. కాంభోజి - అట

(స్వీయ - ముగ్ధ, జాతయౌవన, విరహోత్కంఠిత. నాయకుడు - శఠుడు, విరహ విప్రలంభ శృంగారము, కరుణరసము.)

పల్లవి :

ఏటి బ్రతుకమ్మ! - ఇక నేటి ముచ్చటలు? ఏక
నాటి వెత కాదాయెనే!

అనుపల్లవి :

ఈడు రాదాయె నని - ఏల తనువని చిన్న నా -
డెల్ల చింతించితే ॥ఏటి॥

1\. ఈడు వచ్చిన వెనుక - ఏమి పుణ్యమో సొగసు
కాదా! యని వలచితి వని
వాడు నను చేపట్టి వలచి వలవని తమిని
రాదాయెనని మదిని చాలా వేసట బడితిని ॥ఏటి॥

2. పగలెల్ల నేను నీ వగ – మొగమే చూచుకొని
దిగులు లేకుందు నమ్మా – వగనొంది రే యెల్ల
చిగురు పానుపు మీద – వుసురుసు రందు నమ్మా!
మగని చిత్తము రాని – మసువు లెట్లో ర్తుగో –
గగనమైన తపము – కడతేరదాయె నే నింక ॥ఏటి॥

3. నా వంటి దానికే – నలినాక్ష! యీ పట్ల
దైవ మెక్కడ నుండునో – నీవే నేనే యనుచు
విభుడు రాకున్నంత
నా విభవ మెట్లుండునో – భావమున మా
మువ్వ గోపాలుతో గూడిన యే – ప్రొద్దు మరపు
సేయుదు నింక నేమి? ॥ఏటి॥

## 168. కాంభోజి - ఝంప

(స్వీయ - ప్రౌఢ, ప్రోషితపతిక. నాయకుడు - అనుకూలుడు. ప్రవాస విప్రలంభ శృంగారము.)

పల్లవి:

ఏమి సేయుదు మోహ – మెటువలె దీరును?

అనుపల్లవి:

భామినీ మణి! ని న్నె – వ్వరు తోడి తెచ్చేరు? ॥ఏమి॥

1. వెలది! నీదు ముఖార - విందంబు లిఖియించి
అలరు వాసనలు వ్రా - యఁగ నేరనైతి
కళలొల్కు నీ మోవి - గదసి వ్రాసితిగాని
నెలత! తేనియ లుంచ - నే నేరనైతి ॥ఏమి॥

2. కలికి! సొగసైన నీ - కనులు వ్రాసితిగాని
బెళుకు చూపులు వ్రాయు - వితమెఱుగ నైతి
గళము రేఖలు దెలియ - గాను వ్రాసితిగాని
చెలగు కోకిల వంటి - పలుకు వ్రాయగ నైతి ॥ఏమి॥

3. తరుణిరో! నాగ బం - ధము రీతి గలియుటల
గరిమ వ్రాసితిగాని - పరవశముచేత
పరగ మా మువ్వగో - పాల! రా! రా! యని
తిరుగ రతులకు బిలుచు - తెలివి వ్రాయఁగనైతి ॥ఏమి॥

---

## 169. కల్యాణి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ, అన్యాసంభోగ దుఃఖిత. తన సఖి తన నాయకుని కలిసిన చిన్నెలు తెలిసికొని కోపముతో నీచముగా అడుగు చున్నది.)

పల్లవి :

కంచి వరదునితో పొందు - కద్దో? లేదో?

అనుపల్లవి :

వంచన మువ్వగోపాలు - వరదుడైన చక్కని ॥కంచి॥

1. నీవు దాచక తెల్పవే! – నీలవేణి! అల్లవాని
భావము జూచేపట్ల – పతియైనట్లు మతి తోచీనే ॥కంచి॥
2. నీవే య్యాడకు పోదువో? – ఆ విభు డిందు వచ్చునో?
ఈ వివరములు నేను – ఇన్నాళ్ళుగ నెరుగనైతి ॥కంచి॥
3. నీవు బతిమాలితివో? – నెలతా! అతడు పైబడెనో?
దేవునాన నీ వింత – దిగులుపడ నేలనే? ॥కంచి॥

---

## 170. ముఖారి - చాపు

(స్వీయ - ప్రౌఢ, అన్యాసంభోగ దుఃఖిత, మధ్యమ. నాయకుడు - శఠుడు.)

పల్లవి :

కావలెనమ్మ! వానికట్ల – కంబుకంఠి!

అనుపల్లవి :

ఈ వేళ మువ్వ గోపాలుడు – నావద్ద జేసిన వింతలకెల్ల
॥కావలె॥

1. మందుల మా రది మాయజల్లి – యెందుల జూడ లేనిగడుసు
అందు పోవద్దని నే – నంటి చేపట్టుక
సందెజాము వేళ పోయి – సరిగా దానిల్లు చొచ్చితే
ఇందేల వచ్చితి వంటది – ఎన్నైన బాస లిచ్చినదట!
॥కావలె॥

2. వగవ నేటికి ? అటువంటి - వానికి తగునె ! కొమ్మ !
పగలు రేయి మునుపు - వద్ద బాయక దానితో నే
నగవు లెక్కడ ? సయము లెక్కడ ? - నన్నాడు కొనే
దెక్కడ ?
ఇగురు బోణి ! నామదిలో - ఈసులు దీర నేచె వది
॥కావలె॥

3. మొన్నటి నేరము లెంచక నేను - మువ్వగోపాల దేవుని
ఎన్నిక చేసి నా మదిలో - నే బ్రొద్దు బాయక
చెన్నుగ రతుల గలసిమెలసి - చిత్తము రాను సేవచేసి
కన్నరో ! నే మించు - కొన్న దెంచక
గ్రక్కున దానింటి కేగిన తడవ ॥కావలె॥

## 171. ఘంటారావము - త్రిపుట

(స్వీయ : ప్రౌఢ, ధీర ; నాయకుడు - శఠుడు)

పల్లవి :

కోమలిరో ! వలచినందుకు - గోపాలు డనరా నన్ను

అనుపల్లవి :

ఏమే మని పేరను పిలుతురో తెలియదు
సీమలో జనులందరయ్యయ్యో ! ॥కోమలి॥

1. ఆముకొన్న తమి నిలుప లే నప్పుడు -
ఆసల బెట్టితివి
కాము త్తాపుల మనసు గరిగి మతిమాలిన -
కరుణ జూడ వైతివి
రామరో ! యిక తాళరా దేలుకొమ్మంటే -
రమ్యము గాదంటివి
సోమ వదన ! రేపు మాపంట కడకు -
జూజమే చేసితి వయయ్యో ! ॥కోమలి॥

2. చెలిమికై నే నెంత చుట్టుక తిరిగిన -
చింతల బెట్టితివి
నెలతరో ! అందుకు కొలకుల వడియు -
నీరు దుడవ వైతివి
లలన నే వెన్నెలకాక కుడుకగా చ -
ల్లని మాటలాడ వైతివి
చలపాదివై పగ సాధించి -
జాలి మాలి బెట్టితి వయ్యయ్యో ? ॥కోమలి॥

3. పలుకరించి మా ముద్దుగో -
పాల ! రమ్మని బత్తి సేయవైతివి
నలినాక్షి ! నన్నుగూడి నా డిచ్చిన -
నమ్మికే మరచితివి

చెలియరో! నీ వద్ద జాము నిలుచుండినా -
చేరదీయ వైతివి
కలికిరో! నా వంటి వాని మే లెన్నక -
గర్వాన నుంటి వయ్యయ్యో! ||కోమలి||

---

172. కాంభోజి - ఆది

(స్వీయ - జ్ఞాత యౌవన, నవోఢ.)

పల్లవి:

గిలిగింత లయ్యీర! నాసామి! చ -
క్కిలిగింత లయ్యీర!

అనుపల్లవి:

గిలిగింత లయ్యీర! - కలికి విజయ
రాఘవ!
మొలక చన్ను నీ పంటి - మొనను నొక్కకు మల్లె ||గిలి||

1. కురులు కూడని చిగుత - పరువాన నమ్మి! నీ
పరులు మరులు చేసి న - న్నలయించుచు
విరజాజి శయ్యపై - మరుని మంత్రములచే
పరిపరి వగ వింత - పలుకు నా చెవి సోకే ||గిలి||

2. పలుక నేరని లేత - వయసున నన్ను నీ
పలుకుల నే సొక్క - జల్లి కళ రేచుచు
మొల నూలు దూసిపోక - ముడిలోపల చెయి వేసి
చెలగి గిలిగింత సేయ - కయ్యాలు! మ్రొక్కె(ను) ||గిలి||

3. అక్కర తెలియని - యరవిరి ప్రాయాన
దక్కిన దయ వానివలె - తప్పు మ్రొక్కులు మ్రొక్కుచు
పక్కలోనే పవళించి - బాస లెన్నైన చేసి
అక్కున జేర్చి యెడి - యందు నాకెక్కువు ॥గిలి॥

## 173. కాంభోజి - రూపకము

(స్వీయ - ప్రౌఢ, సమాగచ్ఛత్పతిక. సఖీ పరిహాసము.)

పల్లవి :

చాలు చాలు నీవల్ల నేరమా ?

అనుపల్లవి :

తేలించి మా మువ్వగోపాలు నింటికి -
తెచ్చిన నన్నన వలెను గాక ॥చాలు॥

1. అలివేణి ! నీ విభుడు నీవు నిక నెన్నడు -
నలిగి యుండరో ? యొకరి నొకరు
పిలువుమని నన్ను వేడుకొని - ప్రియము చెప్పరో ?
చులకగా జూచెదవు నన్ను తేరి -
చూడవు మంచి మాటయిన నాడవు
తెలిసె తెలిసె నేడు నీ యక్కర -
తీరె గనుక నింక నే నేటికి ? ॥చాలు॥

2. నా సామి! నిన్ను జేరనప్పుడె – నాతిరో! నీవే నని యుంటివి
వేసారక దినదినము కాళ్ల – వేళ్ల పెనగితివి
ఏ సొమ్ము కోరిన నిచ్చెద నంటివి – ఏ బుద్ధి చెప్పిన
వినే నంటివి
వాసిగ నేరు గడచితే పుట్టి – వాసికె పొమ్మన్న
మాట నిజమాయె ॥చాలు॥

3. కోమలిరో! దాని గూడిన మువ్వ – గోపాలుని
తెచ్చి నిన్ను గూర్చితి
నా మేలు తెలియదు నేను ప్రతి – నప్పుడె మరచితివి
నే మాటవాసికి పెనగితి నింతే – నిన్నుంచి నాకు
రా సిగ్గు దేమి?
కామిని! యీ కలికాలమున కుప – కారము కలదా?
యెవరి కైన? ॥చాలు॥

---

174. శంకరాభరణం - మిశ్ర
(స్వీయ - మధ్య, అధీర)

పల్లవి:

చిటుకకు నింత కోపము – సేయు మువ్వగోపాలుని పై

అనుపల్లవి:

ఇటువంటి నా వలపు – ఏమి కాబోయీనమ్మా!
॥చిటుకకు॥

1. వచ్చినప్పుడు నేనె వద్దకి పొయ్యేదే కాని
ఇచ్చటికి రా రమ్మనే - దెన్నడైన లేదుగా ?
ఇచ్చ లిచ్చలు నేనే - వచ్చి లాలించేదే కాని
గుచ్చి నన్ను కౌగిలించుకొన్న దెన్నడు లేదుగా ?
॥చిటుకు॥

2. ముందుగా నేనే పోయి - ముద్దిడుకొన్నదే కాని
(కుందరదన ! నన్ను ముద్దిడు - కొన్నదెన్నడు లేదుగా ?
పొందుగా నేనే నవ్వ - మొగము పెట్టేదే కాని)
మందయాన ! న న్వానేది - మనసునైన లేదుగా ?
॥చిటుకు॥

3. బలవంతమున నేనే - పలుకరించేదే కాని
ఎలమి నాతో మాటాడే - దెన్నడైన లేదుగా
అలసి వచ్చినప్పుడు నే - కలిసి కూడేదే కాని
చెలియ ! మువ్వగోపాలుడు - చేరియున్నది లేదుగా !
॥చిటుకు॥

---

175. తోడి - త్రిపుట
(స్వీయ - ప్రౌఢ, ప్రోషితపతిక.)

పల్లవి :
త త్తరపడలేక యున్న ప్రౌఢ - తన మేమను కొందునే

అనుపల్లవి :
కొ త్తగాను మువ్వగోపాల ! నీ వన్న
ఉ త్తరంబు ఎటు లోర్చుకొందు నని ॥త త్తర॥

1. వేడుక ఊరికి - వెడలి వచ్చెద నంటే
విడె మొసగి యిది - విహితమా ప్రాణేశ !
నేడు నీ మది కోర్కె - నెర వేరును నీకు
తోడున్న మనసున - తొలుత చూపితి నని ॥తత్తర॥

2. కంకణ యుగము - కన్నీరును ధృతి
పొంక మైన బుద్ధి - పోవగాను తన
వంక హారితో జీ - వంబును వెడలక
సంకట పడనేల ? సామి ! తెల్పు మని ॥తత్తర॥

3. చాలా ప్రొద్దుపోయె - సామీ ! మువ్వ గో
పాలా ! నీకు ఎన్ని - పను లున్నవో ఈ
వేళ జను డిక న - న్నేలిన దౌర ! నీ
కేలా ఇంకను - జోలి యనుచు నవ్వి ॥తత్తర॥

---

## 176. సైంధవి - మఠ్య

(స్వీయ - ప్రౌఢ, ధీర)

పల్లవి :

తలచి నపుడె లేనిదానవు - తరుణి నీ వెందుకే ?

అనుపల్లవి :

పిలిచి నపుడె రాకయుంటే - ప్రియము పుట్ట నేర్చునటవే

1. చంచలాక్షి నిన్ను కోరి - జవ్వన మెల్ల నీ పాలు జేసి
ప్రాణము లొక్కటిగా భావించి నిన్ను కోరితిని ॥తల॥

2. ఇలలో నిక నేమిటికి - నిన్ను వెదకిన నాటికే
బాలమువుడు నాపై గలిసి - జగడ మయ్యే సమయమున
॥తల॥

3. ఎమ్మెకాడు మువ్వగోపాలుడు - డిందు రమ్మని
వేడినప్పుడే ఓ
యమ్మ సమ్మతిగా నీ వుందు - నని నెఱనమ్మితిని ॥తల॥

---

## 177. మధ్యమావతి - త్రిపుట

(స్వీయ - ప్రౌఢ. నాయకుడు - అనుకూలుడు ; విరహోత్కంఠుడు.)

పల్లవి :

తలచునో ? తలచదో ? - తరుణి

అనుపల్లవి :

చెలిమి మువ్వగోపాలు - డెలమికాడని నన్ను ॥తల॥

1. మందరదన మొన - కొరికి మడు పొసంగ
ఇంద మనుచు తానె - యియ్యా వచ్చి లేదంటే
అందుకు నే జిన్న - నై యున్నా నని నవ్వి
ముందా మడుపుతోనే - ము ద్దొసంగిన సుద్ది ॥తల॥

2. ఇంతి నీ దయ లే - దింక నేను రాను నా
యంతరంగము నొచ్చె - నన విని దయ వచ్చి
అంతలో కౌగిట - నలమి నమ్మిక లిచ్చి
సంతస మొనరించి - చింత దీర్చిన సొగసు ॥తల॥

3. ఆలించి నా మాట - లాలించి మువ్వ గో
పాల! రమ్మని రతి - దేలించి మన సిచ్చి
లోలాక్షి నా మోవి - లోప లించుక గంటు
గీలించి చెలరేగి - కోరి నవ్విన హొయలు ॥తల॥

---

178. ఆహిరి - అట

(స్వీయ - ప్రౌఢ, ధీర. నాయకుడు ధృష్టుడు.)

పల్లవి:

తాళజాలనే ఓ చెలియా! నే - తాళజాలనే

అనుపల్లవి:

బాలరో! మువ్వ గో - పాలుడ నే గాన ॥తాళ॥

1. నేర మెంచకుమీ యిందరిలోన - సారెకు
నెంచకుమీ యీవేళ నన్ను
నీరసించకుమీ కౌగిటనన్ను - వేరు సేయకుమీ!
వారి జాక్షిరో! నీపై - వలచియున్న నన్ను
మేరగా దలయించ - మెలత నిను బాసి ॥తాళ॥

2. వద్దికి రావే! వేడుక మీర
ముద్దుపెట్టవే! కౌగిటనుండి – సుద్దు లాడవే!
ముద్దు గుమ్మ! నీ – మోవి తేనె లీయవే
ప్రొద్దుపోయె చల మేటికే జాగు సేయకే ॥తాళ॥

3. భామ లెందైన నెంతైన మది
ప్రేమ లేక యుందురా! ఇట్లు – రామ! ఇక నైన
భామరో! మువ్వ గో – పాల! రమ్మని నన్ను
కాము కేళి గూడి – కలిసి యేలు మీ వేళ ॥తాళ॥

---

179. గౌరి – ఆది

(స్వీయ - ముగ్ధ, కలహాంతరిత)

పల్లవి:

నేరమా? కొమ్మా! వా డెందుకే – చేర రాడమ్మా

అనుపల్లవి:

వారిజముఖి యిటువలె ననుభవముల
ధారుణీపతి తలచిన యప్పుడె ॥నేర॥

1. మాలిమి యను తన లాలనచే రతి
వేళలో నడిచిన వింతలు తలచుక
నాలో నేనే నవ్వుచు నుండగ
వేళ వెలిసి విన్నవించనైతి నకట ॥నేర॥

2. చెలువున దానా చనుమొన లంటుచు
గిలిగింతలమై పులకించిన వగ
దలచుక సిగ్గున దలవంచుక తా
బిలిచి యడిగితే పలుకనైతినట ॥ నేర॥

3. మనసు కరుగ నా మర్మము లంటుచు
పెనగొని తమకంబు నను గలయుగ
గినిసి తుపాకుల కృష్ణునితో నే
దనివి తీరలే దనిపలికితినట ॥ నేర॥

---

### 180. కాంభోజి - అట

(స్వీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత.)

పల్లవి :

నోము ఫలమే కాని - నోచ్చుకొన నేల ?

అనుపల్లవి :

భామరో ! మువ్వగో - పాలు డింత చేసె నంటే ॥నోము॥

1. ఎన్నడు నన్నైకాని - ఏ చెలియు నైనాను
కన్నెత్తి చూడ డమ్మా - కలనైనగాని
కన్నెరో ! ఎటువంటి ఘనుడు - నన్నెడబాసి
వన్నెలాడి యింటనే - వాసమై యున్నాడంటె ॥నోము॥

2. ఏ మాటలైనాను - ఎలమి నాతోనే కాని
ప్రేమ నొక్కరి నైన - పిలువ నొల్ల డమ్మా!
ఆ మమ్మత లన్ని మరచి - అలదానితో గూడి
ఏమో నాటి నేర - మెంచుకొన్నా డంటే ॥నోము॥

3. బాలరో! సత్యపురి - వాసుదేవుడు నేను
పాలు నీరును వలెనె - భావ మలరగను
కేళి గూడి యున్నయెడ - కినుక చేసుక వాడు
వాలాయముగా నిందు - వచ్చేదే లేదంటే ॥నోము॥

---

## 181. సావేరి - ఆది

(స్వీయ - ముగ్ధ, ప్రోషిత పతిక)

పల్లవి:

మగువ! ఊరు దూరమైతే - మనసు దూరమా?

అనుపల్లవి:

తగవు మాలిన దైవము - పగ సాధించితే నేమాయె
॥మగువ॥

1. సొక్కి సోలి యుండ లేదా? - సురతపు పను లీడేర్ప లేదా?
మక్కువ కొన్నాళ్ళకైన - మనసు గూడ నింతే కాని
॥మగువ॥

2. కూడి మాడి యుండలేదా ? కోరిక లీడేర్ప లేదా ?
జోడు గూడి కొన్నాళ్ళకైన - సొగసు కూడ నింతే కాని
॥మగువ॥

3. కలసి మెలసి యుండలేదా ? - కౌగిట జేర్చుకో లేదా ?
చెలియ ! మువ్వగోపాలుడు - చేరి కూడ నింతే కాని
॥మగువ॥

## 182. కల్యాణి - ఆది

(స్వీయ - మధ్య, ధీర. నాయకుడు - ధృష్టుడు.)

పల్లవి :

మేలు వాడనే నిను బాసి - తాళ జాలనే

అనుపల్లవి :

ఏలుకో మువ్వగో - పాలుడను గాన ॥మేలు॥

1. వద్దజేరి హాయలు - ముద్దు ముద్దుగ నీతో
సుద్దు లాడక యెట్లు - ప్రొద్దు పోవునే ॥మేలు॥

2. మదుపు సగము కోరికి - మమతతో నీ వియ్యక
పడతిరో ! కన్నులాన - విడె మింపు గాదే ॥మేలు॥

3. మునుపటి వలెనె - మువ్వగోపాల ! రమ్మని
దినదినము గూడక - తనివి తీరునా ? ॥మేలు॥

# క్షేత్రయ పదములు

## నాయిక పరకీయయైయున్న పదములు

### 1. అఠాణా - త్రిపుట[1]

(పరకీయ - మధ్య, స్వాధీనపతిక)

పల్లవి :

అక్కరో! యెూర్వనివారు సరసుడు గాడని -
ఆడుకొంంటే ఆడుకొనేరు

అనుపల్లవి :

మ్రొక్కదగినవాని - ముద్దుమాటలవాని -
మువ్వగోపాలసామిని ఎవరైనగాని ॥అక్కరో॥

1. రామ! వానిదలచినపుడే - రవిక క్రిక్కిరిసిగుబ్బ -
లేమో రొమ్మెల్ల నిండునే - వాని మాటంటే
నామనసు పైపై నుండునే - వాని జూచితే -
నవనిధు లబ్బినట్లుండునే - యెవరైనగాని ॥అక్కరో॥

2. ఇంతిరో! వాడిందువచ్చి - యెలమి కౌగిలించితే -
ఎంతో బడలిక తీరునే - వశముకాని

---

1. ఆది

కంతు తాపము చల్లారునే - యింతేకాదు నా -
సంతసమెల్ల చేకూరునే - యెవ్వరైనగాని ॥అక్కరో॥

3. పూని మువ్వగోపాలుడు - పైనిచెయివేసితే నా
మేనపులక లుప్పతిల్లునే - నా తమిరేచ
వానికే బిరుదుచెల్లునే - వానిగూడిన -
మానసమెంతో రంజిల్లునే-యెవ్వరైనగాని ॥అక్కరో॥

---

## 2. ఘంటారావము - ఆది

(పరకీయ - పరోఢ, అభిసారిక)

పల్లవి :

అట్టే యుండేవుసుమీ ! నా ప్రాణనాథ !

అనుపల్లవి :

అట్టే యుందుండ కిందు వచ్చెదనని -
యాన పెట్టితివిసుమీ నా ప్రాణనాథ ! ॥అట్టే॥

1. ఇంతలో నీవీడకు రాకుంటే కన్నీరు కా -
వేరి కాలువ సుమీ !
ఇంతింత నీ కెమ్మోవి తేనెలానకుంటె
ఇదిగో నోరెండేనిసుమీ! నా ప్రాణనాథ! ॥అట్టే॥

2. వినరా నీవు కౌగిట లేకుంటే పున్నమ -
వెన్నెల వేడిసుమీ !
వనజాక్ష ! నీ వీడకు వచ్చే దాక తల -
వాకిలియిల్లుసుమీ ! నా ప్రాణనాథ ! ॥అట్టె॥
3. మరచి యెవతెతో నైన-మాటలాడేవు గనుక
మనసు విరిచెదరుసుమీ !
శరణు మువ్వగోపాల ! యీ రేయి కూడ -
జాగు సేయకనె రమ్మీ ! నా ప్రాణనాథ ! ॥అట్టె॥

---

## 3. బేగడ[1] - త్రిపుట

(పరకీయ - సఖి ఉపాలంభన)

పల్లవి :

అది నోముఫలమే - ఓ చెలియా !

అనుపల్లవి :

పదరవే ! మువ్వగో - పాలునితోను ॥అది॥

1. ధనముచేత జ - వ్వనముచేత చక్క -
దనమున నటవే - ఘనతలు ?
వినయము జాణ - తనము గలుగుట -
వినుతికెక్కరే - వనితలు ॥అది॥

---

1. పంతువరాళి

2. మించి పయ్యెద - నుంచి చాల లా -
లించి వేరనీ - యెంచక
మంచివాని ర - మించగలుగుట -
చంచలాక్షిరో ! కొంచెమా ? ॥అది॥

3. మేలువాడు ని-న్నేలిన మువ్వగో -
పాలునేచు టది-మేలటే ?
నాలిముచ్చు గ - య్యాళివైనసీ -
కేల కల్గునే - తాలిమి ? ॥అది॥

---

## 4. అసావేరి - త్రిపుట

(పరకీయ - పరోఢ, మధ్యమ -)

పల్లవి :

అనుసరించిన రాడు - అలిగితినో రాడు -
వనితా ! యీ - నేనరేమో ?

అనుపల్లవి :

తనకేమైనాను మునుపటివలె నేను -
మనసిచ్చి కలియనైతినా ? ॥అను॥

1. వద్దికి రమ్మని - ముద్దుసామిని పిలువగా -
సద్దుసేయక మానెనే !

గద్దరించి నాపైని మదిలో మర్మమెంచక -
ప్రొద్దుమాటలు మాని - వద్దికి రమ్మనే! ॥అను॥

2. మగవారిమాటలు - జగమందు నేగాన -
నగరా ? సరివారిలోన
మగువరో! చిగురాకు - మడుపు లీయగబోతే -
వెగటాయె నతనికి ఏమంటినో సామి ॥నను॥

3. తెలియ జెప్పెద వినవే - అల్ల నాసామి నీతోటి -
మొలక నవ్వులాడీనటే!
బలిమిచేసిన రాడు - తొలిమోము లాయెనేడు -
కలిసితి ఫలమని - తెలిసి మువ్వగోపాలు ॥డను॥

---

## 5. మారువ - ఆది

(పరకీయ - తృప్తాతృప్త : నాయకుడు శఠుడు)

పల్లవి:

అమ్మమ్మ! వీడెంత నెఱజాణడైనాడె ?

అనుపల్లవి :

ఎమ్మెలాడి! మువ్వగోపాలునిటు తోడితేవే!
॥అమ్మమ్మ॥

1. చిరునవ్వు నవ్వుతావచ్చి - చేపట్టినదే కాని
మెఱుగు పయ్యెద తీసే - దెఱుగనే! నత్తి
కురులు నెఱులదీర్చి - విరులు చుట్టినదే కాని
చురుకు కెంపు మోవిపై నుంచంగ నేమి తెలియనైతి
॥అమ్మమ్మ॥

2. చెలియ! యేకాంతమునకు - చెకి చూచినదె కాని
వెలయ ముద్దు మాటలు - విననేరనైతి
గళము ముద్దిడి నన్ను - గారవించినదె కాని
తళుకు చెక్కిటగోరు - తగిలి నొగిలేదేమొ తెలియనైతి
॥అమ్మమ్మ॥

3. గరిమ మువ్వగోపాలుడు - కౌగిలించినదె కాని
ఇరువురి మేనులారసే - దెఱుగలేనైతి
విరిబోణి! పోకముడి - విడచి అంతరంగమున
మరి యేమో చేసెనో - మగువ! యేమి తెలియనైతి
॥అమ్మమ్మ॥

---

## 6. ఉసేని - త్రిపుట

(పరకీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

అలిగితే భాగ్యమాయె మరేమి? వా -
డలిగితే భాగ్యమాయె

అనుపల్లవి :

తలిరుబోణిరో! వాని - దండించ గలన? వా ॥దలిగితే॥

1. అరసొంపు మాట - లాడే వానికినే
తరుణిరో! మంచి - దాన నయ్యేనా?
సరసకు రాడాయె! సకియరో! నామోము
తిరిగిచూడడేమో? - దేవుడున్నాడు వా ॥దలిగితే॥

2. జాలిలేదిక - నేల నాతో పొందు
చాలుగాబోలు - సంతోషమాయె
ఈలాగునే వాని - కితవుగా దేమో
నీలవేణిరో! నాటి - నెన రించుక లేక వా ॥దలిగితే॥

3. బాలప్రాయము నాడె - భ్రమియించినన్ను వా
డేలిన సుద్దు - లెన్నెన్నో గలవు
చాల నాతో బా - సలు చేసినాడే! ఓ
శాలరో! మువ్వగో - పాలు డిప్పుడు వా ॥దలిగితే॥



## 7. యదుకుల కాంభోజి - ఝంప

(పరకీయ - కన్య, ప్రోషితపతిక)

పల్లవి :

ఇంతలోనే అల్లవానీ నన్ను గూర్చి -
ఎడబాయ జెసెగా? దైవము!

అనుపల్లవి :

చింతింప బనిలేదు – చేయు పూజాఫలము ॥ఇంత॥

1. ఆరునెలలైనను అతడు నేనొకచోట –
హాయిగా గూడియుంటిమా ?
మారుకేళికి నెంతో వెతచెందితిగాని –
మనసు మన సొక్కటై యుంటిమా ?
దూరుకు లోనైతిగాని గడెసేపైనను –
తొడతొడసోకి యుంటిమా ?
పేరుచెప్పి మాటలకొక్కనాడైనను –
ప్రేమతో పిలుచుకొంటిమా ? ఓ చెలియరో!॥ ఇంత॥

2. చక్కగా విభుడు నేనొక్కనాడైనను –
సరసములాడుకొంటిమా ?
చక్కెరకెమ్మోవి యాని యొకరికొకరు –
చవిజూచుకొని యుంటిమా ?
అక్కరలుతీరగా కౌగిటిలో నణగి –
అల్లిబిల్లిగ నుంటిమా ?
పక్కలోపలచేరి యాటలకైన సతి –
పతులనుకొనియుంటిమా ? ఓ చెలియరో ! ॥ఇంత॥

3. చాళితో మువ్వగోపాలునిపై వేడ్క –
పదమైన పాడుకొంటిమా ?

బాల ! నెనరున ముచ్చటలాడు విరుల -
పానుపుపై నుంటిమా ?
చాలప్రొద్దుగ్రుంకి యొకవాడైనను -
జాగరమైయుంటిమా ?
కాలమెప్పటివలె వానితో నేకూడి -
కావుచెందగ జేసెగా ఓ చెలియరో ! ॥ఇంతి॥

## 8. ధన్యాసి - చాపు

(పరకీయ - దూతి సంఘటన)

పల్లవి :

ఇంతిరో ! వరదునికి నీపై - నెంతమోహమే !

అనుపల్లవి :

సంతతంబతని వెతజూడ-జాలక యిందువచ్చితిని ॥ఇంతిరో॥

1. చెక్కట చేచేర్చు కొనెను - చిరునవ్వు నవ్వుకొనెను
అక్కట నే దలచినట్టె - ఐరా దనెను
మక్కువ మునుజేసిన చెలిమి - మరపు రాదాయె ననెను,
చక్కని యీచెలిని గూడని - జన్మమేటికి జన్మమనెను
॥ఇంతిరో॥

2. పడతి ! ఉండుండినే నేమి - పాపముచేసితి ? వనెను
తడవు నిన్నెడబాసి - తాళలే ననెను
నుడువ నోరాడ దనెను - నొసట చేయుంచుకొనెను
అడిగితే మీరేమైన - నార్చిరో ? తీర్చిరో ? యనెను
॥ఇంతిరో॥

3. పలువరించుచు మామువ్వగో - పాలుడైన వరదుడు
నలినాక్షి ! యీనాటివింత - నడచునో ? యనెను
తలచి యుసురుసురు మనెను - దైవమిట్లు చేసెననెను
వల పనే పాపము పగ - వారికైన గారా దనెను ॥ఇంతిరో॥

---

## 9. మధ్యమావతి - త్రిపుట

(పరకీయ - మధ్య ; దూతిక నాయినా విరహమును
నాయకునికి తెలియజేయు చతుర)

పల్లవి :

ఇంతే మోహములేని - దిపుడు తెలిసెగదరా !

అనుపల్లవి :

పంతగించి మువ్వగో - పాల ! రావైతివి ॥ఇంతే॥

1. నీవు వచ్చిన మొదలు - నిమిషమే యుగముగా
మావనిత యొంటిగా - మదిగుందుచు

భావమున తను తానె - పలుమారునొచ్చుచు
ఈ వేళదాక భుజి - యించకనె యున్నది ॥ఇంతే॥

2. వెనరైన మమువంటి - నెలతలతో పలుకక
కనుమూసి తానొక - గడియ నిద్రింపక
గొనబు సొమ్ము పెట్టక - కొప్పు చక్కముదువక
మనసిజుని కాకచే - కనలుచు నున్నది ॥ఇంతే॥

3. వలచిన చెలినెడ - బాసి యీరీతిగా
జలము చేసెదవు న - వ్వులకైన తొలుత
కలసిన వాడ విట్టు - లలిగిన దెల్ల మా
నెలత చేసిన పాప - ఫలమేమో ? యకట ! ॥ఇంతే॥

## 10. కేదారగౌళ[1] - ఆది

(పరకీయ - మధ్య ; సఖితో తన విరహవేదన తెలుపునది
సఖి వెడలిపోవునని దుఃఖించునది)

పల్లవి :

ఇందుకు పగజేసెనా ? - యీ దైవము ?

అనుపల్లవి :

కుందరదన! వినవే - గోపాలునెడబాసినదిగాక ॥ఇందుకు॥

1. నాపుణ్య మిట్లైనందుకు - నాతిరో ! నీవుండికదా
యీ ప్రాణము కాపాడితి - వింతకాలము

1. తోడి.

దాపున నెవ్వరు దృష్టి - తాకించిరో యూర్వ్యజాలక
బాపురే! నీకు నేడూరి - పైనము వచ్చెనా? చెల్ల!
॥ఇందుకు॥

2. దంట చెలులు నొద్దికైనా! - జంట నీ వుండగాను
ఒంటినున్న దిగులుతీరి - యుంటినే నేను
మంటమారితనమున నే - మాదునో యని నీవెంచి
కంటికి రెప్పగాచిన - క్రమమున పోషించితివి ॥ఇందుకు॥

3. పడతిరో! మామువ్వగో - పాలుడు ననుగూడి చాల
తడవాయెనేమో కాని - తడజేసె ననుచు
ఊదుకుచున్న నామనసున - కొక్కింతైన భయము
పొడమనీక నాకు చితవు - బుద్ధులు బోధించితివి
॥ఇందుకు॥

---

## 11. ఘంట - త్రిపుట

(పరకీయా - విప్రలబ్ధ)

పల్లవి:

ఇందు రాదగదు నే - నేల వచ్చితినమ్మ!

అనుపల్లవి:

అందరిలో జాల మోస - మాయె వాడిందు లేడాయె
॥ఇందు॥

1. మునుమున్నె శృంగారించు - కొని తమకమున రాగ
ననుజూచి నీవైన వ - ద్దనవైతివే
వనజాక్షి ! గట్టిగ - వంచనలే చేసితివి
ఘనము గుట్టుదీరె ! నయ్యో - కన్నవారెల్ల నవ్వగ
॥ఇందు॥

2. పిలువక అందుపోయేది - తెలిసి వీధిలో చెలులు
కిలకిల నవ్వేరు గుం - పులు గూడుక
వలపు సిగ్గెరుగదని - పలికే రా మాటలెల్ల
చెలి ! వినీవినములు - చేసితి వివేకములేక ॥ఇందు॥

3. కలికి ! మువ్వగోపాలుని - గలసిన దాననై
ఎలమి సఖులగూడి మా - యింట నుండక
పలికి బొంకదనుచు - పదుచుతనము చేసి
నిలువక వచ్చిన - ఫలము గలిగెను ॥ఇందు॥

---

## 12. మోహన - చాపు

(పరకీయ - ప్రౌఢ, విదగ్ధ)

పల్లవి :

ఇకనిన్ను పోనిత్తునా ? ఇభరాజ వరదా !

అనుపల్లవి :

శుకవాణిచేత నీ - సుద్దులెల్ల విన్నట్లాయె ॥ఇక॥

1. నవ్వులంట తున్నావేమో - నావద్దు చూడు మీసారి
పువ్వు బోడులచేత - రవ్వ సేయుంచకమాన ॥ఇక॥

2. జవ్వన మెల్లనీ పాలుచేసి - చాలా నమ్మియున్నందు
కెవ్వతెనో కూడివచ్చి - యిపుడు లేదని బొంకేవు ॥ఇక॥

3. పన్నుగ మువ్వగోపాల! బాసలిచ్చి నన్ను గూడి
వన్నెలాడి కేలోనైన - వగలెల్ల విన్నారా! నేడు ॥ఇక॥

---

## 13. కాంభోజి - త్రిపుట

(పరకీయ - పరోఢ, అభిసారిక)

పల్లవి :

ఇచ్చోటను చాల ప్రొద్దుండ జెల్లదు - ఇంటికిపోవలెరా!

అనుపల్లవి :

ముచ్చటలకెల్ల ఇది సమయముకాదు -
రచ్చల పెట్టకురా! ఓరోరి జాణ! ॥ఇచ్చోట॥

1. మగనికౌగిలి బాసివచ్చితి నేడు నీ
మాట తప్పక నేను
బిగువైన గుబ్బల కొనగోరులుంచ జూచేవు -
వెలజాతిదానగాను

తగవులేటికిరా ? నీయక్కర తీర్చికో -
నను బంపు దుడుసుగాను
వగకాడా ! నిదుర మేల్కొంటే దోసముకాదా ?
వాదులేలరా ! నాతోను ఓరోరి జాణ ! ॥ఇచ్చోట॥

2. చురుకు చురుక్కనిమోవి - పంట నొక్కితి వల -
గురుతులెక్కడ దాతురా ?
చెరుకు తీపని వేరుతో పెకలించేవు -
చెలువుడా ఎటువై తురా ?
......మోహంబుగాని - తగిలియుండుట యిటువంటి -
................ - మాయపు వలవేతురా ?
ఓరోరిజాణ ! ॥ఇచ్చోట॥

3. వేసట్టె కలిసితివి నన్ను పలుమారు ! - విడువరా
యికనైన
నాసామి ! మువ్వగోపాల ! పూనిచలము -
చేసేది మరియాదరా ?
ఆసకుమితియేమి ? కూడగూడ మోహ -
మధికమయ్యే దేకాని
నీసొమ్ము ఈ మేను; కోరినప్పుడే వత్తు -
నెనరు నాపైనుంచరా ! ఓరోరి జాణ ! ॥ఇచ్చోట॥

---

## 14. కన్నడ - ఝంప

(పరకీయ - ముదిత, తృప్త)

పల్లవి :

ఇప్పటికీలాగు నున్నాను

అనుపల్లవి :

ఇప్పటికీలాగున నున్న - ఇటువంటినావలపు
ముప్పొంగ నిచ్చేవో ? లేదో ? మువ్వగోపాల! ॥ఇప్పటి॥

1. ఎప్పుడంటప్పుడు నా - యిచ్ఛకు వచ్చినట్లు
ముప్పిరి గొన్నతమక - మున బెనగుచు
జొప్పిలు తేనెలూర నీ - కప్పురంపు తావి మోవి
తెప్పలుగానాని తనివి - తీర నుప్పొంగుచు ॥ఇప్పటి॥

2. ఇదిసమయ మవును నే - డిదివేళ కాదనక
కొదవ యింతయు లేదు - కోరినట్లు
గుదిగొన్న తమకమున - గుబ్బల కసిదీర న
న్నదుముకొని కౌగలించి - ముదముచే పొదవి ॥ఇప్పటి॥

3. కంతుకేళి గూడిన - యంతలోనె తమిరేగి
సంతసమున బంధ విశే - షములచే బెనగి
పంతముతో మువ్వగో - పాల ! నా సొమ్మైతి వని
చింతేమియులేక నీ - సేవే జీవనమై ॥ఇప్పటి॥

## 15. ఆనందభైరవి - త్రిపుట

(పరకీయ - పరోఢ, వాగ్విదగ్ధ)

పల్లవి :

ఊరకే చలము చేసే - వేరా ? మ్రొక్కేరా !

అనుపల్లవి :

ఔరా ! మువ్వగోపాలా ! గారవించి చూడరా ! ॥ఊరకే॥

1. పద్దుసేయక వేగ - వద్దికి రారా ! వట్టి
సుద్దులనే తేలించి - పొద్దుపుచ్చకురా !
ముద్దులయ్య ! నీ మోము - ముద్దుగులుకుచు నున్నదిరా!
ముద్దుపెట్టమనసయ్యీరా ! మోము మోమున జేర్చరా !
॥ఊరకే॥

2. అరమరలు సేయకు రా ! - వశాను కైన దానను రా !
తరుణులువలె వలపు - దాచ నేరను రా !
నెరనమ్మిన దానను రా ! - నిమిషమిక తాళలేరా !
మరునిల్లు చెమ్మగిలె మై - మరవసాగెను రా ! ॥ఊరకే॥

3. అక్కర తెలిసివేగ - పక్కనుంచుకోరా !
చక్కని మా మువ్వగోపాల ! - చొక్కియున్నాను రా !
నిక్కునాగుబ్బలు గోట - నొక్కి యెదజేర్చుకోరా !
ఎక్కువైన రతులచే - గ్రక్కున నన్నేలుకోరా! ॥ఊరకే॥

## 16. సారంగ - త్రిపుట

(పరకీయ - విప్రలబ్ధ)

పల్లవి :

ఎక్కడి నేస్తము లెక్కడి సెనరు - లెవ్వరి కెవ్వరే

అనుపల్లవి :

మ్రొక్కిన వినక మా మువ్వగోపాలు నా -
ముదిత యింటికి ద్రోసిరే ఓ చెలియా! ॥ఎక్కడి॥

1. ఇదిగో! ఎన్నడు నిరుగు పొరుగు లెరుగనివాని -
కెన్నెన్నో బోధించిరే!
అది చక్కనిజాణ యని వాని దానిల్లు -
కదలకుండగ జేసిరే! ఓ చెలియ! ॥ఎక్కడి॥

2. బలిమిని నాచేత నింతలో నింతైన -
బంచుక పోజేతురే!
చెలులుగాదా రెండు దలచరని యింటి -
చెలువుని ఎడజేసిరే! ఓ చెలియా! ॥ఎక్కడి॥

3. మొలకప్రాయమునాడె మువ్వగోపాలుని -
కలయుట తెలియరటె!
లలనరో! వానిచే లంచాని కాసించి -
చలపట్టి పగచేసిరే! ఓ చెలియా! ॥ఎక్కడి॥

## 17. పున్నాగవరాళి - త్రిపుట

(పరకీయ - మధ్య, ప్రోషితపతిక)

పల్లవి:

ఎటులమరచి యుందునే ? ఓ చెలియా ! నే -
నేమిసేయుదునే ?

అనుపల్లవి:

కటకట ! రేయిపగలు కన్నుల గట్టినట్లయితే ॥ఎటుల॥

1. వెలది ! ఊరిదాకపోయి - వేగనత్తు ననగ
పలువెతలు నే గొన్న - పలుకవల దనగ
మొలక నవ్వుల ముద్దు - మొగమింత చేసుకొని
తల వంచుకొని ఎంతో - తల్లడించిన వగ ॥లెటుల॥

2. తడవు నిన్నెడబాసి - తాళగలనా ? ఇక
జడియకు మనసు - నుడి నుడి యింపగ
ఎడలేని కన్నీరు అ - పుడు తుడుచుచు
ఉడుకుచు నటు మోమై - ఉసురనుకొన్నది ॥ఎటుల॥

3. చెలిమిని చేరదీసి - చిత్తంబు కేళిని
కలయుచు వగవగల - కరిగింపగ
ఎలమి మువ్వగోపాలు - డింపుమీర హా ! యని
పలుకుచు నటుమోమై - పరవశమైయున్నది ॥ఎటుల॥

## 18. ఘంటారావము - బాపు[1]

(పరకీయ - కన్య, ప్రోషితపతిక)

పల్లవి:

ఎన్ని తలచుకొందునమ్మా! -
ఎట్లా మరపువచ్చునమ్మా!

అనుపల్లవి:

కన్నరో! చక్కని నా దేవుడైన -
కంచివరదుని మంచిగుణము ॥ఎన్ని॥

1. మన్ననచేసి యెప్పటికి దయ -
మరవవద్దని పాదములంటుచు
నన్నింత చేసితివనుచు తెగువ -
నవ్వు నవ్వుచు
కన్నుల వీనుల చెక్కులమోవి -
గళము ముద్దుపెట్టుకొని
తిన్నగ నూరికి పోవుచు నన్నే -
తిరిగి తిరిగి చూచిన వగ ॥ఎన్ని॥

1. మత్య.

2. వెన్నవలెనే కరిగి కరిగి -
   విడనాడని మనసుతోడ
నన్నుదప్పక చూచిచూచి -
   చిన్నబోవుచు
వన్నె బంగారు బంతులవంటి నా -
   చిన్ని చన్నులు రెండు దన
కన్నుల కొత్తుకొని మోము -
   గ్రక్కున నెత్తలేకున్న వగ ॥వెన్నె॥

3. పల్లవాధరిరో! మిక్కిలి లేత -
   ప్రాయపుదానవు తాళలేవని
మెల్లగా దమి రేచి నన్ను -
   చల్లగా కలయుచు
ఉల్లమలరగ తన యెదపై నన్ను -
   మల్లెపూవలె నుంచుకొన్న
వల్లభుడు మువ్వ గోపాలు డగు కంచి -
   వరదుడు చేసిన మచ్చిక ॥వెన్నె॥

---

## 19. శంకరాభరణము - చాపు

(పరకీయా - పరోఢ, వృత్తవర్తిష్యమాణ సురతగోపన; నాయకుడు బలాత్కారము చేసి చేసిన వర్తమానములు తన కాప్తయైన చెలికత్తెతో చెప్పుకొనునది)

పల్లవి :

ఎవ్వడే? ఎవ్వడే? ఓ భామ! వీ - డెవ్వడే?

అనుపల్లవి :

ఎవ్వడే? నేను - పవ్వళించిన వేళ -
పువ్వుబాణమేసి - రవ్వచేసిపోయె ॥ఎవ్వ॥

1. పట్టపగలు - వాడువచ్చి -
బలుదిట్టడయి నాయిల్లు చొచ్చినా
దట్టినన్ను - చెట్టబట్టి కౌగిలించి -
గట్టిగా నామోవి - గంటుచేసిపోయె ॥ఎవ్వ॥

2. గరిత! వానికి నేను సతమా? నన్ను -
గద్దించి పలుకు టుచితమా? నా -
పురుషు డూరలేని - ప్రొద్దుమాపటివేళ -
[1]సరసాన డేలించి సన్నజేసిపోయె ॥ఎవ్వ॥

---

1. సుద్దులదేలించి ముద్దుపెట్టుక ;

3. వెన్నతిన్న - పిన్న తనమా ? [1]గొల్ల -
కన్నెల వలపించు గుణమా ? నన్ను
కొన్న మగనివలె _ కొంగుబట్టితీసి -
[2]చన్ను లొడిసిపట్టి - చలమేటి కనిపోయె ॥ఎవ్వ॥

4. పేదసాదల కిదియూరా ? -
యిందు పిన్నపెద్ద లెవరు లేరా ? యీ
వీథివారలెల్ల - వింత చూడనె కాక -
దాదు ఫిర్యాదేది ? ధరణిలో లేదాయె ॥ఎవ్వ॥

5. నీలమేఘ శ్యామలాంగుడు మంచి -
మేలు పీతాంబరధరుడు వాడు
లీలతో పదియారు వేల గోప -
స్త్రీల నేలిన మువ్వ గో - పాలుడనిపోయె ॥ఎవ్వ॥

---

## 20. భైరవి - త్రిపుట

(పరకీయ - పరోఢ, లఘుమాన)

పల్లవి :

ఎవ్వతెరా ? నీతో నవ్వినది

---

1. అల్లత్రేతల గూడిన; 2. రవ్వకు ననుబిలిచి రాపు చేసిపోయె.

అనుపల్లవి :

నివ్వటిల్లు ప్రేమ - నీ పొందు కాసించి
మువ్వగోపాల ! నీ - మనసు తెలిసెలేరా ?   ॥ఎవ్వతె॥

1. తీవితో నీవు రాగ - దోవ కడ్డము వచ్చి
బావ! రమ్మని చాల - బలిమి చేయుచును
తీవరముగ పైట - తీసి గుబ్బలు చూపి
యీవలెనని కౌగి - లీయ వచ్చునటరా !   ॥ఎవ్వతె॥

2. సొలపు చూపునట ! - సొక్కితి ననునట !
కులుకునట ! ముద్దు - కొసరునట !
అళుకెందు కిందు మీ - యాపెలేదనునట !
చెలులు చెప్పగ నీ - చిన్నెలన్నియు దెలిసెరా! ॥ఎవ్వతె॥

3. మును పెన్నడైన నీ - మోమయిన తెలియక
చెనకితినో లేక - చనవునను
విను మావ తిన్నట్లు - వేదనచే దిరిగేవు
ననుగూడి నా ప్రాణ - నాథా ! మువ్వగోపాల ! ॥ఎవ్వతె॥

## 21. ఉసేని[1] - ఆది

(పరకీయ - పరోఢ; వృత్తవ ర్తిష్యమాణ సురతగోపన)

పల్లవి :

ఎవ్వతె నిను బోధించెనో ?

అనుపల్లవి :

మువ్వగోపాల ! నాదు - ముచ్చట చెల్లనీయక -
ముదుగు నడపించుమని - ముష్కూటికి చలపట్టి ॥ఎవ్వతె॥

1. ఇన్నాళ్లదాక నిరుచెవి - యెరుగనీక
నన్ను గావలసి నీవు - నడచితివి
మున్నున్న దయ లేక _ మొగనాలని యెంచక
కన్ను మరుగుగాని చోటు - గా చెక్కిలి చీరుమని ॥ఎ॥

2. విరివాసన కూడిన - వితమున నీవు నేను
అరమర లేక యుండే - యందము చూచి
విరస మెందును లేదు - వీరి కని తలచి
గురుతుగా నా మోవి - గుమ్మెలు పోనొక్కుమని ॥ఎ॥

3. హెచ్చుతమి నీవద్ద ను - రింతసేపు నే నుండిన
వచ్చి తడవాయి మాట - వచ్చినందువు
కుచ్చితమున మా మువ్వ - గోపాల ! నన్నుగూడి
యిచ్చట తెల్లవారుదాక - నింటికి పోనియ్యవద్దని ॥ఎ॥

---

1. గోపికా వసంతము.

## 22. తోడి - త్రిపుట[1]

(పరకీయ - పరోఢ, దివ్యాదివ్య. నాయకుడు తన యెడలనెపమిడి రానందుకు అతనియెడల నెపమెంచి చెలులతో చెప్పుకొనేది)

పల్లవి :

ఏమంటినమ్మా ! నాసామిని - ఏమంటినమ్మా !

అనుపల్లవి :

కోమలాంగిరో ! మువ్వ - గోపాలసామినే ॥నేమంటి॥

1. వామాక్షి ! నాసరి - వారున వ్వేరని
వేమారు మాటాడ - వెరచి నేనుండగ
నామనసింత్రైన - నాథుడు తెలియక
ఆ మందయానతో - ఆడుకొన్నాడట ! ॥ఏమంటి॥

2. బలిమివాని గుట్టు - బయలు దేరనియ్య
అలివేణి ! తగవుగా - దని నేనుండగ
చెలువుడు నామేలు - తెలిసి తెలియలేక
కలికితో పలుమారు - కసరుకొన్నాడట ! ॥ఏమంటి॥

3. ముచ్చటతీర మా - మువ్వగోపాలుడు
పచ్చవిల్తుని కేళి - పరగ నన్నుకూడి
విచ్చలవిడి దాని - యిచ్చకములకేమో
గచ్చులాడితోనెంతో నొచ్చుకొన్నాడట ! ॥ఏమంటి॥

---

1. అట.

## 23. కల్యాణి - త్రిపుట

(పరకీయ - అదివ్య. నాయికా నాయకులు మునుపు అన్యోన్య ప్రేమ
గలవారే అయినా, ఇప్పుడు నాయకుడు తన ప్రక్కలో
సంచరించే విధము తెలిసికొని నాయకుని
యెడల ప్రీతి తక్కువయినది)

పల్లవి :

ఏమనంటి నమ్మ! వాని - కెంతో కోపమే

అనుపల్లవి :

కోమలి! వినవే మువ్వ - గోపాలసామితో ॥ఏమనంటి॥

1. ఇంతనాట నుండి విభు - డెలమితో నన్నేలి
ఇంత కపటమేమొ - ఎరుగనైతినమ్మా!
వంతకారికి వలచియున్న - వాని చిటుకుమంటే
ఇంతకంతకు నన్నల - యించమేర కాదంటి ॥నేమనంటి॥

2. దాని కూడిన చిన్నెలు - తనకే సమ్మతమయితే
కాని యిందుల కేమనగ - కమ్ముకొంటిని
మానక దాని సుద్దులు - మరిమరి యనగాను
మానిపించుటకై వేరే - మాటలాడితిగాని ॥ఏమనంటి॥

3. మును పెంతో మోహమున - మువ్వ గోపాలకా
యని ఎనసి లాలించిన - చనవుదీర
వనితా! యిప్పుడు నా భాగ్య - వశమిలాగున్నది
మానక యెవ్వరి నే - మనక యూరకున్నాను ॥ఏమనంటి॥

## 24. తోడి [1] - ఆది

(పరకీయ - సఖీశిక్షా లక్షణము)

పల్లవి :

ఏమని దూరితి వే ? కోమలి ! నీకోపము కొల్లబోవద్దా ?

అనుపల్లవి :

మోము చూడక యిట్లు - మువ్వగోపాలు ॥నేమని॥

1. పిలవక వచ్చునో ? - పెద్దమాటలాడునో ?
చెలిమికాదనునో ? - చే కొంచె మెరుగునో ?
అలుక చేయ నేర్చునో ? - అందిందుపోవునో ?
పలుమారందరిలో - పడుచుతనముచేసి ॥ఏమని॥

2. మంచిమాటలాడడో ? - మన్ననచేయడో ?
వంచనపరుడో ? - వచ్చిలాలించడో ?
ఇంచుక చిత్తమీడో ? - ఎమ్మెలవాడో ?
అంచయాన ! ఇటులననవచ్చు - ననరాదనకనీ ॥వేమని॥

3. నినుగూడదాయెనో ? - నీయానమీరెనో ?
కినిసి రాననెనో ? - కేరడములాడెనో ?
మనసురాదననో ? నీ - మాట జవదాటెనో ?
మొనసి కోపమూర్వక - మువ్వగోపాలుని ॥ఏమని॥

---

1. కన్నడ.

## 25. శ్రీరాగము - ఆది

(పరకీయ--పరోఢ, వృత్తసురత గోపన)

పల్లవి :

ఏ మమ్మా! యీ వింతలు చూడవే - ఇదియేటివగలే ?

అనుపల్లవి :

కాముని గన్న మువ్వ గోపాలరాయడట! -
ఏమో గుసగుసమని - ఎచ్చరిక చేసెనే! ॥ఏమమ్మా॥

1. హద్దుమీరి వా - డటునిటు చూచి -
సద్దుసేయక నా - వద్దికివచ్చి
గద్దరించి గుబ్బలపై గొనగోరు లుంచి
ముద్దియ్యవే! యని మోము - మోమున జేర్చెనే! ॥ఏ॥

2. పైకొంగు పట్టుకొని - పరిపరి విధముల -
పలికినాడే వాడు! కులికి కులికి
చెలియరో! ఏమని చెప్పుదు నాతోను -
కలకలమని నవ్వి - కౌగిలించెనే! ॥ఏమమ్మ॥

3. మాటాడవద్దని - మరి నన్ను బెదరించి -
మదనకేళిని నా - మరునింట చేయుంచి
చేష్టలేమేమో - చేసితే భ్రమసితి -
చేరెనో ఆవేళ - తెలియదే మారితి ॥ఏమమ్మ॥

## 28. ముఖారి - త్రిపుట

(పరకీయ - పరోఢ, విదగ్ధ)

పల్లవి:

ఏమనే వానతీరా? ఏమి సేతురా?

అనుపల్లవి:

తామసమేల చేసేవు? - దక్కితి మువ్వగోపాల! ॥ఏమనే॥

1. పదము పాడగ వినేవో? -
చదరంగమే చూచేవో?
సదయుడ! కౌగిలించేవో? -
చక్కెర కెమ్మోవి నొక్కేవో? ॥ఏమనే॥

2. తిలకమే తీరుగ - దిద్దుదువో -
దేవుడవని మ్రొక్కుదునో?
పొలయలుకలే చేయుదువో? -
చెలిమితో లాలింతువో? ॥ఏమనే॥

3. చేరి కూడి యుందువో? -
చెక్కిలి నొక్కుదువో?
కూరిమితో విడెమిత్తువో? -
గొబ్బున మువ్వగోపాల! ॥ఏమనే॥

## 27. ముఖారి - ఆది

(పరకీయ - పరోఢ, వాక్క్రియా విదగ్ధ)

పల్లవి :

ఏమిర వరద! నీ _ మోము చిన్నబోయినది ?

అనుపల్లవి :

నామనసు నీమనసు - ప్రేమనిండి యుండగ ॥ఏమిర॥

1. ఒడిమీదనుండగా - పడతులందరు రాగా
వడిగా లేచిపోయినదే - వలపులేనిదాననా ?
ముడిబొమ్మలేలరా ? నా _ యడపకత్తెచే ఆకు
మడపుల నంపించినదే - మమతలేనిదాననా ? ॥ఏమిర॥

2. తెలియజూచితే నీకు - దృష్టితాకేనంట
తలు పోరజేసినదే - తలపులేనిదాననా ?
నలుగురిలో నీతో - నవ్వరాదనుచునే
నిలుచేర వచ్చినదే - హితవులేనిదాననా ? ॥ఏమిర॥

3. ఘనుడ! మువ్వగోపాలు - డను కంచివరద! నే
తనివితీరక యలిగినదే _ నెనరులేనిదాననా ?
వినరా! ఎలమిపైకొని - వింతవింతగ రతుల
పెనగి మైమరచినదే - ప్రియములేని దాననా ? ॥ఏమిర॥

## 28. నవరోజ్ - ఆది

(పరకీయ - కన్య, విరహోత్కంఠిత)

పల్లవి:

ఏమిసేతు ? కన్నెప్రాయము - నేడజేసె దైవము

అనుపల్లవి:

ఆముకొన్న రతిసుఖము - అనుభవించే దెన్నటికో ? ॥ఏమి॥

1. నెనరుగల నగుమోము - తనియ జూచెద నంటే
తనమేన సిగ్గుచేత - తలనెత్త నీదు
మనసులో వాని మీది - మమతైతే యింతిం
తనరాదు విననిది వా - కారు మేరకాదు ॥ఏమి॥

2. సొగసు చేసుకపోయి - సుద్దులాడెద నంటే
పగదాయె తల్లిదండ్రులు - బయలు వెళ్లనీయరు
ఇగురు బోఁడులెవరైన - ఈ వగలు వింటేను
నగుదురో యని గుండె - దిగులు మసీని ॥ఏమి॥

3. ఎదురు వాకిలి గనుక - ఎదురెదురె చూచుచు
అదె లోకమై నేను - నిదురపోవకను
సదయ ! మువ్వగోపాల ! - సామి ! నన్నలుముకొని
ఎదనుంచి నట్లాయె - మదనపరవశమాయె ॥ఏమి॥

— —

## 29. ఉసేని - ఏక[1]

(పరకీయ - దివ్య. తొలుత నాయకునికి పూలహారములు చుట్టినందునను, నాయకుని చెక్కిట గోరులుంచినది గనుకను, మదనశాస్త్రము తెలిపినది గనుకను, లాలించినను నాయకుడు దయాళుడు కాలేదని మిక్కిలి భక్తిచేసినందునను తుదకు నాయకుని కలిసినది గనుకను - ఇవన్ని దుర్గుణములుగా వెంచి సఖులతో చెప్పుకొనునది)

పల్లవి :

ఏమి సేతునే? కొమ్మ! నే - నెటులనైతునే

అనుపల్లవి :

భామరో! మా మువ్వ గో -
పాలు డేలరాడే? ఓయమ్మా! ॥ఏమి॥

1. ఒద్దికతోడ చెక్కిట గోరు - లుంచ నైతినో?
దిద్దిమదన శాస్త్రమెల్ల - దెలుపనైతినో?
ముద్దుముద్దుగ నతని కేను - మ్రొక్కనైతినో?
నద్దికి రమ్మని పిలువనంపితే - గద్దరించెనట
గదవే ఓయమ్మా! ॥ఏమి॥

2. వంచనలేక సిగను పువ్వు - లుంచనైతినో?
ఇంచుకించుక నేను కౌగి - లించనైతినో?

1. చాపు.

లంచ మిచ్చి కెవ్వ్వాని లా - లించనైతినో ?
కంచు పసను వంటిమనసు - కనక వా డిందు
రాడే! ఓయమ్మా! ॥ఏమి॥

3. చెలువుడా! యని చాల భక్తి - సేయనైతినో ?
చెలిమితోడ మోము మోము - చేర్చనైతినో ?
కలికి! మా మువ్వగోపాలు రమ్మని - కలయనైతినో ?
అలుకచేసి యల్లదాని - వలను జిక్కి
రాడే! ఓయమ్మా! ॥ఏమి॥

---

## 30. పంతువరాళి - ఆది

(పరకీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

ఏమో మాయవల పాలాగున చలముచేసెనే

అనుపల్లవి :

మాముద్దు చెలువ గోపాలునెడబాసినది మొదలు ॥ఏమో॥

1. ఏరీతి వేగింతు - నెవరిని మది దలంతు ?
నీ రేయి నెట్లోర్తు - నీ విరహమున్న
కూరిమింతో పెగటాయెనో - కొమ్మనామదితాళదాయె
అరడికిలోనై చాల - ననుబడుముతైతినే! చెలియా!
॥ఏమో॥

1. కాంత యీవింత తమిగాదు - కంటికి నిదురరా దెన్నటికి
మరవురా దీమోహమున - తన్యప్రాయమువాడు
కదిసి కౌగిట చేర్చి యున్నదెల్ల
తలచిన నోర్వనైతినే చెలియా ॥ఏమో॥

3. చెలియ! మామువ్వగోపాలుడైన - శ్రీ వేంకటేశుని
కలసిన వగలెల్ల - కల్లలయ్యె నేడు
తలచనేలె యా కథలు - తరుణి నాటివెతలు
నిలిచినచోటను - నిలువనైతినే! చెలియా!

---

## 31. యదుకులకాంభోజి - ఆట

(పరకీయ - పరోఢ, మధ్య, అధీర)

పల్లవి:

ఏల మువ్వగోపాల! - యీ చలమేలరా?

అనుపల్లవి:

వేళరా మదనుని కిపుడే - విరహామునే -
తాళరా! ని న్నెడబాయ - జాలరా! ॥ఏల॥

1. నెనరున నిను ఘన - మని నమ్మితి న
న్నేమేరా! మ్రొక్కేరా! నీ
చనువీరా! కౌగిలించ వ -
ద్దనమేరా! కోపమేల? గ్ర - క్కున రారా! ॥ఏల॥

2. అందు నందు న - న్నందక త్తెనుగా -
కుందురా! ఈ చెలిమాటలు
వింటురా? ఇప్పుడు నా మన -
సుందురా! - ఇందుకు నే నేమందురా? ॥ఏల॥

3. బలు చెలిమిని నిను - గలసితి నంటే -
పలుకవు మువ్వగోపాలనే
అలుకవు కస్తూరినాపై - చిలుకవు మా -
టలకై న పలుకవు ॥ఏల॥

---

## 32. తోడి - ఆది

(పరకీయ - పరోఢ, ప్రతిభాచతుర)

పల్లవి :

ఏలరా? చలమేలరా?

అనుపల్లవి :

ఏలరా? మువ్వగోపాల! ఏమిచేసితి? కోప ॥మేలరా॥

1. ఇందురారా! నవ్వితిని - ఎంతైన సామివిగావా?
అందుకిందుకు ని - న్నాడ నోరాడు నా కౌర్యా
వింతరా! ఇంతచిన్నబో
యుందురా? మనసు నొచ్చుకొందురా?
చక్కనిసామి! ॥ఏలరా॥

2. మంచివాడవు నే నీ - మనసు చూరాడితి నింతే
వంచనగాదు నీ పై - వలచితిరా! కౌగి
లించరా! నే నీ సొమ్మని
యెంచరా! రతుల నల - యించరా!
చక్కనిసామి! ॥ఏలరా॥

3, వేడుకై యింతసేపు - వేడుకొందువనుచు
మోడిచేసితి నింతే - మువ్వగోపాల! నన్ను
• గూడరా! నాతో సరస
మాడరా! నన్నుచల్లగ - జూడరా!
చక్కనిసామి! ॥ఏలరా॥

---

## 33. ఘంటారావము - ఆది

(పరకీయ - పరోఢ, విరహోత్కంఠిత)

పల్లవి:

ఏలవలచితినో యమ్మా! ఎట్లా వేగింతు నే? కొమ్మా!

అనుపల్లవి:

ఆలాగాట ఎరుగనైతి - యెదుగిరి చెలువరాయని పై ॥ఏల॥

1. ఉన్నచోట నుండనీదు - ఒరుగుపై నన్నొరగనీదు
అన్నాహారము లేదు - ఆనబాలు తేనె చేదు ॥ఏల॥

2. చలువలైతే సైచనాయె - జాజులెంతో ముసలాయె
నిలుపరాని మోహమాయె - నిట్టూర్పు లగ్గలమాయె ॥ఏల॥

3. తలపు వానిమీదనాయె - తలవాకిలె ఇల్లాయె
పలుమారు గదసిన మువ్వగో-పాలుడౌ చెలువరాయనిపై ॥ఏ॥

---

## 34. [1] ఆహిరి - ఆది

(పరకీయ - పరోఢ, అన్యాసంభోగ దుఃఖిత; దూతి సంఘటన)

పల్లవి :

ఏలాగున రమ్మందునే! ఓ భామా ! వాని -
నేలాగు రమ్మందునే ?

అనుపల్లవి :

ఏలాగు నేను రమ్మందు ? నీ - వేలాగు పిల్వుమనేవు ?
పాలుమాలి మువ్వ గో - పాలు డీ లీల నుండగా ॥ఏలాగు॥

1. అచ్చట వాడు సదియు - సల్లిబిల్లిగా యుండగా
ముచ్చట లాడుచుండగా - ముద్దులు పెట్టుచుండగా
గ్రుచ్చి కౌగిలించుకోగా - కోరిక మదుపు లందియ్యగా -
అచ్చిక బుచ్చికలచే - నాపె తానై యుండగా ॥ఏలాగు॥

---

1. ఆరభి.

2. చెలిమి నొకరి కొకరు - తిలకము దిద్దుకోగ
కిలకిల నవ్వుకోగ - కిన్నెరమీటుచుండగ
కులుకుచు నిద్దురను - కొక్కోకము చూచుకోగ
చలువచప్పరములో - సరసములాడుచుండగ ॥ఏలాగు॥

3. నిదురకంటికి రాక - నీవు నేను వేగించగ
అదేమో! వాడు రాడాయె - నని నీవు దూరుకోగ
మదిరాక్షి! మువ్వగోపాలుడు - మాటలోనె ఇందువచ్చి
మదనకేళి గూడి - మనసు లేకందుబోతె ॥ఏలాగు॥

---

## 35. కేదారగౌళ - ఆది

(పరకీయ - వరోఢ, తృప్త)

పల్లవి :

కంచివరదా! నీవెక్కడ గలిగితివి?

అనుపల్లవి :

ముంచేవో దరిచేర్చేవో - మోహాంబుధిలో
నున్న నన్ను ॥కంచి॥

1. ముదముతో వేగమె ముడి - వదలించి రవిక తీసి
కొదమగుబ్బల రొమ్ము - కుమ్మి కోరాడి

సదమదమైన సుద్ది - సరగనీతో దెలిపెదనంటు
ఇదియేమో మాటకవకాశ -
    విరాళమున నన్నింతసేయ ॥కంచి॥

2. నొక్కి-నోరునిండ - నూరారు ముద్దులిడుకొని
చొక్కి- పరవశమైన - సుద్దులు నీతో
మక్కు-వతో దెలిపెదనంటే - మదిలోచాలసంతసమై
ఎక్కు-వయిననాదు మోహ -
    మినుమడించె నింతసేయ ॥కంచి॥

3. నిలిచినిలిచి కలయుచు - నివ్వెరగందుచు నిన్ను
తలచితలచి సొలయుచు - తమినిల్పలేక
కులుకుచు చెక్కి-లి - కొట్టి ముద్దాడుచు
అలరిమువ్వగోపాలుడ - వై నన్ను దక్కి-ంచుకొన్న ॥కంచి॥

## 36. సౌరాష్ట్రము - ఆది

(పరకీయ-పరోఢ, సురతప్రియ)

పల్లవి :

కోడికూసె నయ్యయ్యో నా - గుండె ఝల్లుఝల్లుమనేనే!

అనుపల్లవి :

చేడెరో! నాసామివద్ద- జేరి మాటాడేటంతలో ॥కోడి॥

1. చెలువుని కదురేగి చెలగించి తోడితెచ్చి
కలపము మైనిండ - నలది కస్తూరి నామముదిద్ది
కలువల రేఖలతో - కలహము ముగియించి
చలువ చప్పరములో మేము సరసమాడే టంతలో ॥కోడి॥

2. విరులు శిఖనిండజుట్టి - వింతగా సొమ్ములుపెట్టి
బురుసురుమాలు చుట్టి - పొందుగా తురాయి చెక్కి
సరసుని మోవి చూచి - సారెసారెకు ముద్దుపెట్టి
గురుకుచములతో వాని - గుమ్మి పై కొనేటంతలో ॥కోడి॥

3. మ్రొక్కి వేడుకొని యెంతో - మోహమున ముద్దుపెట్టి
అక్కరో! సిగ్గింత లేక - ఆవేళ నీవి వదలించి
మక్కువ మీరమదన - మందిరమున వానిల్లు చేర్చి
చక్కని మువ్వగోపాల - సామితో కలసే టంతలో ॥కోడి॥

---

## 37. యదుకులకాంభోజి - ఆది

(పరకీయ-పరోఢ, సురతప్రియ. నాయకుడు-శఠుడు)

పల్లవి:

చలమేల చేసేవురా! చక్కనిసామి!

అనుపల్లవి:

చలమేల చేసేవురా! నీ చక్కెర మోవానిచ్చి—
జలజాక్ష! పన్నగశాయీ! చక్కనిసామి! ॥చల॥

1. చెలిమిచేసి చిన్నవాడ - చేపట్టి నీ కౌగిటిలో
అలవాటుల చేసితివిరా ? చక్కనిసామి !
తెలియనైతి నింతైన నీ - తియ్యబెల్లిమాటలెల్ల
చెలువుడా ! నిజమని యుంటిరా ! చక్కనిసామి ॥చల॥

2. అలుకచేసి రానివాడ - వలయించి వెతలుపెట్టి
కలలో నేల వచ్చేవురా ! చక్కనిసామి !
నిలుపరాని తమిచేత - నే నీ తీరుననుండగ
పలుకవయ్యో పగదాననా ! చక్కనిసామి ! ॥చల॥

3. ముద్దుమువ్వగోపాల ! నావద్దచేరి రతికేళిని
దిద్దుకొన్న సామివికాదా? చక్కనిసామి !
వద్దుర బంగారువంటి - వలపారడి పెట్టేవు
ప్రొద్దుపోయె తాళజాలరా ! చక్కనిసామి ! ॥చల॥

---

## 38. ఆనందభైరవి - ఆది

(పరకీయ – పరోఢ, ప్రతిభా చతుర)

["ఉపపతితో సంబంధపడిన వర్తమానము చెప్పుచున్న మళ్లీ తెలియనట్టి మాటపొర్లించి అమరపలికేదిన్ని, తన యభీష్టప్రకారము జరిగితే ప్రార్థన చెల్లించి పెడుదామని వేడుకొనేదిన్ని"]

పల్లవి :

చూడని కూడని నిందలు - జోడించిరమ్మా !

అనుపల్లవి :

ఆడుకొనని వారున్నారా ! -
హరిపై నాపై ఏ మో జనులు ॥చూడని॥

1. నిక్కముగ నతని మోము - నిలిచి చూచినానా ?
అక్కరదీర కౌగిలి - అందియున్నానా ?
చక్కెరమోవి యానినేను - నొక్కిచవి చూచినాన ?
అక్కరో! నే నతనిజూచి - చక్కని వా డన్నందుకు-

2. చేడెరో ! అతనికి నేను - ఈ డౌదునంచు మదిలో
వేడుకై ఎవరితోనైన - ఆడుకొన్నానా ?
పోడిమిగా అతని పదము - పాడి విని ముదమందినాన ?
కూడ పంతముండేవారి - కోరిక లాడించెనేమో-?

3. సన్నుతాంగి ! మువ్వపురి - సామినాదు మనసు తెలిసి
మన్నించి మరు కేళి నన్ను - మరపియున్నాడ ?
కన్నరో ! మమ్మనినవారి - కన్నుపొడిచి నట్టైతేను
చెన్నుగా మా దేవునికి - చేసేనే పూలంగి సేవ ॥చూడని॥

## 39. ఘంటారావము - ఆది

(పరకీయ – కన్య, విరహోత్కంఠిత)

పల్లవి :

తరుణిరో! పుణ్యపాపము - తనచేతివి

అనుపల్లవి :

పరమాత్ముడౌ మువ్వగో -
పాలుతో విన్నవించవే ||తరుణి||

1. చేరదీసినా మంచిదే - చేపట్టుకున్నా మంచిదే
ఆరుదూరుచేసి న - న్నలయించినా మంచిదే
గారవించినా మంచిదే - కౌగిలించినా మంచిదే
ఏరీతి విన్నవించినా - ఇచ్ఛకమై తోచీని ||తరుణి||

2. మనసువిరిచే చెలుల చాడి - మాటలువిన్నా మంచిదే
నెనరు ధానసని యాద - డించినను మంచిదే
చనువుమాటలింక - చన దనిన మంచిదే
తనకైన యీ మేను - తానేమైన చేయనీవే ||తరుణి||

3. చెలులతో నను రవ్వ - చేసినా మంచిదే
చెలిమితో నెప్పటివలె - చేరినా మంచిదే
వెలదిరో! నాపై మనసు - విరుచుకొన్నా మంచిదే
పలుకులేల ? మా మువ్వగో -
పాలుతో విన్నవించవే ||తరుణి||

---

## 40. కాంభోజి - త్రిపుట

(పరకీయ - పరోఢ, ప్రేమగర్వితా)

పల్లవి :

తరుణిరో! నా ప్రాణేశుని - దాచుకొందునా?

అనుపల్లవి :

సరసిజాక్షులెల్ల కూడి - సామి వెంట తిరిగేరే! ॥తరుణి॥

1. శృంగార వనములో - చెలువుడు నేను
రంగు మీరగ చద - రంగ మాడగను
అంగనరో! యల - యలివేణులు కొందరు
సంగతిగా కను - సైగ చేసేరే! ॥తరుణి॥

2. విడిదికి వాడురాగ - వెలదులందరు చూచి
వడిగ రమ్మని చాల - వగల చేలించి
విడెము లందిచ్చుచు - వెరపింత్రైన లేక
పడకకు రమ్మని - బలిమి చేసేరే! ॥తరుణి॥

3. మక్కువతోడుత - మా మువ్వగోపాలు
డక్కరో! ననుగూడి - యతిశయముగను
పక్కలో నున్నవాని - పడతులు తమ తమ
అక్కర దీర్చుమని - ఆనపెట్టేరే! ॥తరుణి॥

---

## 41. కల్యాణి – ఝంప

(పరకీయ – పరోఢ, ప్రేమగర్విత)

పల్లవి:

తరుణులార ! విభునెందు - దాచుకొందునమ్మా !

అనుపల్లవి:

వరదునెందు దిరుగులాడ -
వద్దని మ్రొక్కిన వినడు ॥తరుణు॥

1. అబ్బురముగ వాడు వచ్చె - యుబ్బు తెలిసి వంతు వేసి
యబ్బెననుచు బిలువ - నంపెనట యొకతె !
నిబ్బరమున వాడు రాగ - నిలువుమని పైట తీసి
గుబ్బలుచూపి మోహింప - గులికెనట యొకతె! ॥తరుణు॥

2. ఎక్కువ తమితో కెమ్మో - విమ్మనుచు నోరూరి
ఒక్కడను చెయ్యెత్తి - మ్రొక్కెనట యొకతె !
అక్కరతో వాడిందు రాగ - అడ్డగించి కౌగిలిమ్మని
పెక్కువిధములనొట్టు - వెట్టెనట యొకతె ! ॥తరుణు॥

3. అంచితముగ మువ్వగోపాలు - డైనకంచి వరద ! న
న్నుంచుకొమ్మని చాలా - నుడివెనట యొకతె !
పంచశరుని కేళి గూడి - భామ ! నాతో మాటలాడ
పొంచులు విని మదిలోన - పొగిలెనట యొకతె! ॥తరుణు॥

## 42. బిలహరి - త్రిపుట

(పరకీయ –పరోఢ, ముదిత, తన గృహకృత్యములెల్ల ఉప పతితోచెప్పి. అత్త బావ మొదలయినవారు సమీపము నందున్నారని భీతిచేత నాయకుని తీవ్రముగా కలిసి పంపించేది; ప్రతిదినము రావద్దని చెప్పేది.)

పల్లవి :

తిన్నగ మాటలాడర! మువ్వగోపాల! వున్నమబ్బీనినీకు

అనుపల్లవి :

మొన్న రేయివచ్చిన - సన్న తెలిసి
కొన్నమగడు నాపై - కోపముచేసెను ॥తిన్నగ॥

1. విరులపాన్పుపైని - వేడ్కలలరగాను
గురుకుచములరొమ్ము - గుమ్మపైకొనవచ్చుసామి!
మరునకు ఈ స్నేహాము - మనసున నాటియుండని
సురతాన కళలంటి - సాక్షియుండాము సామి! ॥తిన్నగ॥

2. ఎంతో వేడుకగాను - ఇరువురు సెనసినది
అంతరంగమునందు - నాడుకొందాము సామి!
వంతకాడైనబావ - వచ్చేటివేళాయె
శంతులుసేయకురా - రచ్చకోర్వాను సామి! ॥తిన్నగ॥

8. గుత్తకానివలె - నిత్తె నిత్తెము వచ్చేవు
అత్త కంటకిమోసము - అంగడి బెట్టకుము
చిత్తాన నేనరుంటి - చేరియుండగవచ్చు
వత్తురు ఎవరైనా - వడిగా గూడరసామి! ॥తిన్నగ॥

---

## 43. సారంగ - త్రిపుట

(పరకీయ - సౌందర్యగర్వితః)

పల్లవి :

తెలియనైతి నమ్మా! ఓయమ్మ! నే

అనుపల్లవి :

కలికిరో! యిటువంటి - కపటజ్ఞుడని నాడు
కలనైనా గాని యెంచకనే నుంటినమ్మా! ॥తెలియ॥

1. చనువిచ్చి మాటాడునే యెప్పుడు నన్ను -
సఖియ రమ్మని పిలుచునే
అనుదినము నన్ను నిమిష మెడబాయ -
నని నమ్మిక లిచ్చునే
వనజాక్షిరో! యిటు -
వంటి గుణము వాని
మనసు విరిచి యే -
మగువ బోధించెనో ॥తెలియ॥

2. పిలువనంపిన రాడు ఇప్పుడు నాడు -
ప్రియము మాటలు వినడు
చలమొకింతయు మానడు ఇపుడు నాపై -
చాడిమాటలు విన్నాడు
తెలియని వాడైతే
తెలియ దెలుపవచ్చు గా
వలె నని యుంటే -
వాని వగలు నే ॥ తెలియ॥

3. బలిమిని నను కూడు మా మువ్వగో - పాలు డనువాడు
తలిరుబోణిరో! చూడు దాని జేరి - తలచక యున్నాడు
అలనాటి కూటమి - యన్ని మరచి
నెలత యింటిలోనే - నెలకొని యున్నాడు ॥ తెలియ॥

---

## 44. కల్యాణి - చాపు

(పరకీయ – ఖండిత)

పల్లవి :

తెలియ వచ్చెనురా! నీవగలెల్ల - దృష్టి తాకీనిరా!

అనుపల్లవి :

వెలయు మువ్వగోపాల! దానింటనుండి -
విచ్చేయు హాయలుచూచితె ఇపుడు ॥ తెలియ॥

1. చక్కెర కెమ్మోవి పచ్చి నీ పలుకెంపు -
స్వామి! నీ కన్నుల నిద్దుర మంపు
చెక్కుటద్దములపై గ్రొన్నెల గుంపు -
దక్కిన నలినాక్ష! దానిపై సొంపు ॥ తెలియ॥

2. కులుకు సిబ్బెపు గబ్బి గుబ్బలపోటు -
గుత్తపు వన్నెల కీలుజడవేటు
లలదాని పసుపుదుప్పటి వల్లెవాటు -
చెలువు నడలమించిన తడబాటు ॥ తెలియ॥

3. సందిట బంగారు గాజుల దద్దు -
సకియ దిద్దిన నుదుటి తిలకము ముద్దు
అందకాడ! మువ్వగోపాల! యీ ప్రొద్దు
యిందు వచ్చి నన్నేలిన పద్దు ॥ తెలియ॥

## 45. ఉసేని - ఆది

(పరకీయ-ఖండిత, ప్రౌఢ, నాయకుడు శఠుడు. ప్రణయమాన విప్రలంభ శృంగారము, కరుణ)

పల్లవి:

తెలిసె నీ నెనరులేని జాడలు - తేట తెల్లమిగ

అనుపల్లవి :

వలపు నిలుపు మీ మాటలకేమి -
వచ్చె ? మువ్వగోపాలసామి ! ॥ తెలిసె॥

1. మనసు కలిగితే దినమొక్కసారి -
మాయింటికి రావా ? ఒకసారి
చనువుమీర కౌగిలించి ముద్దిడి -
సరసనుంచుకోవా ?
తనివితీర పూవిచ్చి కర్పూర -
తావిమడుపు లీవా ? ఈ
తనువు నీదని నమ్మికచేసిన-
తచ్చనలె కాని కొంచెకాడవా ? ॥ తెలిసె॥

2. ఊరిదాక పోయివచ్చెదనని -
ఊరకె యనలేదా ? అయి
దారుదినములైనను మోమొక్క -
సారిచూపరాదా ? ఆ
వారిజాక్షికి హితవై తేగాని -
పేరు దలచనీదా ? క -
న్నీరునించి దయమరువకు మన్నది -
నీతోనేకాదా ? మర్యాదా ? ॥ తెలిసె॥

3. కూడియుండ లేదా నను -
   కూరిమితో నీవు ? ఇవు
డాడ కాడ కేమేమో తలచుక - అంతరంగమిావు
   జోడుబాయ లేనని బతిమాలిన -
వేడవలద నేవు ! నా
   యీడువార లెకసక్కెము లాడుట -
కింత చేసినాడవు మంచివాడవు ! ॥తెలిసె॥

---

## 46 [1]అఠాణా - త్రిపుట

(పరకీయ - అతృప్త, మధ్యమాన)

పల్లవి :

దక్కితి నంటే - దయసేయవు

అనుపల్లవి :

మొక్కలింపు మేల ? - మువ్వగోపాల ! ॥దక్కితి॥

1. ఎవ్వతె బోధన విన్నావో ? - ఎంతో మ్రొక్కిన గైకోవు
నవ్వక యూరకున్నావు - నన్ను రట్టుచేసేవు ॥చక్కతి॥

---

1. తోడి - ఆది.

2. అంటి నాచేపట్టరాదో? - అవురా! నీ మనసురాదో ?
ఇంటికి వచ్చేవో లేదో ? - ఇక నీ కోపముపోదో ॥దక్కి–తి॥

3. మునుపు నన్నేలినావు - మువ్వగోపాల! నీవు
నెన రేటికి దాచేవు! - నిరాకరింప జూచేవు ॥దక్కి–తి॥

## 47. ముఖారి - చాపు

(పరకీయ - సఖీశిక్షా లక్షణము)

పల్లవి :

నన్నేవా ? - నన్నే వా ?

అనుపల్లవి :

నన్నేవా ? యింక నీవు - చిన్నదానవా ? ఓయమ్మా!
నిన్నువాని గూర్చినదే - నే రామ! లెస్సబాగాయె-

1. సతిపతులు మీ రిద్దరు - సరసము లాడెడువేళ
అతడు నిన్నేమన్నగాని - యాతని ననవలెగాక ॥నన్నే॥

2. పాయరాని మోహమున - పైటకొంగు బట్టితేను
నాయకుడ! నీ కిది - నాయముగా దనవలెగాక ॥నన్నే॥

3. ప్రేమ మువ్వగోపాలుడు - కాముకేళి గూడేవేళ
సామజయానరో! నీకు - చక్కిలి గిలిగింత లయితే॥

## 48. [1]పంతువరాళి - ఆది

(పరకీయ - కన్య, సంకేతస్థలమున ఉపపతితో తనవర్తమానము తెలియ జేసుకొనేది; తనను వివాహము చేసికొమ్మని కోరేది)

పల్లవి :

నన్నే పెండ్లాడు సుమీ! నాయాన మువ్వగోపాలా!

అనుపల్లవి :

అన్నన మావారు వరా - లడగకుండ జేసేగాని ॥నన్నే॥

1. చన్నులు రాకమునుపే - సరసములాడుచు నీవు
ఎన్నరాని మోహమున నా - కిచ్చిన బాసలుదలచి ॥నన్నే॥

2. ఎంతెంతో నను లాలించి - ఇంటికి తోడుకపోయి
వింతసేయక నా మోవి - విందారగించిన సొగసున ॥నన్నే

3. తెలియనైతి చిన్ననాడే - తేలించి మువ్వగోపాలా!
అలరువిల్తుని కేళి న - న్నలవాటు చేసిన సామి ॥నన్నే

---

## 49. సైంధవి - ఆది

(పరకీయ - కలహాంతరిత)

పల్లవి :

నా కోపమే - నన్నింత చేసెనమ్మా!

1. నాదనామక్రియ

అనుపల్లవి :

రాకేందు ముఖి ! నా వద్ది -
రమణు లతనిపై చాడి పలుకగ ॥నాకోప॥

1. నేనే పోయి పిలువవలెనో -
నెలత పంపుదునో ?
పూనివాని చెలులతోనే -
పొసగ దెలుపుదునో ?
వాని మనసు నా మనసు తెలిసిన -
వనిత ! నీవే తెలుపుదువో ?
ఈ నేరములు గాచి యిప్పు -
డింటికి రమ్మనవే ॥నాకోప॥

2. వాడివేడి శరముల - వంటి నా చురుకుమాటలకు
వాడుగాగ తాళుకొని - వచ్చెనా విడిదికి
ఏడాయె నొక్కనిమిష - మెవ్వరితో మందలింతు
పోడిమిచెడి యిట్లు నా - బుద్ధికి ఇంతమోసమాయె ॥నాకోప॥

3. చెలువ ! మువ్వగోపాలుడైన - శ్రీ వేంకటేశుడు నన్ను
వలరాజు కేళినేలిన _ వగలెల్ల నిప్పుడు
తలచి నామేను గరగెను - దైవము పగసాధించెను
నిలుపరాని మోహామాయె - నీవైన తోడితేవే ॥నాకోప॥

## 50. సౌరాష్ట్రి - ఆది

(పరకీయ - పరోఢ; మధ్యమ)

("నాయిక తనవల్ల నేరమేమియు లేదని నాయకునికి తెలియ జేసి, నాయకునివల్ల నెపము కలిగినట్లుగాను, తనశరీరము నాయకునికి అర్పించినట్లుగాను ఇరువురున్ను కూడియుండునట్లు సమాధానముగా నాయకునితో ప్రియ వచనములాడేది")

పల్లవి :

నావల్ల దుడుకు లె - న్నటికైన గలవా ?

అనుపల్లవి :

మోవనాడు కలిగిన - మువ్వగోపాల! దేవా ! ॥నావల్ల॥

1. ఏరా ? నీ కౌగిలే నా - కిరవని యుండ లేదో ?
రారా ! నినుదైవము - మారుగ జూడ లేదో ?
కూరిమి కొసర లేదో - కొమ్మని విడెమియ్య లేదో ?
దారితప్పి నడవగ - తాళనైతి గాక ॥నావల్ల॥

2. అనువైన నా మేను నీ - కమ్ముకొన్న దానగానో ?
తనవి తీరక నేను - తమినుండగ లేదో ?
మనసు లొక్కటిగానో ? - మాటనిలుప లేక నీవు
ననుమీరి నేడు వేరే - నడచుకొన్నది గాని ॥నావల్ల॥

3. కూడియున్న దినములు - కూడియుండగ లేదో ?
వేడుక చెల్లింప లేదో ? - వేడుకొనగ లేదో ?
ఊడిగంపు పడుచునై - యున్న దాననుగానో ?
పాడితప్పి మామువ్వగో - పాల! యింతవచ్చెగాని ॥నావల్ల॥

## 51. కల్యాణి - [1]మఠ్య

(పరకీయ - క్రియావిదగ్ధ, నాయకుడు - ధృష్టుడు)

ల్లవి :

నిన్ను మరతునే? ఓ చెలియా!

నుపల్లవి!

నన్ను నీ సొమ్ముచేసి వేంకట -
నాథా! రారా! యన్నజాణవు ॥నిన్ను॥

. పొలతి! నీగుణ మరయవలసి -
యలుక తెచ్చుక కన్నెఱ్ఱజేసి
పలుకక యూరకున్న నన్ను -
ప్రణతితో జేరి
కిలకిలనవ్వుచు సారెకు చక్కిలి -
గింత లిడుచు నన్ను
తలిరు గుబ్బల రొమ్మున గుమ్మి -
దక్కించుకొన్న చలపాదివి ॥నిన్ను॥

2. మొదల తరితీపుసేయ మాయ -
నిదుర తెచ్చుక పవ్వళించితే
అది తెలిసి నీవు నా కెమ్మోవి -
ఆనవచ్చితి

1. చాపు.

పెదవులు రెండు గట్టిగపట్టి -
వదన మిట్టట్టు త్రిప్పనీయక
గదిమి యదిమి మోవియాని -
విదలించివేసిన సాంతకారివి ॥నిన్ను॥

3. వెలయు మువ్వగోపాలుడైన -
వేంకటేశ! గోపభామల
నలయక పదునారువేల గూడితి -
వయిన గానిమ్మని
కలయువేళ నేమోకొన్ని -
కథలచేత జాగుచేసి
సొలయక రతులగూడి నన్ను -
జూడర నా మార్గమనిన జాణవు ॥నిన్ను॥

---

## 52. నవరోజు - త్రిపుట

(పరకీయ - పరోఢ, అతృప్త)

పల్లవి :

నీకన్నా నా మగడేమేలు - నీపాదమాన

అనుపల్లవి :

ఏకాంతమున నీమాటలు విని -
ఏమోయిపుడు మోము జూడగలిగెద ॥నీకన్నా॥

1. మోహామే చాయనెట్లు దాతు - మోహామెవరిపాలుసేతు
సాహసము ఈవేళ - చాలుచాలు పోపోర! ॥నీకన్నా॥

2. బూరుగమాను కాసించి - పొంచిన చిలుక చందమాయె
నీరూపు రేఖలు చూచి-నీకే వలచి వచ్చితిసుమీ॥నీకన్నా॥

3. నిద్దురకాచినదెల్ల - నీళ్లలోని హోమమాయె
పొద్దుపోయె నింటికి - పోవలెను మువ్వగోపాల! ॥నీకన్నా॥

---

## 53. ఆహిరి - రూపకము

(పరకీయ-విరహోత్కంఠిత; సౌందర్యగర్వీత, ముదిత)

పల్లవి :

నీకె దయరావలె గాక - లేక దిక్కెవ్వరు ?

అనుపల్లవి :

పాకశాసన వినుత ! మా మువ్వగో -
పాలరాయ ! నీ మనసు కరిగి ॥నీకె॥

1. క్రొన్నన వంటిమేను చిక్కిన -
సన్నవలువలు కట్టుకయున్న
ఎన్నిదినము లన్నము మానిన -
నేలాగు నుండిన

చెన్నైన కురులు చిక్కువడిన -
చిన్నినా చక్కని మోమువాడిన
అన్ని యిదేటి కనుచు వచ్చినా -
కన్నీరు తుడిచే కన్నెలున్నారా? ॥నీకె॥

2. విరహా వేదనచేత సొక్కిన -
వెతలజెందిన పాపజాతి
మరుని మూకచుట్టు ముట్టిన -
మనసునొచ్చిన
నిరతమునే నసురుసు రనిన -
నిట్టూర్పులచే నొగిలి యుండిన
అరసి యేడవకు మనుచువచ్చి న -
న్నాదరించే యతివలున్నారా? ॥నీకె॥

3. నేరక నడచిన నేర్చి నడచిన - నే నెటువంటి దాననైన
సారెకు నిన్నెంతో దూరుకొనిన - చలముచేసిన
చేరరమ్మని కోపగించక - చిత్తము రంజిల్లజేసి చాల
కూరిమితో మువ్వగోపాల!-గూడితి వెప్పటి కీలాగ ॥నీకె॥

## 54. బిలహరి - [1]త్రిపుట

(పరకీయ - విరహోత్కంఠిత; నాయకుడు - ధృష్టుడు)

పల్లవి :

నీకేల భ్రమదీరదే ? కంచివరదు డా -
నెలతపై మేలువాడె

అనుపల్లవి :

రాక యిందరిలో ని-రాకరించి యుండగ ॥నీకేల॥

1. పిలువనంపెదనని - తలపేలె ? వాడు దాని
సొలపుచూపులకే - చొక్కి-యుండగ
నెలత ! వానిపాలికి - నే నున్నానటవమ్మా
కలి బోసిన నుట్టివం - కలు చూచే వయ్యయ్యో! ॥నీకేల॥

2. ఆటపాటలును స - య్యాటలవి కొన్నాళ్లు
బూటకములు చేసి-పాటించెను
నేటికి నీవేలె ? నేనేలె ? వానికా
బోటికలిగి యుండగ - నేటిమాటలే చెలియా ! ॥నీకేల॥

3. పనిలేదు ముద్దుగో - పాలుడౌ వరదుని
చనువు నిక్క-మటవె - చంచలచిత్తుడు
ననుగూడి నాతో నా-డిన మాటలు నిలిపెనా ?
వనజాక్షి ! పైని క్రొత్త - వలపది రెణ్ణాళ్లు ॥నీకేల॥

---

1. ఆది.

## 55. కల్యాణి - చాపు

(పరకీయ - "పరోఢ, గుప్త వృత్త సురతగోపన; ఉపపతి యందు రూపురూపులో ప్రత్యక్షముగా తన వర్తమానముల దెలియజేసుకొనునదిన్ని, పెద్దపిన్నల లక్ష్యముసేయక యుండి నందునున్ను, ప్రేమయుంచి యుండే కార్యము లుపపతితో దెలియజేసి నందుచేతను")

పల్లవి:

నీ పొందుసేయక మాన నువ్వ -
గోపాలా! నీ పాదమాన

అనుపల్లవి:

నా పొందు నీ వెడబాయకురా! చాల -
నమ్మితిరా! నిన్ను నా ప్రాణనాథా! ॥నీపొందు॥

1. ఎవ్వరాడిన నాడనీ! మగ -
డేమిచేసిన చేయనీ!
నవ్వే వారెల్ల - నవ్వనీ! యత్త -
నన్ను దూరిన దూరనీ! సామి! ॥నీపొందు॥

2. కన్నవారు రవ్వసేయనీ! నా -
కాపుర మేమైనగానీ!
అన్నదమ్ము లెడబాయనీ చాల -
ఆరడిదూరైన గానీ! నాసామి! ॥నీపొందు॥

6. నీవు నే గూడగ జూడ నీ! మామ -
నేరము లెంచిన నెంచనీ!
బావ చాల రట్టుచేయనీ! చుట్ట -
పక్కాలు తిట్టిన దిట్టనీ! సామి! ॥నీపొందు॥

---

## 56. సావేరి - ఆది

(పరకీయ–ముదిత: నాయకుని రావించి
తృప్తిపరచినందుకు సఖిని మెచ్చుకొనేది)

పల్లవి :

నీమేలు మరతునటే ? యో ముద్దుగుమ్మా

అనుపల్లవి :

కామిని తిరువళ్లూరి వీరరాఘవుల పొందు -
కలిగె నెన్నటికైన నో చెలియా! ॥నీమేలు॥

1. ఇంతి నీవంటి సఖిని - నెన్నిజన్మములకైన
సంతరించుకోగలనా ? - సగము దేహ మిచ్చిన
ఎంతైన నీ ఋణము తీరునా ? మదిలోనివేదన
నెంతటనైన చల్లారునా ?. నీవురాకున్న -
కాంతుడు నను జేరునా ! యెన్నటికైన ॥నీమేలు॥

2. మనసు చీకటి గమ్మి - మాటాడ చెలులు లేక
ఘనమైన విరహాగ్ని - గాగేటప్పుడు వచ్చి
నను జేరదీసితివి - తనుమధ్య ! ప్రాణే
శుని దారపోసితివి - నమ్మె జెప్పిన -
వనజాక్షుల నోరు మూసితివి - ఎన్నటికైన ॥నీమేలు॥

3. బాలరో ! మువ్వగో - పాలుడౌ వీరరాఘవుని
కీలాగున నున్నసుద్ది - హితవుగ విన్నవించి
వాలాయమిందు రప్పించితివి - తేరి చూడని
వాలు గంటుల మెప్పించితివి - ననుగూడిన
వారిచే బాసలిప్పించితివి - ఎన్నటికైన ॥నీమేలు॥

---

## 57. భైరవి- ఆది

(పరకీయ - పరోఢ, తృప్త. రతియందు ఒకతేపనే రమించి నను తృప్తివహించి నందునను, నాయకునియందు సంతోషము కలిగినందునను.)

పల్లవి :

నీవే వచ్చితివి - నేను వచ్చినట్లు

అనుపల్లవి :

భావము తెలిసి మువ్వగో -
పాల ! నేడు మాయింటికి ॥నీవే॥

దినములెల్ల నూరకపోయె – నిన్ను –
గనుగొంటి నేటికి లెస్సాయె
మనసెంత చేసెర విటరాయ – యింక –
నిను నే నెంతని మెత్తు – నెనరున నమ్మనాయె ॥నీవే॥

వెలదులు మెచ్చుకోగా గందు – నీ –
వితమెల్లను – వీనుల విందు
చెలులకలికి నూరకుందు – నోరి –
బలిమి పైకొందునోయని – పదరి తమిలోనుందు ॥నీవే॥

కూడితి నా ముచ్చటతీర – మువ్వ –
గోపాల! చాల సొంపులుమీర
నేడు నాకోరిక లీడేర – ఇంక –
వీడ నాడకు నామది – వేదన చల్లార ॥నీవే॥

## 58. పంతువరాళి - త్రిపుట

(పరకీయ - ప్రతిభాచతుర)

పల్లవి :

నేను మంచి దానగనుక – నీతప్పు గాచితిగాని

అనుపల్లవి :

మానునా మరియొకతె? – మామువ్వగోపాల! ॥నేను॥

1. వెంటవెంటతిరుగుచు – వినయమాలాడుచు
ఇంటికి రమ్మంటె రాక – ఏల యేచేవు ?
ఒంటి నా చెయి చిక్కితి – వింటిలో నిన్నడ్డగించు
కొంటేను విడిపించు – కొనిపోవు దిక్కుగలరా ? ॥నేను॥

2. చెట్టబట్టి ప్రియము – చెప్పి పానుపెక్కమంటె
ఒట్టు పెట్టుకొన్నానని – ఊరకుండుదువు
పట్టుపడితివి నాచే – పడకింటిలో నిన్ను
కట్టివేసుకొంటె నిన్ను – విడిపించు దిక్కుగలరా? ॥నేను॥

3. పందెమాడుచు వచ్చి – పడకింటిలో జొచ్చి
అందకాడ! మా మువ్వగోపాల! – యనిన
మందె మేలమా నీకు – మాటిమాటికి నాతో ? ॥
కందర్పునిచేతి చిలుక – కదసినిన్ను
పట్టుకొని నిన్నుగూడి – ప్రౌఢికెక్కితే దిక్కుగలరా? ॥

---

## 59. కేదారగౌళ - త్రిపుట

(పరకీయ - ఏకశయ్యాన్యోన్య వియోగ సంయోగము)

పల్లవి :

పక్కలో కోపాన – పవ్వళించినవాని ॥
చక్కబెట్టుకో వశమా ?

అనుపల్లవి :

మిక్కిలి విరహాన - చిక్కినే నంతలో -
మిగుల కౌగిలించితినే సామిని చెలియ ! ॥పక్క॥

1. ఒక్క శయ్యపైని - ఒదిగియున్న వితము -
చక్కగా జూచి మదిని
సొక్కిన నా - చూపు అతని చూపు -
ఒక్కచోట నుండినాను ॥పక్క॥

2. దక్కి దక్కనట్లు - దాగియున్న విభుని మేను -
తడవను తలపోయుచు
పుక్కిటి విడెమీయగా - నిట్టుకొనకొన -
పుక్కిలి చూచుకొనెనే ! సామి ఓ చెలియా ! ॥పక్క॥

3. రాతిగుండె గనుక నిదుర మబ్బునవేనే -
రమణునిపై కొంటినే
కాతరమున వాని కళలంటినే నతని -
కౌగిలి చేర్కొంటినే

4. యాతరి చిత్తజు కేళి రంజిల్లె ననుచు -
అతనిచే మెచ్చుకొంటినే
నాతి ! మువ్వగోపాలునినే గనుక -
బలిమిని పైకొంటినే ! ఓ చెలియా ! ॥పక్క॥

## 60. కాంభోజి - ఝంప

(పరకీయ - సఖీశిక్షా లక్షణము)

పల్లవి :

పుట్టుభోగీంద్రు డలుకల కోర్వజాలడో -
పొలతిరో బిరానరావే

అనుపల్లవి :

నెట్టుకొని పలుమారు - నేనె మ్రొక్కెదనే ॥పుట్టు॥

1. చలమేలమొగ్గ మ - ట్టెల పోట్లగంట్లచే
అల రమణుమేను - పులిపులి యైనది
కలికి ! నీ చనుదోయి - గజనినిమ్మ పండ్లకా
కలగాని మాయదా - గాయంపునొప్పి ॥పుట్టు॥

2. పమ్మిపుప్పొడి నెరసు - పడి యెర్రనైన కను
దమ్ములకు నీరార - గమ్మెనిపుడు
కొమ్మ ! పయ్యెదకొంగు - కోకావినొత్తవే
తెమ్మపడి కన్నుగవ - తేట యాగాని ॥పుట్టు॥

3. పెలుచురే యెండ వడ - పెట్లు పడినాయకుడు
తల కొనెడు వెతలచే - దప్పిదీర
అల మువ్వగోపాలు - నలమి కౌగిటజేర్చి
పొలుపు కెమ్మోవి క - ప్పుర పడమీయవే ॥పుట్టు॥

## 61. వరాళి - చాపు.

(పరకీయ - స్వాధీనపతిక, నాయకుని విరహము, విప్రలంభ శృంగారము

పల్లవి :

ప్రొద్దుపోదు నిదురరాదు -
పొలతి నెడబాసినది మొదలు

అనుపల్లవి :

తద్దయు నీ పాపజాతి -
దైవము పగసాధించెనమ్మ ! ॥ప్రొద్దు॥

1, అనలు కొనలు పారినట్లు -
మనసు మనసు నెనసి చాల
పెనలుగొన్న చెలి మన్ననలు -
వినము నుతిసేయక ॥ప్రొద్దు॥

2. అరువు మురువు గలిగిన చి -
త్తరవు నెరవు ప్రతిమవలెను
ఉరవిరవై యున్న చెలిని -
మరువవెరవు గొననకట ॥ప్రొద్దు॥

3. మువ్వగోపాల ! రమ్మని - ముద్దుపెట్టి కూడగాను -
ముడవ వెరవు గొననకట !
పువ్వుబోణి మోవితేనె -
భుజియించిన చవిదలచి ॥ప్రొద్దు॥

---

## 62. ఖండె - ఆది

(పరకీయ - మధ్య; విరహోత్కంఠిత)

పల్లవి :

ఫలమింక యేమికద్దు ? – భామరో చాలు

అనుపల్లవి :

ఫలములేదు మువ్వగో – పాలు పొందువద్దు ॥ఫలమింక॥

1. చెనకి వానితో నేకూడి – చేసితి నెనరు
చనవుల నిచ్చోట ఇంటి – చలమెట్లా యీడేరు
వనజాక్షి వానికోసరమై – దిన దిన మీపోరు
కని విన్న వారేమైనా – కాదనబోరు ॥ఫలమింక॥

2. వామాక్షిరో! వా డీడకు – వచ్చే మనసులేదు
రామా! వా డిందు రాదలచితే – రానిచ్చేది కాదు
ఏమో నాటికామెపోయె – ఇంక పనిలేదు
భామా! నామనసు వాని – పై నాటియుండబోదు ॥ఫల॥

3. ఎంతో లాలించి కూడినా – హితవుమాట నన్న
రంతుసేయక నా మనసు – రాయిచేసుకొన్న
యంతరంగము చేయించి – యలసితినే మొన్న
వింతలు మువ్వగోపాలుని – విటము లన్నివిన్న ॥ఫలమింక॥

## 63. కల్యాణి - చాపు

(పరకీయ – పరోఢ; ఉపపతి, శఠనాయకుడు,
నాయికా నాయకుల పరిహాస లక్షణము)

పల్లవి :

మంచి దానివే చెలియ! మాటలకును

అనుపల్లవి :

వంచనగల సఖియని - వార్త చెప్పకోవస్తి ॥మంచి॥

1. "చెలియ! నీనెమ్మోము - చంద్రుడందురుగాని -
చంద్రుడైతే - చంద్రకళగావా?"
"సరసుడవు నీవు నేను - సరసము లాడంగ -
కళవేళన కళవచ్చు చంద్రకళగానా?" ॥మంచి॥

2. "కమ్మని నీ ముంగురులు - తుమ్మెదలందురుగాని, యేవే?
తుమ్మెదలైతే ఎగరవా?"
"కామాంధకారమున - గతులు రేయిపగలు -
తామసపు రతివేళ తానెగసి యాడున్" ॥మంచి॥

3. "సకియనీ చన్నవలు - సంగటి కొండలందురుగాని
కొండలైతేకోట - తలుపులేవే?"
"ఇక నేనేమి సేయుదును? మువ్వగోపాల!
ఇదిగోపాలిండ్లపై తర్కింప రవికముడి తలుపుగాద?"॥

## 64. భైరవి - త్రిపుట.

(పరకీయ - స్వాధీనపతిక, అనుకూలుడైన నాయకుని వచనములు. సంభోగ శృంగారము)

పల్లవి :

మంచివెన్నెల యిపుడు - మగువ మనకు

అనుపల్లవి :

పంచబాణుని కేళి - బాగుగాకూడుండ ॥మంచి॥

1. బిగువు కౌగిటిలోన - పికిలి పిట్టలరీతి
బిగిమీర పెనగుచును - చిగురుమోవాని
సొగసుగా నీమేను - జుమ్మనగ జేసెదను
అగడుసేయక నన్ను - ఆ పనికి లెమ్మనుమీం! ॥మంచి॥

2. సన్నజాజులు నీదు - జడనిండ జుట్టెదను
పన్నీరు గంధంబు - బాగుగా నలది
చెన్నుమీరగ గూడి - చికిలిగా తమి రేచి
నిన్ను మది కరగింతు - నిండు పున్నమ నేడు ॥మంచి॥

3. పలుమారు మువ్వగో-పాల! రమ్మని పిలిచి
మొలక నవ్వులతోను - ముద్దుపెట్టి నిను
నెలకొని సమరతుల - నేర్పుతో నేలెదను
ఎలనాగ! మోహాతమ - మెల్ల దీరగ నేడు ॥మంచి॥

## 65. బేగడ - త్రిపుట.

(పరకీయ - పరోఢ; వృత్తి ఎర్తిష్యమాణ సురతగోపన)

పల్లవి :

మగువ! ఇంతదుడుకు - తగునే? వానికి నేను -
మగనాల గాదటవే ?

అనుపల్లవి :

నగధరుడౌ మువ్వగోపాలునికి మేర -
నగవులౌనని తలచి-మొగమాట మాడినను ॥మగువ॥

1. రమ్మని నామనవి - కొమ్మని నే నీదు
సొమ్మనుచు వచ్చి - క్రొమ్ముడిలో మంచి
కమ్మని వాసన - గ్రమ్ము విరులు దురిమి
నెమ్మి తోడుత ముద్దు - లిమ్మని పిలిచెనే ॥మగువ॥

2. పట్టు పటాని పూల - పావడ సరిగల
బుట్టాల రవసెల్లా - కట్టగా వచ్చి చే
పట్టి పింజరించి - దిట్టముగా నాదు
గుట్టు చూపుమనుచు - మట్టుమీరి నవ్వెనే ॥మగువ॥

3. ఒంటిగానే పడక - టింటనుండగ వచ్చి
జంటకుచముల గోరు - లంటనాటి ముని
పంట మోవినొక్కి - దంట వగల కళ
లంటి రతుల సొక్కించి - వెంట వెంట దిరిగెనే ॥మగువ॥

# 66. గౌళిపంతు - ఆది

(పరకీయ - విప్రలబ్ధ)

పల్లవి :

మరచినాడట ! యేమే ? - మగువ ! హా !

అనుపల్లవి :

అరమర గలవాని - అడుగరాదటె యిపుడు ॥మరచి॥

1. నీళ్లకు నే బోయినదే గురుతు -
నీరాటి రేవునను - నిలిచినదే రుగుతు -
గొల్లెము మీాటినిదే రుగుతు -
కులుకు గుబ్బలు చూపుమని తా-కులికినదే గురుతు॥

2. వెలది వేడుకొన్నదే గురుతు -
వేడుకతో చేతిమడుపు - విసరినదే గురుతు -
తలయూచి నవ్వినదే గురుతు బాళి -
తాళజాలలేనని - తా ననినదే గురుతు ॥మరచి॥

3. పలుకాట్లు మోవిపై నుంచినదే గురుతు -
అలుముక మువ్వగోపాలు - డన్నదే గురుతు
చలువదుప్పటి ముసుకే గురుతు -
సందుకొని మరుకేళి - సలిపినదే గురుతు ॥మరచి॥

## 67. నీలాంబరి - త్రిపుట

(పరకీయ - పరోఢ; వాగ్విదగ్ధ - "ఈ నాయిక నాయకుడు తీవ్రంగా రమ్మనగా పోతిననిన్ని, తనకు మిక్కిలి మోహమనిన్ని నాయకుని లీలావినోదములు దలచి సంతోషమందు నదిన్నిగా నుండుటవల్లనున్ను నాయకునితో తక్షణము రమించవలెనని యెన్నిక గలిగినందు చేతనున్ను వాగ్విదగ్ధ")

పల్లవి :

మాటలచేతదీరునా ? బోటి ! [1] ఏ

అనుపల్లవి :

పాటి ? మాముద్దుగో - పాలుడు రాక నీనోటి ॥మాటల॥

1. గ్రక్కున రమ్మని కౌఘుని - గదిమి వాని
చిక్కించుకొని మోవిపంట - జిదిమి,నాదు
అక్కరదీర గుబ్బల రొ - మ్మదిమి, వాని
పక్కపెనగవలె ననుచు త-మకమున్నది మదిని ॥మాటల॥

2. పట్టరాదు మోహమని - పలికి అంతనా
గుట్టువిడిచి వానిపై - కురికి భుజలతల
పట్టి కట్టి వేయకున్న - కలికి ! మోహ
మెట్టు తాళగ వచ్చునే - ఇపుడు నావంటిచెలికి ॥మాటల॥

3. బాలరో ! మువ్వగో - పాలుడు తన
లీల వగదెలిసె గా - బోలు నన్నురతి

---

1 ఏటి మాముద్దు... డేక లీనోటి

కేళిదేలించె నాలుగు - జాలు వినవే! ఓ
వాలుగంటి! కడలి - వలె చిన్ననామేలు ॥మాటల॥

---

## 68. భైరవి - ఆది *

(పరకీయ - ఉత్తమ, ఈ నాయక నాయకునికి ఉపచారము చేయగా నాయకుడు ప్రతి ఉపచారము చేయనందువల్ల నున్న నాయకుడు యీ నాయికకు స్వాధీనం లేనం దున ఆ వర్తమానముల సఖీ జనులతో చెప్పుకుంటున్నది")

పల్లవి :

మాటలాడి మనసు - మర్మము తెలియనివాడు
ఆడుదాని వలపించునే - అమ్మలార!

అనుపల్లవి :

ఏటిరాయబార మింక - నెక్కడిసుద్దులె చాలు
పూటపూటకువాని - పొంక పరచవశమా? ॥మాట॥

1. వద్దికి రమ్మని - వగజేసి పిలిచితే -
వాదుసేయునెకాని - ఆదరింపడమ్మ!
ముద్దుపెట్టి మోవి - మొనపంటనొక్కితే
అదరిపాటున లేచి - అలుగజూచె నన్ను! ॥మాట॥

---

* కళ్యాణి - ఝంప, మూడవచరణములేదు అంగుళో ముద్ర గోపాల ముద్ర ఉంచవచ్చును

2. పక్క జేరి మోహమున - పవ్వళించి మనంటే
వెక్కస పడి మోము - వెలవెల బారెనమ్మా!
చెక్కు చేర్చి నేను - చిగురుగోర త్తితే
అక్కడ బదులుగ జేయ - కలుగజూచెనమ్మా!॥మాట॥

---

## 69. ఉసేని - త్రిపుట

(పరకీయ - ప్రేమగర్వితః అతృప్త)

పల్లః :

ముచ్చట తీరదు – మువ్వగోపాల!

అనుపల్లః :

గ్రుచ్చి యక్కున జేర్చి – కొనక రేయును బగలు॥

1. మచ్చెకంటి యని మోవి తేనె -
ఇచ్చలుగా దయచేసిన
మెచ్చి దేవర చిత్తమిచ్చి లాలింపుచు –
హెచ్చొ యుపచారము లెన్నైన చేసిన ॥ముచ్చట॥

2. చక్కెరబొమ్మ! రమ్మని నన్నాదరించి –
మిక్కిలి దయతోడను
దక్కితినీకు, దయవాడననుకొని –
పుక్కిటి విడెమిచ్చి – చెక్కిలి నొక్కిన ॥ముచ్చట॥

3. సరస సల్లాపమున కళలంటి -
 గుర్రముపై - నుంచుకొని
 కరుణించి చౌశీ - తి రతుల నన్నేలిన
 మెరసి మువ్వగోపాల!-మేలు నీ సొమ్మునిన॥ముచ్చట॥

---

## 70. యదుకుల కాంభోజి - ఆది

(పరకీయ - అతృప్త)

పల్లవి :

ముద్దుపెట్ట లేవుగా ? నా సామి!

అనుపల్లవి :

ముద్దుపెట్టలేవుగా - మోము మోమున జేర్చి
అద్దుకో ! మువ్వగోపాల ! - వద్దికి వచ్చేనుగాని

1. తత్తరముసేయక - తమినిలుపజాలను
 గుత్తంపు గుబ్బలను - కుమ్మి కౌగిలించేకాని ॥ముద్దు॥
2. కంటకముసేయకె - జంటనన్ను బాయకు
 అంటున మోహాన మోవి - జుంటి తేనెలిచ్చేకాని॥ముద్దు॥
3. వచ్చి వలపించుచు - గుచ్చి కౌగిలించుచు
 మెచ్చుగ మువ్వగోపాల - మచ్చికతో కూడేకాని॥ముద్దు॥

---

## 71. తోడి - రూపకము

(పరకీయ - పరోక్ష, మధ్య ప్రేమగర్వీత)

పల్లవి :

ముద్దుపెట్టి పోయినాడే - మోహనాంగిరో నాకొక

అనుపల్లవి :

సద్దుచేయవద్దనుచు - సైగచేయుచు నాకొక ॥ముద్దు॥

1. టక్కులొల్కువాడు నాదు
పక్కలో చేరి వల - పెక్కగ గోరి
చెక్కులోన - చెక్కుజేర్చి
మ్రొక్కివేడుచు నాకొక ॥ముద్దు॥

2. కప్పురంపు విడె మిచ్చి
కొప్పునుబట్టి తల - త్రిప్పగ దట్టి
సప్పవేణి! ఎవరితోడ
చెప్పవద్దని నాకొక ॥ముద్దు॥

3. [1] . . . . . . . . . . . .

---

1 గ్రంధపాతము

## 72. శంకరాభరణము - త్రిపుట [1]

(పరకీయ - పరోఢ, వాగ్విదగ్ధ)

పల్లవి :

ముద్దుగోపాలా ! – ముచ్చటలేలా ?

అనుపల్లవి :

నావిధిగాని ని – న్నన బనిలేదు ॥ముద్దు॥

1. కడనుండి మాటాడే – కాని యూరకయుండు
తడవాయెవచ్చి ఎ – క్కడికి పోవలెనో ?
విడనాడితి వింతే – విడెమైన నొల్లవు
జడియకు మీ యాపె – సఖులిందు లేరు ॥ముద్దు॥

2. మిగుల వెరతు వల్ల – నగమాయలాడికి
నగవు లేటికిరా ? ప – న్నగ రాజశయనా !
తెగువుతో నైన రా – తిరి కిందు రాలేవో ?
పగటి నోటిమాటలకే – పగలాయె గదరా ॥ముద్దు॥

3. ఈవే మెచ్చుగగూడి – యీ జగమెరుగగ
సేవచేసినది నీ – చిత్తాన లేదో ?
నావంటిదాన నె – న్నవు ముద్దుగోపాల !
ఆ వనితకు సత – మయ్యేవా ? నీవు ॥ముద్దు॥

---

1. అట.

## 73. సావేరి - త్రిపుట [1]

(పరకీయ - పరోఢ; వృత్తవర్తిష్యమాణానురతగోపన, నడపిన దౌత్యము చెడినందువల్ల నాయకుడు ప్రవేశము వేసుకొని మోసపుచ్చి తనను రమించెనని నాయిక తన సఖులతో చెప్పుకొనునది.)

పల్లవి :

మోసపుచ్చి రమ్మి మగవాని నాడదంట -
ముదితలందరు గూడుక ||మోస||

అనుపల్లవి :

చేసిన చేతకు మనసు కరిగి నేను -
శోకాకుపడి యుంటినే ఓ - చెలియరో! ||మోస||

1. అత్తమామ కూతురనగ మ్రొక్కితే పెండ్లి -
యౌనని దీవించెనే!
చిత్తము వచ్చిన మగని తెచ్చెదగాని -
సిగ్గేల లెమ్మనెనే
గుత్తంపు గుబ్బలు నవ్రువ లవునని -
కొనగోరనొక్కిచెరెనే
పొత్తుకు రమ్మని చేపట్టి ననుదీసి -
బువ్వము తినిపించెనే ఓ చెలియరో ||మోస||

1 అట

2. రామరో! రమణు డూరలేడు - రమ్మన్న పడుకొంటినే
భామరో! ప్రొద్దుపోదు మోవిపంటి -
పానము సేతామననే
కోమలి! ఇద్దరమూడువారమైతిమి - కోరికతీర దననే
ఏమరి నే నిదురపోవగ జూచి -
ఏమేమో చేయజూచెనే ఓ చెలియరో ॥మోస॥

3. నిదుర కంటికి రాదు మగపనులు సేతామా -
నెలత! ఇద్దరమననే
ముదితరో! అంతలో ఆడదనుచు వాని -
మొనసి నే పైకొంటినే!
వదలకుండగ బిగికౌగిటలీయమై -
వంచన తనమునను
కదసి మా మువ్వగోపాలుడు తానని -
కళలంటి నను గూడెనే ఓ చెలియరో ॥మోస॥

---

## 74. ఘంట - ఆది

(పరకీయ - పరోఢ, విరహోత్కంఠిత)

పల్లవి:

మ్రొక్కేను జాగుసేయకువే మా -
మువ్వగోపాలుని తోడితేవే

అనుపల్లవి:

ఎక్కువైన ప్రాణసఖి - వీవేయని నమ్మితి -
నింత యుపకారము సేయవే ॥ మ్రొక్కెను॥

1. కాయజుబారికి తాళజాల నీవు నన్ను -
కాచి రక్షింప నిదియే వేళ
ఓయమ్మ! పొరిచూపులే మేలా? ఈ సమయాన
ఒదవని చెలికత్తె లేలా? ॥ మ్రొక్కెను॥

2. వేడుకొన్నానాపై దయలేదా? అయ్యో! నాపాలి -
విధి నా మనవి విన్నవించనీదా?
ఆడుబుట్టువు పుట్టలేదా? విరహవేదన -
అతివ! నావలె నీకు లేదా? ॥ మ్రొక్కెను॥

3. ముదితరో! నే నున్న తెరగు విన్నవించితే
మువ్వగోపాలుని మనసు కరగు
మొదలు నన్నేలిన మోహామెరుగు మాటలేటికి?
ముమ్మాటికి జొచ్చితి నీ మరుగు ॥ మ్రొక్కెను॥

---

## 75. తోడి - ఆది

(పరకీయ - పరోఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

మ్రొక్కేర చలమేల ? — మువ్వగోపాల !

అనుపల్లవి :

అక్కరతో నీ కౌగిట —
నలముకోర ! ఈవేళ ॥ మ్రొక్కేర॥

1. అరుదుగాదా ? నీ మేలు —
అలిగేది యీపాటి చాలు —
సరసమాయె నెమ్మేలు —
చాడి వింటివిగా బోలు ॥ మ్రొక్కేర॥

2. మారుడేసె పూవుదూపు —
మనవా యింతైన రాపు
కోరియున్నాను నీ ప్రాపు —
కోపమైతే ఎంతసేపు ॥ మ్రొక్కేర॥

3. నన్ను నేలితివి చాలా —
ననవిల్తు కేళిదేల
మొన్నటి చలమిక నేలా —
మువ్వగోపాల ! యీవేళ ॥ మ్రొక్కేర॥

## 76. ఆహిరి - ఝంప

(పరకీయ - ప్రోషిత - ఉపపతి, నాయకుడు తన విరహోత్కంఠను తెలియజేయుచున్నాడు.)

పల్లవి :

రామ రామ! ప్రాణసఖి నెడబాసి -
రాము డెటువలె తాళెనో ముందు ? ॥రామ॥

అనుపల్లవి :

తామరసాక్షిని దలంచితే నా గుండె -
తల్లడంబందె నేమందు నయ్యయ్యో ॥రామ॥

1. కలికి చిలుకపలుకు లీలాగున నతనికి -
కర్ణశూలములై యుండలేదో ?
నెలరాయ డతని పాలిటికి నీలాగున -
నిప్పుల కుప్పయై యుండలేదో ?
తెలియకను రాతిరి పగలు నీ తీరునను -
దిగులు మదిలో తోచదాయె నేమో ?
చెలియ నెడబాసి నప్పటనుండి నా మనసు -
చిందరవందరై యున్న దయ్యయ్యో ! ॥రామ॥

2. మరుదు పగవాడగుచు నీలాగు నాడల్ల -
మనుజేశు నలయించ డాయెనేమో ?
కెరలి యీ గండుగోయిలనాద మీలాగు -
ఖేదమై యతని బాధించలేదో ?
విరివిగా నాతని కాహార నిద్రాదులును -
విరసంబుగాక ఇంపాయెనేమో ?
విరిబోణి నెడబాసినది మొదలు నే నిట్లు -
వెడవిల్తు బారిపాలైతి నయ్యయ్యో ||రామ||

3. వేమారు నావలెను దనసతికి నాతడును -
వేడగను నమ్మికల నియ్యలేదో ?
కామినీమణివద్ద లేనప్పు డతనికి -
కనుగవల నీ రిట్లు గ్రమ్మలేదో ?
తామసపు ప్రేమచేత నతడు నావలె గాక -
ధైర్యంబు తెచ్చుకొని యుండెనేమో ?
కామించి నను మువ్వగోపాల ! రమ్మనుచు -
కలిసిన చెలికనులగప్పె నయ్యయ్యో ||రామ||

— —

## 77. కేదారగౌళ - ఆది

(పరకీయ - విరహోత్కంఠిత)

పల్లవి :

రార ! రార ! ఇంక - రాపు చేయక

అనుపల్లవి :

కోరియున్నాను మువ్వ -
గోపాల ! నీకు మ్రొక్కేను ॥రార॥

1. తెరచూచి మాటాడితే - తేనెలు చిందునటర !
కూరిమి గోరంత లేక - కోపగించేవు
చేరి నేనెంత వేడిన - చిత్తమేల కరగదు ?
సారసాక్ష ! ఇదేటి చలము ?- చాలు చాలు ఈవేళ॥

2. ఎందాక నన్నేచేవురా ? ఎంతసేపని తాళుదురా ?
మంద బుద్ధివై నేడు నా - మాటవినవు
చిందర వందరలయి మనసు - చెప్పినటు సేయదు
అందగించి కౌగిట - నలముకొందువు గాని ॥రార॥

3. పంచబాణుని కేళిని లా - లించి నన్నేలితివుడు
మంచివేళ గాగా నేమో - మక్కువ మీర
వంచనతో నీ మనసు - మళ్లించుకొని యింతలోనే
మించినావై లేనినేర - మెంచక మువ్వగోపాల ! ॥రార॥

## 78. కల్యాణి - ఆది

(పరకీయ – విరహోత్కంఠిత)

పల్లవి :

రారా! నాసామి! రారా!

అనుపల్లవి :

రారా! రాపేల చేసేవు? రారా! నాసామి! ||రారా||

1. ముందు ననుగూడి నీ –
విందురా కిపుడు వచ్చి
సుందరాంగ! నన్నేచు –
టందమా? యిందరిలో ||రారా||

2. ఎంతసేపని తాళుదానరా? –
ఇంత పరాకు చేసితే
సుంతైన దయచూడవా? –
సుదతి బోధన కాబోలు? ||రారా||

3. పంతమేల నాతో –
కంతుకేళి గూడరా!
వంతల బెట్ట కిక ము –
వ్వగోపాల సామి! ||రారా||

---

## 79. పంతువరాళి - త్రిపుట

(పరకీయ - వాసకసజ్జిక)

పల్లవి:

రార ! మా యింటికి – రాతిరి నిన్ను మా –
రామ రమ్మన్నదిరా !

అనుపల్లవి:

రారా ! మా రమణి నీకు – రాయబారమంపినది
జేర నినుగోరి మరు – లూరి యున్నదిరా ॥రారా॥

1. తళుకు చూపులు గల – మొలకరా !
యదినీకు – తగియున్నది మరుని చిలుకరా !
చెలువుడ ! నీవీవల – పలుకురా ! మా –
కలికి నీపై మరు – లులుకురా ! యీవేళ ॥రారా॥

2. మందగమననుపేరు – చెందెరా ఆ నెలత –
అందము జూచి పై – కొందురారా !
చందముగా దిక – సుందరాకార ! మా –
సుందరాంగి నీకెదురు – చూచుచున్నదిరా ! ॥రారా॥

3. బాల పాన్పున విరులు – పరచియున్నదిరా !
శ్రీలోలా ! నీకే పూల – మాల గొన్నదిరా !
వాలుగంటితో చల – మేలరా ? మువ్వగోపాల ! –
ఏలరా ? తడ – వేల చేసెదవురా ! ॥రారా॥

## 80. కల్యాణి - ఆది

(పరకీయ - విరహోత్కంఠిత)

పల్లవి :

రారా! సామి రారా!

అనుపల్లవి :

రారా! నా వలపు - వారక మించె నాసామి! ॥రారా॥

1. ఎంత సేపని తాళుదానరా? మోహ -
మింతనరాదు నీ యానరా!
చెంతజేరి కెమ్మోవి యానరా! నన్ను -
చింతలబెట్టేది మానరా నాసామి! ॥రారా॥

2. ఏరా నీకు పగదాయెనా? చూచి -
యేలేటంతపాటి లేదాయెనా?
చేరి నీ పదసేవ చేయనా ఇపుడు? -
చిన్ననాటి కూటమి పోయెనా? సామి! ॥రారా॥

3. కూడితి విక దయయుంచరా! మువ్వ -
గోపాల! నామోహ మెంచరా!
వేడ కయ్యోని కౌగిలించరా! నన్ను -
వింతసేయక గారవించరా! నాసామి! ॥రారా॥

## 81. ఆనందభైరవి - ఆది

(పరకీయ - పరోఢ, వాసక సజ్జిక)

పల్లవి :

వచ్చేనని రాకపోయెనే ఓయమ్మా ! నాపై -
వానికింత దయ లేక పోయెనే

అనుపల్లవి :

విచ్చల విడిగా నేడు మువ్వగోపాలుడు
మచ్చికతోడను మాటలాడి యిపుడు ॥వచ్చే॥

1. ఇంత ప్రొద్దు వాడు రాక - యెదురెదురు చూచి యిట్లు
చింతింపవలసె నేటికి - చిక్కెతి ముమ్మాటికి
సుంతసేపు నావద్ద - సొంపుతో నుండకపోతే
కంతు తాపమెట్లు తీరునే - కలికి ! తెచ్చువా రెవ్వరే॥

2. పలుకనేలే నేను వాని - పక్క చేరి నిమిషమైన
పలుకనీయవు దాపురముగా - భామ! వాడు వచ్చునే ?
చెలువుని జూచి మోహించి - చేకొన నెవతెయున్నదో ?
తలచి తలచి విరహమున - తల్లడిల్లుచుండ నాయెనే॥

3. వామాక్షి సత్యపురి - వాసుదేవు డలనాడు
నా మనసు దెలిసి కూడి - నమ్మిక లిచ్చెనే !
ప్రేమలన్ని మరచెనో ? - ప్రొద్దుపోయె నిందు రాడు
ఏమి నేరము లెంచెనో? - ఇక నేమి సేయుదు? వాడు రాడు॥

## 82. పంతువరాళి - ఝంప

(పరకీయ - షరోఢ, అనుశయాన, సఖియూరడింపు మాటలు)

పల్లవి:

వచ్చే మనసో ? రాని మనసో? వనితా ?
నీవే తెలుసుకోవే!

అనుపల్లవి:

అచ్చట కంచివరదు - ఆడిన మాటలివిగో ! ॥వచ్చే॥

1. మొదటనే బిలిచితే - ముదిత ! నీవెవ్వరనెను
కదసిన దాననంటె - కన్నీరునించెను
ముదమున నీవంపిన - ముద్దుటుంగర మొసగితే
సదయుడందుకు వద్ది - సకియ ! కేలనుంచెను ॥వచ్చే॥

2. తొలుతటి మమతలు - చెలిమి లాలన వగలు
వలపులు వక్కాణ జాబు - వ్రాసినదని
పలుకరించి వాని - పాదముల చెంత నుంచగ
అలివేణి ! తా చదువుక - అసురుసురననే ॥వచ్చే॥

3. ముద్దు మువ్వగోపాలుడు మన - మిద్దరిని భ్రమయించి
అద్దమరేయి నిన్ను - సద్దుసేయక ఏలి
దిద్దిన సైగ నే - దెలియజేసినంతలో
ముద్దియ! దయమరవకు మని - మురిమాట కనుమనెను॥

## 83. భైరవి - త్రిపుట.

(పరకీయ - పరోఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

వలపు నిలుప నాదు వశము గాదేమిసేతు -
వనితరో! యీవేళ

అనుపల్లవి :

పొలతిరో! మా మువ్వగోపాలరాయుడు -
చలము చేసినాడు ॥వలపు॥

1. చలువగంధము విరుల-సరములేలే కొమ్మ లేలే ?
సొలపైన మీ సొగసు - చూచే వారెవ్వరే ?
చెలియరో! నే డది - చెప్ప సక్కము గాదు
వలపైన యీ పాపము - వద్దే పగవారికైన ॥వలపు॥

2. చిలుక తేజీపై నెక్కి - చెలరేగి యెదురెక్కి
విలుగుణధ్వనిచేసి - విరిశరము బూని
కలుకు గుబ్బలనడుమ - గురి జూచుచున్నాడే!
అలరు విల్తునిబారి - నార్చే వారెవ్వరిక? ॥వలపు॥

3. సరసుడు రాడాయె - సరిప్రొద్దు వేళాయె
విరహము మెండాయె - వెన్నెల కాకాయె
మరుని కేళిలో నన్ను - మువ్వగోపాలుడు
సరసముతో పెనగి - చౌకసేసినా డిక ॥వలపు॥

---

## 84. కాంభోజి - త్రిపుట

(పరకీయ - పరోఢ, లక్షిత)

పల్లవి :

వినవైతివి గదా !

అనుపల్లవి :

వినిన మావారు కా - దనరా ? మువ్వగోపాల ! ॥విన॥

1. చిన్ననాటి నేస్తము - చెరిచితివి గదా !
మన్నించు మని బతి - మాలితివి గదా !
పన్నగ శయన ! నన్ను - బలిమి బట్టితివి గదా !
తిన్నగా నే నెంతో - తెలియ జెప్పినగాని ॥విన॥

2. తరుణులు విశ్వాస ఘా - తకు లనేవు గదా !
సారది వ్రతముచెడిన - సుఖములేదాయె గదా !
ఎరిగితే ఇలు చేర - నీయరు గదా !
అరగడియ మాత్రాన - కపుడె నద్దన్నగాని ॥విన॥

3. అలుకదీరి యాపె నీవు - కలుసుకొంటిరి గదా !
కలకాల మీ కిద్దరికి - గానిదైతి గదా !
చలపట్టి నీవు నన్ను - చౌకచేసితివి గదా !
పలుచనాయె గదా నా - బ్రతుకు మువ్వగోపాల! ॥విన॥

## 85. బేగడ - త్రిపుట

(పరకీయ - పరోఢ, వర్తిష్యమాణ సురతగోపన; "పతి యూరిలో లేనందువల్ల నున్ను, ఇది గర్భమైనచేత వితరులు తెలిసెరని ఉపపతి యందు గర్భము విచ్ఛిన్నము చేయవలె నని తెలియజేయునది.")

పల్లవి :

వెదకి తేరా పోయి - వేరు వెల్లంకి

అనుపల్లవి :

హితవైన చెలులిక - నెవరు వద్దను లేరు ॥వెతకి॥

1. ఒట్టుపెట్టినగాని - రోరి! వినవైతివి
తిట్టిన తిట్లెల్ల - దీవెన లంటివి
పట్టుకొంటివిరా నన్ను - బలిమి గూడితివి
ముట్టునెల దప్పెను - మొగవా డూరను లేడు ॥వెతకి॥

2. నిండకొండి గట్టితివి - నిన్నన బని లేదు
ఇందనీయదు కూ - డిక నేమి సేతు ?
మందుమాకు లడిగిరారా !-మంత్రసానులవద్ద
కుందరదనలు కూడి - గుసగుసలాడక మును పే ॥వెతకి॥

3. ఊరికి పోయినమగడు - ఉట్టిపడ్డట్టు వచ్చి
ఈ రేయి నను గూడె - నిక దూరుపాసె
కోరిన కోరికలెల్ల - కొనసాగె మువ్వగోపాల !
నీ రూపమున నేను - నీకే కందు మగవాని ॥వెతకి॥

## 86. మోహన - త్రిపుట

(ప్రకీయ - పరోఢ, లక్షిత. "రమింప వచ్చిన నాయకుని సమయభేదమువల్ల కూడేటందుకు లేనందున ఉపపతిని సముదాయించినందునున్ను, బావగారు తనయందు మిక్కిలి విరోధముంచినందువల్లనున్ను, తన శయ్యాగృహానికి తోడికోడలుయొక్క పడకిల్లు సమీపమందుండెడిచేతనున్ను మిక్కిలి తామసముచేత కూడదని నాయకుని సముదాయించుటవల్ల లక్షిత.")

పల్లవి

వేళ కాదుర గడియ - తాళురసామి! ॥వేళ॥

అనుపల్లవి :

చాలుచాలు పది - వేల్కైన నిది

1. ఊరక నాపైని - నేర మెంచక
పోరుచు మా బావ - గారున్నారోయి!
కూరిమి నా తోడి - కోడలి పడకింట
చేరిక యందుండ - మేర కాదోయి! ॥వేళ॥

2. ఒద్దికతో మన - మిద్దరము కూడి
సుద్దు లాడుట కిది - ప్రొద్దు కాదోయి!
పద్దుమీరగ నా - పగవారి వద్దనే
సుద్ది విన్నంత - కొద్ది కాదోయి! ॥వేళ॥

3. నిరతము శ్రీ వేద - పురి నిలయుడైన
మురళిగానలోల ! - మువ్వగోపాల !
అరవిరుల పాన్పుపైని - మరుకేళి నన్నుగూడి
తిరుగ పొరుగింట - తరుగు కాదోయి ! ॥ వేళ॥

---

## 87. ఆనందభైరవి - ఆది

(పరకీయ - అన్యాసంభోగ దుఃఖిత)

పల్లవి :

శ్రీపతిసుతు బారికి నే - నోపలేక నిను వేడితే -
గోపాలా ? మువ్వగోపాలా !

అనుపల్లవి :

ఏ ప్రొద్దు దానింటిలోనే - కాపైయుండి నీ సరస స -
ల్లాపాలా ? మువ్వగోపాలా ! ॥ శ్రీపతి॥

1. పైపూత మాటల నేర్పు - జూపు దానిరతిపై నింత
తీపేలా ? మువ్వగోపాలా ! ॥ శ్రీపతి॥

2. చూపుల నన్యులదేరి - చూడని నాతో క
లాపాలా ? మువ్వగోపాలా ! ॥ శ్రీపతి॥

3. నా పొందెల్ల దానికబ్బి - యే పొందులేక యుసురను చే
నా పాలా ? మువ్వగోపాలా ! ॥ శ్రీపతి॥

## 88. సౌరాష్ట్రి - ఆది

(ప్రకీయ - కన్య. "పిత్రాద్యధీన గావున గూఢచేష్టలచేత నాయకుని క్రీడకు వేడుకొనేటందువల్లనున్ను, అతిబాల్యములో నుండేటప్పుడే నాయకుని రమించి యుండుటవల్ల నున్ను పుష్పవతియైనతర్వాత నాయకుని గలియవలయునని ఉపపతితో తెలియజేసేది గనుక కన్య")

పల్లవి :

సమర్తాడి నెలపూటలాయెరా!-చాల తామసమేలరా

అనుపల్లవి :

సమయమురా! మువ్వగోపాలా! -
సామి ! యేమోయని యుండేవు ! ||సమ||

1. అడుగడుగుకు నిన్ను కనుగొనవలెనని -
వడిగా కన్నులు పారీరా !
నడివీథిలో నినుజూచిన నావల -
అడుగుంచ మది దోచదురా !
విడెమీయగ నీచేసోకిన నా -
యొడలెల్ల జల్లు జల్లనురా !
కడువేడుకతో పలుక -
వలసి ముచ్చటైతిరా ! ||సమ||

2. గుబ్బలు వ్రట్టులై క్రిక్కిరిసెరా! –
 కొనగోరులుంచి మనసీరా!
గొబ్బున నిను కౌగిలించవలెనని –
 కోరికలెన్నో యున్నవిరా!
నిబ్బరమగు నీ మోవి తేనెలకు –
 నినుజూడ నోరూరెనురా!
దబ్బరలాడనేరనురా! అల –
 తావెల్ల తమి దడిసె గదరా! ॥సమ॥

3. నిన్నటినుంచి విరహము మించి –
 నిదుర కంటికి రాదురా!
అన్నము నోటికింపు కాదుర –
 ఆ పనిపై భ్రమచెందెనురా!
కన్నెప్రాయమున నొక నాడేమో –
 కలిసితి వపు డేమి తెలియదురా!
నిన్నెడబాసి యున్నియు రోసి –
 నిముసము ప్రొద్దుపోదురా! ॥సమ॥

---

## 89. తోడి - ఆది

(పరకీయ - సఖీశిక్షాలక్షణము)

పల్లవి :

సరసిజాక్షి ! నీ జన్మము - సఫల మాయెను

అనుపల్లవి :

పరమాత్ముడైన మువ్వగో -
పాలుని హస్తము సోకినంతనే ||సరసి||

1. నమ్మికలిచ్చి నీవు నన్నెంతకైనను - అమ్మకొమ్మనగ
సమ్మతిగ ముద్దు ముద్దుగనిన్ను - రొమ్మున నుంచగ
నెమ్మితో రాతిరి పగలు వాడు - నీవద్దనుండగ
కొమ్మరో ! కోపమువచ్చినంతనె - కొట్టరాదటవే ?
ఓ చెలియరో ! ||సరసి||

2. నలినాక్షి ! నీవెంత కసరుకొన్న - నవ్వుచేసుకోగా
చెలువముగా నీకు దగిన సొమ్ములు - సింగారింపగా
వెలది ! నీకురులు దువ్వి - విరులు ముడువగా
అలుక వచ్చిన చేత ని - న్నదలించ రాదటవే ?
ఓ చెలియరో ! ||సరసి||

3. సారెకు నీకు దృష్టి తాకీనని - చాటున నుంచగ
చేరి మువ్వగోపాలుడు నీకు - సేవచేయగా
కోరిన యపుడె నిన్ను గూడి - కూరిమి కొసరగ
శ్రీరామ రామ ! నిన్నువాడు - చెనకరాదటవే ?
ఓ చెలియరో ! ||సరసి||

## 90. ఆనందభైరవి - ఆది

(పరకీయ – పరోఢ, మధ్యమ)

పల్లవి:

హితవు కాదేమో నీ – కెన్నడైన మాయింటికి –
బతిమాలిన రావు గోపాల!

అనుపల్లవి:

సతమైతివని యీాడు – సరసిజాక్షులలోన –
ప్రతిలేదని యుంటి గోపాల! ||హితవు||

1. నీ వెట్లు జాణవైతివో – నీపై మరులుకొన్న దాని
భావము తెలియ – లేవు గోపాలా!
నావెంట బడినట్లు – నీవెంట బడకున్న
భావజుని కేమాయె ? గోపాలా! ||హితవు||

2. ఏపట్ల దయజూడవు నీ – వెవ్వ రనేవే! ఏమి
పాపము చేసితినో! గోపాలా!
ఈ పుట్టువు పుట్టించి – ఇంత నన్నలయించు
పాపపు విధి నేమందును ? గోపాలా! ||హితవు||

3. కలసి నిన్ను చౌశీతి – గతుల దేలించినను
భళియన నోరాడదా ? గోపాలా!
వలచి నావలెనున్న – వనిత లెందరో నీకు
బలవంతమా ? మువ్వగోపాలా! ||హితవు||

## 91. పంతువరాళి - ఆది*

(పరకీయ - సహోగచ్ఛత్ప్రతిక; సురతగోపన)

పల్లవి :

ఇంతే చాలునే ఓ లలనా ! - ఎవరేమి ముట్టుకొన్నారు ?

అనుపల్లవి :

వంతుగ నీకు నే - వలచినందుకు ఫలము ॥ఇంతే॥

1. కోరివేడి యెంతో - దూరాన నుండి
వారిజాక్షి ! ఇంటి కిపుడు - వచ్చితే
సారెకు రమ్మని - చొకళించే ముద్దు
గారాపు ప్రేమతో - కౌగలించిన ఫల ॥మింతే॥

2. పట్టరాని తమిచేత - బహు విధములనుండి
నెట్టుకొన్నందుకు - నే వచ్చితే
అట్టిట్టు సేయక - యలుగక నే ముద్దు
పెట్టి నా వెత తీర్చి - ప్రేమలాలించితివి ॥ఇంతే॥

3. నాటి పొందు వెలది ! - నాటి యున్నందుకు
బోటిరో ! నీ యింటి కిపుడు - వచ్చితే నటుల జేయు
మాటల బెట్టక ముట్టెడి గోపాలల్ల ! యీా
చాటుకు రమ్మని - కూట మిచ్చిన ఫల ॥మింతే॥

* మధ్యమావతి - త్రిపుట

## 92. ఫరజు - ఆది

(పరకీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు, వియోగ విప్రలంభ శృంగారము, కరుణ.)

పల్లవి :

ఏమనెనే? సుద్దు - లేమే? బంగారు బొమ్మా!

అనుపల్లవి :

మరుగేల? దాచకే రా - మ తుపాకుల
రాయుడు నీతో ||ఏమనె||

1. మానిని! ముందుగా నా - మాట నీ వెత్తితివో?
తానే పల్కరించెనో? దయనాపై దగిలి
కానుక తనచేత - బూనెనో? యుందిమ్మని
యాన తిచ్చెనో? నా మీ - దాన చెలియా! ||ఏమనె||

2. వనితరో! వా డీడకు - వచ్చెద ననెనో? లేక
నను తోడి తెమ్మనెనో? - నా ప్రాణ విభుడు
నెనరుతో మాటాడెనో? - నేర మెంచెనో?
వినిపింపు వానిమాట - విన ముచ్చటయ్యీని ||ఏమనె||

3. వేడుక తుపాకుల - వేంకట కృష్ణుడు
కూడే వేళలో నే - నోడించితి నంట
నేడా సుద్దులేమైనా - నీతో మందలించెనో?
మోడిగ నున్నాడో? - ముదితరో! వినిపింపవే ||ఏమనె||

## 93. బేగడ - చాపు

(పరకీయ - ప్రౌఢ, సురతప్రియ)

పల్లవి :

చెరగు మాసి యున్నానని యోచన - సేయవద్దుర సామి!

అనుపల్లవి :

దొరయా నా మువ్వగోపాల! -
పరసతులకు దోసమెన్నడు లేదురా ॥చెరగు॥

1. సరసకు రమ్మని చాలా నే వేడితే - శంక పడే వేమిరా?
అరసికుల తప్పు శాస్త్రములు నిజ - మనుచు నమ్మవద్దురా
దురుసుగ నే నీ వద్దికి వచ్చితే - దూర మరిగే వేమిరా?
నలుపు మీర ఆ వారనుండి నన్నంటక - నకముద్దైన
నియ్యారా నాసామి! ॥చెరగు॥

2. సదయా! నా పయ్యెద తొలగించి నీ -
యెద చనుమొనలను గ్రుమ్మెద
ఒదిగి మే నంటక నీదు తీయని మోవి -
ఒనరగ నానెదను
మదన జనక! అందుండి నీమొన పంట -
మడుపు లందీయుదునా?
మది నే వగనైనా ముందు వెనుక -
మరి జూతురా? నాసామి! ॥చెరగు॥

3. తన్ను దానెరుగక తొలగుట యీ వట్టి -
తప్పు నీమము లేలరా ?
పన్నెలాడుల కిది సహజగుణం బని -
వార్తయు వినవేమిరా ?
నిన్న మొన్న ఓ మువ్వగోపాలా - నీవింక నిది వినరా !
ఇన్నాళ్ళ వలె గాదురా నేటి సుఖ -
మెరిగితె మరవవురా నాసామి ! ॥చెరగు॥

---

94. భైరవి - చాపు

(స్వకీయ - నవోఢ. నాయకుడు - దక్షిణుడు. సఖి పార్శ్వచారిణి ; ప్రోత్సాహమూతి, భయానకరసము.)

పల్లవి :

జాడగ జూచిన నాటికే కాదా - దండించ
బోయేసు మీ వారలు ?

అనుపల్లవి :

ఆడుదాని మన సేమని తెలిసేరు -
అతివరో వచ్చి పువ్వులు వేసికోవే ! ॥జాడ॥

1. జంటకత్తె నా - వంటిది నీ కుండగ -
ఇంటివారు ని న్నేమి చేసెదరు ?
ఒంటిపాటున వా - డంట వచ్చిన వేళ -
కంటే సుంకము కన - కుంటే బింకము ॥జాడ॥

2. లంకాద్వీపము వంటి - సంకేత స్థల మమరి
బింకము చేసేవు - బోటిరో నీవు
ఇంకా దిటవు లేక - ఎందుకు వెరచేవు ?
రంకాడ నేర్చినది - బొంకాడ నేరదే ? ॥జాడ॥

3. మగని కన్న దొంగ - మగని పొందే మేలు
వగకాడు మువ్వగో - పాలుడు తాను
తగిన వారి మనసు - తనివి దీర్చేవాడు
మగువరో ! ఊరక - దిగులు పొందనేల ? ॥జాడ॥

---

95. సావేరి - త్రిపుట

(పరకీయ - ప్రౌఢ, సాహసిక. అయోగ విప్రలంభ శృంగారము, కరుణ)

పల్లవి :
తరుణిరో ! నన్నాడుదాని జేసిన విధికి -
తగలక పోదే నా యుసురు

అనుపల్లవి :
మరుకేళి లోపల - మన సివ్వనేరని -
మగనితో నను గూర్చెనే మాయచేసెనే ॥తరుణి॥

1. మగువా ! పాపపు బ్రహ్మ - మగవాడు గావున
మనసు తెలియదాయెనే
అగణితముగ నే మగవాడ - నైతే వాని బిగు
వెట్టిదో చూతునే ! ఏమి సేతునే ? ॥తరుణి॥

2. అమ్మ లక్కలు గూడి - ఆడుకో నేటికే -
అతివరో! నే గోలనా ?
ఇమ్ముగ ముమ్మాటికి నెనసిన మువ్వగోపాలుని -
నమ్మి తెగించెదనే - ఇలు దాటెదనే ॥తరుణి॥

3. ?

---

## 96. కాంభోజి - అట

(పరకీయ - కన్య)

పల్లవి :

బాల పంద్రెండేండ్ల - గోలసుమీ ! యిక
తాళదు గాసికి - దయ యుంచారను

అనుపల్లవి :

లాలించు మా ముద్ద - రాలిది గాయకు
రాలు గాదు విజయ - రాఘవసామి ! ॥బాల॥

1. కోమరు మరునిచేతి - కూన సుమీ! నీకు
అమరిన చిత్రంపు - టటివ సుమీ
సమరతి యుపరతి - చౌశీతి బంధములు
క్రమముగా నేర్పెదవా - గాక కొసరేవు గనుక ॥బాల॥

---

? మూడవ చరణము దొరకలేదు.

2. తొయ్యాలి బంగారు - తునక సుమీ! మరుని
కయ్యాన 1కలికిని - కసరకుమీ!
తియ్యని మోవిచ్చి - దిద్దుకొందువుగాని
శయ్యపట్ల 2రాపు - సెయ్యకుమీ! జాణ! ॥బాల॥

3. తరుణులలో మేలు - తరము సుమీ! నిన్ను
సురకేళి మెప్పించు - మగువ సుమీ!
అరయ విజయ - రాఘువ! ఎట్టి దొరకైన
దొరకేనా? అలమించు - దొరకె నీకె ఓ జాణ ॥బాల॥

---

## 97. కాంభోజి - ఆది

(పరకీయ - ప్రౌఢ, ప్రగల్భ, ధీర)

పల్లవి:

ముచ్చటలే కరువాయెగా

అనుపల్లవి:

వచ్చేనంటే పొరుగూరి - వలపే దూరమాయెగా॥ముచ్చ॥

1. అందుకలు పొందు లాయెగా
కలలోని ముడుపుగా నీ
చందము లాయెగా
అందకత్తె నెడబాసి - అప్పుడే మూడు నెల
లాయెగా ॥ముచ్చ॥

1. కొసరకు - సెయ్యముతో, 2. రవ్వ - కాయకు.

2. రాయబారము లాయెగా - చెలి నీ చేతిలోని నీడాయెగా
ఈ యెడ పగవారి కెంతెంతో నవ్వులాయెగా
నాయకా ! మమ్మెడబాసి -
నాలుగు నెల లాయెగా ॥ముచ్చ॥

3. అరుదుగ నాట లాయెగా - చేరిన చెలికి
అందని ద్రాక్షపండాయెగా
చేరి పెంచు బెల్లవరము చెన్నుగా రమ్మని నన్ను
మరుకేళి గూడిన - మమత లైదు నెల లాయెగా
॥ముచ్చ॥

98. సైంధవి - ఆది

(పరకీయ - పరోఢ, వృత్తి వర్తిష్యమాణ సురతగోపన)

పల్లవి :
మేర గాదురా ! నీ విడిదికి -
పోర ద్రొక్కేరా !

1. మంటమారి మామకు నే - నంటే మిగుల రోసము
ఒంటి వెడల నీదు శాన - వింటే చాల మోసము
వెంట వెంట తిరిగేవు - విభు డింటనే వాసము
కంటకుడు నా మరది - కంటే ప్రయాసము ॥మేర॥

2. సుదతి యైన మా యత్తి యీ - సుద్ది నాడే విన్నది
వదిన నమ్మజాలదు తల - వాకిటనే యున్నది
పదర వల దీ ప్రొద్దు నీ - పద్దు చెల్లుచున్నది
అదిగో ఈ వీథి కొనను - ఆరుదూ రాచున్నది ॥మేర॥

3. పల్లకి దొరలై తే నా - పైటలో చేయి వేతురా!
ఇల్లా లనక కలసి మెలసి - ఇంత గాసి సేతురా!
ఇల్లు వెళ్ళనీదు సవతి - ఇంత రట్టు సేతురా!
తెల్లవారెను విజయరాఘవ! - ధీర! ఏమి సేతురా!
॥మేర॥

---

99. ముఖారి- చాపు

(పరకీయ - మధ్య. నాయకుడు -ధృష్టుడు)

పల్లవి :

వచ్చిన నేమి? రాకున్న నేమి? - వనితరో! నీవద్దికి

అనుపల్లవి :

ముచ్చట దీర మా - మువ్వగోపాల! రారా యని
మోవి యాన నిచ్చేవో చెలియ! ॥వచ్చి॥

1. చేర దీసేవో? యిందు రమ్మని - చెప్పనో ల్లేవో?
వారిజాక్షి! నీపై - వలచిన వాడని
గారవించేవో? రమ్మని నన్ను - కరుణ జూచేవో?
నేరము లెంచేవు - నెనరు లేనిచోట ॥వచ్చి॥

2. చిత్త మిచ్చేవో ? దేవుడని – సేవ చేసేవో ?
వృత్తడి బొమ్మ ! నీ – పొందుగోరిన నన్ను
*పొత్తు చేరేవో ? మరుని చేతి – పోరు దీర్చేవో ?
మత్తురాలవు నీ – మాట నమ్మియుండు ॥వచ్చి॥

3. మనవి వినేవో ? బాగా లిచ్చి – మదు పొసంగేవో ?
మునుపటివలె న – న్నానసి నోరునిండ
ముద్దు పెట్టేవో ? నా నామదిలోని – మోహామెంచేవో ?
నను మువ్వగోపాలా ! – యని లాలించేవో ? ॥వచ్చి॥

## 100. కాంభోజి - ఝంప

(పరకీయ - స్వాధీనపతిక, మధ్య, అభిసారిక. నాయకుడు - అనుకూలుడు. విప్రలంభ శృంగారము)

పల్లవి :

విడిచి పోలేక నడ – వడి గొన్న సరులతో

అనుపల్లవి :

గడిదేరి మువ్వగోపాలా ! – కాంతుడా ! యని ॥విడిచి॥

1. ముడిగొన్న చనుగవలె – జీరు కొప్పునను
సడలి యాడెడు విరుల – చేరు, నుదుటిపై
విడిన కస్తూరి, చెమట – జారు కన్నులును
పొడగట్టి నట్లున్నదో చెలియా ! ॥విడిచి॥

---

* పొత్తి... —బాధ.

2. అదనైన మోవిపై - గొదమ కెంపులతోను
పదరి నవ్వితె తేనె - లొలుకు ముంగురులు
చెదరి బొమలను సొంపు - గులుకు నెడ నెడను
పొదలు నడుమున ముద్దు - గులుకు పెదవులను
అదరి పలికిన - పలుకు నేడు నా
మది నిలిచి నట్లున్నదో చెలియా ॥విడిచి॥

3. ఎడలేని పిరుదులను - తడబాటు నడుగులను
నడిరేయి నా - కడకు వచ్చి కూర్చుండి
విడె మడిగి - మడుపు లందించి రవికె ముడి
విడిచి నప్పుడె తమక - మెచ్చి కూటముల
ఎడవాటు పైట కడు - తొడల జీరెడు తీరు
ఎడబాయ కెద నున్నదో చెలియా ॥విడచి॥

# నాయిక సామాన్యయై యున్న పదములు

### 1. శంకరాభరణము - ఆది

(సామాన్య - ఖండిత)

పల్లవి :

అందగాడ వౌదువు లేరా - ఆదివరాహా!

అనుపల్లవి :

అందుకైతే జాణవు అ - ల్లందుకైతే జాణవు -
ఆదివరాహా! ॥అంద॥

1. ముప్పొవగలు చాలించు - మొగవారు లేరో సీమలో న
న్నప్పగా బిలువ మనేవు - ఆదివరాహా!
తప్పుసుద్దులకెల్ల నే - తాళేదానను గాను!
అప్పుడే విన్నవించినాను - ఆదివరాహా! ॥అంద॥

2. విటరాయ! నీతో జేరి - వేగించిన నా సొమ్ము
అటమరించేది న్యాయమా? - ఆదివరాహా!
మటుమాయలు చాలించు - మాకియ్యవలసిన పైడి
అటుపెట్టి మాటలాడు - ఆదివరాహా! ॥అంద॥

3. కోడె కాడవై మువ్వ - గోపాలుని వలె నాతో నో
రాడ జూచే వదేమయ్యా? - ఆదివరాహా!
ఈడు లేని రతుల నేలి - యియ్యరాని బాస లిచ్చి
ఆడి తప్పకు దోసము - ఆదివరాహా! ॥అంద॥

భైరవి - రూపక

(సామాన్య - మధ్య, ముదిత)

పల్లవి :

అక్క ! చూడు వీ డెంత - అగడు కాడమ్మా !

అనుపల్లవి :

పక్కజేర వచ్చి నన్ను - బయలు చేసెనమ్మా ! ॥అక్క॥

1. కిన్నెర మీటుకొంటు - నన్ను జూచి తన
కన్నుల దెలిసి - సన్నసేసి నా
చన్నుల పైకొంగు - చక్కదీసి తన
చిన్నిగోర నొక్కి వాడు - చీరి నా డమ్మా ! ॥అక్క॥

2. చేమంతి పూలచెండు - చేతి కిచ్చి నా
సేవ సేసే నంటు వాడు - చేరి కొలిచి నా
మోవితేనె లివ్వనంటె - మ్రొక్కి నా డమ్మా ! ఉన్న
తావు చూచి వచ్చేనంటు - తక్కిడి కాడమ్మా! ॥అక్క॥

3. పొగడ మాని కొనలలోని - సొగసు గెలలోని
చిగురు శయ్యమీద నన్ను - వగలు చేసెనమ్మా !
నగుచు పెరుందేవి పతి - నాయకుం డమ్మా !
పొగడి పొగడి నన్ను వాడు - పొందినాడమ్మా! ॥అక్క॥

## 3. పంతువరాళి - త్రిపుట

(సామాన్య - కలహాంతరిత)

పల్లవి :

అడపగత్తె వాని వంటిదైతే చాలా-ఆరుదూరు గాదుగదా!

అనుపల్లవి :

పడతిరో! మా మువ్వగో - పాలు డిటువలె -
పాడి తప్పినందుకు ఓ చెలియా! ॥అడప॥

1. కలికి! నేను లేనప్పుడు దానికి - గన్నుల మ్రొక్కునట!
ములుచయై తన కొక్క ముద్దు బెట్టుమని - మూతి
చాచునట!
కులుకుచు మడు పందుకొనుచు దాని చెయ్యి - గోరు
దాకించునట!
తొలగి నాతో నవ్వదోస మని యది - తోదోపుల
వచ్చెను, ఓ చెలియా! ॥అడప॥

2. వీరు వా రిచ్చట నిండేరు వాకిలి - వేసి రమ్మనునట!
సారెకు దానితో బచ్చిదేరమిగుల - సరసము లాడునట!
చేర రావద్దు వద్దనగానే పైటలో - జేయివేయవచ్చునట!
మేరు మానిసి కాగా నందుకు లోగాక - మించ
నాడివచ్చెను, ఓ చెలియా! ॥అడప॥

3. కోమలి ! నే నీడ నుండు టెల్ల నీ – కోసమని పలుకునట !
వేమరు-దానిపై పండ్లు గొరికి చాల – వెరపించి
చూచునట !
ప్రేమతో నిను గూడకున్న నన్ను నీ – పేర
బిలువ మనునట !
భామరో ! యిటువంటి మువ్వగోపాలుని – పదరి
పొందు జేసితి ఓ చెలియా ! ॥అడప॥

---

4. కాఫి - చాపు

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి :

అదరీనె మోవి తనకు దానె – వదలీనె నీవి

అనుపల్లవి :

మదిలోన వా డేమొ – మంత్రించె గాబోలు
సుదతి ! మువ్వగోపాలు – జూచిన మొదలు ! ॥అదరీనె॥

1. ఇది యేమో మాయా చిలుక వచ్చి – బెదరించి పోయా
నిదుర కంటికి రాక – నిన్నటాలనుండి
చెదరీనె చిత్తము – చెలియ యేమి సేతు ? ॥అదరీనె॥

2. అప్పుడే కొమ్మా ! నన్ను వా – డడిగించె నమ్మా !
ఒప్పక మా వార – లూరకుండుట జూచి
యుప్పతించి వా – డుసురసు రనె నేమో ! ॥అదరీనె॥

3. లీలతో నిందువచ్చి తగి - లించెనే మందు
బాలరో! మువ్వగో - పాలుడు ననుగూడ
నీ లాగు నేమేమో - జాలము చేసేను! ॥అదరీనె॥

---

## 5. కేదారగౌళ - త్రిపుట

(సామాన్య - దూతీ సంఘటన)

పల్లవి :

అమ్మ! నే జెల్ల చాలు నీ వెక్కడి - యూడదానవే!

అనుపల్లవి :

సమ్మతితో మువ్వగోపాలుని పొందు - సతమని యుంటివి ॥అమ్మ॥

1. ఎంత వలపైనను మొగవాని కస - మిచ్చి మాట లాడుదుర?
ఇంత లోనే వాడు రాకుంటే - చింతల జిక్కుదుర?
సింతస మెన్నడు లేదాయెనో! వాని - సడ్డ సేతురా? బుద్ధి
మంతురాలవని వద్దంటేమున్న నా - మాట వినవైతివి! ॥అమ్మ॥

2. కలికి! ప్రాణేశ! రమ్మని బయలుగా - గౌగిలించేవు!
పలుకరించి యదేమన్న నాతోడ - భ్రమసి మాటాడేవు!
పలుమారు వానిపేర జెలికత్తెల - బిలిచేవు! యెందు
వలచే వారు కద్దు, నీమలో నీవలె - వలచే వారు లేరు! ॥అమ॥

8. ఇది యేమో యన్నము వాని పొత్తునే గాని - హితవు
గా దనేవు !
మదిరాక్షి ! మువ్వగోపాలు నొద్దనే గాని - నిదుర
రా దనేవు !
బెదిరేవు వానిపై మనసు నిలుపలేక - మొదలె కూడి
నావు !
ఎదలోని వెత దీరదు నీ మోహ - మింతకు దెచ్చెగా !
॥అమ్మ॥

---

## 56. కాంభోజి - ఝంప

(సామాన్య - దూతీ సంఘటన)

పల్లవి :

ఇంత దయగలవాని - నేల రా వద్దంటి ? - వెంత నిర్దయు
రాలవే !

అనుపల్లవి :

సంతతము మా మువ్వగోపాలసామి నీ -
సర్వసత్వములె యెంచునే ఓ చెలియా ! ॥ఇంత॥

1. వెలది ! నీ గుణ మమృత మని నిండు కొలువులో -
వేనోళ్ల గొనియాడునే !
పలుమారు నీకు సరి రూపవతి లేదనుచు - బాస చేసెద
ననియెనే !

తెలిసి పదివేల జన్మములకు నీ ఋణము - తీర్చుకో జాల
నననే!

చెలియ! తనమీద నీ - వలుక చెందినది తా - జేసిన
పాప మనేనే! - ఓ చెలియరో! ॥ఇంత॥

2. మును నీదు కెమ్మోవి తేనెలానగ ప్రాణ - ములు నిలిచి
యున్న వనేనే!

ఘనమైన విరహ వేదన కోర్వజాల నిక - కాచి రక్షించు
మనేనే!

తనువు తన సొమ్మో, యిచ్చకము గా దీమాట - తన చిత్త
మెరుగు ననేనే!

వనజాక్షి ననగ బని లేదు నా పాలిదైవము - కరుణదప్పె
నవనే, ఓ చెలియరో! ॥ఇంత॥

3. ముందు మా మువ్వగోపాల! రారా! యనిన - ముద్దు
తా మరవ ననేనే!

కందర్పు డిక నేమి చేసునో యెరుగమా - కలికితో
దెలుపు మనెనే!

మందె మేలమున నే నాడినమాట తన - మదినుంచ
వలువదనెనే!

ఇందుముఖి ననుగూడి లాలించిన సొగ - సెంతనుచు
దలతననెనే! ఓ చెలియరో! ॥ఇంత॥

## 7. కల్యాణి - త్రిపుట*

(సామాన్య - అన్యాసంభోగ దుఃఖిత. "తనకు ఆప్తముగా నుండే దూతి నాయకుని కలసిన చిహ్నముల జూచి కోపించేది గనుకనున్ను తన యింటిలో నుండే చిలుక పలుక నందుననున్ను దూతి అద్దము చూచుకొని మోవి పలుకాటు చూచుకొన్నందుననున్ను, నాయకుని పీతాంబర మెత్తి దూతి వాసన జూచినందు నున్ను నాయిక తెరచాటున పొంచియుండి దూతిని చూచినది గనుకనున్ను.")

పల్లవి:

ఇంత మేలుదానవా ? ఓ చెలియా ! నీ - వింత
మేలుదానవా ?

అనుపల్లవి:

ఇంతి ముద్దుగోపాలు - నింటి కేల పొమ్మంటివే ? ॥ఇంత॥

1. చెలు లొక్కరును లేరు - చిలుక పంజరమున
పలుక కున్నది యల్ల - భావమేమో !
తెలుసుకొందా మని - తెరచాటున నుండిన
కలికిరో ! వాడే చ - క్కని వా డంటివి ! ॥ఇంత॥

2. మరి యే మందువోయని - మాటాడక నీ గుట్టు
నరసే ననకేల - నద్దము పూని
మురిపముతో నీదు - మోవి విరిచి చూచుకొని
నెరజాణాయైన వా - నికి నీదు లే దంటివి ! ॥ఇంత॥

* అట

3. వాని బంగారు దుప్పటి – వాసన చూచి గుబ్బల
పై నొత్తుకొని మువ్వగో – పాలరాయని
పూని యింకొకసారి – పొందకేల పొమ్మంటి ? నాడు
దాని బుద్ధి యెంత మాత్ర – మని దూరుకొంటివి !
॥ఇంత॥

8. శంకరాభరణము - త్రిపుట

(సామాన్య - సౌందర్య గర్వితి)

పల్లవి :

ఇంత మోహమేమిరా ? – ఇందరికంటే – ఇంతి చక్కని
దేమిరా ?

అనుపల్లవి :

సుంతసేపు దాని – చూడకుండగ లేవు !
అంతరంగము దెలుప – నదియేల ? మువ్వగోపాలా !
॥ఇంత॥

1. నీ కెదురుగ వచ్చునా ? – నెనరూరగ – నిండు కౌగిట
జేర్చునా ?
ఆకు మడుపు లిచ్చునా ? తన చెలిమి – కైన వాడని
మెచ్చునా ? తమి హెచ్చునా ?
ఏక చిత్తమున మీ రిద్దరు – నింపుసొంపుగ నున్న ముచ్చట
నాకు విన విన వేడు కయ్యారా ! యిపుడాన తీరా !
॥ఇంత॥

2. మోవి పానక మిచ్చునా ? కొసరి కొసరి – ముద్దులాడ
నిచ్చునా ?
తావి పువ్వుల తెచ్చునా – తన సొగసుకు – తగినవాడని
మెచ్చునా ? మనసిచ్చునా ?
దేవరే మగడు కావలెనని – భావజుని పూజలొనరించిన
యీ వనిత పే రేమి సెలవీరా ! సిగ్గేల ? తేరా ! ॥ఇంత॥

3. సంతోషముగ నాడునా ? తంబురమీట – సంచుపాట
పాడునా ?
వింతరతుల గూడునా ? ఆ సమయమున – విడువకుమని
వేడునా ? కొనియాడునా ?
సంతతము నన్నేలుకొని యీ – కాంతపై వలచినపుడె
యింక
కొంత యున్నదో మువ్వగోపాలా ! – కోఅడమేలా ?
॥ఇంత॥

---

## 9. వసంత భైరవి - ఆది

(సామాన్య - కలహాంతరిత)

పల్లవి :

ఇంత రాపు చేసితే – నే నెటులోర్తునే ?

అనుపల్లవి :

ఇంతి ! మువ్వగోపాలుడు – వింతదానివలె నన్ను ॥ఇంత॥

1. మొదల వా డీడకు వచ్చి - మ్రొక్కి పొందవలె నన్న
సదయుడ! వద్దు నేస్తమే - చాలు నంటినే!
కదసి నా మాట వినక - కాళ్ల వేళ్ల బెనగుచు
పదివేల బాసలు చేసి - పాయజాల ననేవా ॥డింత॥

2. మనసు దెలియ నలసి - మా యింటికి రావద్దన్న
కనుగొన దిటవులేక - కన్నీరు నించెనే!
పెనగొన్న తమకాన - పెదవులె తడుపుచు
నిను బాయలేనని - నెలత బతిమాలిన వా ॥డింత॥

3. నీ మాట నమ్మ రాదోయి! - నే జాల కోపకత్తెను
ఏ మన్న నేమి వచ్చునో - ఎందుకంటినే!
మోము చూచి వాడు తన - మోహానే ఫ్రాటకాపని
కోమలిరో! మువ్వ - గోపాలుడు ననుగూడి ॥ఇంత॥

---

10. కాంభోజి - అది

(సామాన్య - ప్రౌఢ, ప్రేమాధిక)

పల్లవి :

ఇంత లేదని యెంచకురా!

అనుపల్లవి :

కంతుని గన్న చక్కని - కరిగిరి వరద! నా సామి!
॥ఇంత॥

1. నిను బాసి తాళలేను ? – నీ సొమ్ము జేసితీ నామేను
తనివి దీర్చక పోసీను! – తమి నిల్పలేను ?
నను విడనాడెద నను వగమాను !– మఱచను మోహాము –
నా మదిలోను !
దనరగ నీవు నా – దైవముగాను
మనసున నెంచితి – మక్కువతోను ! ॥ఇంత॥

2. ఇక్కడ నుండ మనసా యేమో – యేమో తెలియదు
నీ మాయ !
సొక్కుపొడి చల్లినట్లాయె – సుగుణో నిధేయ !
అక్కట నీవు నన్నరమర శాయ – జిక్కితి మదనునిచే
విటరాయ !
క్రొక్కిన దిప్పపు – మోమీ చాయ !
చక్కని సామిగా – చాల నిను శాయ ! ॥ఇంత॥

3. తెలిసి మువ్వగోపాల! – దేవుడవై న న్నీ వేళ
కలసి యేచేది మేల ? – కంటి నీ లీల !
సొలపున నను దయ జూడ వదేల ? – చెలిమితో యేచేవో
చాల !
కలిగితివి కరివరద ! నా పాల – కలవని నమ్మితి – కరుణా
లోల ! ॥ఇంక॥

## 11. భైరవి - ఝంప

పల్లవి :

ఇంత విరహము ? – పలుక వెరపగు – యింతి తానెటు
సైచునో ?

అనుపల్లవి :

కాంతు డద్భుతుడనగ నిన్నన – కారణమేమి ? (శ్రీ)
వీరరాఘువ ! ॥ఇంత॥

1. గంధ మెండిన గంధవతి కుచ – కలశముల గన్నీటి వెల్లువ
చింది కళపెళ లుడికి చెలిపై – జింది మీనై మిట్టి పడినది !
కందె హారము నీలసరమై – కర్పురము నీరాజనంబై
యుం డనుచు రా చిలుక వెలువడి
మందిరము దెస మరలి చూడదు ! ॥ఇంత॥

2. చంచలేక్షణ ! పెంచి నంసయు – కాంచనమ్మున చెలువు
తామర
కొంచు రాగ నూర్పు సెగలను – మించ సారగను
గాంచుమీ
మంచునీరు కషాయముగ నటు దించి – మించు సతి
వేలుంచ చుయ్యానే !
మించునని చెంగలున చెలి కో – పించివై చిన ముగ్ధ
గనుమీ ॥ఇంత॥

3. ధ్యానమున నిను జేరి అమృత - పానమున కళలూరి కలయుచు
మేను మరచిన దేమొ తెలియదు ! - చాన పరవశ గతిని ఉన్నది !
నేను కావలసినదె కాక మ - న్నించి కరుణించి అభి
మానమున మా చెలికి ప్రాణ - దాన మొసగు శ్రీ మువ్వగోపాల ! ॥ఇంత॥



---

## 12. నాదనామక్రియ - త్రిపుట

(సామాన్య - మధ్య, ముదిత)

పల్లవి :

ఇంతహాయి వింత

అనుపల్లవి :

కంతుజనక నా రెండు కన్నులాన నీతో పొందు ॥ఇంత॥

1. ఆనవాలు జంటి తేనె - లారగించితివో యేర !
ఆనతీయ రాదటర - అందము గాను !
పూని నీ చెక్కిలి - పుక్కిటాకు లంది యంది
యానగా నానగా తీ - యనై యున్నదిరా గోపాల ! ॥ఇంత॥

2. కలపము పన్నీరు జాజి – కదంబము మైనిండ
నలదుకొన్నావు గొజ్జోలు – నందముగా
కలుకు గుబ్బలను రేదు – గుమ్మి కౌగి లియ బోవ
జలువ వాసనలు వెద – చల్లరా మువ్వగోపాల ! ॥ఇంత॥

3. ఎన్ని మందు లిడితివో ! యెంత మంతిరించితివో !
చిన్నదాన ! నీ మాయల – జిక్కితి లేరా !
నిన్ను జూడగ జూడ – నేను నా తమి మించి
తిన్నగా నెందైన దనివి – తీఱదు మువ్వగోపాల ! ॥ఇంత॥

---

## 13. సురట – త్రిపుట

(సామాన్య - ప్రౌఢ, ధీర, ఖండిత. నాయకుడు ధృష్టుడు)

పల్లవి :

ఇందెందు వచ్చితిరా ? అలదాని యిల్లు
ఈ వీథి గాదు పో పోరా !

అనుపల్లవి :

మందరగిరిధర మా మువ్వగోపాల ! కుందరదనను మది
॥ఇందెం॥

1. హెచ్చైన వెన్నెలలో – ఇల్లు ఎరుగక నీవు
మచ్చకంటిని గూడి – మైమరచితి వేమో !
మచ్చికతో దాని – మనసు చల్లగ జేసి
గ్రుచ్చి కౌగిలించిన కోమలి నే గానర ! ॥ఇందెం॥

2. నడిరేయి ఝామువేళ – నాతి నీవును గూడి
నడచుకొన్న చిన్నెలు మా – నాతి దెలిపెనుర!
వడివడి వీథిలో – వద్దికి వచ్చి రవిక
ముడి విప్పి వచ్చిన – ముచ్చవు నీవే కావా? ॥ఇందెం॥

3. మదన లాహిరి మించి – మదవతినలె వచ్చి
వదలకున్నా విదేల – వద్దు పోపోరా!
మదనకేళిని గూడి – మనసు మెప్పించినది, యు
విద లందరు జూచెర – యుదయ మాయెనులేర! ॥ఇందెం॥

---

14. సౌరాష్ట్ర : త్రిపుట
(సామాన్య : పరిహాసము)

పల్లవి :
ఇక నిన్ను నమ్మరాదే! ఓ – యింతిరో! మాట లేటికే?

అనుపల్లవి :
ఒకవేళ నవనీత – మొకవేళ పాషాణ
మకట నీ చిత్త – మయ్యయ్యో! చెలి! ॥ఇక॥

1. సరసు దని మెచ్చుకొందువు! ఏ వేళ నీ
చక్కెర కెమ్మోవి యాన మందువు!
తిరుగ లేని కోపము దెచ్చుకొందువు! నాదు
సరసకు రావు! యెంచ నన్ను దూరేవు!
॥ఇక॥

2. చెలువు డని భ్రమ సేతువు! తమి – దెలిసి ప్రేమచే
దేరదీతువు!
కలికిరో! తిరుగ – కాక సేతువు!
చలమేల జేసేవు? చాలు – చాలు పదివేలు! ॥ఇక॥

3. కూరిమి నీవె నే నంటివి మువ్వ – గోపాల! యని కూడి
యుంటివి
వేరే యింతుల చాడి – వింటి విది మేలా?
వారిజముఖి! యేల – వాదాడ వచ్చేవు? ॥ఇక॥

## 15. కల్యాణి - త్రిపుట

(సామాన్య - ప్రౌఢ, ఉత్తమ)

పల్లవి:

ఇచ్చిన మంచిదె! – ఈయకున్న మంచిది! – యింటికి
రమ్మనవే!

అనుపల్లవి:

వచ్చితే నే మనవలదు! – నొచ్చుకోనేని
మెచ్చరాని చుట్టమె! – మువ్వగోపాలుడు! ॥ఇచ్చిన॥

1. కలనాడు ఒక గవ్వ – గా సెలవు సేయడా?
తలచిన వస్తువు – దయసేయడా?
కలిమి లేము లనగ – కావడి కుండలు!
కాలము ఒక రీతి – గా వచ్చునా ఉండి? ॥ఇచ్చిన॥

2. మేలు దలపక యీ - వేళ పో పొమ్మంటే
వాలు గంటి దై - వము మెచ్చునా ?
ఆలోచ నెందుకే ? - అతడు మనకు లేడా ?
కాలము పోవును - కడకు మాట నిలుచు ॥ఇచ్చిన॥

3. నేడు వచ్చిన నెనరా - నెలత ! నన్ను రతుల
గూడిన ముచ్చట - గురు తెరుగవా ?
ఆడికెలకు తా - నౌదునా బాగాయె
వాడ బండ్లలో వచ్చు - బండ్లు వాడల బోవు ॥ఇచ్చిన॥

---

## 16. భైరవి - త్రిపుట

(సామాన్య - అతృప్త)

పల్లవి :

ఇటువంటి వాడు రానేలే ?, యీలాగై తే
యేటి వేడుక తనమే ?

అనుపల్లవి :

విటరాయు డచ్యుత - విజయరాఘవు డెంతో
వెరచు నమ్మా ! దానికి, ఓ చెలియా ! ॥ఇటు॥

1. అలివేణి రాగా జూచి చిలుక-యయ్యా వచ్చినా డంటె నందు
కలికీని నా యిల్లు యీ యింతి పొరుగని
చిలుకను దండింతునా ?
యిలలోన ఇటువంటి మగవారి వరస
లెందైన గనుగొంటిరా ? ఓ చెలియా ! ॥ఇటు॥

2. ఈ రాతిరి మా యింటికి పావురము

హెచ్చు తమి గలిగిన దీ

సారి నా యుపరతి సల్పితే పలుక - కూరకుండు నటవె ?

యా రతి కూజిత మాపె వినేనంట !

యళికి నే నేమి సేతునే ? ఓ చెలియా ! ॥ఇటు॥

3. కలికిరో ! విజయరాఘవుడు తాను నేను

గంతు కేళి గూడగ

పలుమారు గిలుకల కోళ్ల పట్టె మంచము

ఘలుఘలు మంటేను !

మెలతరో ! యా సద్దు నాపె వినే నంటే

మెల్ల నే నను కూడనే ! ఓ చెలియా ! ॥ఇటు॥

---

17. మోహన - అట

(సామాన్య - కలహాంతరిత)

పల్లవి :

ఇద్దరికి సరి వలపు లాయె !-ఎవరికైన దెలుప వశమె ?

అనుపల్లవి :

ముద్దు తిల్ల గోవిందునికి మా - మోహనాంగికి ! ॥ఇద్ద॥

1. విభుడు పాంచాల దేశాధిపతి ! - వెలది పద్మిని వంశజాతి !

ఉభయ వాదుల మనసులు మమతలు

యువిదలార ! తెలిసి తెలియలేరు ! ॥ఇద్ద॥

2. కంటిరా ? వింటిరా ! వీరి రూపము కంటె
కంట కంటమని గన్నవారలు !
రొయింటి యెంటములచే నెడసేయ
ఓ భామ ! నీ చేత నా చేత నౌన! ॥ఇద్ద॥

3. నాలుగు జాతుల వేళలు దెలిసి ! నాతి విభుడు కలసిమెలసి !
తేలించ మా మువ్వ గోపాలుడే
తిల్లగోవిందరాయుడై నాడే ! ॥ఇద్ద॥

---

## 18. పున్నాగవరాళి - త్రిపుట
(సామాన్య - ప్రేమగర్వీత)

పల్లవి :
ఇద్దరి హృదయము లేక హృదయ మైతే - వద్ద నే వా
రెవ్వరే ?

అనుపల్లవి :
సద్దు సేయక నా వద్దికి వచ్చి
ముద్దు బెట్టుచు మోవి యానుచు
మోదమున నన్నాదరించుచు ! ॥ఇద్ద॥

1. అలివేణి ! వినవే ! యీ - యాదిత్యుని పాపము !
బలిగా ఎదురుగా - బట్టె నంచు !
చెలియరో ! వినవో యీ - జలజము లలర గలికి
చిలుకల కొలికి ముద్దుల - గులికి నాతో పలుకరింపగ !
॥ఇద్ద ॥

2. చంద్రమండలమున – సంకేతమే మేఘ
బృందము బాధించె నటంచు
ఇందీవరముల వికసింపవే భామ!
మందగమన! మకరంద భాషణ!
సుందర స్వచ్ఛందము మన ॥ఇద్ద॥

3. చంచలమతి నీవు – చాడి మాటలు విని
వంచనల కొడిగట్టినా వేమో!
పంచ శరుని గన్న ప్రణతార్తిహరుడు మా
కంచి వరదుని మంచి తనమున నెన
రుంచి కరుణించగ మన! ॥ఇద్ద॥

---

## 19. ముఖారి – చాపు

(సామాన్య - ప్రేమాస్పద)

పల్లవి :

ఇన్ని విధముల బూజించేర సామి! – యింతిని నను
గూర్చుమీ!

అనుపల్లవి :

ని న్నెంతోగా వేడుకొన్నందుకు నా
నెంజిలి దీర్చుసుమీ! నా సామి, ॥ఇన్ని॥

1. క న్నెమోము నేను గనుగొన గలిగిన
పున్నమెుక్క ప్రొద్దుండేర సామి!
కన్నులు ముద్దాడ గలిగిన నే జంట
కలువ పువ్వుల బూజించేర సామి!

సన్నుమాగారంట గలిగిన వాగుల
చేతి వ్రతము లుండేర సామి!
చన్నులంట గలిగిన బంగరు కల
శము శిఖరముపై నుంచేర సామి! ॥ఇన్ని॥

2. తియ్యని మోవాన గలిగిన ననజుంటి
తేనె లారగింపించేర సామి!
శయ్యపై దాని నన్ననయ జేసిన నంత
చతుర్దశి చెల్లించేర సామి!
ఒయ్యారి జిగిచూపుల నన్ను జూచిన – నొప్పుగ
నారతు లెత్తేర సామి!
నెయ్యంపు బొందున జెమటల దడిసిన – నిత్యాభి
షేకము జేసేర సామి! ॥ఇన్ని॥

3. బాల నన్ను బిలిచిన నిన్ను మువ్వగో – పాలరాయడని
పిలిచేర సామి!
చాల ప్రొద్దు వేడుక నుండ గల్గిన–జాగరములు గాలించేర
సామి!
మేలుగ రతులను మెలగిన నీకు ల – క్ష్మికి గల్యాణము
చేసేర సామి!
వాలుగంటి యెదనుండ గలిగిన నే – వేళ నిన్ను దలచేర
సామి! ॥ఇన్ని॥

## 20. కాంభోజి - ఝంప

(సామాన్య - తృప్తాతృప్త; నాయకుడు - అనుకూలుడు)

పల్లవి :

ఈరీతి మదన సామ్రాజ్య - మిచ్చిన చెలి
నే రీతి మది నెడసి యుండు ?

అనుపల్లవి :

చేరుకొని రతికేళి యందు - చెక్కులను
జీరె తన కొనగోరులందు ! - పోకముడి
జార నోరకు దీసి - కేరి పైకొన్న వగ
మీాటి మనసెడ బాయదో - చెలియ ! ॥ ఈరీ॥

1. విడిచి పోలేక నడ - వడి గొన్న సరులతో
ముడిగొన్న చన్నుగవ సొరు - కొప్పునను
సడలి యాడెడు విరులచేరు - నుదుటిపై
నిడిన కస్తురి చెమట జారు - కన్నులను
ఏడవాలు పైటకడ - తొడల జీరెడు తీరు
పొడగట్టి నట్లున్నదో చెలియ ! ॥ ఈరీ॥

2. అదనైన మోవిపై - గొదమ కెంపులతోను
పదరి నవ్విన తేనె జిల్కు - ముంగురులు
చెదరి బొమలను సొంపు గుల్కు - ఎద నెడను
బొడలు నడుమున ముద్దులొల్కు - పెదవులును

అదర పల్కిన పల్కు - వదలకను నేడు నా
మది నిలిచి యున్నదో - చెలియ ! ॥ఈరీ॥

3. ఎడలేని పిలుదులను - దడబాటు నడుగులను
నడురేయి నా కడకు వచ్చి - కూర్చుండి
విడె మడిగి మడుపు లందిచ్చి - రవిక ముడి
విడిచి నపుడే తమక మెచ్చి - కూటముల
గడిదేరి మువ్వగోపాల యని - కలసినది
ఎడబాయ కెద నున్నదే - చెలియా ! ॥ఈరీ॥

21. కన్నడ - ఆది

(సామాన్య - అన్యాసంభోగదుఃఖిత)

పల్లవి :

ఈలాగు సేతురా ?

అనుపల్లవి :

బాలరో ! మగవాడు - పాలుమారిన గాని ॥ఈలా॥

1. మెచ్చి వాడు నిలివెడు ధనము నీ
కిచ్చెద ననగ నేమి ఫలము ?
ఎచ్చట యీ పాపము వినము కాన
వచ్చెను నీ చెలికత్తె తనము ! ॥ఈలా॥

2. ఎనయ లేదని నాతో నంటివి ! వా
డేమి కావలెనో మచ్చకంటి !
వినవే ! యింత సే పేల యుంటివో ?
వెలది ! నీ మాయ నెల్ల గంటి ! ॥ఈలా॥

3. తోడి తెచ్చెద నని యందు జేరి వాని
గూడుదుర లే ? దోసకారి !
మోడితో నీ విపు డున్న దారి తెలిసె !
మువ్వగోపాలు పొందు గోరి ॥ఈలా॥

---

22. తోడి – త్రిపుట

(సామాన్య - ప్రవత్స్యత్పతిక)

పల్లవి :

ఊరికి పోక నేడిం – దుండేది మేర

అనుపల్లవి :

వారిజాక్షులార ! కంచి – వరదుడు నా
కెదురు చూడగానే ! ॥ఊరి॥

1. తొలుత నే నొచ్చే టప్పుడు – తోచీని మనసు కెంతైనా !
ఎలనాగ ! నా కన్నదరె – ఏమి సేతునే ?
పలుమారు నన్ను పేరను – పలుకరించ జేనో తెలియ దే !
చల మేల ? నన్నంపరే – శకునము మళ్లించవలెను !
॥ఊరి॥

2. ఎంత మీరు లాలించిన - ఎన్ని సొమ్ములు పెట్టిన
సంతోస మై యుండదే ? నా - సామి నెడబాసి !
ఇంతులార ! నా మోహము - యింతింతని తెలుప
వశమా ?
కంతుజనకుడు నేడు నా - కలలో వచ్చి నాడమ్మ !
॥ఊరికి॥

3. చిన్న నాట నుండి నేను - చెలిమి జేసితి ఎంతైన !
ఎన్నికతో మరు కేళి నెనసి - యున్నదాన నయ్యయ్యో !
... ... ...
... ... ... ॥ఊరికి॥

---

## 23. సురటి - త్రిపుట

(సామాన్య - జ్యోత్స్నాభిసారిక)

పల్లవి :

ఎంత చెలిమి చేసితి వే ? - యింతిరో నీవు !

అనుపల్లవి :

ఇంతింతని తెలుప వశమా ? యిపుడు నీ దిగులు ॥ఎంత॥

1. నిన్ను కౌగిలి జేర్చి - నీ చెక్కులి ముద్దు బెట్టి
కన్నుల నీరు నించి - కడు దైన్యమున
వన్నెలాడి ! నిన్ను బాసి - వచ్చిన నాటనుండి
వెన్నవలె కరిగి కరిగి - వేసటకే లోనైతి ! ॥ఎంత॥

2. నా వలెనే నీవు – నా భావ మంత దెలిసి
దేవు నాన మైమఱచి – తెలివి నోడితివి !
నావంటి పాపజాతికి – నాతి యీ వితమైతి !
నీవంటి దానికి – నీతి గాదె ! ఓ చెలియ ! ॥ఎంత॥

3. పొంకముగా వద్ద జేరి – పూవిల్తుని కేళి
కొంకక గుబ్బల గుమ్మి – గూరిమి మీరగ
యింక నైన గాగిలించి – యింతి ! వేడుక మీర
పంకజాక్షి ! మువ్వగో – పాలా ! యని న న్నేలకనే ! ॥ఎంత॥

---

## 24. కాంభోజి - అది

(సామాన్య - ప్రేమగర్వితి)

పల్లవి :

ఎంత లేదని యెంచకురా !

అనుపల్లవి :

కంతుని గన్న చక్కని – కరిగిరివరదా ! నా సామి ! ॥ఎంత॥

1. నిను బాసి తాళలేను ! – నీ సొమ్ము జేసితి నా మేను !
తనివి దీర్చక పోనీను ! – దక్కితి నేను !
నను విడనాడే – నను వగ మాను !
ననిచెను మోహము – నా మదిలోను !
తడరగ నీవు నా – దైవము గాను !
మనమున నెంచితి – మక్కువతోను ! ॥ఎంత॥

2. ఇక్కడ నుండ మన సామి ! – ఇది యేమో తెలియదు
నీ మాయ !
చొక్కపోడి చల్లి నట్లాయె ! – సుగుణవిధేయా !
అక్కడ నీవు నన్నరమర సేయ – జిక్కితి మదనునిచే
విటరాయ !
మొక్కిన ద్రిప్పవు మో మిా చాయ !
చక్కని సామి ! నీ చల మిట్లాయె ! ॥ఎంత॥

3. తెలిసె మువ్వగోపాల ! – దేవుడ వైతి వీ వేళ !
కలసి యేచు టదేల ? – కంటి నీ లీల !
సొలపున నను దయ – జూడ వ దేల !
చెలిమి మాని యే – చెదవుర చాల !
వలచితిరా నిను – వరద ! నా పాల !
గల వని నమ్మితి ! – గరుణాలోలా ! ॥ఎంత॥

---

25. మధ్యమావతి - అట

(సామాన్య - సౌందర్యగర్వితి)

పల్లవి :

ఎంత లేదు నాతో – నీదు సేతుర !

అనుపల్లవి :

వింత లాయె ! కసుకాయ మధుర మాన !
వినరా మువ్వగోపాల ! సామి ! ॥ఎంత॥

1. నీ మనోభావము దెలియ నేర్చునా ?
నెనరుగా ని న్ననుసరించ నేర్చున ?
వేమారు మోడి చేసీనా? నా వలె - వేడి పిలువ నేర్చునా?
ప్రేమ మీఱ నీ బాళి రంజిల్ల
పెదవి తేనె లాని ముద్దాడ నేర్చున ?
సామిగా పదివేల చుక్కలాయెను !
చంద్రునికి సరి వచ్చునా సామి ? ॥ఎంత॥

2. అతిశయ లీలలు సేయ నేర్చునా ?
అణకువై ముచ్చట లాడ నేర్చున ?
రతివేళను నిన్ను తమి రేపించ నేర్చున........?
సతతము నీ తమి యుప్పొంగ జేసి
చౌసీతి బంధాల బెనగ నేర్చున !
మితి లేని యిత్తళి సొమ్ములు హెచ్చైన
బంగార మౌన సామి ? ॥ఎంత॥

3. కొక్కోక శాస్త్రము జదువ నేర్చున !
కుచముల నీ రొమ్ము గుమ్మ నేర్చున !
అక్కరదీర ని న్నలయించక రతికేళి ననుభవింప నేర్చున !
చక్కెర విల్తుని గన్న మువ్వగోపాల !
చల్ల వడిగండ్లు ముత్యమౌనా సామి ! ॥ఎంత॥

## 26. ముఖారి - చాపు

(సామాన్య - ఖండిత, మధ్య ధీరాధీర, నాయకుడు ధృష్టుడు, ఈర్ష్యామాన విప్రలంభ శృంగారము, రౌద్రరసము, హాస్యరసము.)

పల్లవి :

ఎందుకురా బొంకేవు లేదని నాతో ?
ఎమ్మెలు సేయకురా !

అనుపల్లవి :

ముందటి వాడవా ? వేణుగోపాల !
ముచ్చు వగలు మానరా ! ॥ఎందు॥

1. నిన్న దా నింటికి బో లేదో ?
నీ వది నన్నాడుకో లేదో ?
అన్ని ఇప్పుడే తార్కాణ గాదో ?
అపుర ఈలా గైతె కోపము రాదో ? ॥ఎందు॥

2. సరసము లాడుకో లేదో !
సన్నజాజులు జడ నుంచ లేదో !
పరిమళగంధ మలదుకో లేదో ?
భామ చేతి విడె మందుకో లేదో ? ॥ఎందు॥

3. చెలిని కౌగిలించ లేదో ?
చేరి మోమును ముద్దిడ లేదో ?
కిలకిల నవ్వుకో లేదో ?
కీరవాణిని మెచ్చుకో లేదో ? ॥ఎందు॥

4. దయ మరువ వద్దన లేదో?
దక్కితి నని వేడుకో లేదో?
నయముగ పరము విన లేదో?
నాతి నిను బాయ లే నన లేదో? ॥ఎందు॥

5. నను గూడినవాడవు కాదో?
నాతో నీ సుద్ది తెలుప నీదో?
చిన్నబుద్ధి తే దోసము గాదో?
కన్నె నేలితి నని బలుకరాదో? ॥ఎందు॥

---

## 27. కేదార గౌళ—చాపు

(సామాన్య - సఖీ పరిహాస లక్షణము)

పల్లవి :

ఎన్ని పోకిళ్ళ బోయే వే
యింతిరో నీవు!

అనుపల్లవి :

ఎన్నడు మువ్వగోపాలు
డెన సెనా? విర్రవీగేవు ॥ఎన్ని॥

1. సతతముగ నొక నాడైన
చక్కగా నిను జూచీన?
హితవు మీరను తమక
మెపుడై నను రేచీన?

విత లెంత రాక కులికెదవు
పేరు విన్న మాత్రాన నే వుబ్బే
అతిశయంబేమి ? నీదు మెరువడి
"అల్పం పటా భిక్షం" ! ॥ఎన్ని॥

2. సరివారు నగై కొన్నట్లు ఎచ్చైన
సరిగ కోకల గట్టేవు !
సరసముగాను ఇంటి వె
చ్చానికై పది రూకల
మరచినావా ? ఇక నేమో యొక
మంచి వలువతోనే అల్పునికి
ధర నైశ్వర్యము వచ్చితే
అరద రాతిరి గొడుగు బట్టుకొన్నట్లు ! ॥ఎన్ని

3. నిన్ను నీవే మెచ్చుకొనుచు !
నిలువు టద్దము చూచుకొనుచు !
చెన్నుగ నీ రతుల మెప్పించి
చెలగితి ననేవు !
కన్నవారితో సాటి యె
క్కడ లే దనేవు !
ఎన్న డెక్కని వాడు గుఱ్ఱ
మెక్కితే ముందు వెన కైనట్లు ॥ఎన్ని

## 28. కాంభోజి - ఆది
(సామాన్య - ఆదివ్య)

పల్లవి :

ఎవ్వ రతని చూచినాడే ? యింతిరో నన్ను!

అనుపల్లవి :

జవ్వని ! మా మువ్వగోపాల !
సామి నా మర్మము దెలియక ॥ఎవ్వ॥

1. మూసగలేని మనసు భ్రమలే
కానగలేదు నా కపటము చాలే !
తానే యింటికి వచ్చి దాగగ యుండలే ?
ఏనుగనెక్కి దిడ్డి ఈగ దూరగ నేవే! ॥ఎవ్వ॥

2. గదసి దిగులుతో గతి గూడతో
సదమదమై యుండిన సామి యిత డేమి ?
తుదమొద లైన నేమి ? దొడ్డ కొంచె మయినా నేమి ?
చదవక వే యింటి జవ్వాజి మా కేమి ? ॥ఎవ్వ॥

3. పరిపరి వితముల పణతిపై నేమందు ?
సరసము విరస మైతే సామి నేమందు ?
మరు కేళి కొత్త లాయె
మా మువ్వగోపాలు పొందు !
అరుగు మీది బిరు దైతే
అపుడే నే గూడి యుందు ! ॥ఎవ్వ॥

## 29. భైరవి - ఆది

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి :

ఏటి నేస్త మిక – బోటిరో ! వినవె !

అనుపల్లవి :

నేటి రేయి మువ్వగోపాలు డా
బోటితోనే గూడి నపుడె ॥ఏ॥

1. కాసు వీసము లేటికే ? – ఘనుని పొందే చాలు నని
ఆస చెంది యుంటి గాని ! – అతివరో ! వినవే !
మోసగాడు దా నింటిలో – వాసమై యున్నా డిపుడు ॥ఏ॥

2. ని న్నెడ బాయ నని – ఎన్నెన్నో బాస లిచ్చి !
పన్నీరు గంధము దెచ్చి – పైనిండ నలది !
వన్నెలాడి వద్ద జేరి – వలచి యున్నా డిపుడు ! ॥ఏ॥

3. చిన్ననాటి నెనరైన – చిత్తమున నుంచినాడ ?
మన్నించి యాడిన – మాట మాయ లాయెనే !
మున్ను నన్నేలిన (శ్రీ) – మువ్వగోపాలుని తోను ! ॥ఏ॥

## 30. భైరవి - ఆది

(సామాన్య - దివ్య)

పల్లవి :

ఏటి మమత ? యెక్కడి యాస ? – యెవ్వరి కెవ్వరే ?

అనుపల్లవి :

పాటల గంధి ! మువ్వగో
పాలుని నమ్మరాదె ! ॥ఏటి॥

1. కను సన్నలో బిలువ లేద ? – కరము లెత్తి మ్రొక్కినది లేద ?
అనుసరించి వెంట తిరిగి – యాడుకొన్నది లేద ?
తనువు పులకించి సొక్కించ లేద? – తానె పైకొన్నది లేద?
తనివి నైన ప్రొద్దు బోదు !–తరుణీ ! నీకు బుద్ధి లేద ? ॥ఏటి॥

2. దక్కితి నంటిన ? లేద ? – దండము బెట్టినది లేద ?
మక్కువతో బాస లిచ్చి – మాటాడుట లేద ?
చెక్కిలి నొక్క లేద ? – చిత్త మిచ్చి నడువ లేద ?
చిక్కింపు సొమ్ము లిచ్చి – సింగారించి చూడ లేద? ॥ఏటి॥

3. కురులు దువ్వి ముడువ లేద ? – విరిసరులు జుట్ట లేద ?
సరిగ రవికె దొడిగి మంచి – చలువ గట్ట లేద ?
విరిశరుని కేళి గూడి – వేదనారాయణు డనగా
పరువంపు ప్రాయము నాడు – పైకొన్న మువ్వగోపాలుని ॥ఏటి॥

## 31. భైరవి - త్రిపుట

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి:

ఏటి మాట లమ్మ! – యీ చెలులతో!

అనుపల్లవి:

పాటలగంధి! మువ్వగో
పాలుడు రాడాయె నయ్యో! ॥ఏటి॥

1. మించిన చింతతో నుండ – నన్ను మాటలా
డించ నెట్టు మన సయ్యేనే?
చంచల మాయె నా మదికి! – చాలు చాలు నేడు
నే నెంచిన యన్నిక లెల్ల నీడేర వాయె
నయ్యో! ॥ఏటి॥

2. మీననేత్రరో! వినవే! నా – మే లోకరి
మేలని మది నెంతు!
నే నెవ్వరికి పగ – దాననా? నేడు నా దీనత
విభునితో – దెలుపలే రయ్యో! ॥ఏటి॥

3. చెలిమి నెప్పటి వలెనే మువ్వగోపాలుని
కలికి! నా తమి దీఱను
కలసి సొంపుతో నుండ – గలిగెనో? లేదో? యో
చెలియరో! దైవము – చలము సాధించె నయ్యో!
॥ఏటి॥

## 32. సావేరి - రూపకము

(సామాన్య - దూతీ సంఘటన)

పల్లవి :

ఏమైన నందు బోను! వేరొక్క

యింతిని బంపవే!

అనుపల్లవి :

రామ! నీ వాడిన మాటలకు వాడు

రాడు! మనసు నొచ్చెను! ॥ఏమై॥

1. చక్కని వాడని యీవి కాడని

సరసుడని వాని వేగమె

దక్కించుకో వలె నని కొందఱు!

చక్కెర బొమ్మలు

చిక్కుల బెట్టి యెన్నెన్నో వగలు

చేసి వాని పొందు గానక

ఒక్కతె గాదె యందరు వేసారి

యున్నా రేటి మాటలు? ॥ఏమై॥

2. విందులు బెట్టి వాని మనసు

విరిచే మని చెలులు కొందఱు!

మందు లెన్నో? మాయ లెన్నో?

మంచి తన మెంతో?

కందువ తెలిసి కుంటెన గత్తె
లెంద రెంత జేసిన !
ఇందుముఖి ! నీమోహా
మింతింతన రాదు ! ॥ఏమై॥

3. కలసి వానిపై లేని నిందలు
గట్టి యింటికి రావద్దంటివి !
పలుమారు వానితో పోరు వద్దంటే
యలుక చేసితివి !
చలపాది నీ కోప మింతకు వచ్చెను !
తెలుసుకో నేరనైతివి ! నేడా
చెవికి మువ్వగోపాలున కెడలు
సేయ నాచేత గాదు ! ॥ఏమై॥

---

### 33. ఆహిరి - చాపు

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి :
ఏరీతి వేగింతునే ? యో చెలియ !

అనుపల్లవి :
ఏరీతి వేగింతు ? - నెటుల నే తాళుదు ?
సారెకు బైకొను - సకియ నిన్నెడబాసి ? ॥ఏరీ॥

1. సందె ప్రొద్దు కాడ – సమయ మిదే యని
ముందు కౌగిట జేర్చి – మోదముతో
దందన సేయక – దైవాలరాయ! నీ
పొందు గోరితి నన్ను – పొలతి! ని న్నెడబాసి! ॥పరి॥

2. ఆస బడిన చెలి – యను గూడక యున్న
దోసమురా! యని – దూరుచును
బాస నిచ్చి నన్ను – బలిమి నింటికి
నా సామి రమ్మను – వనబోణి నెడబాసి ॥పరి॥

3. పలుమారు మువ్వగో – పాల! రమ్మని వేడి
నలమి కౌగిట మో – వాన నిచ్చి
తలిరువిల్తుని కేళి – దమి మీరగా నన్ను
గళ లంటి కూడిన – కలిగి ని న్నెడబాసి! ॥పరి॥

---

34. తోడి – త్రిపుట

(సామాన్య - కలహాంతరిత)

పల్లవి :

ఏలనే వాదు సామితో? మన – కేలనే?

అనుపల్లవి :

బాలరో! మువ్వగో – పాలునితో! ॥ఏల॥

1. సన్నుతాంగిరో ! వాని – సరసుల లోపల
వన్నెకాడని యెంతో – వలచి యుండగ !
కన్నులతో నాడుకొన్న మాటలు నేడు
విన్నాను సన్నగ ! – వినతి సేయగ లేనే ! ॥ఏల॥

2. కులుకులాడిని మరు – గూడి యుండగ నిపుడు
పలుకుట మన కది – పలుచదనము గాద ?
వలపున రేయినన్ను – పిలుపించనని యల్ల
పొలతుల యెదుట వాదులు పలికెనట ! ॥ఏల॥

3. చెలిమి మీరెనని – పిలువ నంపిన గాని
వలచినదాని గూడి రాడాయె ! – వాడిందు
చెలువుడు ఇంతలో – చలము సాధించితే
కలకంఠిరో ! వాని – కలువరించ నేలే ! ॥ఏల॥

---

35. కాంభోజి - ఆది

(సామాన్య - దివ్య)

పల్లవి :

ఏల యలగి నాడమ్మా ? యీ యలుక
ఎవ్వారు దీర్చేరమ్మా ?

అనుపల్లవి :

బాలరో ! మా మువ్వగో
పాలుడు నా మనసు దెలిసి ॥ఏల॥

1. వేడుకతో నన్ను దన విడిదికి బిలువ నంపితే
వెలదిరో! నే రానంటినా ?
యాడైన దనతో - మోడి జేసి కొంటినా ?
పలుమారు దా
జూడగ నే వేడగా దా
మోడిగ్గా నింత పరాకా ?
ఆడాడ దిరుగుచు! మన సీక - యులయించి!
యింటికి రాక ||ఏల||

2. ఇందు వచ్చిన ఎపుడైన హితవుగ మాటాడక నే
మందె మేలమున నుంటినా ?
కొందరి వలె - పొందుటకు పైడి
దెమ్మంటినా ? దాని బోధన
విందురా ? తా నిందు రాక నె
యుందురా నే నెంతో తేరా !
ఇందుముఖ! నాపై నేర
మెంచుట మేర గాదు ! ||ఏల||

3. బాలప్రాయము నాడే వే
వేల నేరములు జేసితే
లాలించి మన్నించలేదా ?
చాలా రతి లాహిరిలో నే యి
ల్లాలైనను నడవదా మువ్వగోపాల !

బాలరో! నే దాళరా! చల
మేలరా? అన్నదే తప్పా?
మే లోర్వని వారిలో న
న్నీలాగున చులకన జేసి ॥ఏల॥

---

## 36. నవరోజు - త్రిపుట

(సామన్య - సఖీ ఉపాలంభన)

పల్లవి :

ఏల వచ్చితివే సామి నెడబాసి?
ఏలాగు కాళ్లాడనే? – యో లలనరో!

అనుపల్లవి :

బాలరో! మువ్వగో – పాలుడు నిన్ను దలచి
పలువరించుచు నుండునే! – యో లలనరో! ॥ఏల॥

1. ఉసురని తల యూచునే – శయ్యపై నుండి
యులికి దిగ్గున లేచునే!
కసరి దిక్కులు జూచునే! – కన్నీరు నించి
కన్ను లెఱ్ఱగ జేసునే! – యో లలనరో! ॥ఏల॥

2. తలవాకిటనే చేరునె! నీదు కెమ్మోవి
తలచుక నో రూరునే!
వెలది! విధిని దూరునె! తనలో దాను
వెఱ్ఱి కోరిక గోరునె! – యో లలనరో! ॥ఏల॥

3. నిను చాల లాలించు నే ! - మువ్వగోపాలు
   పెనసిన వగలెంచు నె !
   చనువిచ్చి కరుణించు నె ! యిందఱిలో నీ
   సాటిలేదని మెంచు నె ! - యో లలనరో ! ॥ఏల॥

---

## 37. కల్యాణి - త్రిపుట

(సామాన్య - ప్రౌఢ, రతిప్రియ)

పల్లవి :

ఏలా దయ నేలరా ? - నే నీకు బగదాననా ?

అనుపల్లవి :

చాలా వలచి నానురా ! గో - పాలా ! ॥ఏలా॥

1. తరి తీ పేల జేసేవు ? - తగవా యింటికి రావు !
   కరుణతో నను జూడవు గోపాలా ! ॥ఏలా॥

2. చను వీయవు నామీద ! నీ కింత - చల మేలరా ?
   నను వంటిది నీకు వింత గోపాలా ? ॥ఏలా॥

3. శ్రీనిధి ! మువ్వగోపాల ! - చెలులలో నను జాల
   లాలించి యేలితి వీలీల - గోపాలా ! ॥ఏలా॥

---

## 38. కేదారగౌళ - త్రిపుట

(సామాన్య - విప్రలబ్ధ)

పల్లవి :

ఒక్కరైనగాని నా - యక్కర కొదిగెరా ?

అనుపల్లవి :

ఎక్కువైన విరహాగ్నిచే - జిక్కినపుడు వచ్చి
మక్కువతో మన సిచ్చినా - చక్కని సామి ననుగూర్చి
॥ఒక్క॥

1. ముదితరో ! వా డిందు - మోడి చేసి రాకుండగ !
అది నా చెలులతోడి తె - మ్మని వేడితే !
ఎద గరిగి నా మాట - ఇంచుకైన నెంచరైరి !
మదిరాక్షు లున్నారనే - మాట వాసి యొకటేగాక
॥ఒక్క॥

2. ఇంతిరో ! విభునెడబాసి - యెలమి యొక్కింతలేక
ఎంతో నా మనసు కరగి - చింత నొందితి !
చెంత జేరి న న్నావేళ - ఎంతైన సడ్డ సేయరైరి !
అంతరంగు లున్నారనే - మాట వాసి యొకటేగాక
॥ఒక్క॥

3. చానరో ! చక్కని - సామి మువ్వగోపాలుడు
సూనశరుని కేళి గూడి - సొక్కించగా
నా నేర్పులవాని - దా నిల్లు జేర్చిరి !
మీననేత్రు లున్నారనే-మేలి మొక్కటే గాక ! ॥ఒక్క॥

## 39. ముఖారి - చాపు

(సామాన్య - రతిప్రియ)

పల్లవి :

ఒద్ద దరలరైతి రేమే ? – ఓ చెలులార !

అనుపల్లవి :

ప్రొద్దు బోయినదాక – సుద్దులే తలపెట్టుక ॥ఒద్ద॥

1. చిప్పిలు తేనె మోవి యాన నిమ్మని
చేతులెత్తి మ్రొక్కగాను !
ఒప్పుగా నామది యెప్పు – డెప్పు డనగా !
అప్పుడె నా అవిక ముడి–విప్పగ మీ కెఱుక లేక! ॥ఒద్ద॥

2. అయ్యలు ! తాళలే నని – యాముకొన్న ప్రేమతోడ !
నియ్యాన యిక దమి – నిలుప లే దనగాను !
అయ్యయ్యో ! నే కన్నుగీటి – అదర వేసిన దాక ॥ఒద్ద॥

3. నగుచు మువ్వగోపాలుడు మీరందుబోతే
చిగురు విల్తుని కేళిగూడ
మగువరో ! యీ చెలులు సైగ – మాలిన వారనగాను
మగవాని మనసు దెలిసి – మఱి నే బొమ్మన్నదాక ॥ఒద్ద॥

---

## 40. కల్యాణి - ఝంప

(సామాన్య - ప్రేమగర్వితా)

పల్లవి :

ఓయమ్మ! నీ రెంత - యోర్వ జాల రమ్మ!

అనుపల్లవి :

సోయగమున తువాకి కృ - ష్ణుడు నేను గూడి యుంటే!
॥ఓయమ్మ॥

1. పంటికొద్ది నా మోవి - పై విభుడు నొక్కిన
గంట జూచి నవ్వే - నా కలికీ!
జంట బాయక నాతో ము - చ్చట లాడ వద్దని
కొంటెతనమున గసరు - కొనియె నా మగువ! ॥ఓయమ్మ॥

2. బత్తివాని మోవి నా మోవి - పై నుంచగా జూచి
దత్తి గా దనియె నా తరుణి!
హత్తి మోవితో మడుపు - లందీయ వెరగంది
యిత్తరి ఇవిగాక దయ లనియె నా యింతి! ॥ఓయమ్మ॥

3. వన్నెమీర విభుడు నా - వద్దికి రాగానె మ్రొక్కితె
ఎన్నినేర్చె ననియె నా భామ!
నన్నుగూడి తువాకి కృష్ణ - నరనాథు డాదరించితె
తన్ను దిట్టుకొనియె నా తామరసనేత్రి! ॥ఓయమ్మ॥

41. కళ్యాణి - ఝంప

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి :

కందువ తెలియక నాపై మేలువాడను
కొందు రితరు లెల్లను !

అనుపల్లవి :

ఇందుముఖిరో ! మువ్వగోపాల ! నా సామి మా
యింటికి రాగా జూచి ॥కందువ॥

1. రచ్చలు జేసు నీ వీథిలో నన్ను
రమణుల గూర్చుకొని !
ముచ్చటై నే వద్ద జేరి మాటాడితే
మోడి చేసుకొనును !
మచ్చికంటు లింద రున్నా రొక తైన
మంచిది గాద నుచు

వచ్చినందువల్ల యేమి భాగ్యమటు
వలె నున్నది వానికి ! ॥కందువ॥

2. పొలతి యిం డ్లెల్ల దిరిగి యీడకు సరి
ప్రొద్దు వేళను జేరును !
పిలచి నప్పుడె తలుపు దెరువ రాదా యని
చెలిక త్తెను దూరును !

నలిరేగి యించుక నిదుర బోతి నని
నన్ను జూచి కేరును !
తలపు నా మీాద లేదు గనుక నేరము వేసి
దా నింటికి జారును ! ॥కందువ॥

౩. మనసు వచ్చి యొక నా డీడ నుండిన
మాటాడక నిద్రించును !
వనజాక్షి ! ముందుగ సఖులతో నను లేప
వద్దని బెదరించును !
ఘనమైన తమినే నిలుప లేక పై కొంటె
గ్రక్కున చాలించును !
తన కితవు గనుక మువ్వగోపాలుడు
దానింట వసియించును ! ॥కందువ॥

---

42. మోహన - చాపు

(సామాన్య - తృప్తాతృప్త)

పల్లవి :

కలికిరో ! యింకొకసారి యుపరతి
కలియక నే తాళజాలనే !

అనుపల్లవి :

పలుమారు శ్రీ మువ్వగో - పాలుని మీాద
పదము బాడి పెకాసు గాను ! ॥కలికి॥

1. ముదమున కుచగిరు లల్లాడగ
మోమున ముంగురు లల్లికలాడ!
సుదతిరో! నెన్నడు మసియాడ నీ
సొమ్ము లెల్ల నా యెదను కొంగాడ! ॥కలి॥

2. తాటంకము లిరుగడ గులుక!
తళుక్కు మని నా చెక్కిలి బెళుక!
బోటిరో! యిరువురు తా గులుక విరి
బోణిరో! నా మీదనే యరమర లేక ॥కలి॥

3. అరుదుగ నెరి ముడి సడలించి
అల్లెప్పటివలె నేను రతి కలసి
ఇరువరు తాణన! చేయి వేసి
ఇంపున సతతము మువ్వగోపాలునితోను! ॥కలి॥

---

43. భైరవి – త్రిపుట
(సామాన్య - లఘు మాన)

పల్లవి :

కాని దాని జూచి – కనుసైగ సేయలేదని
నీతో బలికెనటే ?

అనుపల్లవి :

మానినిరో! నిన్ను మాపటి వేళలో
మాటాడ లేద? మా మువ్వగోపాలుడు ॥కాని॥

1. ఇందు వాడు మీ రెంత వేడిన గాని
సంధించి మాటాడుదునా నేడు ?
మందు ముచ్చులమారి – మమతకు లోనైన నే
డండరు నవ్వవలరా ? విడు విడు ! ॥కాని॥

2. ఎంత చెప్పిన వినక యెంతటి నడతలే ?
యింతులైన సైరింతురా ?
చెంత రానిత్తునా ? – చెలియరో ! యిక వాని
అంతరాంతర మెంతునా ? – ఓ చెలియరో ! ॥కాని॥

3. ఎనసిన మువ్వగోపాలుడు – యీడకు రాగ
మనసు కొంకు లే కది – మల్లాడిన వింత
నేను వినియుండగా – నెలతరో ! కొంచె
మున పోనిత్తునా దెలిసి ? – బుద్ధి చెప్పకుందునా ? ॥కాని॥

---

## 44. యదుకుల కాంభోజి – అట

(సామాన్య - కలహాంతరిత)

పల్లవి :

కోపము రాదా – యెవ్వరికైన ?
బాపురె ! మువ్వగో – పాలుని చెలికాడు

అనుపల్లవి :

చేపట్టిన మొదలు – చెవ్వంది లింగ
డాపె యింటిలో – దన్నాడుకొన్నది వింటే ! ॥కోపము॥

1. నాటి నాటికి వాడు - నావద్దికి వచ్చి !
మాటలాడక యెల్లా - మగువ యింటిలో నై తె !
వ్రేటు గజ్జెలే తంబూర - మీటి వింత పదాలె !
మీటు జాతు లెల్లా - మెలత యింటిలో నై తే! ॥కోపము॥

2. సరసిజాక్షిరో ! వాడు - చలువ దుప్పటితోడ
వరసకు వా డిందు - వచ్చి యందు బోతె
బురుసు రుమాలె - బోడి తలకు బొందు మల్లెలె
విరుల సరాలె యిదిగాక - సరిగ దుప్పటి వల్లె
వాటుతో బోతే ॥కోపము॥

3. చెలువుడు చక్కని - చెవ్వంది లింగడు
అలుక చేసి మూగ - నాని వలెను నాతో
గలసి యిప్పు డల్ల - కలికి యింటికి బోతె
గళరవములె పావురంపు పలు - కులె యదియును గాక !
అలివేణి ! దాని కళుకు - వాడై యుంటే ॥కోపము॥

---

## 45. కాంబోది - ఆది

(సామాన్య - ప్రౌఢ - ప్రేమగర్వితా సఖి సల్లాపము)

పల్లవి :

గజరాజ గమనరో ! యీ - కపటము నే నే మెఱుగ !

అనుపల్లవి :

విజయరాఘవేంద్రుని - వింత మీలాగే ! ॥గజ॥

1. జీని గజనిమ్మపండ్లు – చిలుక ముక్కు నొక్కులచే
కానుక జేసిన – కారణ మేమొ ?
కానుక గాదె నీ గుబ్బ – లూని పట్టి చందమామ
కూనల నుంచే నందుకు – గురుతు లాగింతే ! ॥గజ॥

2. కొండొక చవి చూచి పంట – కొరికిన తియ్యమామిడి
పండు కానుక చేసిన – భావ మదేమొ ?
పండు కానుక గాదె నీ – కండ చక్కెర కెమ్మోవి
పండు గంటి జేసె నంట – పైకొన్న లాగింతే ! ॥గజ॥

3. వీరాధి వీరుడు – విజయరాఘవేంద్రుడు ఘంట
బారి మొలనూ లంపిన – భావ మదేమొ ?
బారి మొలనూలు గాదె – భావజు సామ్రాజ్య మెల్ల
తోరణ గట్టుకొన్న – దొరతన మింతే ! ॥గజ॥

---

## 46. మోహన – ఝంప

(సామాన్య - సౌందర్య గర్విత)

పల్లవి :

గడియ గడియకు మనవి – గలదటవె కొమ్మా !

అనుపల్లవి :

షడతిరో ! నామనో – భావ మెరిగిన దొరకు ॥గడియ॥

1. కలనైన గలువరిం - తల నైన దన నామ
ములె గాని వే రొకటి - తలచ దని తెలిసి
కలగాలమును నన్ను - గారవించిన విభుడు
తలిరుబోణిరో! తానే - దయ జూడవలెగాక ॥గడియ॥

2. ఎడబాసి నన్నాత - డెన్న డున్నది లేదు!
పడుచు దనమును దన - పాదములె గతి యనుచు
పడతిరో! యొక పట్టు - బట్టరాదు! పట్టిన
విడువరా దది మంచి - బిరుదు గలిగిన దొరకు! ॥గడియ॥

3. ఆట పాటలను మరి - యన్నిటను నెరజాణ
మేటి యా! తన కొకరు - సాటి లే రనుచు
మాటి మాటికి నన్ను - మరు కేళిలో బెనగి
జాటించు మువ్వగో - పాలునకు నికమీద ॥గడియ॥

---

## 47. నాగగాంధారి - ఆది

(సామాన్య - ప్రౌఢ, ఉత్తమ)

పల్లవి :

గోపాలా యేపట్ల దయ జూడవు!
నీ వెవ్వ రనేవు! నే నేమి పాపము జేసితిరా ?

అనుపల్లవి :

ఈ పుట్టు పుట్టించి - యింత నన్నలయించే
పాపపు విధి నే మందు ? గో - పాలా! ॥గోపా॥

1. నీ వెట్ల జాణ వైతివో ? – నీపై మరులు కొన్నదాని
భావము తెలియలేవు ! గో – పాలా !
నీ వెంట బడిన యట్ల నా – త్రోవ రాక యున్నాడు !
భావజుని కేమాయె ? గో – పాలా ! ॥గోపా॥

2. హితవు గాదేమొ నీకు ! – ఎన్నడైన మా యింటికి
బ్రతిమాలిన రావు ! గో – పాలా !
సతమరిత వని నా యీడు – సరసిజాక్షులలోన
ప్రతి లేదని యుంటి ! గో – పాలా ! ॥గోపా॥

3. కలకంఠి నిన్ను బాసి – గతుల దేలించినగాని
భళి ! యన నోరు రాదు గో – పాలా !
తలచిన నా వంటి వని – తలు నీ కెందఱు
బలవంతమా ! మువ్వగో – పాలా ! ॥గోపా॥

---

48. ధన్యాసి - ఆది

(సామాన్య - ప్రౌఢ, మానవతి)

పల్లవి :

చక్కని దయగలదా ? యిది నీ – జాగా చెవందిలింగా !

అనుపల్లవి :

ఇక్కడికి వచ్చిన దేమో–హెచ్చు కంచివరదా! ॥చక్కని॥

1. చెలికాడ ! నిన్ను జూడ వచ్చితి ! – చెవందిలింగా !
తెలిసె మా యింటికి రాని–దేమో కంచివరద! ॥చక్క–ని॥
2. ఇం దున్నావని – యీాడ వచ్చితివి ! చెవందిలింగ !
అందు కేమి? యెవ రిల్లి ది ? – అవుర! కంచివరద! ॥చక్క–ని॥
3. కానీ వెనుక దార్కా–ణించే – గాని ! చెవందిలింగ !
యీానికత్తో మన మేకమై – యుందాము కంచివరద !
॥చక్క–ని॥
4. ఎవ్వడో యీా పడకింటిలో న వ్వేది ? చెవందిలింగ ?
మువ్వగోపాలుడు గాక మ – తెవ్వరు ? కంచివరద !
॥చక్క–ని॥

---

## 49. ముఖారి - ఆది
### (సామాన్య - ఖండిత)

పల్లవి :
చాలు ! చాలు! ఈ చిన్నెలతో నాదు – సరసకు జేరకుర!
అనుపల్లవి :
చాలు ! ఈ చిన్నెలు – సాగవు నా వద్ద ! మువ్వగో
పాల ! భామవద్దికే పోర ! ॥చాలు॥
1. కన్నెల పీడెముతో – కాటుక మోవితో !
వెన్నుని కీల్జడ – వేటు తోను !
కన్నియ సంపుల – గాజుల నొక్కు–లతోను !
వన్నెకాడ ! నుదుటను – నున్న లత్తుకతోను ! ॥చాలు॥

2. నిద్దుర మబ్బుతోను – నిండు బడలికతోను!
ముద్దియ కలసిన – ముదముతోను!
నిద్దంపు చెక్కిళ్ల – నెలవంకలతోను!
వద్దురా పద్దులు – వగకాడ! నాతోను! ॥చాలు॥

3. అలదాని కుచముల – నలదిన జవ్వాజి
కల యురస్థలమును – గంటి నన్నంటరాకు
బలిమి చేసే దేల – బాల మువ్వగోపాల!
అలనాడె గూడిన – చెలిమి పదివేలు! ॥చాలు॥

---

50. యదుకుల కాంభోజి - ఆది
(సామాన్య - ముగ్ధ, ప్రేమగర్వితా)

పల్లవి:
చిన్నదాన! నే చిన్నదానర!

అనుపల్లవి:
మన్ననతో నేలుకోర! మువ్వగోపాల! ॥చిన్న॥

1. అలతమ్మి పగదాయె! – చెలగి వెన్నెలకాయు!
కలక యగ్గల మాయె! – కరుణించు విటరాయ! ॥చిన్న॥

2. అలరుల వింటి జోదు – అలుక కోరువరాదు!
నిలకొన్న తమి పోదు! – నిదుర కంటికి రాదు! ॥చిన్న॥

3. మొన్న రేయి మరుకేళి – మువ్వగోపాల నన్నేలి
చిన్నలాడి పై బాళి – జేసితి వి దేటి జాలి? ॥చిన్న॥

## 51. శంకరాభరణము - ఆది

(సామాన్య - సఖీ ఉపాలంభన)

పల్లవి :

చెల్లబో ! గోపాలగిరి - చెన్నుడే వీడు కొమ్మా !

అనుపల్లవి :

ఎల్లలోకము లిత - డేలు ననగా వినవా ? ॥ చెల్లబో ॥

1. పరిగేవాని చేతిపైడి - పట్టిన దానవా ? యింటి
గురుతు చెప్పవద్దా ? యెంత - సరసురాలవె ! కొమ్మా
గురిగాడు గనుక సి - గ్గున నెవ్వరి నడుగక
వెరచీ సందు కా సందుకు - తిరుగగా దోడితెచ్చితివి !
॥ చెల్ల ॥

2. వచ్చిన దాక తల - వాకిట నీ నైనాను
నెచ్చెలు నైన నుండితే - నేర కుటవె కొమ్మా !
ఇచ్చిన పైడి చేతికి - వచ్చినదే చాలు నటవే ?
హెచ్చు కొద్దు లెరుగ వలదా ? - ఎవరంట ఉన్నావే !
॥ చెల్ల ॥

3. బాలరో ! మువ్వగో - పాలు డైన చక్కని
పాలగిరి చెన్నుదు నీ - పాల గల్గె ! కొమ్మా !
ఏల ? రేపు వచ్చే నంటే - యిం తైన సమ్మతించక
ఏల రాన ద్దంటివే ? ని - న్నే మందునే ? చెలియ !
॥ చెల్ల ॥

## 52. బిలహరి - అట

(సామాన్య - ప్రౌఢ, అధమ)

పల్లవి:

చేత కాసులేదె ! కాని – చే సైగలే !

అనుపల్లవి :

ఈతరి మువ్వగోపాలు–డింతిరో! పట్టి యమ్మేలే! ॥చేత॥

1. గీరు నామము పెట్టి ! – గిలుకు పావాలు మెట్టి !
ఓరచూపు జూచుచునే – నన్ను తావున
జేర వచ్చిన లోన – చిరునవ్వు నవ్వుకొంటి !
పారిపారి యిందరిలో – పైబడ వచ్చీని ! ॥చేత॥

2. పిల్లగ్రోవి చేత బట్టి – బిగియు దట్టియు గట్టి
వల్లెవాటు వేసి యిందు – వచ్చి మెల్లనే
మొల్ల సుగంధు లందరము – ముచ్చట లాడుచుండ
గుల్ల కాడై మన యింటి–గురుతు లడుగ వచ్చీని ! ॥చేత॥

3. చిటికెన కొనగోరు – చిమ్ముకొంచు పలుమారు !
చిటి పాటి పదములు – చేరి పాడుచు !
అటు నిటు వచ్చి కళ – లంటి నయము చేసి
యటమటించి మువ్వగోపాలు – మీద చే వేసెనే ! ॥చేత॥

## 53. బిలహరి - చాపు

(సామాన్య - సఖీ - శిక్షాలక్షణా)

పల్లవి :

చేపట్లు కావచ్చునా ? మీలో మీకు
చేపట్లు కావచ్చునా ?

అనుపల్లవి :

ఏ పట్లకైనను నెంచదగును మిమ్ము
ఈ పట్లలో మీకింత తాళిమి లేక ॥చేపట్లు॥

1. కోప మెవరికైన రాదా ? తిరిగి
కూడి యుండేవారు లేదా !
మాపు వచ్చెద నంటె – మంచి దనగ రాదా !
రాపటె వానితో – నీ పాటు వినరాదా ! ॥చేపట్లు॥

2. అలిగి యావలికైన పోక ! లోకు
లాడుకొందురని లేక !
పలుకకుండ లేక – పదరి తింతియగాక !
కలికిరో ! తొల్లిటి – ఘనత యెంచుకోక ! ॥చేపట్లు॥

3. కాముడు సేసిన సేతో లేక
కమలజు వ్రాసిన వ్రాతో
ప్రేమ గూడిన వాని – చే మించే దేమి జాతో
భామరో ! మువ్వగో – పాలునితో నిట్లు ॥చేపట్లు॥

## 54. ముఖారి – ఆది

(సామాన్య - ప్రౌఢ, దివ్య)

పల్లవి :

తన చిత్తము వచ్చినటుల – దయసేయు మనవే !

అనుపల్లవి :

వనజాక్షిరో ! మా మువ్వగో – పాలుడైన
నా సామిని ॥తన॥

1. చెలిని వేడుకొన్నాడట ! – చెయ్యెత్తి మ్రొక్కినాడట !
అలవేణితో నన్నేమేమో – అనుకున్నాడట !
నలినాక్షికి గుడివాకిట – నమ్మిక లిచ్చినాడట !
జలజగంధి విభుడెందైనా లె – స్సైయుండితే చాలునె !
॥తన॥

2. తొడరి యీ దిక్కు చూచితే-దోషము వచ్చుననె నట !
పడతి వద్ద మీసము దువ్వి – వదరుకొనె నట !
తడయక నా పేరు జెప్పి – పుడక ద్రుంచి వైచె నట !
అడుగులో వేయి గుణములయితె
అతని దిద్ద నెవరి తరమె ? ॥తన॥

3. మోహనాంగుడు నన్ను దొలుత – మోసపోయి
కూడెనట !
ఆ హరి సాక్షిగ ఇక న – న్నంటుకో డట !
సాహసురాల నని నిండు – సభలో నాడుకొన్నా డట
స్నేహము నాటియుండితే–చెలువునకె దయ వచ్చీన ? ॥తన॥

## 55. సింధు పదం (?) ఏ

(సామాన్య - ప్రౌఢ, అదివ్య)

పల్లవి :

తప్పించుకుంటె నే మాయెనె ? – తరుణి వాడు

అనుపల్లవి :

ఎప్పుడైన ఒకసారి – ఇందు రాకపోయ్యేన? ॥తప్పించు॥

1. ఈ రేయి నన్ను గూడితే – ఇన్నూరు ఘట్లిచ్చే నని
సారె సారెకు వేడెనే ఓయమ్మ ! వాడు
బేరా జబ్బు మాటలాడెనె ! అయితే నే మాయె ?
బేర జబ్బు చేసుకుంటె జడకొద్ది వేయనా ?
నారీమణిరో! విజయరాఘవ-నాయని సానీగ చేత ॥తప్పించు॥

---

## 56. లలిత పంచమము - ఆది

(సామాన్య - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

తలచితే దిగులయ్యీనే !

అనుపల్లవి :

పోలతి పానకములోని – పుడకవలె నున్న వితము ! ॥తల॥

1. అతని కెమ్మోవి నే జూచి – అతడు నా మోవి జూచి
మితి లేని మోహామున – మీరుచు నుండగ !
జతగూడి తామరాకు – జలము చలించినట్లు
పతియు నేను మారుని – బాధలచే నున్న వితము ॥తల॥

2. మక్కువతో మేము - మాటలాడగ గద!
ఇక్కడ నే తాళలేక - యీ రసమున
గ్రక్కున ముసుగుబెట్టుక - కల్ల నిదురతో నన్ను
ఎక్కువ తెలియలేక - ఇంగిత మెఱుగని చెలులు ||తల||

3. అంతటి మువ్వగోపాలు - డైన కంచి వరదుడు
ఇంతుల దిట్టి వేరొక - యింటికి వచ్చి
కంతుకేళి నన్నేలి - గారవించగా గద
ఇంత విరహవేదన - ఎన్నడు గాన! మీ పాపము ||తల||

---

## 57. మధ్యమావతి - త్రిపుట

(సామాన్య - ప్రౌఢ, ప్రేమగర్వితి)

పల్లవి:

తలచునో? తలచదో? - తరుణి!

అనుపల్లవి:

చెలిమి మువ్వగోపాలు - డెలమి కాడని నన్ను ||తల||

1. కుందరదన మొన-గోరికి మడు పొసంగ
ఇంద మనుచు దాని - యియ్య వచ్చి లేదంటే
అందుకు నే జన్న - నై యున్నా నని నవ్వి
ముంచా మడుపుతో నే - ముద్దొసంగిన సుద్ది ||తల||

2. ఇంతి నీ దయలే – దింక నేను రాను నా
యంతరంగము నొచ్చె – నన విని దయ వచ్చి
అంతలో కౌగిట – నలమి నమ్మిక లిచ్చి
సంతస మొనరించి – చింతదీర్చిన సొగసు ॥తల॥

3. ఆలించి నామాట – లాలించి మువ్వగో
పాల ! రమ్మని రతి – దేలించి మన సిచ్చి
లోలాక్షి! నా మోవి – లోప లించుక గంటు
గేలించి చెలరేగి – కేరి నవ్విన హొయలు ॥తల॥

## 58. ధన్యాసి - అది

(సామాన్య - సఖీశిక్షాలక్షణము)

పల్లవి :

తాలిమి గలిగిన వా డని నీవు – దండించితే
లోకు లే మందురే ?

అనుపల్లవి :

మేలు దలచితే తాళలే నని
ఏల మనసు నొప్పించితి వ నేను ॥తా॥

1. నిన్ను నీవె మెచ్చు – నీలవేణి దానికి వేడబాల ?

.......................................

## 59. మధ్యమావతి - అట చాపు

(సామాన్య - సౌందర్యగర్విత)

పల్లవి :

దాని నన్ను సాటిసేయ - తగునా ? యేమోయి జాణ !

అనుపల్లవి :

కాని పోని మాటల చేతను - కనికర మందు కే
అంద మయ్యేనా ? ॥దాని॥

1. అంద మైన వీణ చేత బూని - అనురాగములే మీటి
పొందుగాను పదకవిత్వముల - పలుక నేర్చెనా ?
మందయానచేతి మం దిపుడు-మధురము లిచ్చెనో నీకు ?
కుందరదనపై మరు లుం టే - చందురుతో
సాటి తార లయ్యేన ? ॥దాని॥

2. కమ్మని కస్తూరి తిలకము దిద్ది - కలపముపై నలదునా ?
గుమ్మ రొమ్మున గుబ్బలదిమి - కెమ్మోవి తేనె లిచ్చెనా?
సమ్మతము నీ పక్కలోన - సరసము లాడ నేర్చెనా ?
కొమ్మపై నీకు మరు లై తే - కోవిలకు సరి కా
కయ్యేన ? ॥దాని॥

3. కామశాస్త్రములే చదివి - కళ లంటను నేర్చెనా
నీ మది రంజిల్ల జేసి - ని న్నేల నేర్చెనా ?
ఆ మగువపై మోహమున - ఆస లుం టే నే మాయె ?
మా ముద్దు మువ్వగోపాల ! సామి ! - నీసాటి
యెవ రయ్యేరు ? ॥దాని॥

## 60. కాపి - చాపు

(సామాన్య - మధ్యమ)

పల్లవి :

దినము లిటు వచ్చెను! - దేవు డోర్వ జాల డాయె!

అనుపల్లవి :

మునుపటి దయ లెందు బోయె? - మువ్వగోపాల!
నాసామి! ॥దినము॥

1. ఏరా! నీ వంతట రాగా నె-యెదురుకొని నాసామి రమ్మని
బారసాచి కౌగలించిన - భామ నే గాన?
ఔర! నీ రదము చేత - నలమి నా మోవి పానక మాని
పారవశ్య మొందినట్టి-పతి నీవు గావా? నాసామి? ॥దినము॥

2. పడతులు నే నారతు లెత్తి నీ - పాదములు కన్నీట కడిగి
అడుగులకును మడుగు లొత్తిన - యతివ నే గాన?
కడువడి నాపై బవ్వళించి - గళమున నీ ముద్దుమోము
విడువ జాలక యుండిన నాటి - విభుడు నీవు గావా?
నాసామి! ॥దినము॥

3. చిన్ననాడే నను జేరరమ్మని-సిగ్గున నుండగ నా చెయ్యెత్తి నీ
కన్నుల నొత్తుక చాల లాలించిన - ఘనుడు నీవు గావా?
నన్నుగూడి మువ్వగోపాల! యే - కన్నెలతో పొందు
సేయవద్దని
మున్ను నీ చేత నమ్మిక దీసిన - ముదిత! నే గానా
నాసామి! ॥దినము॥

## 61. భైరవి - ఆది

(సామాన్య - ప్రేమగర్విత)

పల్లవి:

దూర మెంచక యిటుల సామిపై - దూరు లేల బలికేరే?

అనుపల్లవి:

తారుమారు మాట లేల నాడేరే? - తరుణులార!
తాళరె యికచాలును! ॥దూర॥

1. ఎన్నదగిన చెలులతోడ జెలిమిగ - నెన్నడైన బలికీనా?
కన్నులెంద రెన్ని వగలు చేసిన - కన్నులెత్తి చూచీనా?
వన్నెమీర నెవ రేమి పల్కిన - విన్న వినని రీతి
నుండుసామి!
చెన్నుమీర నా చెలిని గూడె నని - చిన్నమాటలేల
నాడేరే? ॥దూర॥

2. వారి యిండ్లకెల్ల నా సామి - వలసి పోయినాడా?
కోరి కోరి ఖేదనము లొసంగి - వారి వేడుకొన్నాడా?
వారిజాక్షి తా వద్దికి రమ్మని - వలసి సొలసి
చొక్కితి నని పిలువగ
చేరబోయి దాని జూచి నే నని-మీరి భ్రమసి కూడె
నేమొ? తెలియదు! ॥దూర॥

3. కంతు జనకు మువ్వగోపాలు డే – కాంతమునను
మును నన్నుగూడి
కంతుకేళి లోపల బిగి కౌగిట – గళలంటి మెలగుచును
వింత వింత వగ గుల్కు సామిదే – యింతికైన
దక్కునా ? యూరకె
రంతు లేల జేసేరే ? మిక్కిలి రమణులార ! వాని
మనసు దెలియక ॥దూర॥

---

## 62. కల్యాణి - ఆది

(సామాన్య - ప్రేమగర్విత, విరహోత్కంఠిత)

పల్లవి :

నా మనసు వంటిది నీ మన సైతే నా
నోముఫల మీడేరురా ! – అదిగాక

అనుపల్లవి :

వేమారు చెఱకున బండు పండినట్లు వేడుక
లినుమడించేరా ! ఓరి వరద ! ॥నామ॥

1. ఊరకుండగ లేక – గోర నేమి వ్రాసిన
నీ రూపుగా దోచురా ! – యే రాకను
గూరి మేల్కాంచినంత నే నీవు నా–చేరువ నున్నట్టుండురా!
ఈ రీతి నా మోహ మున్నది నీకె తెలియు – నెవరితో
విన్నవింతురా ? – ఓరి వరద ! ॥నామ॥

2. మేడ నెక్కుచు దిరిగి – నీడ జూచిన నీవు
కూడ వచ్చిన ట్లుండురా! – శ్రుతి
గూడి యునిచికొని – పాడినంతనె నీవు నా
తోడ బాడినట్లుండురా!
ఈడు లేని నా వలపు ఇది నీకు తెలియును!
ఎవరితో విన్నవింతురా? ఓరి వరద! ॥నా॥

3. వినరా యాహ్లాద మెపుడు! – నీ కౌగిటి
పెనగొన్నట్లుండు! నేమందురా? – నా
మనసు పేరుందేవి వరదా! – యని తలచిన
నెనసి కూడిన ట్లుండు రా!
నను బోటి సతు లెల్ల నీవు – నా సఖు డంటే
విన సంతోష మై యుండురా!
ఎనసిన తమి రహస్య మది నీకె తెలియు! నే
నెవనితో విన్నవింతురా? ॥నామన॥

---

### 63. కల్యాణి - త్రిపుట

(సామాన్య - ఖండిత)

పల్లవి:

నిలువున నిలివెడు ధనము పోసినగాని
నీపొందు సేయనోపరా!

అనుపల్లవి :

బలు వగకాడవై - భావము రంజిల్ల జేసి
బలిమిని మువ్వగోపాలా! యీ చల మేలా ? ॥నిలు॥

1. మాటలు దేలించి! - మర్మము భేదించి!
టాటోటు వగలను-తరుణుల వంచించి!
కూటముల సోలించి! - కుశిగుంపుల గూడి!
తోటకూర దొంగవలె - తొలగి పొయ్యేవాడవు! ॥నిలు॥

2. తియ్యని వగల-దేలించి సోలించి!
చెయ్యగల పను లెల్ల-జేసి మెప్పించి!
శయ్యపై బవళించి! - సద్దుసేయక లేచి!
తొయ్యలి పైదమ్మి - దులిపి పొయ్యేవాడవు!

3. అక్కరకాడవై-అందందే ప్రేమించి!
చక్కెర లూరించి-చాలా మన్నించి!
మొక్కపఱచి చేడుల-మోహాంబుధు లోడించి!
చుక్కబొడవగ లేచి - జునిగి పొయ్యేవాడవు! ॥నిలు॥

---

## 64. భైరవి - ఆది

(సామాన్య - అధమ)

పల్లవి :

నీ కూతురి నడతలు నీకె సరి!
లోకు లెవరు మెచ్చరమ్మా!

అనుపల్లవి :

ఇక్కడికి తెల్లవారె గద ! – ఇకను మువ్వగోపాలు
డనదట ! ॥నీకు॥

1. నిదురబోతే లేవ మనసు బెట్టదు !
నుదుట నెన్నుడు బొట్టు పెట్టదు !
అదియుగాక తమలపాకు ము
ట్టద ! యేడాదికి కొప్పు విడిచి కట్టదు ! ॥నీకు॥

2. వీణచేత నొకనాడు ముట్టదు !
వింత జూచినా నవ్వు బుట్టదు !
రాణివాసములు అడుగులు బెట్టదు !
రామ ! రామ ! సొగ సనేది బుట్టదు ! ॥నీకు॥

3. నేను గూడితే తనకు గూడదు !
నెనరు గూర్చి పలుకాడదు !
పూని వట్టి మంకు గుణము విడువదు !
బుద్ధి జెప్పినా యెవరిని జూడదు ! ॥నీకు॥

---

## 65. ఆహిరి - రూపకం

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి :

నీకె దయ రావలెగాక ! – లేక దిక్కెవరు ?

అనుపల్లవి :

పాకశాసన వినుత ! మా మువ్వగో
పాలరాయ ! నీమనసు కరగి ॥నీకె॥

1. క్రొన్ననవంటి మేను జిక్కిన !
సన్నవలువలు గట్టక యున్న !
ఎన్నిదినము లన్నము మానిన ! – నేలాగు నుండిన !
చెన్నైన కురులు చిక్కుబడిన !
చిన్ని నా చక్కని మోము వాడిన !
నన్ను ఇదేటి కనుచు వచ్చినా !
కన్నీరు దుడిచే కన్నె లున్నారా ? ॥నీకె॥

2. విరహవేదనచేత సొక్కిన ! – వెతలజెందిన పాపజాతి
మరుని మూక చుట్టు ముట్టిన ! – మనసు నొచ్చిన !
నిరతము నే నసురుసు రనిన ! – నిట్టూర్పులచే
నొగిలియుండిన !
అరసి యేడవకు మనుచు వచ్చిన
న్నాదరించే అతివ లున్నారా ? ॥నీకె॥

3. నేరక నడిచిననేర్చి నడిచిన ! – నే నెటువంటి దాన నైన!
సారెకు నిన్నెంత దూరుకొనిన ! – చలముచేసిన !
చేర రమ్మని కోపగించక – చిత్తము రంజిల్ల జేసి చాల
కూరిమితో మువ్వగోపాల ! – గూడితి వెప్పటి కీలాగ ?
॥నీకె॥

## 66. ఘంట - ఆది

(సామాన్య - విప్రలబ్ధ, అధీర)

పల్లవి :

నీతో ఆడినమాట నిజ మాయెనా

అనుపల్లవి :

నాతి ! మువ్వగోపాలుడు - నూతన ప్రియుడని ॥నీతో॥

1. ఆనాటి మోహము - అటువంటి నడతలు
ఈనాటికి నిలిచేనా ? - ఇక నేటికే ?
మానినీ ! అతనికి మన పైన చోటికే
పోనీవే ! ఎంతలేదు ? - నేను కా దనను ॥నీతో॥

2. వనజాక్షి ! నే నిదివఱకు - వాని గుణములు
కని విని దినములు - గడపితినే
వినవే అన్నిట నాదు - మనసు విరిగెనే వాని
చనువు సతము గా దని - సకియ ! నేనాడే ॥నీతో॥

3. మెలత ! దానిపై - మేలువా డని నేను
తెలిసి యుండగా అతని - తలంతు నట వే ?
బలిమిని వేడుకోగా - చెలిమి చేసితిని
ఎలమి మువ్వగోపాలుని - వలపు సతము గా దని ॥నీతో॥

## 67. భైరవి - ఆది

(సామాన్య - సఖీ ఉపాలంభన)

పల్లవి :

నీలవేణి ! వానికి నీ వేల

బాలబుద్ధి వై పదరుట మేల ?

అనుపల్లవి :

ఏలనె వేడుకొనేది ? చాల కొదువే ?

వానిపై బాళి చాలు పదవే ! ॥నీల॥

1. వినవే ! ఘన మెరుగవా వెఱ్ఱిదాన !

వనిత కైన మగవాని కైన

నెనరు బోతే నా తరువాత

నెనయు రోతే ! గుట్టుతో నుండే రీతే ! ॥నీల॥

2. చెలియరో ! మునుపటి వలెనే వాడా !

తలపు గలిగితే తానే రాడా !

పిలువరాదే మనము ! వానికి నీపై

వలపు లేదే ! వానికి నీకు తొలుత వాదే ! ॥నీల॥

3. బలిమిని మువ్వగోపాలుని గూడి

ఎలనాగరో ! ఇక నేటికి మోడి ?

తెలుసుకొమ్మా నీలో నీవే ! వానితో

చలము వలదే ! కొమ్మా !

వాడు రెండు దలచె నమ్మా ! ॥నీల॥

## 68. నవరోజు – త్రిపుట

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి:

నెంజి లెటువలె – దీరు నమ్మ ?

అనుపల్లవి:

కంజాక్షి ! విన వమ్మ !

కంచివరదు నెడబాసి ॥ నెంజి॥

1. ననబోణి ! నెనరున – నా తలోదరముపై
తన వదన ముంచి మోదము మీరగ
కనురెప్పల చేత నా – చనుమొన లప్పళించి
తనువు పులకరించి నా – తమి రేచే సామి బాసి

॥ నెంజి॥

2. భామ ! నను తన తొడలపై – బవ్వళించు మని
మోము మోమున జేర్చి – మోహము మీర
నామోవి తా నాన – తనమోవి నే నాన
ప్రేమతో నుపమ గ – ల్పించిన సామి బాసి ॥ నెంజి॥

3. పరమాత్ము డౌ మువ్వగో – పాలు డైన వరదుడు
సరస రతుల మది – జల్ల జేయుచు
నిరుపమ కరుణచే – నిదుర బట్టిన దాక
సురటిచే విసరిన – శోభనాకారుని బాసి ॥ నెంజి॥

## 69. కాంభోజి - అది

(సామాన్య - ప్రేమగర్వీత)

పల్లవి:

పదవే! వాని చెలిమి - బలవంతము గదవే!

అనుపల్లవి:

సదయుఁడైన మా మువ్వగోపాలుని
చను వందరికి దొరుకునా ? దొరకదే! ॥పద॥

1. ఆట ప్రాయము నాటి మక్కువ
అది మరవక యుండేది ఎక్కువ!
నేటికి విడనాడేది పెక్కువ! - చెలతరో! వినవే!
యెవ్వరికి తక్కువ ? ॥పద॥

2. అన్య భామలనువలె నను జూడఁడె!
అలిగినను నాతో బదులాడఁడె!
నన్ను బాసి ఏ చెలతను గూడఁడె!
నాపై నెన రెన్నటికిని మరువఁడె! ॥పద॥

3. అంతరంగ మెరిగిన రతిలోలుఁడె!
ఆడినమాట తప్పని గుణశీలుఁడె!
కంతుకేళి నను గూడు దయాళుఁడె!
ఘనుఁడైన మహారాజ గోపాలుఁడె! ॥పద॥

## 70. ముఖారి - ఆది

(సామాన్య - ప్రౌఢ, ఖండిత)

పల్లవి:

పదరి వానిచే పైడి – బట్టు కొనకుడి!

అనుపల్లవి:

కొదవ లయ్యాని! మువ్వ – గోపాలు
డలగి వచ్చెను! ॥పద॥

1. విరిబోణి! మీరు మేము – నింతవారము గాము!
పోరి చూపలే కంచము – పొత్తువారము!
అరమరిక లేని చుట్ట – లగు మీకు మాకు!
విరస మయ్యా ననుచు – నెరుక చేసెద మీకు! ॥పద॥

2. చెలిమి నా యిరుగు పొరుగు – చెలుల బిలుతు నని
తొలత నా యొద్ద మీసము – దువ్వుకొన్నాడు!
వెలది! యీ రోసాన వాడు – వేయూరు లీయ జూచెనే!
చెలగి యందు కాసించి – చేరి వానిచేత మీరు ॥పద॥

3. ఎప్పటి వలెనే వా – డిందు వచ్చి న న్నేలితే
అప్పుడు చెప్పెను గాని – ఆ సుద్దు లెల్ల!
కప్పురగంధిరో! వాని – కసరి వేసారుకోక
మొప్పెతనమున – మువ్వగోపాలు డలగి వచ్చెను! ॥పద॥

## 71. కల్యాణి - ఝంప

(నాయిక - సామాన్య; నాయకుడు - వైశికుడు; పరిహాస లక్షణం)

పల్లవి:

పలుకరించిన నీవు పలుకక పొయ్యేవు!
పణతి! నీ గర్వ మేమొ?

అనుపల్లవి:

తలచితే వెయ్యాలు తరుణుల చేకొన్న
కలికి గోపాలు డనవలె నట్టే నా పేరు? ॥పలు॥

1. తీయని కెమ్మోవి - తేనె లానుచును
సైయాటమున ప్రొద్దు జరుప నొప్పేవా?
పయ్యెద తొలగించి పాలిండ్లపై నొక్క-
చే యైన వేయ నొప్పేవ? ॥పలు॥

2. మోము మోమున జేర్చి - ముద్దులు పెట్టుకొని
వేమారు నన్ను నవ్వించ నొప్పేవ?
భామరో? యిటువంటి - పలుకులు పలుకుచు
ప్రేమతో రాకున్న - పిలువ నంపేవ? ॥పలు॥

3. ఎక్కువ మోహమున - ఎనసి గూడి నన్ను
గ్రక్కున కళలంటి కౌగిలించేవ?
మక్కువతో మువ్వగోపాల! రమ్మని
యొక్క సారైన గూడి యుండ నొప్పేవ? ॥పలు॥

## 72. కేదారగౌళ - ఆది

### (సామాన్య - అభిసారిక)

పల్లవి :

పిలువ నంపె న న్నీ వేళ – ప్రేమ మీరగా నిపుడు !

అనుపల్లవి :

చెలియ ! మువ్వగోపాలుడు – చిత్తము రంజిల్ల నేడు ॥పిలు॥

1. విరిబోణిరో ! రమ్మని – విరుల జడను జుట్టి
పరువ మైన నాటికి – పైడి యిదే యనుచు
మరువకుమీ మాట – మన కిద్దరి కీపూట
చెరుకు విల్తుడే సాక్షి – చెలి యనిన నా సామి ॥పిలు॥

2. ఎమ్మె కాడు నేను – నెనసిన చిన్ననాడే
సమ్మతిగా నొకచోట – జదువు చుండగ
పమ్మిన వేడుకతో – భామ ! నీవు ప్రౌఢ వైతే
కమ్మవిల్తుని కేళి – గలసే మన్నది నిజమై ॥పిలు॥

3. ఎల మావి తోటలో – నింపొంద నొకనాడు
ఎలమి గౌరి పూజ – సలుపుచుండగా
అల మువ్వగోపాలు – డగు వేంకటేశుడు
కలువల శయ్యపై – గలసే మన్నది నిజమై ॥పిలు॥

## 73. ఆనందభైరవి - ఆది

(సామాన్య - సఖీ ఉపాలంభన)

పల్లవి :

పూచిన తలిరు వలెనే సుకుమారు డితడని
చూచి మెల్లనే యేలవే !

అనుపల్లవి :

ఏచకనే వాని ఇపు డైన నీ తోను
దాచక తెలిపినానే తరుణిరో ! యీ వేళ ॥పూచి॥

1. చక్కగా కెమ్మోవి చప్పరింతువు గాని
నొక్కబోయేవు సుమీ !
చెక్కుటద్దములపై ముద్దు లుంతువు గాని
చెనక బోయేవు సుమీ !
చక్కని రొమ్మున రొమ్ము జేర్తువు గాని
చనుల గ్రుమ్మేవు సుమీ !
ఎక్కువ ప్రౌఢ గనుక చెప్ప తగిన దేమి
ఇప్పుడే తెలుసుకోవె ఓ లలనరో నీవు ॥పూచి॥

2. ఎలమితో రతి రహస్యములు నింతువు గాని
హెచ్చు పలేవు సుమీ !
అలగి వాడే మనిన తాళుకొందువు గాని
అలుక జేసేవు సుమీ !

వలపు పెన్నెరి దువ్వి విరులు ముడుతువు గాని
పట్టి దీసేవు సుమీ !
తలిరువిల్తుని శాస్త్ర మెంత తెలిసిన దైన
తగుదాన వైనా గాని లలనరో! యీ వేళ॥ప్రాచి॥

3. కోరిన సరసము మువ్వగోపాలుని నేమైనా
గోరజీరేవు సుమీ !
గారవమున జిత్తె మెఱిగి నడుతువు గాని
గాసి జేసేవు సుమీ !
సారసంగ్రాహివై తగుదానవై - సరసజ్ఞురాల వైన గాని
సారెకు నా రీతి నీవె యాదువు గాని
సరస రతులను వలదు సుమీ ! ॥ప్రాచి॥

---

74. భైరవి - ఆది
(సామాన్య - ప్రౌఢ, రతిప్రియ)

పల్లవి :
భావము తెలిసిన దానను గాన
భావజు గన్న గోపాలా! నీ యాన

అనుపల్లవి :
మోవ నాడితే ముచ్చట దీరునా ?
తా వలచిన చాటు తందాన తాన ॥భావ॥

1. ఏమయ్యా! రావయ్యా! ఇకనైన – ఇట నీ లీల
ఆముకొన్న ప్రేమ – నలసితి జాల

2. జాలము నేర్చిన – చతురుడ వౌరా!
జాణా ని న్నే మందురా?
వాలుగంటి జేరి పలుకు లాడ వదేరా శ్రీలోలా!
ఇది నీకు చెల్లురా? ॥భావ॥

3. ఎందు చూచిన – ఈదరి యిండ్లను
ఉండవు పో నీవు – ఒద్దికతోన
మందరోద్ధర! నీ – మహిమ తెలియ లేక
అందందు తిరిగి నే – నలసి సొలసితి ॥భావ॥

---

## 75. అఠాణా – త్రిపుట

(సామాన్య - అన్యసంభోగ దుఃఖిత)

పల్లవి:
మదమతి బెట్టిన మందులోన తగిలి
సదయుడు నన్నింత

అనుపల్లవి:
ఇది యేటి సద్ది? గోపాలునకు
ఎవరు చెప్పిన బుద్ధి? ॥మద॥

1. నన్ను వంచన జేసి - నన్ను తాంగిపైని
కన్ను వేసినా డట !
దాని తోటి - చిన్నెలు జేసినా డట !
అలదాని గూడి
చిన్ని చన్నులపైని - క్రొన్నెల వంకలు
మిన్నగ సవరించి - మెచ్చుకొన్నా డట ! ॥మద॥

2. వలచి అలదాని - వలలో జిక్కుకొని
చెలియకు దక్కె నట ! దాని మాయలకు
సొక్కినా డట ! దాని నొసల
తిలకము కొన గోర దిద్ది చెక్కిలి నొక్కి
మొలక నవ్వుల మోముతో - ముద్దు లాడె నట ! ॥మద॥

3. ఎలమి శ్రీశైల - నిలయుడు సఖుడగడు
వెలసిన మువ్వగోపాలుడు ఇంతటి వాడౌట !
తెలియనైతి నెపుడు నన్ను - రతుల వలచి
యున్నది మొదలు
విలపించినారా ఆ - వెలది కింటి కే వేళ
వెళ్ళుచున్నా డట బొట్టు గట్టిన ॥మద॥

76. శంకరాభరణము - త్రిపుట
(సామాన్య - సౌందర్యగర్విత)

పల్లవి :
మనవి సేయగ నేలే ? - మగువా !
క్రొత్తలా నేడు ?

అనుపల్లవి :
తను తానే మదిలోనే - దయసేయవలె గాక ! ॥మనవి॥

1. కలికి ! కల్పతరు వని - వెలసి నట్లైతే !
తలచిన కోరిక స - ఫల మౌను గాని ! ॥మనవి॥

2. కరుణాసాగరు డని - బిరుదు గల్గిన ట్లైతే !
పరమోహ రత్నముల్ మరియు నొసగును గాని ! ॥మనవి॥

3. కన్నె ! నా మనోభావ - మన్నియు తెలిసిన
వెన్నుని కిక మీరు - మన్నింప వలె గాని ! ॥మనవి॥

4. అతిశయముగ ప్రాణ - పతి మువ్వగోపాలు
డితవుతో నను గూడి - సతము రక్షించు గాని ! ॥మనవి॥

77. శ్రీరాగం - త్రిపుట
(సామాన్య - తృప్త)

పల్లవి :
మనసు నిన్నెడబాయదు ప్రాణేశ !

అనుపల్లవి :
మనసు నిన్నెడబాసి క్షణ మైన నోర్వదు
మన వాలకించు శ్రీ మువ్వగోపాల ! సామి ! నా ॥మనసు॥

1. మేటి పైటాణి కొంగు జారగ దీసి
గోట గుబ్బల జెనకి
స్మిత్మైన బింబోష్ఠము పానము చేసిన
నేటి చిన్నెలనే తలచి మెచ్చి ॥మనసు॥

2. కస్తూరి మైనలది – కడు వేడ్క లలర
సిస్తుగ వీణ మీటి – విస్తారముగా రత్న
సరములు నా కొసగి
కస్తుపరచి నన్ను – కౌగిలించి నందుకు ॥మనసు॥

3. కేళికా నిలయమున సొంపుగా రతి – కేళి గూడిన సొగసు
మాలిమి తోడను మువ్వగో – పాలసామి
ఏలిన నీ వగలు నే – నేలాగు మరతును ? ॥మనసు॥

## 78. బిలహరి - త్రిపుట

(సామాన్య - ప్రౌఢ, మధ్యమ)

పల్లవి :

మఱచితివా నన్ను ? మగువా !

అనుపల్లవి :

గుఱు తెఱుగవా ? మువ్వ – గోపాలుడను గాన ॥మఱ॥

1. సుదతి! యెన్నడు నన్ను - జూడన ట్లనేవు!
నిదురకు నే గాదా - నేవేళ మిచ్చినది?
కొందమ గుబ్బల మీద - క్రొన్నెల లేమాయెనో? ॥మరు॥

2. నన్ను తాంగిరో! యెన్ని - జాణతనములు చేసేవు! నీ
కన్నెరికమునకు - కంఠసరు లిచ్చినది
మొన్న గాదటవె? నీ - మోవి గంటి చేసినది! ॥మరు॥

3. పాటలాధరి! మువ్వగో - పాల! రమ్మని మంచి
తేట ముత్తెపు సేరు - తీసుక గూడిన
నాటి బడలి కింకా - నేటికి దీరదు! ॥మరు॥

---

## 79. తోడి - త్రిపుట

(సామాన్య - విరహోత్కంఠిత)

పల్లవి:

మరచె నేమో చెలియ! - మాయలో తగిలి!

అనుపల్లవి:

పరమాత్మ మువ్వగో-పాలు డిందు రాడాయె! ॥మరచె॥

1. మొలక ప్రాయమున - మోహము నను గూడి
చిలుక తాళిచ్చినది - చిత్తాన లేద!
కలికి చిలుకల కొలికి - పలుకు లేలే యనుచు
కులుకు గుబ్బల పైని - క్రొన్నెల లుంచినది! ॥మరచె॥

2. అలిగి నే నొకవేళ - అవలి మోమై యుండగ
చెలియరో! కౌగిటను - జేర్చుకొని చాల
పలుమారు తమి హెచ్చి - బాలరో! రమ్మని
తలిరుమోవి పైని - పలు మొన లుంచినది! ॥మర చె॥

3. చెలియ! మే మిద్దరము శయ్యపై పవ్వళించి
వలరాజు మీదను - పదము పాడుకొనుచు
సలలితముగ మదన - సామ్రాజ్య మేలించి
కలసి నను సురతుల - కరుణించినదే యిపుడు! ॥మర చె॥

## 80. కల్యాణి - ఆది

(సామాన్య-రతిప్రియ)

పల్లవి :

రారా! అయ్యలు! రారా!

అనుపల్లవి :

రారా! నా వలపు-వారక మించె నా సామి! ॥రారా॥

1. ఎంత సే పని తాళేదానరా? ఓరి!
ఇక వశము గాదు; నీ యానరా!
చెంత జేరి కెమ్మో వానరా! నన్ను
చింతల బెట్టేది మానరా! - నా సామి! ॥రారా॥

2. ఏరా! నీకు పగ దాయెనా? చూచి
   ఎవ రనే పాటి లే దాయెనా?
   చేరి నీ పాదసేవ చేయనా? అల్ల
   చిన్న నాటి కూరిమి పోయెనా? నా సామి! ॥రారా॥

3. కూడితి విక దయ యుంచరా! మువ్వ
   గోపాల! నన్ను గరుణించరా!
   వేడుకకై కౌగిలించరా! నన్ను
   వింత సేయక గారవింపరా! నా సామి! ॥రారా॥

---

81. సావేరి – త్రిపుట

(సామాన్య - ప్రౌఢ, మధ్యమ)

పల్లవి:

రాలేదు పొమ్మనవే, ఓ చెలియా యీ

అనుపల్లవి:

వేళ తిరువళ్లూరి – వీరరాఘవునితో ॥రాలే॥

1. పదములకే మ్రొక్కితి – భావము దెలుసుకొమ్మంటి!
   ఎదుట నే నిల్చిన – నేల దయరా దంటి!
   కనిసి నేనిక నీకు – కై దండ లిచ్చే నంటి!
   మదిరాక్షి! అందరిలో – మనసు విడనాడెనే! ॥రాలే॥

2. నీరజాక్షుల నంపక — నేనే వచ్చితి నంటి!
వారి వీరి వలె నాతో — వాదులు సేయకు మంటి!
ఊరక నేరమేల? చేదివు లెడ నీవు
వృథాలె రేయిపగలు ॥రాలే॥

3. కోరిక దీర్చేటి మువ్వ — గోపాలు డనుకొంటి!
వీరరాఘవ! నీకు — వింతదాన గా నంటి!
వారిజాక్షి! యుపరతుల — వాని గూడెద నంటి
ఈసరస మేల వద్దంటి? — ఎన్ని నేర్చుకొన్నాడే? ॥రాలే॥

---

82. ముఖారి - అట

(సామాన్య - ప్రౌఢ, వాగ్విదగ్ధ)

పల్లవి :

లలనామణిరో! యీ భావము దెలుపవే
లలితముగా నిపుడు!

అనుపల్లవి :

వెలదిరో! మా మువ్వగోపాలుని దయచేత
వేడుకగా దెలుపవే ఓ బాల! ॥లల॥

1. అలివేణి! నీ దేశ మేదేశ మంటేను
అపుడు చెట్టు జూపెను!
చెలియరో! నీ యూరి పేరేమని యడిగితే
చెట్లు రెండు చూపెను!

చిలుకల కొలికి ! నీ - చెలుల పేరే మంటేను
చెట్లు రెండు చూపెను !
పలుమారు నీ జాతి పేరేమని యడిగితే
పదరి చెట్టే చూపెనే ఓ బాల ! ||లల||

2. సత్పత్రనఖ ! నీకు హిత వేమని యడిగితే
పక్షిహితవు అనెను !
లక్షణవతి ! నీదు చెక్కిట నే మంటే
పక్షి యున్న దనెను !
వక్షస్థలాన ఉన్నది యే మంటే
పక్షియున్న దనెను !
సూక్ష్మముగ నీ పేరేమని యడిగితే
పక్షి పేరే చెప్పెనే ఓ బాల ! ||లల||

3. వారిజానన ! నీకు ఎన్నేండ్లాయె నంటే
ఊరిపేరే చూపెనే !
చేరి నీ తోడుబుట్టినవారు లెవ రంటే
ఊరి పేరే చెప్పెను !
తీరుగా మెఱసెడు మేలుంగర మే మంటే
ఊరి పేరే చూపెను !
ఓ రమణీ ! నీ మోమందున్నది యే మంటే
ఊరి పేరే చెప్పెనే ఓ బాల ! ||లల||

---

## 83. ముఖారి – అట

(సామాన్య - అతృప్త)

**పల్లవి :**

వద్దే తల్లి తిరమే!

**అనుపల్లవి :**

ప్రొద్దు బోయినదాక – సుద్దులే తలబెట్టుక ॥వద్దే॥

1. చిప్పిలు మోవి తేనె నాన నిమ్మని
చే యెత్తి మ్రొక్కగాను!
ఒప్పుగా మరుకేళి – కెప్పు డెప్పు డనగ
అప్పు డైన రవికముడి – విప్పగాను దెలియలేక ॥వద్దే॥

2. అయ్యలు! తాళలేను నీ కౌగిట జేర్చి
ఆనుకొమ్మని యడుగగాను!
నియ్యానని యిక దమి – నిలుప లే ననగా
అయ్యయ్యో నే కనుగీటి – యదరి వేసినదాక ॥వద్దే॥

3. నగుచు మువ్వగోపాలుడు మీ రందుబోతే
చిగురు విల్తు కేళిగూడి
మగువరో యీ చెలెలు – సొగసుమీరిన వా రనగా
మగువ నీ మనసు దెలిపి – ఎంతి నే బో మ్మన్న దాక
॥వద్దే॥

## 84. ఆనందభైరవి - అట

(సామాన్య - ఖండిత, ప్రౌఢ)

పల్లవి :

పట్టు పెట్టుదు సుమ్మీ! వలదు ఈ సరసాలు !

అనుపల్లవి :

పట్టుకురా నా కొంగు – గట్టిగ మువ్వగోపాల ! ॥పట్టు॥

1. ఎక్కడ నీపతి కితవో ! ఎవతెకు నీ పై నెనరో !
అక్కడికే పోవలెగా – నిక్కడ పనియేమి ?
కక్కసమున ఒక టంటే – కానిది యనిపించుటకా ?
చక్కగా నీ వెందైన – చల్లగా నుండితే చాలు ! ॥పట్టు॥

2. ఇం దుంటే యొకమాట ! నా – యిల్లు వెడలితే
యొక మాట !
దందన కాడవౌర ! నీ – దయలెల్ల దెలిసెరా !
ఎందుకు వేడుకొనేవు ? – ఎవరు నేర్పి రీ చిన్నెలు ! ఆ
సుందరివలె నీకైన – అందకత్తెను గాను ! ॥పట్టు॥

3. తగవా శ్రీ మువ్వపురినిలయ మువ్వగోపాల ?
అగడైతి నిను గూడి ! – అందున సుఖమేమి ?
మొగమోటమి జూడను ! – పగలెల్ల నా వద్దనా
సగమాయెను ప్రొద్దొయితే – ! తగ దిం దుండను
నీకు ! ॥పట్టు॥

## 85. భైరవి - అట

(సామాన్య - ప్రేమగర్వీత)

పల్లవి :

వనితా ! నామోహ మెట్టిదో !

అనుపల్లవి :

ఇటువంటి రాతిమనసు దానవే ! నీవు
మన్ననతో మాటాడవే ! ॥వనితా॥

1. నెలతా ! నే నినుబాసి – నిమిషము రాకున్నంత
కలకల నగుతా నా – కన్నుల యెదుట నిలిచి
పిలిచి నట్లుండునే ! నుదుట కస్తూరి
తిలకము దిద్దినట్లుండునే ! వాడి గోరచెక్కిలి
జేరి ముద్దాడి కౌగిట – జేర్చినట్లుండునే ! ॥వనితా॥

2. చక్కని ముద్దుగుమ్మా – సరగున నిన్ను జేరి
అక్కరతో బాగా లిచ్చి – ఆనుమదుపు మొనపంట
నొక్కి నొక్కించినట్లుండునే ! నాతమి దీర
నీకెమ్మో వానిన ట్లుండునే ! కౌగిటలోన
దక్కి చిక్కితి వని-మ్రొక్కి వేడి నట్లుండునే ! ॥వనితా॥

3. పలుకు బలుకుకు దేనె లొలుక – బలుకుచు నన్ను
అల మువ్వగోపాలుడు – అందంపు రతికేళికి
బలువేగము రమ్మన్నట్లుండునే ! – వానిగూడితే
పొలతిరో! యిదె యింద్ర-భోగ మని నట్లుండునే! ॥వనితా॥

## 86. ఘంటారవము - ఆది

(సామాన్య - విప్రలబ్ధ)

పల్లవి :

వన్నెకాడిందు రాగానే - వద్దనేరమ్మా !

అనుపల్లవి :

కన్నీరు చెలులకు - పానకము కాబోలు ! ॥వన్నె॥

1. అందముతో మంచిమాట - లాడుచు నుంటె
అందరు నా వంటి వార - లని యుంటి నమ్మా !
ఇందుముఖ ప్రాణేశు - నెడలజేసిన దనుక
కందువతో నిందుకే - కంకణము గట్టిరే ! ॥వన్నె॥

2. నెనరుతో నా యింట - నే యున్నాడని సారెకు
మనసు విరుగనలె నని - మందలింతురే !
వనిత వారి మాటలు - విననైై నమ్మజెల్ల
కినిసి కలవి లేనివి యే - మని బోధించిరో? ॥వన్నె॥

3. పలుమారు మువ్వగో - పాలుని నేను
కలసి తన జీవము - వలె నుంటి నమ్మా !
మెలత లందరికి నా - మేలు, కనులకు వెగటై
చలపట్టి వారేమి - సాధించుకొనిరో ! ॥వన్నె॥

---

## 87. మధ్యమావతి - త్రిపుట

(సామాన్య - విరహోత్కంఠిత; సఖీ శిక్షా లక్షణము)

పల్లవి :

వలచేది యొకరి కోసమా ? ఓర్వలేని
చెలు లంటేనే రోసమా ?

అనుపల్లవి :

తలిరుబోణి ! వారు పెద్దలైనారు
తాళు కొన్నదే ? దోసమా ? ఎక్కడి జోలే ? ॥తలిరు॥

1. నిను నిందించినారంట - నీవేల అలగి యున్నావు ?
నీ వివేక మెంతాయెగా !
వనజాక్షుల నోటి వెక్కసపు మాటల
వాని మొక్క బోయీనా ? ఎక్కడి జోలే ? ॥తలిరు॥

2. వారు సేయు మనగానే ముందు చెలిమి చేసినావో ?
వారికి చింతిన సేతురా ?
ఊరికే నిన్ను జూచి - యుసురనే దోసకారులు
ఒకరి మేలు సైతురా ? ఎక్కడి జోలే ? ॥తలిరు॥

3. నెమ్మి మ్ముట్టెడి మువ్వగోపాలుడు
నీతో నైన కూడుండనే చెల్లయిది
వాజాలనైనదే చాలదా ?
అమ్మమ్మా ! ఇదియేమి ఎదిగే తిరిగే
వయ్యయ్యో ! యెవ - రైనా
దేశరాజుల యొక్కడి జోలే ? ॥తలిరు॥

## 88. పంతువరాళి - చాపు

(సామాన్య - ఉత్తమ ప్రేమగర్విత)

పల్లవి :

వలపు దాచనేరనే యోభామ !

వారి వీరి వలె నే

అనుపల్లవి :

తలపు తనమీది బాస లిచ్చి చాల

తరితీపుచేసినాడే ! ఓ భామ ! ॥వల॥

1. ఇదిగో వాడు వాకిట వచ్చెనని వింటే

ఎదురుగ నే బోదునే !

పదరక చేలా గొసగి తోడితెచ్చి

పానుపుపై నుంతునే !

ముదమున వాని రొమ్మున గుబ్బ లానించి

ముద్దుపెట్టుకొందునే !

అదనుగ నుతిచేసి బాగా లిదిగోయని

యాకుమడుపు లిత్తునే ! ఓ భామ ! ॥వల॥

2. తిలకము అందము మీర నాకొనగోట

దిద్ది వేడుక జూతునే !

బలిమి సుగంధము పన్నీట మర్దించి

బాగుగ నలదుదునే !

సొలపున వానిపై పదముపాడి వీణ
సొలపుగ మీటుదునే!
పలుమారు నామీద దయయుంచు మని వాని
పాదము లొత్తుదునే! ఓ భామ! ॥వల॥

3. మోసబుచ్చి నన్ను మువ్వగోపాలుడు
మోము జూప కున్నాడే!
వాసిదాన నని తెలిసి తెలియలేక
యాసలూరగ జేసెనే!
రోసము నిలువ దెటుల తాళుదునే
దోసకారిని గూడెనే!
మీసముగల మగవాని వలెనే వచ్చి
మీసరమున నేలెనే! ఓ భామ! ॥వల॥

### 89. కాంభోజి - అట

(సామాన్య - ప్రౌఢ, ప్రతిభాచతుర)

పల్లవి :

వాడేల చేసెనే శ్రీకృష్ణ - డాది వరాహుడు

అనుపల్లవి :

కాదన రమ్మ? నా వల్ల - కల్ల కల్గిన నిపుడే ॥వాడే॥

1. ఇదిగో! దొండ పంటిపై వాలిన
   యుదుటు తుమ్మెద దంటి గాక
మదనుని కేళి - మగువల కాటుక
   పెదవి నంటె నంటె నా? ॥వాదే॥

2. సంకుమీద - చందురు కోదములు
   పొంక మాయె నంటిగాక! యటు
కొంకక తన గళముపై నెల
   వంకలుంచె నంటినా? ॥వాదే॥

3. మేర మీరకు మని సెంబర న్నారి కేళి
   సారె సారెకు - జాజుశయ్య నను
గోరి యంబుజవల్లి వరాజ గుడే
   మీరి యేలినందుకు ॥వాదే॥

90. ఆనంద భైరవి - త్రిపుట

(సామాన్య - ప్రేషగర్వితం)

పల్లవి :

వింటివా! అలదానిమాట - వింతలయ్యాని!

అనుపల్లవి :

అంటె అనవలె తానే - ఆడదైతే యిట్లాడునా? ॥వింటి॥

1. చల్లని మనసుదాననై – వల్లభుని ఎన్నిట మెప్పించి
ఉల్లము రంజిల్ల మోహా – ముప్పతిల్లగా
ఎల్లప్పుడు తనకౌగిటలో – అల్లాడనియ్యగా జేర్చి
అల్లి బిల్లిగా నుంచకనే – అతనెట్లా వెళ్ళనిచ్చేనే ! ॥వింటి॥

2. సకల కలావల్లభుని – సమ్మతించే సఖు లెవ్వరే ?
వకనాతిని గాన నిపుడు – వనిత ! యీచాన
అకట అతని సామ్మంటె–అందరు నవ్వరా ? ఓ చెలియ !
ఎకసక్కె మాడి తేను – ఎక్కువదనేరా భువిలో ? ॥వింటి॥

3. చెలియా! మువ్వగోపాలుని – కలయకుండే చెలులెవ్వరే ?
ఇలలో వలరాజు పుట్టుక – యీపె కోసమా ?
నెలత లందరికి ఇటుల – వలపించు కొన్నాడటవే ?
తెలియనౌనా దానిమాయ ? – తెలియదు పో
పొమ్మనవే ! ॥వింటి॥

---

## 91. సైంధవి – ఆది

(సామాన్య - గురుమాన)

పల్లవి :

విడు విడు నన్నంట రాకురా !
ఓ రోరి జాణ !

అనుపల్లవి :

విడు విడు నన్నంట రాకు
వెరతు ముమ్మాటికి నేను !
విడిదికి మళ్లిపోరా ! – విజయరాఘవ ! జాణ ! ॥విడు॥

1. ఈ పొద్దు చిత్తము వచ్చెనా ? ఆ జవరాలు
ఇల్లు వెడలి రానిచ్చెనా ?
పో పోరా ! దానికైతే నేపాళరాజు ఇచ్చెనా
ఆ పెద్ద ముత్యాల సరులు దానింటికైతే
దీపాళి పండగ చీరెలు (?) ఇక మెచ్చవద్ద ?
ఓ పట్టభద్రాంగి ! మేరలు – ఓరోరి జాణ ! ॥విడు॥

2. చక్కనయ్య నీకె చెల్లునా ? యీలాగైతే
సవతి నీకె సొక్కు జల్లెనా ?
దక్కితి సొక్కితివి – దక్కేవురా ! దానికైతే
ముక్కెరకు మురుగు – ముత్యము ఆ రాణికైతే
ఒక్కొక్క వరాని బత్యము అమ్మనే జెల్ల !
ఎక్కడిది నీకు సత్యము ! ఓరోరి జాణ ! ॥విడు॥

3. కోడకాడ ! ఇందు వత్తురా యీలాగైతే
కొమ్మకు ఇదెల్ల హత్తురా !
ఆడకె మళ్ళిపోరా ! ఆ మోహపు రాణికైతే
కేడెంపు వజ్రాల కమ్మలు ఆ రాణికైతే
జోడించిన ఉంగరమ్ములు నాతోనైతే
జాడిగాని ఇచ్చకములు ఓరోరి జాణ ! ॥విడు॥

---

92. ముఖారి - ఆది.

(సామాన్య - గురుమాన)

పల్లవి :

విడు విడు మమ్మ ! యిదేటి సుద్ది ?

అనుపల్లవి :

పడతింటికి పోలేదని - బాస చేయించుకో వలె ! ॥విడు॥

1. కద్దు కద్దనిపించే దాక - కట్టినదే దానికోక !
సుద్దులు పల్కి యిందాక - సుదతింటికి వచ్చేరాక ॥విడు॥

2. ఎదిరించితే కాదనేరు - ఏటికే యీ యూరుదూరు
పదిలేది కాదు నా తీరు - అదిగోనె చెక్కిట గోరు! ॥విడు॥

3. మును నన్నేలినట్టి మేటి - మువ్వగోపాలు డెప్పాటి
దిన దినము నాతో సాటి - వనితలలో నేటి పోటి ?॥విడు॥

93. కాంబోజి - త్రిపుట

(సామాన్య - స్వాధీన పతిక)

పల్లవి :

వేడుకతో నడుచుకొన్న - విటరాయుడే !

అనుపల్లవి :

ఏడు మూడు తరాలనుండి - ఇందున్న కాణాచట
గూడుకొని మా మువ్వ. గోపాలుడౌ విభుడు ॥ వేడు॥

1. మధుర తిరుమలేంద్రుడు – మంచి బహుమాన మొసగి
ఎదుట కూర్చుండు మని – ఎన్నిన ఇమ్మనెనే!
ఇదిగో రెండువేల పదము – లివ్వ జెంచుకొమ్మనిన
చదురు మీదనే ఉన్న సామికి – సంతోష మింతింతగాదె!
॥ వేదు ॥

2. అళుకు దీరి తంజాపురి – నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి – వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ – చక్కగ వేయిపదముల
పలుకరించుకొ గానె – బహుమానమిచ్చె నావేళ! ॥ వేదు ॥

3. బలవంతుడౌ గోలకొండ – పాదుషా బహుమాన మిచ్చి
తులసి మూర్తితో వాదు – దలచె నావేళ!
వెలయ మువ్వ గోపాలుడు – వెయ్యెన్నెనూరు పదములు
నలువది దినముల లోన–నన్నుగలసి వినుపించెనే! ॥ వేదు ॥

94. ఆనందభైరవి - అట

(సామాన్య - ప్రౌఢ, క్రియావిదగ్ధ)

పల్లవి :

సకియ యుపరతి సేయు సమయమున

అనుపల్లవి :

అకలంకముగు పుణ్యా మబ్బు నని తలచె

1. సరి మోముపై కెగజారు కీ - ల్జడి జూచి కలసి
పతియు పరాగం బనినను - పటు దర్పమున
గతి మీరంగా పుణ్య - కాలమనుచును వేగ
మతివ జలకములాడె - నానంద వార్ధిని ॥సకియ॥

2. స్మరమంత్ర తంత్రముల - సంకల్పములు జెప్ప
హరువు మీరంగ - మరుకేళిని వేడ్కను
సరిగ కుచకలశముల - జారు చిరు చెమటచే
తరళాక్షి జఘన భూ - దాన మొసంగెన్ ॥సకియ॥

3. తరుణి చేమీదుగా - తాంబూల పూర్వకముగ
సరలి మానధనంబు - సర్వ మొసంగెన్
మరుకేళి వేడ్కతో - మగువ యుపరతి పెనంగ
అరది కృష్ణునికి పర - మానంద మయ్యెన్ ॥సకియ॥

---

## 95. బేగడ - త్రిపుట

### (సామాన్య - దివ్యాదివ్య)

(నాయికా నాయకు లిరువురున్ను అత్యంతప్రీతితో నుండి మరల ఇద్దరికిన్ని కలతకలిగి నాయకుడు ఈనాయికను మానేకొరకు తన పొరుగింటి దానికి దాక్ష్యం విడిచినందువల్ల నాయికకు తెలిసి కోపవచనముగా సఖితో తెలియ జేసుకొన్నది.)

పల్లవి :

సరసము గా దిక - సకియా!

అనుపల్లవి :

సరసము గా దిక - సకియరో! కరిగిరి
వరదుడు నా గుణ - మెఱుగక వడిచెను ॥సర॥

1. పదరి వా డింటు వచ్చి - పడ కిల్లు సొచ్చితే
నిదుర లేప వద్దని - నెలత, నీ వనుమీ!
కదిసి మెల్లన నిచ్చ - కములకు వాడు నా
పదము లొత్త వచ్చితె - పట్టనీయకుమీ! ॥సర॥

2. అతివ! వినవే నాలు - గైదు దినముల దాక
బతిమాలించక కాని - భయము రాదమ్మ!
అతితమి గాగిట - నదుముకొని కెమ్మోవి
యత డాన వచ్చితె - అంటవ ద్దనుమీ! ॥సర॥

3. పరగ మా మువ్వగో - పాలు డైన కంచి
వరదుడు నను గూడి - వదలక యుండి
మఱి యే యెన్నిక లేక - గరివించి పోరిగింటి
హరిణాక్షి నడిగించె - నని వింటి నమ్మ! ॥సర॥

---

96. కాంభోజి - అట

(సామాన్య - ప్రౌఢ, ప్రేమగర్వీత)

పల్లవి:

సామాన్యము గాదె! వానిపొందు
సామాన్యము గాదె!

అనుపల్లవి:

ఏ మన నేరని భామలు వాని కాసించి - రే మందు?
విజయరాఘవుడే స్వామి సుమ్మి!

భూమియందు వాని గుణము లెన్న జనులకు
వీనుల విందు ఓ చెలియరో! ॥సామా॥

1. పాయపు హంతకారి కావలె! - వాని పదపద్య రచన
సేయ నుత్తర - మీయవలె! వానిముద్దు కవిత లా
వ్రాయ చదువ నేర - వలె! ఆ వగలయందు
గాయకురాలు - గావలె! ఓ చెలియరో! ॥సామా॥

2. ఆటకు మేటి గావలె! తంబుర
గోట మీటరాగ మనవలె! వానిపై సొగసు
పాటలు వినుపించవలె! వాని మనసు దెలిసి
మాట లాడ నేరవలె! ఓ చెలియరో! ॥సామా॥

3. కప్పుర బాగా లీయవలె! వాతెరకు తేనె
చిప్పిల్ల సగమా కీయవలె! తమి హెచ్చే వేళ
తప్పక మోవి నొక్కవలె! విజయరాఘవుని
అప్పుడె పైకొని కూడవలె! ఓ చెలియరో! ॥సామా॥

---

### 97. ముఖారి - ఆది

(సామాన్య - స్వాధీనపతిక)

పల్లవి :

సామికి సరి యెవ్వరే? నా చక్కని

అనుపల్లవి :

భామరో! తిరువళ్లూరి వీరరాఘువ!

1. నెలతరో! ఎప్పుడైన - నేనే చెక్కిలి జీరి
కలగి యెఱుక లేక యే - చెలియ జీరెనంట!
తెలుసు కొమ్మను గాని - యలగి మూరు బలుకకే
చలియించని నిందు కుండ - నలె నుండు నమ్మ! ॥సామి॥

2. కదసి నేనే వాని మోవి - గంటి చేసి మరపున
పదరి యీలాగున నే - పడతి యుంచె నందునె!
అదరీన? కోపగించీన? - అలసీన? సొలసీన?
మదిరాక్షి! నా చిత్తము స - మ్మతి బరుచు నమ్మ!
॥సామి॥

3. భామరో! మా మువ్వగో - పాలు డౌ వీరరాఘవుడు
కాముకేళి హాయలుగ - గలసి యుండగ
ఏ మగువ వద్దనైన - ఈలా గుందువో యంటె
ఈ మాటెట్లుంటివని - ఎంతో యుస్సురనె నమ్మ!
॥సామి॥

---

98. కాంభోజి - త్రిపుట
(సామాన్య - ప్రౌఢ, తృప్త)

పల్లవి:

సుదినమాయనే! యీ ప్రొద్దు - సుదిన మాయనే!

అనుపల్లవి:

మదనావతారుని సేవ - మనకు గలిగెనే! ॥సుదిన॥

# క్షేత్రయ పదములేవో?

## 1. కాంభోజి - చాపు

(స్వీయ - ముగ్ధ, విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు, కరుణా శృంగార రసములు)

పల్లవి :

ఇదిన్యాయమా నీకు ఇతరులవలచేది-ఇంతినే నొకతుండగా!

అనుపల్లవి :

సదయహృదయుడ! నే - సమర్తాడి నెలలాయె
సరగున ననుగూడ - సమయమై యుండగ ॥ఇది॥

1. చిన్ననాడే యా - శృంగార వనములో
చెన్ను మీరగ మనము - చేరికూడుండగ
వన్నెకాడ! నాడు నీ - వన్నమాట నేడు
ఒన గూర్పక నీవు విడలించు - కొని పోయ్యే ॥విది॥

2. సొక్కియున్న వేళ - చెక్కిలి నొక్కుచు
మక్కువతో నన్ను - మరచిపో ననుచు
పెక్కువిధముల నా - కొట్టుపెట్టి యిపుడు
చక్కని సామిగా - టక్కుచేసి పోయ్యే ॥విది॥

3. నిన్ను బాడక అర – నిముసము తాళర
కొన్న మగడ నీ వని యను – కొంటిరా
వెన్నెలగాసెర – వేడ్కతో గూడర
పన్నగ శయన శ్రీ – పార్థసారథి! యిపు ॥డిది॥

## 2. యదుకుల కాంభోజి - త్రిపుట

(పరకీయ - విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు,
విరహ విప్రలంభ శృంగారము, కరుణారసము)

పల్లవి :

ఎంతని వేడిన చెంత జేరకున్నావు – ఇంతకోప మేలరా ?

అనుపల్లవి :

రంతుకాడ! కంచి రంగేంద్రుని కుమార!
రారాయుడ రంగా ? యీ–రావు లేలరా? ॥ఎంతని॥

1. కన్నులు విలుకాని – ఘన బాణ జాలముల
కరిగిసే నిట్లుండగా సామి! యిన్నాళ్ళదాక
నన్ను బాసియుండుట నీ కెట్లు మది దోచెరా ?
నిన్న నేటివారు నీకు ప్రియులైనారా ?
॥ని॥ నిన్న నేవని లేదు ఆ–నెలత సేయు మాయలకు ॥ఎంతని॥

2. బలిమిని పిలిపించుక - వచ్చినప్పుడే. తెన్ను
తెలిసెరా నీ జాడలు ? వలచి వలనైతే
పలుకే బంగారమా ? - వన్నె కాడ ! యిపుడు
కలనైన నీ మాట - గడచినా నట్రా ?
చలము సేయక రారా - సామీ యిక తాళలేనురా
॥ఎంతని॥

3. ఇదివరకు నినుబాసి - ఎన్నో బాముల జెందితి
ఎమిాతోచక నుంటిరా
సదయ! రారా నీ మనసారఎప్పటివలె-జాగు సేయక యేలరా
అదనమున నీపై - ఆశ బెట్టించెరా
మదనావతార నీ - మది రా సహించు రా ॥ఎంతని॥

---

3. ముఖారి - ఆది (వర్ణము)

(స్వీయ - విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు
విరహ విప్రలంభ శృంగారము, కరుణాస్వరము)

పల్లవి :
చలము సేతురా నాపైని ?-చక్కనిసామి! జాలమేల రారా
కలువల రాయుడు పలుమారు నన్నే - తలవట్టెరా పలుకే
వేమి నాతో బాలగోపాల! సామి !

అనుపల్లవి :
పరాకు వలదని మరిమరి దెలుపగను వినవదె నా మనవిని
సరోజముఖుని గరాగరిగ ముదంబు దనర నేలగ నిదేసమ
యము సరసా ! యిపుడు ॥ చలము సేతురా ॥

1. నీ కింతైన దయలేదటరా ! సామి !
ఏ సఖి బోధించెనురా ! నీరామాటాడవు పిలిచితే !
సదయ ! ॥చలము॥

2. మున్ను కడుప్రేమతో నెరకీవితో మంచిపలుకులతో
కూడితి వపుడే మరచినసామి ! ॥చలము॥

3. చాలునురా ! నిరపరాధినిరా ! అలుక సేయ తగవగునటరా
పూలవిల్తుడు డాసి పలు చలము పూనియు నెద గదియు
శరములేయగను తాళగవశమ ? ॥చలము॥

4. సారెకును నేరము లెంచెదవేల ? ఎవరైన విని నగర ?
కోరి నిన్ను వలచియున్న నన్ను కన్నడ చేసెద వపుర !
యిదేఘనమ ? భళి భళిర ! ॥చలము॥

5. వేరుసేయకుర మరెవ్వరి వేడబోదురా ? చెలువుడ నను
కూరిమి తోడ మదనుని కేళి నెనయుము నినుబాసి నే
నోర్వగజాలను గదరా ? ॥చలము॥

---

## 4. ముఖారి – చాపు

(నాయిక అక్షిత, సఖీభావము, పార్శ్వ చారిణి, ఈర్ష్యామాన
విప్రలంభ శృంగారము, కరుణారసము)

పల్లవి :
చూడుడీ జోడద్దములపైని సన్నంపు–చుక్కలు గనిపించెనే

అనుపల్లవి :
నేడుత మదనసంగరమున నలసిన–జాడవలెనున్నది
అవ్వాని వేడ్క– ॥చూడుడీ॥

1. చక్కని పిట్టల చందమామ కూన - చెక్కిన వగజూచితే
చొక్కంపు బంగారు కుండలపై కెంపు - చెక్కినట్లున్నదే
జవ్వని వేడ్క ॥చూడుడీ॥

2. ఇక్కలి చీకటిని చిక్కుపడిన చందమామను గ్రమ్మట
చూచితే
మక్కువ తమ్మిపై ముసరిన గండుతుమ్మెద గుంపువలె
నున్నదే జవ్వని వేడ్క ॥చూడుడీ॥

3. పుట్ట పల్లిసామి పగడంపు పై కెంపు - చెట్టున వగజూచితే
గుట్టుగ ఈ రేయి మదనభండారము - కొల్లలైన
ట్లున్నదే జవ్వని వేడ్క ॥చూడుడీ॥

## 5. కాంభోజి - అట

(సామాన్య - ప్రౌఢ, విరహోత్కంఠిత, వాగ్విదగ్ధ)

పల్లవి:
తరుణి ! మరుశరములకు - తాళ లేనే

అనుపల్లవి:
వరుస వావియు లేని - వాడాయె నమ్మా ! ॥తరుణి॥

1. తల్లికిని తమ్ముడై - తన యత్తకును మగడై
అల్లునికి చెల్లెలిని - అమరనొసగి
బల్లిదుడై కన్నులను - పగలు రేయిగ జేయు
కల్లరీడైనట్టి - ఘనుని ఇందు తేవే ॥తరుణి॥

2. మామయైన మోహనుడై - మనుమునికి మనుమడై
ప్రేమించి అల్లుడై - కన్న తండ్రియై
భామ! తన భావమున - పాటి కట్టుకొని
కామరూపమైనట్టి - ఘనుని ఇందు తేవే ॥తరుణి॥

3. ఒక సతిని శిరమునను - ఒక సతిని ఉరమునను
ఒక సతిని వీపునను - ఒనరనుంచి
సకల లోకము లేలు - స్వామి శ్రీకృష్ణుని
మకరాంకు కేళికై - మగువ! ఇందు తేవే ॥తరుణి॥

---

## 6. ఆనందభైరవి - రూపకము

(పరకీయ - ముగ్ధ)

పల్లవి:

తలచిన హృదయము ఝల్లను - తరుణీమణియొయ్యారము!

అనుపల్లవి:

కలిగినా యిక నొకసారి - కన్నుల జూడ మను ॥తలచిన॥

1. మోము మరవంచి పదఘుంటనమున - భువి వ్రేలన వ్రాయుచు
కోమలి కన్నీరిరుగడలను - గ్రుక్కుచు రెప్పలను
వేసరు నన్ను చూచుటయె కాని - వేరేమి యొల్లని భావము
ఏమని తలపోయుదు! విధి నింక - నేమని దూరుదును! ॥తల॥

2. చెక్కిట చెయి యిడి యలసట - చే పరువము కడుంపాడగ
వెక్కసమగు తా నుద్దిగ న్నట్లు - [illegible] నిలుపుదును ?
అక్కర తీరగ నాతో - ఆడిన మాటలు తలచితే
ఎక్కడ పొగడుదును ? ధైర్య - మే గతి
నిలుపుదును ? ॥తల॥

3. ననుకృష్ణా! యని పేర్కొని - నవ్వుచు కౌగిట మిక్కిలి
అనువుగ జిక్కితి నిక న - న్నడు గిడ నెనయుచును
తనుపులకలు నే నడుగగ - తామరసానన యెవ్వటి
చనవున నడపించిన యుప - చారము చందము
లెల్లను ॥తల॥

7. కాంభోజి - అట

(సామాన్య - ముగ్ధ. అధీర)

పల్లవి :

దయవాడని తెలిసి మనసు నొప్పించితే -
తరుణి ! దోసము కాదటే

అనుపల్లవి :

రయమున తమి రేచి నమ్మించి నన్ను జే -
రకవె ! తలపెట్టితివి ! అయ్యొయ్యో ! ॥దయ॥

1. కలికి! నీ మీదనే - కలవరమని నీతో -
[illegible] లేదా! నాతో
అలుక చేసితే ప్రాణములు నిలువ లే -
వని యానాడె తెలుప లేదా! నా
నిలువెల్ల అమ్ముల బాదల జేసిన మరుడు -
నీ పాలిటికి లేడా!
ఇలలో వలచిన విభులను లాలించే
యింతుల జూడలేదా? రా రాదా? ॥దయ॥

2. మాట నిలుకడ లేని దానవనుచు నే వే -
మారు విన్నవించ లేదా? చిన్న
నాటనుండి నీ మీద మనసుంచిన నేరము -
నను జూచి తాళరాదా! పలుకు
లేటికే మగవాడు పైబడి తిరిగితే -
ఎవరికి చౌక కాదా! అయ్యయ్యో! ఈ
ఆటవారమైన నన్ను బోనాడితే -
అది నీకే కొదవకాదా! నాతో వాదా! ॥దయ॥

3. !

### 8. మరట - ఆది

(సామాన్య - ఖండిత, మానవతి. నాయకుడు - వైశికుడు. ప్రణయ మాన విప్రలంభ శృంగారము; అద్భుతరసము)

పల్లవి :

దానిబోధన వినవద్దురా

అనుపల్లవి :

నన్నుబాయ న్యాయమా ? అది నీకు ప్రియమా ?
నన్నేలర ! బృహదీశ్వర ! ॥దాని॥

1. వద్దజేరి ముద్దుపెట్ట వచ్చితే
గద్దరించి మోమోర జేసేవు సామి ! ॥దాని॥

2. అదేర ! భళి భళిరా !
ఔ రార ! ఇది మేరా ? పో పోరా ! ॥దాని॥

3. ?

---

### 9. కేదారగౌళ - ఆది

(సామాన్య - ప్రౌఢ, అన్యాసంభోగ దుఃఖిత)

పల్లవి :

నే నేల మరులైతినే - ఇట్లా వానికి ?

అనుపల్లవి :

వాని వంచన తెలియక - వనితా ! నే మోసపోతి ॥నేనేల॥

1. పగలు వచ్చేది యిందు ; రే యెల్ల దాని -
పడక యింటిలో పొందు ; ఇంచుక నేవు
మొగము చూపేది యిందు ; వింత వింతల
వగలు చేసేది అందు ; అగడు చేసేది
యిందు ॥నేనేల॥

2. మోడి చేసేది యిందు ; చెక్కిలి నొక్కి
ముద్దు పెట్టేది యందు ; చాడిమాట
లాడే దిందు ; కర్పూరపు - విడె మిచ్చేది యందు
విడనాడే దిందు ॥నేనేల॥

3. నిందమాట లాడే దిందు ; త్యాగేశుడు అందముగ గూడే
దందు ; ప్రాణేశ్వరుడు దండనలు చేసే
దిందు ; నెనరున మోవి విందుచేసే
దందు ; వేమా రలయించే దిందు ॥నేనేల॥

---

## 10. ఆనందభైరవి - ఆది

(సామాన్య - ప్రౌఢ, ధీర)

పల్లవి

నే ముద్దు వరదుడనే - నీ వాడనే

అనుపల్లవి :

భామా ! నన్నేలవే - ఖడలిక్క ఖీ:ర్దేను ॥నే॥

1. మాటలాడి తెలుపవే – మనసులో మర్మము
బోటి! వింతగా – జంకేవేమే?
ఏటికే ఈ వాదు? – ఎలనాగ! ఇందరిలో
నాటి వలెనే నీవు – నవ్వుచు మాటాడవే ॥నే॥

2. సంగతి కాదే యిది – సరసు రాలవే నీవు
అంగనా! తెలుసుకోవే – అతివేగమే
ముంగరకైనా యీ – మురుపు ముత్యము
శృంగారి! నీ కెమ్మోవి – చెలియుని అన నీవే ॥నే॥

3. గబ్బిగుబ్బల పైని – గౌరవమున పన్ను
ఉబ్బుతమి రతిని – ఊరడించి
గొబ్బున ముద్దు వరదుని – కోరిక చెల్లగా నీ
అబ్బురపు వగల – అతివ నన్నేలవే ॥నే॥

---

## 11. సావేరి - ఆది

(సామాన్య - మధ్యా, ధీర, ఖండిత; అస్యాసంభోగ దుఃఖిత)

పల్లవి:

పూసలోని దారము వలె ఎంత
చేసెనే నమ్మినందుకు!

అనుపల్లవి:

మోసమేమని యడిగితే తగని
రోసమే వేణుగోపాలుడు ॥పూస॥

1. ఎవతె యింటికి పోవని పల్కి
ఎదురిల్లు చొచ్చి వచ్చె ఘడియలో
శివ శివా! ఇతని మోము చూచితే
సేతు యాత్ర పోయిన తీరదు ॥పూస॥

2. అటక మీద సరిగ చీర చాటున
ఆపెకిచ్చి సేవించుకొనె నట
కటకటా! ఇతని పేరు తలచిన
కాశి యాత్ర పోయిన తీరదు ॥పూస॥

3. నాయిక సానుల సంగతి నిమిషము
బాయలేక కలసి వచ్చి నన్నిటు
మాయచేసి కూడినందు కిక చాం
ద్రాయణం బాచరించనా తీరదు ॥పూస॥

---

12. కాంభోజి - ఆది

(సామాన్య - ప్రౌఢ, అధమ)

పల్లవి:

పో పో పో యీా ఈ కొత్తమాట - పుణ్యా మేమి!

అనుపల్లవి:

1.

1. ఇంత కుండ పాలు పితికే - ఎనుము లున్నవి ; నే
సంతరించిన తూముకూరి - సన్న బియ్య మున్నవి
చింతించక రెండు పెట్టెల - చీరె లున్నవి ఇదిగో !
దొంతుల కందిబేడలు గో - ధుమ లున్నవి ॥పోపో॥

2. నీ మీదన మంచిమానె - నెయ్యి ఉన్నవి
నే మానంబు దానగాను తే - నె చక్కెర లున్నవి
కామించిన వగల యూర - గాయ లున్నవి నా
యామర పొగాకు వక్కలయే పొ - ద్దైన నున్నవి ॥పోపో॥

3. సంచుల అయిదింట నిండ - శనగ లున్నవి నే
పంచిన వస్తువులు వెండి - పైడి కొంత యున్నది ఇదిగో !
*    *    *    *    *
మంచి కదంబ కస్తూరి జవ్వాదు లున్నవి ॥పోపో॥

---

## 13. గౌళిపంతు - ఆది

(సామాన్య - ప్రౌఢ, ప్రేమాధిక్య)

పల్లవి :

బాల నెంచేది నీకు చెప్పా ? దీన జన
పాలుండ ! నేటి పద్దేల ?

అనుపల్లవి :

వేగమె రారా ! యాల యాంచ
మోదకశైల వాస ! (మువ్వ ?) గోపాల ! ॥బాల॥

1. చిలుకల పలుకుల – కలకల ములకను
అలరుల విలుతుని – ములుకుల వలను
అల నెల చలువల – తొలుకుచు పొదలను
నెలకొను నలుకను – జంతుచు నుండే ॥బాల॥

2. అనయము తన మన – మున నిను వినయము
నను నెనరున చన – వున ఘనమగు తమి
ని మును కొని పెన – గొను తమికిని దిన
దినమును వనరుచు నుండే ॥బాల॥

3. ముదమున పొదలుచు – పదరిన మది నిను
కదిసిన సుదతిని – కాకుత్స్థ డవై
రదనము తుదలను – పెదవిని నదుముచు
మదను సదనమున – ముద మొనరించే ॥బాల॥

14. మోహన – జంప

(సామాన్య – ఉత్తమ)

పల్లవి :

భావజ జనక ! పరమ పదనాయక !

అనుపల్లవి :

నీ వెన్క నీ వసుధ దైవ మేది ? మాకు వేరా సాద
దేవ కన్న వనేది ? మమ్మేల నీవు చేసేది పోది ॥భావ॥

1. అరుణాక్ష ! అరుణాక్ష ! నేమిట్టు -
లహో రాత్రులు మిమ్ము
గరిమతో దలచంగ - కరుణించ రాద !   ॥భావ॥

2. అంచితము దేవతలు - అందరును మిము సే -
వించి కా దనుట అన్నిట
మించిన వేద వినుత ! మమ్ము కరు -
ణించేది మీ ఘనత   ॥భావ॥

3. నీవు ఏనుగు కొండ - నెలకొని వరద పెరుం -
దేవి గూడుక నుంటివి వేడుకతో
నా విన్నపము వింటివి మమ్మో -
దేవ ! ఏలుకొంటివి పో   ॥భావ॥

---

## 15. కాంభోజి - రూపకము

(సామాన్య - ప్రౌఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

మందుల మహిమే మటుమాయ నా
మాటంటే కూడదటవే

అనుపల్లవి :

మందె మేలమున మరచెనో ? లేక మగువరో ఏ -
మందునే ! మ్రొక్కేను ; రమ్మనవే !   ॥మందు॥

1. ఆటాడి వలచిన వలపులు భూమిలో -
అన్యో్న్య లేదు కాదె !
నాట్యమైన మగవాడు దొరికేని -
వ్రాత ఫలము గదవే! ॥ముందు॥

2. ఆనాడే తెలియనైతి - అమ్మచెల్ల ! ఈ -
పానుపు పాలాయె నా ప్రాయ మెల్ల
కాని పోని దాని వావే - కడవెళ్ళ సుఖము -
కాననైతి నించుకైన ॥ముందు॥

3. హాయి లేని యాడుపుట్టు - కాయె నమ్మా ! -
మాయ మరుని కొప్పగించ నాయెనమ్మా !
పోయెగాని చెట్టపట్ట - డాయెనమ్మా ! -
పాయరాని విరహామె మిగు -
లాయెనమ్మా ॥ముందు॥

## 16. సారంగ - అట

(స్వీయ - ప్రౌఢ, సౌందర్య గర్వితః పార్శ్వ చారిణీ మధురాలాప)

పల్లవి :

మగువ (తను వెన్న) నే - మాడ్కినుండె !

అనుపల్లవి :

1. సొగసునకు పుట్టిల్లు - చొప్పనగ నుండె ॥మగువ॥

1. నెలత పయ్యెద లోన - వలుద పాలిండ్లపై
నెల వంక లే రీతి - నెలవు మీరె ?
వలరాజు అపరంజి - కలశము వెలయించి
వలనొప్పగా దాగు - వ్రాసిన ట్లుండె ॥మగువ॥
2. తావి మించిన యట్టి - తరుణి వాతెర కెంపు
భావించి చూడ నే - పగిది నుండె ?
భావజు డమృతమెల్ల - పదిలంబుగా గట్టి
వేవేగ తాముద్ర - వేసిన ట్లుండె ॥మగువ॥
3. సిరుల నింపొందు మా - శ్రీకృష్ణుతో నింతి
పరివి పెనగంగ నే - కరిణి నుండె ?
అరయ నీలపుసరులు - అపరంజి సరిపెణయు
సొరిది మారుడు పెనచి - చూచిన ట్లుండె ॥మగువ॥

## 17. శంకరాభరణము - అట

(స్వీయ - కలహాంతరిత. నాయకుడు - అనుకూలుడు. విరహ విప్రలంభశృంగారము)

పల్లవి :

మానినీ! వినవే నే మందబుద్ధితోను -మాటాడక యుంటినే

అనుపల్లవి :

మానమే భూషణము - మానవతుల కెల్ల
మాన మెడలిన వెనుక - ప్రాణ మేటికె ?
చెలియ ! ॥మానినీ॥

1. ఇరుగు పొరుగు వార్త – హితవుగ నే నెంచి
సరసునితో పొందు – చాలు పొమ్మంటినే
మఱుగేలనే ? నటుల – మాటలు నే విని
తెరవాన బ్రతుకిట్టి – తెరగాయె నిక నేల ? ॥మానినీ॥

2. మాపు రేపు విభుడు – మర్యాదతో నన్ను
దాపున చేర్చక – దయతో నేలుచుండగ
ప్రాపు దొరికె నని – పడతు లందరు ఎడ
బాపిరి ఇక నా – భాగ్య మెట్లున్నదో ? ॥మానినీ॥

3. అగరు గంధము మేన – అలది కౌగిట చేర్చి
వగకాడు నను గూడి – నద్దికై యుండగ
మగువ లేమో నా – మనసు భేదించిరి
వగ పేల ? చిరుతని – వాసుడై యున్నాడు ॥మానినీ॥

## 18. ఆహిరి - చాపు

(పరకీయ - ప్రౌఢ, సాహసిక)

పల్లవి :

రారా ! రారా ! రారా ! నీ ధర్మము
రాతిరి విటకాడా !

అనుపల్లవి :

తేరకాడ ! నీవు – తెచ్చేవో ? ఇచ్చేవో ? ॥రారా॥

1. అత్త మెత్తనిది మామ ముసలివాడు
ఉత్తముడైన బావ - ఊరలేడు
సత్యము నా మాట - సవతిపోరు లేదు
ప్రత్యేకము ఇళ్లు - పై కానలే లేదు ॥రారా॥

2. మొగుడు జంజకి గాడు - మొత్తిన తిట్టడు
తగుల బట్టి కాని - తలచలేడు
మగనాలి నే నని - మనసున నెంచకు
పగలైన రా యే - పడుచు సందడి లేదు ॥రారా॥

3. మరదులు నే నంటే - మాటాడ వెరతురు
ఎరిగిన వివరాల - కే మనరు
నెరజాణ! వేణంగి - నిలయుడా ననుగూడి
సరగున నీ కొర్కె - సంతోసమే కాని ॥రారా॥

---

19. మంగళకైశిక - అట
(సామాన్య - ప్రౌఢ, వాగ్విదగ్ధ)

పల్లవి :

లంజరికము మాను మీా చెలువ కృష్ణ !

అనుపల్లవి :

చంజి (?) మధురాపురి - తంజావూరి వలె తలచకు మీా
పంజె తోలురాయ - పాళెము లంజలు
కంజదళేక్షణ - కలికి చెలువ కృష్ణ ! ॥లంజ॥

1. వాడి నాకులును - వక్కలు సవరించి
విడె మీయ - వెస నవ్వుచును
*కోడె నామము దిద్ది - కొప్పు దువ్వుకొని
వాడ వాడల నిన్ను - వలపింప జూతురు ॥లంజ॥

2. ఈ సొమ్ము లెన్నా ? - ఇదియేది చూతమని
ఆసతో ధరియింతు - రటు మీదట నిన్ను
మోసపుచ్చి పక్క - వేసుకొని నిన్నంటే
దోసానికి వెరవక - దోచి పొమ్మందురు ॥లంజ॥

3. ?

---

## 20. మోహన - రూపకము

(సామాన్య - ఖండిత)

పల్లవి :
వచ్చితివా నాతో - వాదులాడ ?

అనుపల్లవి :
ఈ ముచ్చు వగలకు - నే మొక్కేరా వరాహ ! ॥వచ్చి॥

1. మందయాన యింట నిన్న - మాపటి వేళ మోవి
విందారగించి నీ విటు - విలాసముతోను ॥వచ్చి॥

2. మొగ్గల తీరైన దాని - నిగ్గు చన్ను లదిమి
బిగ్గ గుమ్మనైన రొమ్ము - తగ్గులతో నిపుడు ॥వచ్చి॥

3. అంబుజవల్లి పతియైన - యాదిమూర్తివో
కంబుకంఠి రా రమ్మని - కలిసీనని నేర్పిన ॥వచ్చి॥

21. భైరవి - చాపు
(సామాన్య - ప్రౌఢ, సురతప్రియ)

పల్లవి :
వనిత వగవగ సుపరి సురతము - వర్షమై
యేతెంచె నిప్పుడు

అనుపల్లవి :
మనసు భ్రమయో లేక యిది యల
మరుని మాయ విచిత్రమో ! ॥వనిత॥

1. సొగసు కురులను మొయిలు ముఖమను
సోము నందము నెల్ల గప్పెను
పొగరు కనుబొమ లింద్రచాపము
పోలుపు దాల్చుచు మీరెను
మిగుల నతివ గళనిశ్వాసము
మేటి పవనుడు విసరసాగెను
మగువ నడుమున తీగ మెరుపులు
మాటి మాటికి మెరసెను ॥వనిత॥

2. కలికి జిలిబిలి కులుకు పలుకులు
గళ రవమ్మున ఉరుము లురిమెను
కలికి ముత్యపు సరులు ముడి విడి
ఘనముగా వడగండ్లు రాలెను
కలయికల చిరుచెమట వానలు
కనక కుచ గిరులందు కురిసెను
నెలవు కొను స్వేదముల కొలనులు
నిండి మడుగై పారెను ॥వనిత॥

3. ?

---

22. పంతువరాళి - రూపకము

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :

విన్నవించరమ్మా ఓ చెలులారా ! – విన్నవించరమ్మా !

అనుపల్లవి :

నిన్ను బాసి చింతలో కరగి – కన్నీరు నింపుచున్న దనుచు
కన్నెలార ! నా దీనత – కరిగిరి వరదుని తోనే ॥విన్న॥

1. వనితపై నలనాటి నెనరెందు బోయె ? నేల
కినుక ? మరుని కొప్పగించితివా ? యని ॥విన్న॥

2. మగవారిని చెలులు నీవల్ల నమ్మ - దగదన వలసె నేడు
సొగసాయెనా ? యల - సుదతి మాయ లయ్యయ్యో !
మగువ కిచ్చిన బాస - మరచితివా ? యని ॥విన్న॥

3. ఘన యోగపురి సామజవరదా ! నీవు
కన్నుల గట్టిన ట్లగునా ?
మనసున నున్నట్టులుండి - మరి కౌగిట లేవు
గనుక న్యాయముగాదు - కలికి నేలరా ? యని ॥విన్న॥

---

## 23. కాంభోజి - ఆది

(స్వీయ, ప్రౌఢ, స్వాధీనభర్తృక)

పల్లవి :

సదయుడైన మా మదన గోపాలుని
చను వందరికి దొరుకునో దొరకదో ॥

అనుపల్లవి :

పదవే అలవాని చెలిమి - బలవంతము గదవే ॥సద॥

1. ఆట ప్రాయమునాటి మక్కువ
అదివరకు ఉండేదే యెక్కువ
నేటికి విడనాడేదే నిక్కువ
అతివరో వినవే అందరికిని తక్కువ ॥సద॥

2. అన్య భామలవలె నన్నాడడే
 ఆడినమాట తప్పని నెరప్రోడడే
 నను బాసి యే వనితను గూడడే
 నాపై నెనరు ఏ నాటికి వీడడే ||సద||

3. అంతరంగము తెలిసిన లోలుడే
 ఆ సుమబాణుని మించిన లోలుడే
 కంతుకేళిని నన్నేలు దయాళుడే
 ఘనుడైన మా మదన గోపాలుడు ||సద||

---

24. సౌరాష్ట్ర - ఆది

(స్వీయ - ప్రౌఢ, ప్రేమాధిక్య)

పల్లవి :

సాముచేసెనే మా వరదరాజులు – సాముచేసెనే

అనుపల్లవి :

సాముచేసెనే దొడ్డప్రేమతో సురలుపొగడగా
సామజవరదుడు సామి పగరుల గెల్వగా ||సాము||

1. దట్టి బిగించుక దండెలు దీయుచు
 చుట్టుకొా పరువడి
 దిట్టగ జేయుచు పట్టుచుకొంత
 కట్టులాడు సం – గడములు దిప్పుచు ||సాము||

2. పట్ల గంధమును – జెట్ల గొప్పయును
పట్ల కోపమును – జెట్లవలెనె కొ
గిట్లను పొర లే – టట్లను పెనగే
టట్లను ముట్టి – ట్టట్టె వెనుకను ॥సాము॥

3. కడువడి మీరగ – కటారి కోలలు
పటుతాళంబులు – పట్టుచు చెమటలు
పుడమి గుహారి (?) పుణ్యకోటి వైరికి
పట్టడ మియ్యక – పగతురు తొడి బడ ॥సాము॥

---

25. ఆనందభైరవి – ఆది

(పరకీయ - ప్రౌఢ, తృప్త)

పల్లవి :

సొక్కుచు సోలుచు – సుందరి వచ్చె
సొగసు చూడరమ్మా కొమ్మా !

అనుపల్లవి :

చొక్కపు టరవిరి – సురటిని చేకొని
చక్కని కృష్ణుని పక్కన రాతిరి – సరిసరిగా కలిసిమెలసి
॥సొక్కు॥

1. కుసుమాయుధు నర్చించు తెరంగున
కొప్పున విరు లొకటొకటిగ జారగ
విసువక వేకువ జాము చందురుని
వితమున ముఖకళ వెల వెల బారగ
కొసరి కొసరి తన యూరికి వెడలగ
కోకిల కొరికి కొరికి తిన మానిన
పసగల తలిరుల కీవిని ననుగత
రస జనకంబగు మోవితో కడు
రాజిల్లెడు మైతావితో
ఒసపరి నిద్దుర కంటి జోకతో
ఒంటికట్టు ముడి సడలు కోకతో
మిసమిస లనుచును – మిట్టల మీదను
పసుపు నిగ్గుగల – పయ్యెద జారగ ॥సాక్కు॥

2. గగన తలంబున సంధ్యారుణ రుచి
కలసిన చుక్కలు పెసగొని జాడ
బిగి బిగి రత్నసరమ్ముల పొడలుచు
చిక్కువడిన హారము లసియాడ
మగువ నడుము కుతికిలబడి మృదు కుచ
యుగ భరమున కలికి నడలు బెళుకుగ
మొగమున నెర నెల తగిలిన రోహిణి

వగల ముంగురులు నటించగ
ప్రియ వాక్యము చిలుకను మించగ విని
మగుడ రతాశలచే నించగ నల
మరుడు శరంబుల ముంచగా
నగధరు కనుగొని నగు క్రేగంటను
చిగురుబోడి కడు - సిగ్గున మెల్లనె ॥సొక్క॥

3. చల్లని మంచు తెరంగున భాసిలు
చందు పసిండి యరంటుల లీల
తెల్లని వలిపపు పావడలో తొడ
లుల్లసిల్లగల నిగ నిగ మని చాల,
ముళ్లు బంతి పెట్టి పావలు
మురువు మీద మెట్టి అందెలు
ఘల్లని మ్రోయగ శృంగారరసము
వెల్లి విరిసి పారగా తన
యుల్లము వెన్నుని గోరగా నెల
పిల్లలు చెక్కుల మీరగా
నల్లని సామిని నలినదళాక్షుని
మల్లికార్జున సమానుని
పెనగొని వరదా యని ॥సొక్క॥

---

# ఇతరుల పదములు

## 1. శహన - త్రిపుట

(స్వీయ - వాసకసజ్జిక, అనుకూలపతిక, సంభోగశృంగారము, కరుణ)

పల్లవి:

అక్కట మరుపాయె – నౌర మరే మాయె ?

అక్కర దెలిసి రా – నైతి నదేమాయె ?

అనుపల్లవి:

పక్క బాసిపోవు వేళలో – ఎక్కడికి అని చెట్టపట్టగ

నిక్కముగ నీతో వత్తునని చని – నిన్న ప్రొద్దున
నుండి గానవు ॥అక్కట॥

1. ఏడాది పండుగ నేడని యెంచి యీ
మేడ శృంగారించితి జలకమ్ముల

నాడి వల్వయు ధరించితి కస్తూరిబొట్టు
వాడిగా నొనరించితి

నాడు నింటికి వేడుకల్బ
లొప్పిడిమిగ జేయు దామని యీ

వాడ వాడల చేడి లంపిన
లేదు లేదని మరలి వచ్చిరి ॥అక్కట॥

2. పడకటింటి మంచి వాసన పన్నీట
బడి బడి నలకించి రంగైన పు

ప్పొడి ముగ్గు లలరించితి పానుపుపైని
పొడిపూలు పరపించితి

వడి వడిగ తెల్లనాకు మడపులు
　　ముడుపులుగ మడిపించి నే నా
నిడుపుగల పూసరులు క్రొమ్ముడి
　　ముడున పనిపడి గడితి నివిగో ॥అక్కట॥

3. ఈనాడు కూడెడు ఏ సతీపతులును మ
　　రేనాటి కెడ బాయక యుందురని పలికి
తే నది సడ్డసేయక యుంటి వింక
　　గానిమ్ము తడవింక సేయక
పోనీ పోనీ వచ్చితి నీ
　　పుణ్యమాయెను లేర రంగడ
సూన శరు సంగరములో నిను
　　సొక్కజేతుర సింహపురవర ॥అక్కట॥

---

2. కాంభోజి - ఆది

(సామాన్య - ప్రౌఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

అక్కరో! నేను వానికి - మ్రొక్కి వేడుకొంటి నని
　　గ్రక్కున తోడి తేవే ఓ - చక్కెర బొమ్మా!

అనుపల్లవి :

ఎక్కువైన కృష్ణదేవుని - అక్కున జేర్చి హాయిగా
　　చక్కెర మోవిని నేను - నొక్కవలె
　　　　నంటి నని ॥అక్కరో॥

1. మందగమనరో! నీ కే - మందునే ? వాని వింతలు
ఎందును జూడ లేదే ఓ కుందరదన !
పొందుగ కలయగ నేను - సుందర మనుచు నీవు
ముందర తెల్పిన దెల్ల - ఎందుపోయె
నంటి నని ॥అక్కరో॥

2. మందమారుత మిదిగో! - సందుగాని డాసెనే యీ
చందమామ కాకల కే - మందునే ? భామ !
పొందుగా నన్నేలిన యీ - నందకృష్ణుని ఈ వేళ
పొందుసేయ రమ్మనవే - ఎందుకు
జాగు చేసేవే ? ॥అక్కరో॥

---

3. కన్నడ - రూపకము

(స్వీయ - మధ్యాధీరాధీర, ఖండిత - నాయకుడు - శఠుడు. సఖి పార్శ్వ చారిణి. మాన విప్రలంభ శృంగారము, కరుణారసము)

పల్లవి :

అడు గడుగున కలగి పోవు టది - అతనికి మేలుటమ్మా ?

అనుపల్లవి :

అడల కడుగ నోరు లేదటమ్మా ! మీరనబెట్టి
ఒడలెరుగని సివము నెప్పుడు - పుడమిని రా నేరదమ్మా !
నుడివెద మా యింటి గుట్టు-నోరు లెరుగరమ్మా ॥అడు॥

1. మిద్ది మీది పరుగులు – మీసాలపై తేనెలు
కొద్దికాలమే కాని – కొనసాగు నటమ్మా !
హద్దు మీరి అర్థరాత్రివేళ – నాడ కేగుచుండ
ప్రొద్దుగాని ప్రొద్దు వేళ – పోవరా దంటినమ్మా ! ॥అడు॥

2. పగ లొక్కనాడైన కంటి – కగుపడి నే నెరుగనమ్మ !
తగులుమారి యొకతె బాగ – తగులుకొనె గదమ్మ !
సొగసు మీరి సొగసు చేసి – మొగము చూచు
చుండు నమ్మ !
మొగము నద్దము లున్నవమ్మ – మొగమాట మేలనమ్మ!
॥అడు॥

3. పెరటి చెట్టుమందు మీద – ప్రియముగలుగునగునటమ్మ!
పరులుపెట్టు నెట్టిదైన – పరమార్థము కాదుటమ్మ !
ధరను సింహనగర రంగ – ధాముని నిక నమ్మకమ్మ !
మురిపెము లిక మానుమమ్మ – తరిలిన మరి దొరకదమ్మ!
॥అడు॥

---

## 4. కాంభోజి - రూపకము

(స్వీయ - మధ్య, ఉత్తమ, స్వాధీన భర్తృక. నాయకుడు - అనుకూలుడు)

పల్లవి :

అలసిపోతి వయ్యో సామి! - అంతే చాలు నేటి కిక
కలయుటకు - కాలము లేదా? మరేమి?

అనుపల్లవి :

కులము వారమై యుండగ - కూడిక సతమై యుండగ
తలపనేల సింహానగరధామ - శ్రీరంగధామ ॥అలసి॥

1. బలితపు చెమట సోనల తోడ - వాడిన నెమ్మోము క్రొన్దమితోడ
వెలయు నిట్టూర్పు సెగలతోడ - విరిసి విరియని కన్దోగలతోడ ॥అలసి॥

2. వడకెడు నును నెమ్మేనితోడ - తడబడు మాటల చవితోడ
అడలునట్టి పెన్దొడలతోడ - అసు రుసురులతో నీ తోడు ॥అలసి॥

3. కలిగిన దెల్ల నొకనాడు - కడజేసుకోగా మరునాడు
కళలు జారిపోయె చూడు - నిలుపుము సింహాపుర వర నేడు ॥అలసి॥

---

## 5. ఆనందభైరవి - అట

(స్వీయ - ప్రౌఢ; తన దుస్థితి చెలికత్తెతో చెప్పుకొనుట. కరుణా రసము పదమంతటను గలదు)

పల్లవి :

ఆడు దాని జన్మమయ్యో! - అన్నిటికంటె నధమము
కాదటవే!

అనుపల్లవి :

ఈడు రాక మును పే - ఏమో యెరుగని
నాడే వక్కడు మెడను - త్రాడు గట్టునమ్మా
చేడెరో! ఇట్టి అన్యాయం - బేదనైనను జూడగ
కోడిగము గాదె? పెనిమిటి - కుంటియైన
కురూపియైన? ॥ఆడు॥

1. తల్లిదండ్రుల నన్న - దమ్ముల నక్కల చెల్లెళ్ళను విడిచి
వల్లభునే దైవముగా నమ్మి - వాని యిల్లుచేరిన
పిదప ఏమందు మనపాట్లు
కల్లలే? పుట్టింటి వారిని - గాన బోవలె నంటిమా అది
వల్లకాదని చెప్పుదురు! - పగవారికైనను
వలదు గదవే ॥ఆడు

2. అత్తగారి పోత్తు – అతివరో యేమందు ? కత్తికోత
మేలుగా ?
జిత్తులన్నీ నేర్చిన యాడుబిడ్డల – చిత్తము
మెప్పించి చెలగు ఎవ్వారి తరము ?
ఉత్తకొండెము లెన్నో వారలు – ఒత్తి మగనితో చెప్పి
దినమును
మొత్తగా కొట్టింప జూతురు – మిక్కుటంబుగ
వేడ్కతోడ ॥ఆడు॥

3. పెక్కు బాధల కోర్చి – బిడ్డల గనగా యీ – దిక్కు
మాలిన బ్రదుకు
ఎక్కడకును బోక – ఏమియు జూడక–ముక్కుచు
నింటను మాల్గుట తల్రవాత
నిక్కముగ మనలోన సుఖపడు – నీలవేణులు నూటికొక్కరు
ఎక్కువౌ వేంకట సుబ్బరా – యేశ్వరుని
కృపజూడ కన్నను ॥ఆడు॥

## 6. శహన - చాపు

(స్వీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత, అయోగ విప్రలంభశృంగారము, కరుణ)

పల్లవి :

ఆడుదాని జన్మమెత్తిన ఫలమేమి ? అతివరో ! వ్యర్థమమ్మా

అనుపల్లవి :

మేడలు మిద్దెలు – మెండు గలిగిన నేమి ?
ఈడైన విభునితో – నెనసి యుండకపోతే ॥ఆడు॥

1. అతివ మిక్కిలి రూప – వతియైతే నేమి ?
సతతము పతిభక్తి – సలిపితే నేమి ?
అతులిత వ్రతములు – ఆచరించిన నేమి ?
పతితోడ హితవుగా – పలుకు లేక పోతె ॥ఆడు॥

2. వెల విరి వస్త్రాలు – వెయ్యి గట్టిన నేమి ?
సలలిత నవరత్న – సరులు పెట్టిన నేమి ?
కలిమి అందరికంటె – కలిగి యుంటే నేమి ?
ఫలకాలమునాడు – పతిని గూడక పోతే ॥ఆడు॥

3. కస్తూరి గంధము – కల్పి పూసితె నేమి ?
విస్తారముగ – విరహా ముండిన నేమి ?
శిస్తుగ పువ్వులు – శృంగారించిన నేమి ?
కస్తూరి రంగని – కలసి యుండక పోతే ॥ఆడు॥

## 7. తోడి - రూపకము

(సామాన్య, ఖండిత, మధ్య ధీరాధీర, ఉత్తమ, అంగగోపన. నాయకుడు శైశికుడు. కరుణాద్భుతరసములు)

పల్లవి :

ఇంతలోనే అలుగ నేలరా ? నే నేమందు నేరమేమిరా ?

అనుపల్లవి :

వింతలాయె లేరా వార - కాంతల పరమాయెనన్నా
ఇంతలు కనులున్న వాని - ఎఱ్ఱ జేసి చూచే వారా ॥ఇంత॥

1. వారితోడ గూడి యాడ - వలదు మానుమంటినా ?
కూరిమిగల నా ముత్యాల - హార మియ్యనంటినా ?
చీరెలియ్య ఒకతె చూచి - చెప్పగా నే వింటినా ?
తారుమారు చేసినను - దండించు చుంటినా ? ॥ఇంత॥

2. వేడుక లాడాడ నని - ఆడి పోసుకొంటినా ?
ఈడువారు గేలిమాట - లాడిన మా రంటినా ?
తోడులేక రేబవలు నా - మేడ జేర్చుకొంటినా ?
కోడిగాని కంటిగాని - కోపముతో నంటినా ? ॥ఇంత॥

3. ఒరుల నింటనైన సఖ్య - మొందగ వద్దంటినా ?
వెరువక నెల కొక్కసారి - ఇరువుకు రమ్మంటినా ?
కరువు దీర నా కంటికి - కన్పడి పొమ్మంటినా ?
తరచుక సింహపురి రంగ-ధామ పోనిమ్మంటినా? ॥ఇంత॥

---

## 8. సౌరాష్ట్ర - ఆది

(స్వీయ - సప్రౌఢ, విరహోత్కంఠిత. విరహ విప్రలంభ శృంగారము,
కరుణ)

**పల్లవి :**

ఇంతి వినవే! యీ రాజశేఖరుం డెవడో తెలుపరా దటవే!

**అనుపల్లవి :**

కాంత! ఈతడు బంగారేచ ధరణీ - కాంతుడో?
జయంతుడో? శ్రీమంతుడో?

1. చాన వీని నెమ్మోము పున్నమ - చందమామ చందము మీరు
వీని కన్నులు వెలిదమ్మి రేకుల - విధమున నలరారు
తేనె లొల్కు సుధజిల్కు వీని - తేటలైన మాటలు సౌరు
వీని మేని కాంతులు వేమారు క - డాని గేరు గదవే
నే నేమని దెలుపుదు నీతని పెన్నెరు లందము
అళిబృందము చందమవును
కౌను కేసరి కేసరియానగ దనరు యీ చెలువము
యువతీ
మానస క్షోభణమై కనుగొను
మానవులకు నేత్రోత్సవ మయినది ॥ఇంతి॥

౨. సన్ను తాంగిరో వీని చూపులు – శంబరారి తూపులనేలు
పొన్నరంట్లనే యూరు లూరకే – పో పొమ్మన జాలు
చెన్నుమీర నలరారు వీని – చెక్కుటద్దముల డాలు
వన్నెలాడి! యితని వీనులు – శ్రీవర్ణ యుగము గదవే!
పొన్నమ యీతని పొక్కిలి నవ్వులు – వెన్నెల తేలి
చిన్నెల
వన్నెలకన్న మిన్న కరి – నెన్నవు నెన్నడ లెన్నదగినవో
కన్నెరో! నే నెటు సన్నుతి సేయుదునే? గురునకు
పన్నగ వరునకు నైనను వశమా? ॥ఇంతి॥

౩. వనిత! వీని సొగసైన రదములు – వజ్రమణుల కేసరిబోలు
వినవే యీతడు వంగారేచ – విభుడే కాబోలు.
వనజనేత్రి! యిటువంటి వాని – తనువు గాంచినదే జవరాలు
కనులు గలిగినందుకు ఈతని దినదినము జూడవలె
నసబోణిరో! నన్నల క్రొన్నన విలుతుని కేళిని మది బాళిని
నెనయు మనవే యీతనిపై నా మనసు దగిలి యున్నది యీ
తని వొందని తను వేమిటికే మోహాము
ఘనమై యున్నది ఇక తాళ లేనే ॥ఇంతి॥

---

## 9. హిందూస్థానీ కాఫీ - అది

(స్వీయ - స్వాధీన పతిక, సంభోగశృంగారము)

పల్లవి :

ఎందుకు రా కోపము ? మదన జనక !

ఏమి మనసున దోచెరా ?

అనుపల్లవి :

?

1. గ్రక్కున నను నీ - కౌగిట జేర్చవు

చక్కని మోవి చురుక్కన నొక్కవు ॥ఎందుకు॥

2. సరగున సమరతి - సల్పగ దలచిన

గురు కుచములచే - గ్రుమ్మితి నని యా ?

॥ఎందుకు॥

3. ధర రేపల్లె పురవరా! నీమది - కరుణ చూపి

మరు కేళి గూడరా ॥ఎందుకు॥

---

## 10. ? ?

పల్లవి :

ఎన్నడు ఈ మోహ మనే - దెటువంటిదో యెరుగ

అనుపల్లవి :

నన్నున్న చోట నిమిషమై - నా ఉండ నీయదు

వన్నెకాడైన కైలాస - వాసుని రూపమే చూచి -

వలచి మైమరచి యుంటినే ఓ యమ్మలాల ! ॥ఎన్న॥

1. ఆట పాటల మీరినానె - ఆసలే దెవ్వరితోను
మాటలాడ పోయినాను - మరులు కొలిపెనే !
కూటములు మదిలో తలుచు - కొన్న మేను పులకరించి -
గుండె దిగులు దిగులు మనేనే ఓ యమ్మలాల ! ॥ఎన్న॥

2. మాల నున్నదాని తెచ్చి - ముంగిట బెట్టిన వలపు
చాలు చాలు ఆడుదాని - జన్మమింక నే లే ?
ఏల బాధించేరే నన్ను ? - ఎందుకు తోడెల్ల దాని -
ఎందు కొని తాళుదునే ? ఓ యమ్మలాల ! ॥ఎన్న॥

3. క్రొత్త వలపు రవము - ఎత్తిన వారి వలెను
తత్తరపడి నా మనసు - తల్లడించెనే
చిత్తజుడు లాగి మొల - కెత్తి యో రతిసీమను -
చిమ్మగా సొమ్మసిల్లితినే ఓ యమ్మలాల ! ॥ఎన్న॥

---

## 11. ? ?

పల్లవి :

ఏడనుండి వచ్చె నీ మేలమ్మా !

అనుపల్లవి :

నేడు రాడాయె నిదిగో వరద రాజమ్మా ॥ఏడ॥

1. కేలన పాలు చక్కెర పెట్టి పెంచిన చిలుకకు
నే నేమి చేసితి ?
మారు ములుకులకై – నోరు మూసితి నమ్మా ! ॥ఏడ॥

2. చాల నేర్చిన బన్నిన యీ మెడ – తాళివల్ల కొంత
తాళితి వడజాతి కాకల తాళ జాలితి భువి –
పాలుపొందనికి సోలితి నమ్మా ॥ఎడ॥

3. కందర్పుని లీల గలసెనే – కాముడై యందమైన
వరదు డిప్పుడు
ఎందును దయగల డిప్పుడు నా – డెందుండి వచ్చెనో
ఇప్పు డో యమ్మా ॥ఏడ॥

## 12. గౌరీపంతు - చాపు

(సామాన్య - ఖండిత, మధ్య ధీర. నాయకుడు - ధృష్టుడు. ఈర్ష్యా మాన విప్రలంభశృంగారము, రౌద్రము)

పల్లవి :
ఏ రీతి బొంకేవురా ? ఓ రోరి ! – ఏ రీతి బొంకేవురా ?

అనుపల్లవి :
ఏ రీతి బొంకేవు ? ఇదిగో ! నీ భుజమున – దేరిన పసపు
నిగ్గులు ; నీ మేనల జారిన కుంకుమ జక్కులు
నీ రెప్పలపై పేరిన కాటుక కగ్గులు వేంగిరాయ ! –
రారా యేటికి సిగ్గులు ? ॥ఏరీతి॥

1. ఎందుకు తక్కేవు ? మందగమనలతో - పొందు
సేయ నంటివి
పొందులు సేయగ బోకుంటే ఏడది - సందిట గాజుల
కోతలు ? నీ మేనెల్ల
చిందిన గంధపు పూతలు నీ పెదవిపై
కందిన కెంపుల పూతలు చెక్కిట చెలు - వొందిన
కస్తూరి గీతలు ఓ రోరి ॥పరీతి॥

2. నిన్న నాతో నల నీరజముఖి యింటి - కెన్నడు బోనంటివి
ఎన్నడు పోకుంటే ఇదిగో నీ చెవినంటు - కున్నది
ముక్కెర నొక్కులు నెత్తురు గమ్మ
చున్నది రొమ్మున రక్కులు నీ నాలుకపై
సున్నము మించిన పొక్కులు నీ నిడువాలు - కన్నుల
నిద్దుర సొక్కులు ఓ రోరి ! ॥పరీతి॥

3. నిక్కము వేణంగి నిలయుడ ననుగూడి యెక్కడ బోనంటివి
ఎక్కడ బోకుంటే ఇదిగో నీ గళమున - చొక్కపు
చందురు కూనలు నీ మేనెల్ల
చిల్కిన చెమ్మట వానలు నీ స్పిగలోను
పుక్కిన పూలసోనలు నన్నంటకు - మిక్కిలి
నీ మీదానాలు ; ఓ రోరి ! ॥పరీతి॥

---

## 13. బేహాగ్ - రూపకము

(పరకీయ - జ్ఞాతయౌవన యగు సాహసిక. నాయకుడు - ఉపపతి. భయానకరసము, సంభోగశృంగారము)

పల్లవి :

ఒకటే మాటన బలిమిని - ఒప్పుకొంటి గదరా ? ఆపై
అకటా ! నే - నోప జాలరా !

అనుపల్లవి :

ఎకసక్కెము గాదురా లేరా - ఎంతసేపు సహింతురా ?
పకపకమని నవ్వకురా - పరులు రాబోయేరు
సామి ! ॥ఒకటే॥

1. మొగము మొగముతో జేర్చి - ముద్దుపెట్టుటంతే కాని
చిగురు మోవి పంట గంటు - సేయబోకురా
తగు మాత్రము మొలక చన్ను-బొగడ లంటుటంతే కాని
నగుబాటగు చేతిగోరు - నాట నీయబోకు సామి !॥ఒకటే॥

2. ఇంతదాక మగవానిని - ఎరుగుదునా నేడె కాని
ఇంతటి తడవైన బొంక - ఎటుల నవునురా సామీ !
ఇంతేకాదు నేటి రాత్రి - కింటి యాతనితో నన్ను
మంతనమున గలుప బూన - మాటలాడు
చున్నవారు ॥ఒకటే॥

3. ప్రొద్దు మాపు వేళాయెర – పురుషు దూరనుండి వచ్చు
సద్దు లేక పోయి వత్తు – చాలింపుమురా
పెద్దలు విని చూచిరన్న – ఇద్దరికిని మోసమగును
పద్దులి నరసింహ నగర – వాసుడ! రంగేశుడ!
యిది ||ఒక్కటే||

---

### 14. ముఖారి - అట

(సామాన్య - ఖండిత, ప్రౌఢ. నాయకుడు-వైశికోత్తముడు. కరుణారసము)

పల్లవి :

కాశికి పోయెదనే నీ వలననే – కాశికి పోయెదనే

అనుపల్లవి :

ఓసోసి నా మది నన్ను అట్టుల నీవు – ఆశలెల్ల నిరాశ
చేసుక సదే ||కాశి||

1. ఏ తీరు నైనను – ప్రీతి సేయుదు వని
పాతకిచే చాలా – భ్రమసి తిరుగుచుంటి
రాతి మనసుగల – నాతి నీ వనుచును
నే తెలియక మోస – పోతినే వేసారి ||కాశి||

2. చక్కగాను నీవు – సంతోషముగ నాతో
ఒక్క మాటాడిన – తక్కువటే నీకు

ఇక్కడి భ్రాంతిచే - ఇల్లాలిని బాసి
దిక్కు దెసయు లేక - తిరిగి తిరిగి రోసి ॥కాశి॥

3. ముద్దుగుమ్మ! మన - మిద్దరి కూటమి
ముద్దు నట్టేశ్వర - మూర్తికె తెలుసును
సుద్దు లెంచకుండు - సుదతి నీ వనుచును
పద్దుచేసి నాతో - పలుకవు గనుక నే ॥కాశి॥

---

## 15. దర్బారు - అట

(స్వీయ - మధ్యధీరాధీర, ఖండిత. నాయకుడు - ధృష్టుడు. సఖి పార్శ్వచారిణి. మాన విప్రలంభశృంగారము, కరుణాద్భుతరసములు)

పల్లవి :

గడియ గడియ కటువంటి - గారుడములు తగునటమ్మా!

అనుపల్లవి :

పిలిచిన మారాడడమ్మా! అదియేమో కొమ్మా!
నుడువ తరము గాదె వాని - నడతలు నాతోడు సుమ్మా!
విడిచిన నిక దక్కడమ్మా - వీధి కెక్కవలయు
నమ్మా! ॥గడియ॥

1. కరుణమాని కనుల యెదుట - కాంతలతో సరసమాడ
గరిత! యోర్వ వశమటమ్మ - గట్టిగ వినవమ్మా!

ఇరుగు పొరుగు లమ్మలక్క—లెంతో చులకన సేతురమ్మా!
పురుషుడే ఈ రీతి సేయ – పరు లిక నెటుల నిలుతు
రమ్మా! ॥గడియ॥

2. ఏమో పోనీ యనుచును – నే నెంత యూరకున్న తాను
నా మీదనే నేరమెంచి – నాతో బలుక డమ్మా!
సామ దాన దండ భేద – చతురోపాయములు చూచి
వేమరు నే నలసి సొలసి – విహితమా యిది? యంటి
నమ్మా! ॥గడియ॥

3. ఆలు మగల యలుక తళుకు – టద్దములపై పెసరగింజ
వలెనె నిలువ దనుచు మీరు – పలికెదరు గదమ్మా!
వాలుగంటి! అతడు ఇందు – వచ్చి మాసమాయెను
తాలిమి యిక గలుగదమ్మా – తప్పెవరిదో
తెలుపరమ్మా ॥గడియ॥

4. ధరను వెలయు ఛత్రపురిని వెలయు జగన్మోహన
వర నాటకమునకు తా – వరదుడై యుండెనమ్మా!
సరస కళా భరితుడమ్మా! – సంగీత లోలుడమ్మా!
అరయగ నన్నేలడమ్మా! – అందుకేమి
ఉపాయమమ్మా! ॥గడియ॥

## 16. కురంజి - త్రిపుట

(పరకీయ - విరహోత్కంఠిత ; అస్వాస్యసంభోగదుఃఖిత. నాయకుడు శఠుడు. విరహ విప్రలంభశృంగారము, కరుణ)

పల్లవి :

తలచుకొంటే తాళ జాలనే ఆడు—దాని జన్మ మిక చాలునే

అనుపల్లవి :

లలన ! వానికి సతమాయెనే కై - లాసపతి యిందు
రాడాయెనే ॥తలచు॥

1. మగువా ! ప్రేమతో జేరవచ్చెనే ఆకు
మడుపు పంట నొక్కిచ్చెనే
సొగసు కెమ్మోవి యాన నిచ్చెనే వాని చూడ చూ
డగ తమి హెచ్చెనే ॥తలచు॥

2. పాయరాని వలపాయెనే నా
పతి కింత దయ లేక పోయెనే
కాయజుని రాపాయెనే యా
కలికి వానికి సతమాయెనే ॥తలచు॥

3. దొరల వలపు లేటి శతములే ? అవి
దొరికేది తొలి నోము ఫలములే
తిరుగ సేచుట వారి మతములే అవి
తెలిపెద నంటే భారతములే ॥తలచు॥

4. అలిగి రాడేమి సేతునే ?

అమ్మలార ! నా వలపెటు దాతునే.

వెలది ! యీ దిన మెట్లు ద్రోతునే ? ప్రాణ

విభుని కెన్ని కమ్మలు వ్రాతునే ? ॥తలచు॥

5. హాయలు మీరిన విరి తోటలో మంచి

యొద్దువైన బంగారు మేడలో

నయము మీర కైలాసపతి నన్ను గూడెనే ! యీ

నలినాక్షిని తిరుగ పెండ్లాడెనే ! ॥తలచు॥

---

## 17. నాటకురంజి - ఆది

(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత. విరహ విప్రలంభ శృంగారము, అద్భుతరసము)

పల్లవి :

పేరు బడ మన్నారు రంగనికి -

పెండ్లి సేయ నెన్నటికో తెలియదు

అనుపల్లవి :

ధరణి దొర లిండ్లను బుట్టుట పగవారికైన -

కొరగాదమ్మా ! ॥పేరు॥

1. తలిదండ్రుల మతిచే కొన్నాళ్లు - తలచుచు తరి జూచుచు కొన్నాళ్లు

కుల ధర్మములు విచారించుకో - వలె ననుచు కొన్నాళ్లు

అలరు పాయములు పరి - మెళవు విరుల విధమాయెగా
విధి మాయగా ఈ ధరణి - పేరు బడ మన్నారు
రంగని ॥పేరు॥

2. మగని సుఖ మెరుగక కొన్నాళ్లు - మరియాదల కొరకై
కొన్నాళ్ళు
నగరి వారమనేటి బింకముల - నాణెంబులు వెదకుచు
కొన్నాళ్ళు
పొగరు తమక మడవిగాయు వెన్నెల - పోలిక తుద జాలి
కయ్యె నిది ॥పేరు॥

3. అరమరిక తోచి తోచక కొన్నాళ్ళు - అనుభవ విధ
మెరుగక కొన్నాళ్లు
సరసముగా రతికేళి ముచ్చటలు - సఖియలచే చాలా
విని కొన్నాళ్లు
అరరె! ఆడుతనమే పగ జేసేదై - అలసితినే
సొలసితినే ॥పేరు॥

---

## 18. కన్నడ - ఆది

(స్వీయ - ప్రౌఢ, ధీర, ఖండిత. నాయకుడు - ధృష్టుడు. ఈర్ష్యా మాన విప్రలంభశృంగారము, హాస్యరౌద్రరసములు)

పల్లవి :

పోరా! ఈ వగ లేలరా? చాలు—పోరా! ఈ వగ లేలరా?

అనుపల్లవి :

ఏరా! ఈ నడత సరేరా! మంచిది తెలిసేరా!
ఈ వగ లేలరా ? ॥పోరా॥

1. నిక్కముగను తమి - జిక్కి దాని కాళ్ళ కీవు
మ్రొక్కి కెమ్మోవి పంట - నొక్కి దక్కినావట ॥పోరా॥

2. ఆడీ కాళ్ళకు లోబడి - పెక్కుల గూలగూడి
ఆడినది పోనాడి నేటి - కా మాయలా డింటికి ॥పోరా॥

3. సూటిగాను తంబుర మీటి - పాట పాడు నా బోటి ? ఆ
బోటి నీకే సాటి అ - చ్చోటికే యిక ॥పోరా॥

4. సారాసార మరయు ధీరా - సలలితునకు
మేరా ? సింహపురి వి - హారా ! మణివిహారా ! ॥పోరా॥

## 19. రేగుప్తి - త్రిపుట

(స్వీయ - విరహోత్కంఠిత. నాయకుడు - శఠుడు. సఖి - పార్శ్వ చారిణి, విరహ విప్రలంభశృంగారము, కరుణ)

పల్లవి :

బోటిరో వాని నను గూర్చితే నీకు - కోటి వరహాలైన
ఇస్తునే

అనుపల్లవి :

సాటిలేని నృపకోటిలో - మేటియౌ వెలు -
గోటిబంగారే చేంద్ర కీ - రీటిపై మది నాటి
యున్నది ॥బోటి॥

1. చిన్ననాడె వాడు నన్ను చేపట్టి - మిన్నగాను కలసి
వెలసి యున్నట్టి
చిన్నెలన్ని చూచి యిపుడు చలపట్టి
వాన్నెలాడి వాని కెన్నెన్నో బోధించెనే అతడు
నిన్న దాని గారవించెనే అది నన్ను మించెనే
వలపించెనే
నన్నుతాంగిరో! యేమి సేయుదునే ఇక - నెన్నటికి
నా సామిని
కౌగిటికి డాయుదునే ఒకసారి వాని
కన్నె నీ వన్నిటను నేర్పరి - వెన్న నీకు నసాధ్య
మే మున్నదే? యీ
మన్నె దొరతో విన్నపము చేసి యీ రాతిరి
॥బోటి॥

2. ఎమ్మెకాడు వచ్చునని నిదుర లేక - యెదురు చూచి
వేసారితి యిందాక
అమ్మచెల్లా! చలువ వన్నెల కాకలాయె నింక
నిముషమైన నోర్వజాలనే జాలంబు లేలనే? యిక
తాళ లేనే
సమ్మదమున గూర్పనిది భారమా? యీ

తుమ్మెదల నాదము మరి మరి వినగా తరమా ?

ఒకసారి కేని

తెమ్మెరల రథముగా విరుల శ

రమ్ములును శుకసంతతులును సైన్యములైనను గెల్వానాపై

కమ్మ విలుతుడు దాడి వెడలెను ॥బోటి॥

3. మదిరాక్షిరో ! బంగారే చేంద్రుడు డాసి దాని

మాటలు నిజము చేసి అవభావము నన్నడబాసి

నది మొదలుకొని భుజియించ దోచదాయెనే మరుల దన

మాయెనే యిక తాళలేనే

సుదతిరో నా మనవి చేకొనవే ? యికనైన వేడుక

లొదవగా నన్నేలు కొమ్మనవే ! ఒకసారి వాని

పెదవి తేనె యానిపైకొని కొదమ ఛనుగవ గదియ నెద

నెద నదిమి

మదన కదనమున నుపరతి గదియక – మదిని

తమి నిలువదు ॥బోటి॥

---

## 20. ? – ఆది

పల్లవి :

రావే ! రావే ! యో రమణీ !

అనుపల్లవి :

ఈ వేళ భావజుడు నన్ను జాల

వగ జాటె నే తాళజాల ॥రావే॥

1. నిద్దంపు గుబ్బల పైని - నెలవంక లుంచిన గని
నిద్దుర రా దేమి సేతు ? - నెన రెట్లు దాతు ?
ఒద్దికతో నీ కౌగిట - నుండక చేర దూరట
ముద్దుగుమ్మ ! పరాక ? - మ్రొక్కే నే మా
యింటిదాక ॥రా వే॥

2. బాలరో ! నే మనజాల - పలుమారు లలయించ
నేలా ? ఈ లాగు నన్నే చే వేల ? ఇంతి యీ వేళ ?
వాలాయముగా నీ కేను - వలచితిని తాళ లేను
మేలు వాడను చాలా - లాలించవే ఇకనైన ॥రా వే॥

3. చెలగి కందాళ వారింట - వెలసిన గోపాలుడ
వలపు కాయని కేళి - కలసి నన్నేలి
తలపవు నేడింతైన - తరుణీమణి ! దయతోన
వలపు మించవే నీ యాన - కులుకు మోవి
తేనెలాన ! ॥రా వే॥

## 21. యదుకుల కాంభోజి - ఆది

పల్లవి :

వింత వింత లెల్ల వినవే - దంతి గమనరో

అనుపల్లవి :

కాంతామణి నీ నీలవేణి - కాముని రాణి ॥వింత॥

1. నోరులేని పాటకాడు నుడివె నమ్మా ఒక
నొండి (?) వాడు వింతలెల్ల ఆడెనమ్మా ॥వింత॥
2. చేరి మూగవాడు శ్రుతి గూడెనమ్మా!
చెంత గ్రుడ్డివా శ్ళందరు చూచేరమ్మా ॥వింత॥
3. విత్తులేని భూమిలోను చెట్టు పుట్టెనమ్మా!
వింతగా రెండు శాఖ లాయెనమ్మా! ॥వింత॥
4. ఆకున కొమ్మలు ఆరు గలిగెనమ్మా!
అంత పూలు వింత కాయ లాయెనమ్మా! ॥వింత॥
5. వృక్షము మీదనే యుండు – పక్షి కాదమ్మా!
అక్షులు మూడు గలిగుండు – హరుడు గాడమ్మా!
సూక్ష్మముగ జలము మోచు ఘటము కాదమ్మా! ॥వింత॥

## 22. యదుకుల కాంభోజి - అట

(స్వీయ - అజ్ఞాతయౌవన. నాయకుడు - అనుకూలుడు. సంభోగ శృంగారము, అద్భుతరసము)

పల్లవి:

సుదతులందరు నీకు – శోభన మని యంటే –
అదియేమో – నను కొంటినే

అనుపల్లవి:

సదయుడు శయ్యపై – చక్కగ పవళింప
పద పద మని వాని – పక్కకు పంపిరి ॥సుదతు॥

1. చెలియరో! శయ్యపై - నిలువ సిగ్గై నేను ఊరకే -
నిలుచుంటినే
చెలువుడు పిలుచుచు - పలుకగ తలవంచి -
పలుక కూరకుంటినే
కలకంఠి ముంజెయ్యి - కలియబట్టి తన తో -
డలపై జేర్చి చ - క్కిలి గింత పెట్టెనే ॥సుదతి॥

2. ముద్దులగుమ్మ! నీ మోమెత్తి వకసారి - ముద్దివ్వుమని
వేడనే
సద్దుసేయక మన మిద్దరి లోపల సిగ్గెందుకని
పల్కెనే
నద్దికగల మంచి బిగిగల నా మనసు
తద్దయు కరగించి - తా కౌగిలించెనే ॥సుదతి॥

3. తెల నాకుమడుపులు మునిపంట నొక్కి యెం - గిలి
చేసి యందిచ్చెనే
పలుమారు పెదవి యెంగిలి చేసి యాపై - పలు
వరుస నాటించెనే
నెలకూన వంటి నా నెన్నుదురు టద్దములపై చె -
క్కిలి నొక్కి ముద్దాడి కరచెనే ॥సుదతి॥

4. పయ్యెద తొలగించి - పట్టురవిక ముడి - సయ్యాన
సడలించెనే
కయ్యాలింపక చిన్ని - కుచములపై గంధ -
మయ్యారో యన బూసెనే
తియ్యని మాటల - తేనెలు జారగ
వయ్యారముగ నెల - వంకల నుంచెనే ! ॥సుదతు॥

5. పడతిరో ! నే జేయు - పనులు తోచక - తడబడు
చూరకుండగ
నడుము నిమిరి పోక - ముడి వదలించి నా -
యొడలిపై కళలంటుచు
తొడ లెడలించి చ - న్దోయి పట్టి యా
పడుచు తనవు కొంటె - పను లేమో చేసెనే
॥సుదతు॥

6. పల్లవ పద శాన - పల్లెలో నా డెల్లా గిరిజా మనోహరుని
తెల్లమా కీర్తి శో - భిల్లగ నిల్పిన - అల్ల
రామకృష్ణుని
చల్లని దయచేత - నెల్ల వేళల బ్రోచే
అల్ల శంకరుడు నా-యుల్లము కరగించెనే ॥సుదతు॥

# క్రమసూచిక

[ * వివరణములతో నిచ్చిన మొదటి 30 పదములలో చూడవలెను.
స్వీ = స్వీయ ; ప = పరకీయ ; సా = సామాన్య ;
క్షే ? = క్షేత్రయ పదములేమో ? ఇ = ఇతరుల పదములు.]

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 12 | ఆనూయ | అనూయ |
| 1 | 17 | విత్కరము | వితర్కము |
| 8 | 2 | నాయుకుడు | నాయకుడు |
| 11 | 13 | నాదు | నాడు |
| 13 | 9 | ఔత్సుక్వము | ఔత్సుక్యము |
| 14 | 7 | పలవి | పల్లవి |
| 29 | 9-10 | ఆలశ్యము | ఆలస్యము |
| 29 | 19 | విప్రలంబము | విప్రలంభము |
| 32 | 6 | గొట్టె | గొట్టి |
| 35 | 22 | గాని | గ్లాని |
| 36 | 8 | పశ్చాతాపము | పశ్చాత్తాపము |
| 44 | 7 | చేనుకి | చేనుక |
| 51 | 13 | సారధి | సారథి |
| 53 | 11 | శృగారము | శృంగారము |
| 53 | 16 | ధృలి | ధృతి |
| 53 | 17 | రాదు | రాడు |
| 57 | 2 | ఆన్నై | అన్నై |
| 56 | 3 | కదసి | కదిసి |
| 68 | 2 | జూచే | జూచె |
| 69 | 6 | సెనయొని | సెనయని |
| 75 | 12 | నా-లువుని | నా-చెలువుని |
| 80 | 3 | కదసి | కదిసి |
| 86 | 5 | వైకొనె | పైకొనె |
| 86 | 9 | అది | ఆది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 103 | 2 | నుదట | నుదుట |
| 112 | 8 | పయినము | పయనము |
| 112 | 12 | నీళ్లనచు | నీళ్లనుచు |
| 115 | 16 | నిన్ను | నిన్ను |
| 119 | 2 | విరహోత్కంఠిత | విరహోత్కంఠిత |
| 121 | 18 | గోపాలుడో | గోపాలునో |
| 134 | 14 | సభులం | సఖులం |
| 136 | 15 | పార్శ్య | పార్శ్వ |
| 141 | 7 | చిన్ను | నిన్ను |
| 146 | 5 | దురంతర | దురంత |
| 152 | 9 | ఆలసి | అలసి |
| 153 | 8 | సొమ్మపరి | సొమ్మవరి |
| 153 | 14 | పున్నగ | పున్నాగ |
| 155 | 2 | నెప్పించి | నొప్పించి |
| 155 | 13 | పార్త్వ | పార్శ్వ |
| 160 | 14 | ప్రౌఢిమి | ప్రౌఢిమ |
| 162 | 6 | ప్రత్స్యత్పతిక | ప్రవత్స్యత్పతిక |
| 163 | 7 | పెదప్రుల | పెదవుల |
| 165 | 12 | సరన | సరస |
| 167 | 3 | వంచెన | వంచనీ |
| 167 | 11 | నాయకునితో | నాయికతో |
| 173 | 13 | సవ్వు | నవ్వు |
| 175 | 1 | దుస్న | దున్న |
| 176 | 20 | నెన | నైన |
| 177 | 2 | నెట్ల | నెట్లు |
| 180 | 10 | వన్నెలాడి | వన్నెలాడి |
| 183 | 1 | కలవైన | కలనైన |
| 183 | 13 | సరసుకు | సరసకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 186 | 1 | కపురంపు | కపురంఫు |
| 190 | 2 | నవ్వ్వంతె | నవ్వ్వతె |
| 195 | 5 | పెం-పాదఫు | పెం-పొదవు |
| 196 | 18 | ండు | ఇాదు |
| 202 | 4 | మగువు | మగువ |
| 212 | 6 | గోపాలుడు-డిందు | గోపాలుం-డిందు |
| 214 | 19 | వెలసి | తెలిసి |

పరకీయ :—

| | | | |
|---|---|---|---|
| 7 | 14 | మువ్య | మువ్వ |
| 7 | 19 | జెసిగా | జేసిగా |
| 9 | 13 | చెక్కిట | చెక్కిట |
| 10 | 11 | నాయినా | నాయికా |
| 39 | 10 | వగోధ | పగోధ |
| 44 | 2 | విరహలాత్కంతఠిత | విరహోత్కంఠిత |
| 53 | 8 | నన్నెవా | నన్న సేవా |
| 68 | 10 | గబనినిమ్మ్ర | గజనిమ్మ్ర |
| 69 | 7 | వీ | నీ |
| 70 | 15 | నున్న | సున్న |
| 73 | 10 | క్రొమ్మడి | క్రొమ్ముడి |
| 74 | 9 | రుగుతు | గురుతు |
| 75 | 2 | నాయక | నాయిక |
| 75 | 3 | తీప్రంగా | తీవ్రంగా |
| 75 | 6 | వాగ్విదగ్ద | వాగ్విదగ్ధ |
| 76 | 4 | నాయక | నాయిక |
| | 6 | స్వాదీనం లేసం | స్వాధీనం లేనం |
| 77 | 1 | పవ్వళించి | పవ్వళించు |
| 92 | 7 | మాటలిదిగో | మాటలివిగో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 101 | 17 | చాశీతి | చాసీతి |
| 112 | 11 | నానా | నా |
| సామాన్య :— | | | |
| 9 | 20 | దలత | దలతు |
| 14 | 9 | సుగుణో నిధేయ | సుగుణ విధేయ |
| 24 | 15 | గాలించేర | గావించేర |
| 25 | 15 | ఏడవాలు | ఎడవాలు |
| 26 | 14 | పాలుమారిన | పాలుమాలిన |
| 27 | 7 | తెవిసె | తెలిసె |
| 35 | 2 | ఆదివ్య | అదివ్య |
| 35 | 1 | నేవే | నేలే |
| 40 | 11 | చెవికి | చెలికి |
| 52 | 4 | వలరా | వలదా |
| 55 | 5 | దెన్న | డెన్న |
| 62 | 9 | అలవేణి | అలివేణి |
| 93 | 19 | ప్రొద్దొయితే | ప్రొద్దయితే |
| 96 | 14 | సెతురా | సేతురా |
| 103 | 15 | పౌఢ | ప్రౌఢ |
| కే ? | | | |
| 1 | 11 | కూడండగ | కూడుండగ |
| 4 | 16 | పార్శ్వశ్రీ | పార్శ్వ |
| 11 | 12 | చరించనా | చరించినా |
| 17 | 10 | కరిణి | కరణి |
| 15 | 10 | ప్రౌడ | ప్రౌఢ |
| ఇ— | | | |
| 45 | 3 | ముగ్దు | ముద్దు |
| 47 | 17 | శతము | సతము |
| | | వాన్నె | వన్నె |